

# శ్రీనివాసవైభవమ్

సుప్రభాత, పూజా, తీర్థవైభవముల

సంపుటం

తిరుమల తిరుపతి దేవస్థానముల హిందూధార్మిక గ్రంథాల ప్రచురణ
ప్రోత్సాహపథకంలో అందించిన ఆర్థికసహాయసహకారాలతో
"శ్రీనివాసవైభవమ్" ప్రచురింపబడింది.






శ్రీ వెలమకన్ని శ్రీరామమూర్తి

ప్రథమముద్రణ
జనవరి 1982

సర్వస్వామ్యసంకలితము
వెయ్యి ప్రతులు

ముద్రణ :
శ్రీపత్రిప్రెస్
కాకినాడ



ప్రతులకు :
క్షేత్ర సాహితి
పద్మప్రభాస
రామచంద్రపురం
తూర్పుగోదావరిజిల్లా

ముఖచిత్రం :
శ్రీ జి. శివన్నారాయణ
ద్రాక్షారామ

మూల్యం 20 రూ॥లు

సోల్ డిస్ట్రిబ్యూటర్సు :
శ్రీ కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు
రాజమండ్రి-1



అంకితం

పద్మావతీ శ్రీనివాసునకు

వెలమకన్ని శ్రీరామమూర్తి

# శ్రీనివాస వైభవమ్



బావ
పతివాడ

చెల్లాయి
విజయలక్ష్మి

మాచెల్లాయి మాబావ విజయలక్ష్మి పతివాడలు కోటి జన్మల సంస్కారానికి ప్రతీకలు. మానవకోటిలోని సహృదయతకు, స్నేహశీలానికి ప్రతిరూపాలు. కనుపించక అనుగ్రహిస్తూన్న పద్మావతీ శ్రీనివాసులకు 'శ్రీనివాస వైభవమ్' అంకితంచేసి తొలిప్రతి అర్పించాను. కనిపిస్తూ, ఆదరిస్తూ, అభిమానిస్తూ, అమృతహృదయాలు అందిస్తూన్న ఆత్మీయులైన చెల్లాయి విజయలక్ష్మికి, బావ పతివాడకు 'శ్రీనివాస వైభవమ్' మలిప్రతిని సాదరంగా అందిస్తున్నాను. నా అంతరంగంలోని అంతులేని ఆపేక్షకు ఆనవాలుగా - ఒక కానుకగా - పద్మావతీ శ్రీనివాసులు ప్రసాదించే బహుమానంగా—

వెలమకన్ని శ్రీరామమూర్తి.



'శ్రీనివాస వైభవమ్'
ప్రచురణకు సమధిక
సన్నాహం కావించిన

శ్రీ డి. వి. యల్. యన్. రామకృష్ణారావు
M.A., L.L.B., I.P.S.
ఎడిషనల్ కమీషనర్ ఆఫ్ పోలీసు, హైదరాబాద్.

## THIS BOOK SPEAKS OF ITSELF



'క్షేత్రసాహితి'
శ్రేయోభిలాషి

శ్రీ పట్టాభి బి. ఏ.





"సమస్తజననీం వన్దే
చైతన్యస్తన్యదాయినీమ్
శ్రేయసీం శ్రీనివాసస్య
కరుణామివ రూపిణీమ్"

"కమప్యనవధిం వందే
కరుణావరుణాలయమ్
వృషశైలతటస్థానాం
స్వయంవ్యక్తిముపాగతమ్"

# శ్రీ ని వా స వై భ వ మ్

శ్రీనివాసుడు ఆద్యంతాలు లేనివాడు. నేను ఆద్యంతాలు తెలియనివాడను. నాతనువును తిరుమలగిరిగాను, నామనస్సును ఆనందనిలయంగాను మలచి, దానిలో శ్రీనివాసుడు నిలచి ఆద్యంతాలు తెలియని నాచేత ఆద్యంతాలులేని తన వైభవాన్ని నాఎదలో పలుకుతూ, నాచేత 'శ్రీనివాస వైభవమ్' ఆద్యంతం పలికిస్తున్నాడు. నాచేత మీకోసం అక్షయమైన అక్షరరూపంలో అందింప జేస్తున్నాడు. నాలో శ్రీనివాసుడు ధ్వనింపజేసిన ఈ 'శ్రీనివాసవైభవమ్' మీరు అందుకొని మీలోను, లోకంలోను ప్రతిధ్వనింపజేయండి.

ఇతి శివమ్

వెలమకన్ని శ్రీరామమూర్తి.

# సుప్రభాత వైభవము

## మంగళకైశికి

శ్రీకమనీయహారమణిఁ జెన్నుగఁ దాను ధరింపఁ గౌస్తుభం
బా కమలావధూటియు నుదారత దోఁప పరస్పరాత్మలం
దాకలితంబులైన తమ యాకృతులచ్ఛత బైకి దోఁపఁ ద
త్ప్రాకటనందుఁ దోఁచెనన శోభిలు వేంకటభర్త గొల్చెదన్."

— శ్రీకృష్ణదేవరాయలు.

శ్రీనివాసునకు తన 'ఆముక్తమాల్యద' అంకితంచేసి తరించిన ధన్యుడు శ్రీకృష్ణదేవరాయ సార్వభౌముడు. 'ఆముక్తమాల్యద'లో శ్రీహరిసంకీర్తనావైభవాన్ని, ప్రఖ్యాతగానప్రాభవాన్ని వివరించి, నిరూపించే గోదాదేవికథ, మంగళకైశికీగాథ భక్తజనహృదయాలను అలరించి తన్మయులనుచేస్తాయి. అవి సుప్రభాతగానమహిమను భక్తులకు సందేశంగా అందిస్తున్నాయి. గోదాదేవి 'తిరుప్పావు' ధనుర్మాసంలో వైష్ణవోత్తములు సుప్రభాతన అనుసంధానంకావించే పరమ పవిత్రమైన శ్రీరంగనాథునికీర్తించే సుమధురసంగీతకావ్యం. మాఘ మాసంలో ప్రభాతసమయంలో శైవులు సంకీర్తనంకావించే పరమ ప్రమాణకావ్యం మాణిక్యవాచకుల "తిరువెమ్బావు". నేటిమానవాళికి భక్తజనావళికి ముక్తిసాధపుభక్తిసోపానాలను చూపే మణిదీపాల తోరణం శ్రీ వేంకటేశసుప్రభాతమ్. 'తిరుప్పావు' వైష్ణవులపాలిట 'కల్పవృక్షం.' 'తిరువెమ్బావు' శైవులపాలిట 'కామధేనువు'. 'శ్రీవేంకటేశసుప్రభాతమ్' భక్తులపాలిట శ్రీనివాసవరప్రసాదం.

పూర్వం వామనుని ఆశ్రమానికి మూడుఆమడలదూరంలో ఒక పల్లెఉండేది. ఆ పల్లెలో శ్రీహరిభక్తుడైన మాలదాసరి ఉండేవాడు.

ఆపల్లెకు అల్లంతదూరాన కురుగుడి అనే పుణ్యక్షేత్రం ఉంది. ఆదాసరి చీకటినేలేచి హరిసంకీర్తనంచేస్తూ స్వామిని సేవించేవాడు. ఒకనాటి నడిరేయిన ఒకపిల్లి అతనిగుడిసెలోనికి దూరింది. కోళ్ళు దాన్నిచూసి కూసాయి. తెల్లవారిందని దాసరి పెరుమాళ్ళసేవకు బయలుదేరాడు. దారిలో మర్గలీగ త్రొక్కాడు. ఫలితంగా తిరిగితిరిగి అడవిలోనికి వెళ్ళాడు. శాఖోపశాఖలుగా విస్తరించినఒకపెద్దమర్రిచెట్టును చూచాడు. కుంభజానువనే బ్రహ్మరాక్షసుడు దాసరిని గట్టిగాపట్టుకొన్నాడు. దాసరి, వాడూ కలియబడ్డారు. బ్రహ్మరాక్షసుణ్ణి నేలమీదకుత్రోసి దాసరి తిరుక్కురుంగుడికి బయలుదేరాడు. పిశాచీగణం దాసరిని మర్రి చెట్టువద్దకు పట్టుకొనివచ్చి కుంభజానువుముందు నిలబెట్టారు. కుంభ జానువు దాసరిని చంపి మాంసంతిని, రక్తం పానం చేస్తానన్నాడు.

"నేను నీఆకలోని అన్నాన్ని. తప్పనిది చావు. చచ్చి నీకు ఆహారంకావడానికి ముందు బ్రతికినఫలం పొందడంకోసం, బ్రతుకులు లేకుండాచేసికోవడంకోసం శ్రీహరిపై సంకీర్తనంచేసికోవడానికి అనుమ తింపుము. శ్రీహరి గుడివద్దకువెళ్ళి కీర్తించడానికి అనుజ్ఞదయచేయుము" అంటూ దాసరి కుంభజానువును ప్రార్థించాడు. అతడు నిరాదరణతో నిరాకరించాడు. "నామాటప్రకారం నేనుతిరిగిరాకపోతే శ్రీహరితో సమానంగా ఇతరదేవతలను భావించిన పాపినైపోతాను" అని దాసరి శపథంచేసాడు. రాక్షసుడు దాసరిని విడిచిపెట్టాడు. కురుగుడిచేరి స్వామిపై పాడిపాడి పరవశంతోఆడి వడివడిగానడచి రక్కసుడివద్దకు చేరుకున్నాడు ఆశ్రీహరి పరమదాసుడైన దాసరి. తనను ఆహారంగా తీసికొని తృప్తిపొందమని దాసరి బ్రహ్మరాక్షసుని ప్రార్థించాడు. "అన్నా! నీవంటిసత్యవాదినిచూడను. శరీరత్యాగసమయంలో సత్యం పాటించిన ధన్యుడవు. గుడికి వెళ్ళడానికిముందు నిన్నుచంపి నీకండ లతో నాకడుపునింపుకొందా మనుకొన్నాను. గుడినుండివచ్చిన నిన్ను

నాతిండికి ఉపయోగించుకోనలేను" అని బ్రహ్మరాక్షసుడు దాసరితో చెప్పాడు. "హోమానికి పుల్లలునరికే చిరుగొడ్డలిని, మారణహోమం కావించే కత్తిని పరుసవేది సమానంగా సువర్ణంగా మారుస్తుంది. మీవంటిభాగవతులు నావంటిపతితులను, పాపాత్ములను పావనులను కావించా"లని దాసరిని కుంభజానువు ప్రార్థించాడు. దాసరి బ్రహ్మ రాక్షసుణ్ణి అతని దీనత్వానికి కారణం, దాని నివారణకుమార్గం చెప్ప మని ప్రశ్నించాడు. "భగవంతునికంటే భాగవతుడు, భక్తుడు ఎక్కువమేలు చేస్తాడు. దీనికి ముందుజన్మలో నేను సోమశర్మ అనే బ్రాహ్మణుడను. దుష్కర్మవలన కుంభజానువనే బ్రహ్మరాక్షసుడ నయ్యాను. నీవు ఈనాడు శ్రీహరినిగూర్చిపాడిన పాటఫలాన్ని నాకు ధారపోసి నన్ను రక్షింపుము. నీ ఉదయగానం నాజీవితానికి శుభో దయం కావించాలి" అని కుంభజానువు దాసరిని ప్రార్థించాడు. "కప్పురమిచ్చి ఉప్పు కొనుక్కోనలేను. హరిసంకీర్తన ఫలమిచ్చి చావు తప్పించుకోవడం నా అభిమతంకాదు. నీవుకోరింది, నేను ఇస్తా నన్నది నాశరీరంకాదు, నాఉదయసంకీర్తనాఫలంకాదు" అన్నాడు దాసరి. కుంభజానువు దాసరిపాడినపాటలోని సగంఫలమియ్యమన్నాడు. దాసరి కాదన్నాడు. పాతికపాలు వేడికొన్నాడు. దాసరిమిన్నకున్నాడు. ఈప్రభాతసమయంలో శ్రీహరిపై పాడిన తుదిగీతపుఫలమైనా ప్రసా దింపుమని దాసరిని వేడికొన్నాడు. దాసరి దయాళుడై అంగీకరించి కుంభజానువును తనకు రక్కసిరూపంవచ్చినవిధం వివరింపమన్నాడు.

"చోళమండలమందలి గ్రామం నాస్వగ్రామం. అప్పటి నాపేరు సోమశర్మ. వేదాలు, శాస్త్రాలు చదివిన పండితుణ్ణి. ధనాశాపరుడనై వంచనను కళగా అభ్యసించి పోషించాను. చెయ్యరానిపనులు చేసి, చెప్పరానిమాటలు చెప్పి ధనం కూడబెట్టాను. ఒకరోజున వరాల మూటగట్టుకొని ఒకనాడు నాభార్యతో, తోబుట్టువుతో కలసి ఊరికి

ప్రయాణమయ్యాను. అది పసిగట్టిన గజదొంగ కాకశ్మశ్రువు తనసహచరులను దారికొట్టమని నియమించి బాటసారివేషంతో నన్ను వెంబడించాడు. అందరం సత్రంలో ఒకనాడు నిద్రించాము. రాత్రిప్రొద్దుపూడు మమ్మల్ని లేపి పెడదారులలో తిరిగే ఆదొంగవాడు మమ్మల్ని తప్పుద్రోవపట్టించాడు. మేము వాగులోదిగినప్పుడు వాడీలవేసాడు. చోరులు బాటసారుల్ని కొల్లగొట్టారు. ఈ సందడిలో తప్పించుకొన్న నన్ను కాకశ్మశ్రువు వెంబడించాడు. చురకత్తితో నన్ను పొడిచి నావరాలమూట దక్కించుకొన్నాడు. చెవితమ్మెలుతెంపి నాబంగారుపోగులు లాక్కొన్నాడు. స్వగ్రామస్థుడవైన నీవు ఈవిధంగాచేయడం పాడికాదన్నాను. నేను గ్రామాధికారికి వానిపై అపరాధంమోపుతానని భయపడి నన్ను చావుదెబ్బలుకొట్టి పారిపోయాడు. నాచెలి, చెల్లెలు వచ్చి గాయాలతో బాధపడుతున్న నన్ను కావడిలోతెచ్చి ఈమఱ్ఱిచెట్టునీడ క్రిందదింపారు. వారు దప్పికొని నీరుత్రాగడానికి వెళ్ళారు. వారు మరలివచ్చేలోపల గాయాలతో బాధపడుతోన్న నేను బ్రహ్మరాక్షసుడనయ్యాను. ఇది నాకథ. నీమంగళకైశికీగాన ఫలదానంతో నా వికారరూపాన్ని రూపుమాపవయ్యా" అంటూ దాసరికి తనవిచిత్ర విషాదగాథను కుంభజానువు నివేదించుకొన్నాడు.

"నాపాటకు ఆశక్తి ఉందోలేదో నాకు తెలియదు. నాపాటలో కీర్తింపబడ్డ ఆ శ్రీహరికి ఆశక్తి ఉంది. అతడే నిన్ను రక్షిస్తాడు" అన్నాడు దాసరి. ఆక్షణంలో దాసరి మంగళకైశికీగానలోలుడైన శ్రీమన్నారాయణుని అనుగ్రహంవలన కుంభజానువు సోమశర్మగా అవతరించాడు. పాపవిముక్తుడైన సోమశర్మ శ్రీహరిభక్తుడై ధన్యుడై తరించాడు.

కైశికపురాణంలోని కథలో చిన్నమార్పులుచేసి శ్రీకృష్ణదేవరాయలు తన ఆముక్తమాల్యదలో దాసరిమంగళకైశికగాథగా చిత్రిం

చారు. కైశికపురాణంలో దాసరిపేరు 'నంపాదువన్.' నమ్మాళ్వారు హరిదాసుడైన హరిజనుడైనా తనకు పూజనీయుడని ప్రతిపాదించాడు. తమిళనాడులోని ప్రతివైష్ణవదేవాలయంలోను 'ఆళవందారు' కుటుంబానికి చెందినవ్యక్తి సంవత్సరానికొకసారి కైశికపురాణం చదువుతాడు. 'కార్తికే ప్రబుద్ధ్యేత శుక్లపక్షే హరేర్దినే' అని మత్స్యపురాణం చెప్పింది. ఈ కార్తికశుద్ధఏకాదశినాడు శ్రీహరి యోగనిద్రనుండి మేల్కాంచాడు. మరునాడువచ్చే ద్వాదశికి క్షీరాబ్ధిద్వాదశి అంటారు. తిరుమలలో దీన్ని కైశికద్వాదశి అంటారు. శ్రీవారిసన్నిధానంలో ఉన్న ఉగ్రశ్రీనివాసమూర్తికి అరుణోదయసమయంలో ద్వాదశారాధన, ఊరేగింపు, ఆస్థానఉత్సవం జరుగుతాయి. కైశికపురాణపారాయణం ఆనాడు విధిగా స్వామిసన్నధిలో జరుగుతుంది. దీనికి కైశికద్వాదశఆస్థానం అంటారు. ఈ ఉత్థానద్వాదశినాడు శ్రీస్వామివారికి, నరసింహ, వరదరాజ, వరాహ దేవులకు అన్నప్రసాద నివేదనలు యేర్పాటుచేస్తూ క్రీ. శ. 15 వ శతాబ్దంలో శాసనాలు వెలసాయి. వర్ణాతీతసమాజస్థాపనకు ఆవిధంగా కైశికపురాణం నాందీగీతం పాడింది. సుప్రభాతసమయంలో దాసరి కంఠంనుండి వెలువడిన మంగళకైశికీరాగం కుంభజానువును సోమశర్మగా మార్చింది.

## సు మా ల మా లి క

ఉదయరాగం, ఉషోదయగానం మహిమాన్వితమైనదని నిరూపించే నిర్మలగాథ ఆండాళ్ కథ. ఆండాళ్ పాడినపాట తిరుప్పావు. అది శ్రీవిల్లిపుత్తూరు. దానిలో శ్రీకృష్ణమూర్తి దివ్యదేవాలయం ఉంది. పెరియాళ్వారు స్వామిని నిత్యం సేవించేవాడు.

"కోడికూతకు మున్న కోనేటిలో దోగి
వడపెరుంగోయిలాన్ విడిది కేగి

గుడి నలుమూలలు తుడిచి, కడిగి, అంద
ముగ వన్నెచిన్నెల ముగ్గులల్లి
తీర్థమ్ము కొని తెచ్చి తిరుమజ్జనమ్ము కా
వించి, కోవెలతోట విరుల, తులసి
దళముల జతచేర్చి దండలు కూరిచి
తిరుకాపు తీరిచి, దివ్వెపెట్టి
ఇంక తిరునాళ్ల స్వామి ఊరేగువేళ,
మోసి పల్లకి, వ్యజనమ్ము వేసి, ధ్వజము
వెల్లగొడుగో తాలిచి, పెరుమాళ్లకొలుచు
కన్న, దాసునకింక ఏమున్నదయ్యా."

కీ. శే. దేవులపల్లి కృష్ణశాస్త్రి.

ఈపద్ధతిలో పెరియాళ్వారు వటపత్రశాయికి సేవలు కావించే వాడు. ఒకనాడు తులసివనంలో తులసిమొక్కవద్ద ఒకబంగారుబొమ్మ అతనికి దొరికింది. అది క్రీ. శ. 776 – నలనామసంవత్సరం ఆషాఢ మాసంలోని పూర్వఫల్గుణీనక్షత్రయుక్త శుభసమయం. అతడు అప్ర యత్నంగా ఆమెను చూచి 'కోదై' (గోద) అన్నాడు 'కోదై' అంటే మాల అని అర్థం. నిజంగా ఆమె సుమాలమాల. గోవిందునిపై గీత మాలికలు అల్లడానికి పుట్టిన కుసుమాలమాల. శ్రీనివాసునకు, శ్రీరంగేశునకు సుగంధసంభరితమైన సుమనోహర సుమమాలికలు, మృదుమధురగేయమాలికలు రచించి సమర్పించడానికి పుట్టిన కారణ జన్మురాలు శ్రీఆండాళ్.

నిత్యం పూలమాలలు కట్టి [illegible]ళ్వారు స్వామికి సమర్పించే వాడు. నిత్యం గోదాదేవి స్వామికి [illegible]ర్పించడానికి అల్లిన పూలమాలి కలను తండ్రికి తెలియకుండా తలపై అలంకరించుకొని అద్దంలో చూచి కొని మురిసిపోయేది. ఒకనాడు స్వామికి అర్పించడానికి తీసికొని

పోతూన్న పూలమాలలో తలవెంట్రుక కనిపించినది. అనుమానించిన విష్ణుచిత్తుడు గోదాదేవిని ప్రశ్నించాడు. ఆమె తప్పును ఒప్పుకొంది. అతడు ఆమెను నిందించి అవమానించాడు. విచారంతో మేను వాల్చాడు. దిగులుతో నిద్రించిన విష్ణుచిత్తునకు స్వామి కలలో కనిపించి గోదాదేవి ధరించి, విడిచిన పూలమాలలే తనకు కావాలని తెలిపాడు. నాటినుండి ఆమె ముడిచి, విడిచిన పూలమాలలే స్వామికి సమర్పిస్తూ గోదాదేవి లక్ష్మీదేవి అని భావించాడు. నాటినుండి ఆమెకు శూడికొండుత్త నాచ్చియార్ (ఆముక్తమాల్యద) అనే పేరు స్థిరపడింది. శ్రీనాథుని తననాథునిగా పొందాలని ఆమె నిశ్చయించుకొంది. శ్రీమద్భాగవతంలో ప్రతిపాదింపబడిన కాత్యాయనీవ్రతం ఆచరించింది. గోపికలు శ్రీకృష్ణుని పొందడానికి చేసినవ్రత మిది. ఒక మాసంకాలం ఉదయాన్నే లేచి యమునలో స్నానం చేయడానికి పోతూ వంశీమోహనుని కీర్తిస్తూండేవారు. యమునలో స్నానాలుచేసి ఇసుకతో కాత్యాయనీదేవి విగ్రహంచేసి పూజించేవారు. ఫలితంగా శ్రీకృష్ణుని పొందారు. గోదాదేవి శ్రీవిల్లిపుత్తూరునే వ్రేపల్లెగా భావించింది. అచ్చటి కన్యకలను గోపికలుగా తలచింది. స్వామి దివ్య దేవాలయాన్ని నందగోపకుని సుందరమందిరంగా ఊహించింది. దానిలో శయనించిన వటపత్రశాయినే శ్రీకృష్ణభగవానునిగా సంభావించింది. మార్గళివ్రతాన్ని ఆచరించింది. ఆ నెలరోజులలో ప్రతిరోజు ఒకపాటకట్టి పాడింది. ఆ 30 పాటలు (పాశురాలు) గల దివ్యప్రబంధం, మధురశృంగారకావ్యం తిరుప్పావు.

వివాహవయస్సువచ్చి శుభలక్షణలక్షితురాలైన ప్రియపుత్రిక గోదాదేవిని పిలిచి 'నీవు ఎవరిని పతిగా స్వీకరింపదలచావు' అని విష్ణుచిత్తుడు ప్రశ్నించి ఆమె చిత్తం ఎవరిపైన లగ్నమైనదో గ్రహించడానికి ప్రయత్నించాడు. 'శ్రీనాథుడే నా నాథుడు. శ్రీనివాసుడు నా

జీవితేశుడు. శ్రీరంగనాథుడు నాహృదయాధినాథుడు' అంటూ గోదా తన నిశ్చయాన్ని నిర్మలచిత్తంతో తండ్రికి నివేదించింది. ఆనిర్ణయం విన్న విష్ణుచిత్తుడు తన నిస్సహాయతను నిందించుకొంటూ నిరాశ, నిస్పృహాలతో అలసిపోయి మేనువాల్చాడు. అంతలో కల. ఆ కలలో శ్రీరంగనాథుడు కనిపించాడు. గోదాదేవిని తానువరించి వివాహం కావించుకొంటానని చెప్పాడు. శ్రీరంగానికి తోడ్కొనిరమ్మని ఆదేశించాడు. అంతలో కలకరిగిపోయింది. తండ్రి తనయకు శ్రీరంగనాథుని నిర్ణయం తెలిపాడు. వారి ఆనందానికి మేరలేదు. అంతలో ధనుర్మాసం రానేవచ్చింది శ్రీకృష్ణపరమాత్మను సేవించినట్లుగానే శ్రీరంగనాథునీ సంకీర్తించింది. తన తిరుప్పావుతో. ధనుర్మాసవ్రతం ముగించి సకల భోగాలు అనుభవించమని కలలో శ్రీరంగనాథుడు గోదాదేవికి ఆదేశించాడు. తనహృదయనాథుడైన శ్రీరంగనాథునిమాట శిరసా వహించి వ్రతంముగించి శ్రీరంగనాథుని చేరి కళ్యాణవేడుకలు సర్వ భోగాలు అనుభవించింది. అదే మకరసంక్రాంతికి ముందువచ్చే 'భోగి' పండుగ.

శ్రీనివాసుని తనహృదయేశ్వరుని, జీవితేశ్వరుని చేసికోవడానికి గోదాదేవిచేసినవ్రతం ధనుర్మాసవ్రతం. పాడిన పాటలసంపుటి తిరుప్పావు. తిరుప్పావులోని మొదటి ఐదుపాశురాలలో ధనుర్మాసవ్రతానుష్ఠాన విధానాన్ని గోదాదేవి వివరించింది. మొదటిపాశురంలో అనుకూలమైన దేశకాలాదులు శ్రీపతిని పొందడానికి తనకు లభించాయని సంతోషం వ్యక్తంచేసింది. రెండవ పాశురంలో వ్రతాచరణకు అవసరమైన మనఃస్థితి, మూడవపాశురంలో వ్రతానుష్ఠానఫలం, నాలుగవ పాశురంలో వ్రతాచరణవలనలభించే దేవతల అనుగ్రహసిద్ధి, ఐదవ పాశురంలో వ్రతవిశేషంవలనకలిగే విఘ్ననివారణంగూర్చి వివరించింది. ఆరవపాశురంనుండి 15వ పాశురం వరకుగల వానిలో వ్రతాన్ని

కావించే కన్యకలు ఇంటిలోనివారిని మేలుకొలిపేభావాలను అభివ్యక్తీక రించింది. 16వ పాశురంలో ద్వారపాలకుల్ని, 17వ దానిలో నంద గోపులను, యశోదాదేవిని, 18వ దానిలో నీలాదేవిని, 19, 20 పాశు రాలలో శ్రీకృష్ణభగవానుని, నీలాదేవిని, 21వ దానిలో నీలాదేవితో కూడిన శ్రీకృష్ణపరమాత్మను ఉద్దేశించి ప్రబోధం చేసింది. 22వ పాశు రంలో తనపై దయాదృష్టులు ప్రసరింపమని ప్రార్థించింది. తన విన్నపం వినడానికి సింహగమనంతో వచ్చి సింహాసనాన్ని అలంకరింప మని శ్రీకృష్ణుని 23వ పాశురంలో అర్థించింది. దివ్యసభాభవనంలోని స్వామికి మంగళానుశాసనాన్ని కావించడాన్ని 24వ పాశురంలో వర్ణిం చింది. 25వ పాటలో ప్రతిబంధకనివారణను, 26వ పాట వ్రతసామ గ్రిని, 27వ పాటలో వ్రతప్రయోజనాన్ని కోరింది. 28, 29 పాశురా లలో నిరంతరం, నిర్విరామంగా, నిరవధికంగా శ్రీనివాసుని తిరుచర ణాలను సేవించాలన్నదే ఆకన్యల ఉద్దేశమని చెప్పింది. 30వ పాశు రంలో ఫలశ్రుతిని ప్రకటించింది.

తిరుప్పావువంటివి కొన్ని వెలువడకపోలేదు. కాని సాహిత్య చరిత్రలోమాత్రమే నిలచాయి. జైనుల 'తిరువెమ్బావై' అట్టిది జైనులు అర్హతదేవుణ్ణో, బౌద్ధులు బుద్ధదేవుణ్ణోగూర్చి 'సర్వజ్ఞుడు' ప్రాచీనమైన 'పావై' లేకపోలేదు. తత్త్వరాయ చక్రవర్తిస్వామి అద్వైతపరంగా రచించిన పావైపాటలూ ఉన్నాయి. ఆండాళ్ 'తిరు ప్పావు', మాణిక్యవాచకుల 'తిరువెమ్బావు' దక్షిణభారతసంస్కృతి నిలచినంతకాలం నిలచే పావైపాటలు. అవి సీమాంతరాలుదాటి సయామ్‌దేశం చేరి స్థిరపడ్డాయి. 'త్రిమెమ్బావై-త్రిపావై' అనే ఉత్సవరూపంలో ఆ దేశప్రభుత్వంచేత పలుశతాబ్దులనుండి విజయ వంతంగా నిర్వహింపబడుతూ నేటికీ కొనసాగుతోంది. అట్టి విశిష్టతను సంతరించుకొన్న తిరుప్పావు ద్రావిడమనే ముదలాయిరంలోనే కాదు

భక్తజనహృదయాలలోను స్థిరమైన, సుస్థిరమైన స్థానాన్ని సంపాదించుకొంది. శ్రీవేంకటేశ్వరస్వామి సన్నిధానంలో తిరుప్పావు ప్రత్యేక ప్రతిపత్తి పొందింది. శాత్తుమొఱసమయంలో స్వామివారిచెంత జియ్యంగార్లు, ఏకాంగులు, ఆచార్యపురుషులు, శ్రీవైష్ణవోత్తములు నిలచి తిరుప్పావు పఠించి హారతి అర్పిస్తారు. తిరుమలలో తిరుప్పావు పారాయణం చేసే పద్ధతి క్రీ.శ. 14వ శతాబ్దం చివరభాగంలో యేర్పడింది. క్రీ.శ. 1467లో శ్రీరామానుజుని సన్నిధిలో శాత్తుమొఱ (మంగళానుశాసనం)లో ద్రావిడ దివ్యప్రబంధ పఠనం జరిగినట్లు శాసనంవల్ల తెలుస్తోంది. క్రీ.శ. 8-12-1390 తేదిన తిరుప్పావు మార్గళిమాసంలో అను సంధానంచేసినపుడు పదిరోజులు అన్నప్రసాదనివేదన చేయడానికి ముల్లై తిరువెంకటజియ్యరును నియమిస్తూన్నట్లు, శ్రీభాండారానికి వస్త్రసముదాయం సమర్పిస్తూన్నట్లు ఉన్న శాసనం తిరుమలలో తిరుప్పావు ప్రాచుర్యాన్ని ప్రకటించి నిర్దేశిస్తోంది. తిరుపతిలో భోగిపండుగకు యేడుదినాలుముందుగా ఆండాళ్ అమ్మవారికి నీరాట్టోత్సవం జరుగుతుంది. రామచంద్రతీర్థంవద్ద ఈ ఉత్సవకార్యక్రమం మహావైభవంగా జరుగుతుంది. తిరుమలలో తిరుప్పావునకు ప్రత్యేకస్థానం లభించగా తిరుపతిలో ఆండాళ్‌కి విశేషమహోత్సవం జరుగుతోంది. ఉదయగాన మాధుర్యానికి ప్రతీకగానిలచిన తిరుప్పావు గానప్రియుడు, సంగీతలోలుడు, రాగవశుడైన శ్రీనివాసుని అనురాగమాధుర్యాన్ని గోదాదేవికి ప్రసాదించింది. సుప్రభాతసంకీర్తనం యేభక్తునకైనా శ్రీనివాసుని అనురాగానుభవాన్ని అందిస్తుంది. అలరింపజేస్తుంది. బాలాజీని నిత్యసన్నిహితుణ్ణి చేస్తుంది. సుప్రభాతసంగీతం భక్తుణ్ణి భగవంతుని చెంతకు చేర్చే సులభమైన, సురక్షితమైన ఉత్తమసాధనం. శ్రీనివాసుని చేరడానికి ఉపకరించే ప్రయాసలేని ప్రయాణసాధనం తిరు తిరుప్పావు అనుసంధానం.

# సుప్రభాతమ్

శ్రీవేంకటేశ్వరభక్తులపాలిట 'శ్రీవేంకటేశసుప్రభాతమ్' కల్పవృక్షం. భక్తిసాహిత్యంలోను, స్తోత్రసాహిత్యంలోను, శ్రీవేంకటేశభక్తిసాహిత్యంలోను, అనన్యసామాన్యమైన స్థానం 'శ్రీవేంకటేశసుప్రభాతమ్' అలంకరించింది. శ్రీవేంకటేశసుప్రభాతకర్త ప్రతివాదిభయంకరం అన్నన్. క్రీ. శ. 1268 -- 14-11-1369 మధ్య జీవించిన వేదాంతదేశికుని చరమదశలో అన్నన్ ఉన్నట్లు తెలుస్తోంది. అన్నన్ మనవాళమహాముని శిష్యుడు. తురుష్కదండయాత్రల సమయంలో శ్రీరంగనాథుడు క్రీ. శ. 1330-1360 మధ్య తిరుమలపై ప్రవాసం అనుభవించాడు. తిరుమలపై శ్రీరంగనాథస్వామి సన్నిధిలో గోదాదేవి తిరుప్పావులోని సప్తపదులు పఠనంవిన్న అన్నన్ శ్రీవేంకటేశ్వరస్వామిపై మేలికొలుపుశ్లోకాలు రచించాలని సంకల్పించి 'శ్రీవేంకటేశసుప్రభాతమ్' సంతరించాడు. ఉదయం శ్రీనివాససన్నిధానంలో జరిగే వేదపారాయణం, దివ్యప్రబంధపారాయణంస్థానంలో శ్రీవేంకటేశసుప్రభాతపఠనం క్రీ. శ. 14 వ శతాబ్దం చివరకాని, 15 వ శతాబ్దం ప్రారంభంలోగాని ప్రారంభమైనట్లు ఆధారాలు కనపడుతున్నాయి. దీనికి సుమారు వంద సంవత్సరాల పిమ్మట తాళ్ళపాకవారి మేలుకొలుపులు పాడే ఆచారం నెలకొల్పబడింది.

శ్రీవేంకటేశసుప్రభాతమ్ స్వామి సుప్రభాతం, స్తోత్రం, ప్రపత్తి, మంగళానుశాసనం అనే నాల్గుభాగాలుగా ఉంది. సుప్రభాతమ్‌లో 29 శ్లోకాలను దేవస్థానం ప్రకటించింది. ఇంకా రసవత్తరమైన శ్లోకాలు ఉన్నాయి. స్తోత్రంలో 11 శ్లోకాలు ఉన్నాయి. ప్రపత్తిలో 16 శ్లోకాలు, మంగళానుశాసనంలో 14 శ్లోకాలు ఉన్నాయి. ఈవిధంగా శ్రీవేంకటేశసుప్రభాతమ్‌లోని శ్లోకాలసంఖ్య 70.

భగవానుడు ఎప్పుడూ మేల్కొనిఉండేవాడే. నిత్యచైతన్యస్వరూపుడు భగవంతుడు ఆది అంతము లేని దేవునకు పవ్వళించుట, మేల్కొంచుట ఎలా ఉంటాయి? భగవానునకు శ్రీవేంకటేశునకు ఈ సుప్రభాతపఠనం కావించడంలోని అంతరార్థ మేమిటి? తమోనిద్రా ముద్రితులైన మానవులను పరమేశ్వరతత్వంలోనికి మేల్కొల్పడానికే ఇది ఉద్దేశింపబడింది. శ్రీవేంకటేశ్వరుని మేల్కొల్పడంలో మనల్ని మనం మేల్కొలుపుకొని శ్రీనివాసుని తత్వనవనీతాన్ని మనలో నిలుపుకోవడానికి, నెలకొల్పుకోవడానికి శ్రీవేంకటేశసుప్రభాతపఠనం దోహదం చేస్తుంది. పరతత్వజ్ఞానం పొందే నిశితమైనబుద్ధి లభిస్తుంది. మేలుకొన్న స్వామివారి మంగళరూపవైభవాలను, అనంతకల్యాణగుణాలను గానం చేసేది శ్రీవేంకటేశస్తోత్రం. శ్రీవేంకటేశనామంపై మనస్సు, శ్రీవేంకటేశచరణంపై శిరస్సు ఉంచడానికి, శరణాగతి పొందడానికి శ్రీవేంకటేశప్రపత్తి మార్గం నిర్దేశిస్తోంది. శ్రీవేంకటేశ మంగళానుశాసనం జ్యోతిస్వరూపుడైన శ్రీనివాసభగవానునిలో జీవుడు కర్పూరహారతివై లీనమైపోవడానికి దారిచూపే కరదీపిక.

భావావేశంతో, రసావేశంతో, భక్త్యావేశంతో, మధురకవితావేశంతో సాగినరచన శ్రీవేంకటేశసుప్రభాతమ్. శ్రీవేంకటేశ భక్తిని విశ్వవ్యాప్తం చేయడంలో శ్రీవేంకటేశసుప్రభాతమ్ ఉత్తమ ప్రచారసాధనంగా తోడ్పడుతోంది. దానిలోని సాహిత్యపరిమళం, పఠనసౌలభ్యం జనులను శ్రీవేంకటేశ్వరభక్తులుగా మారుస్తోంది. భక్తులను పులకాంకితుల్ని చేసి పారవశ్యభరితుల్ని చేస్తోంది. అందరి హృదయాలలో అది భక్తిబీజాలు నాటి, వానిని వృక్షాలుగా చేసి, మోక్షరసంతో నిండిన భక్తిఫలాలను అందించేస్తోంది. అనుభవింపజేస్తోంది. సుప్రభాతశ్లోక కుసుమాలు సాహిత్యసౌందర్యంతో వికాసం పొంది శ్రీనివాసభక్తిసుగంధాలను వెదజల్లుతున్నాయి.

డబ్బదిశ్లోకాలుగల ఈ సుప్రభాతమ్‌లో మనం గమనించి గ్రహించవలసిన ఎన్నోవిశేషాంశాలు ఉన్నాయి. 'కౌసల్యా సుప్రజా రామ' అన్నశ్లోకం బాలకాండ లోనిది. దీన్ని పఠిస్తూ ఉదయాన్నే వైష్ణవదేవాలయాలలో గర్భగుళ్ళను తెరిచే ఆచారం దేశంలో వ్యాప్తిలో ఉంది. రాముడు కౌసల్యాసుప్రజారాముడు. దశరథరాముడు అని పిలవడం విశ్వామిత్రునకు హితవుగాక అలా మేలుకొలిపాడు. రాముణ్ణి తండ్రి ఆలోచించిగాని విశ్వామిత్రునితో పంపలేదు. సైనిక కార్యాలు సాధించేవయస్సు రామునకు లేదని సాకు చెప్పాడు. కాని వశిష్ఠుని ఉపదేశంమూలంగా పంపాడు. కౌసల్య రాముణ్ణి విశ్వామిత్రునితో అవశ్యం వెళ్ళమని ఆశీర్వదించి పంపించింది. అందుచేత కౌశికుడు రాముణ్ణి కౌసల్యాసుప్రజారామా అని సంబోధిస్తూ మేల్కొలిపాడు. శ్రీరాముడు సత్యపరాక్రముడు. ధర్మవిగ్రహుడు. రామానుగ్రహం వలన సత్యధర్మాలు భక్తులకు వరాలుగా లభిస్తాయి. దానికోసమే ముందుగా ఈశ్లోకం ఉంచబడింది. శ్రీకృష్ణుడు గోవిందుడు. గోవిందుడుశాంతిప్రేమల్ని ప్రసాదిస్తాడు. అందుకే గోవిందుని మూడులోకాలకు శాంతిభిక్ష, ప్రేమభిక్ష ప్రసాదింపమని మేల్కొలిపే శ్లోకం సుప్రభాతంలో కనపడుతోంది. ప్రాచీన చతుర్విధ 'పురుషార్థాలు, ధర్మార్థ కామమోక్షాలు. అర్వాచీన చతుర్విధపురుషార్థాలు సత్యధర్మ శాంతి ప్రేమలు, శ్రీరామ కృష్ణావతారాలు ఎత్తిన శ్రీనివాసుని పురాతన, అధునాతన చతుర్విధపురుషార్థాలు ప్రసాదింపమని అర్థించడానికే సుప్రభాతమ్‌లోని రెండుశ్లోకాలు ఉద్దేశింపబడ్డాయి.

తరువాత రెండుశ్లోకాలు లక్ష్మీదేవి అనుగ్రహప్రాప్తిని కోరుతున్నాయి. లక్ష్మీదేవి దయాదేవి అని 'దయానిధే' అన్న పద ప్రయోగం తెలుపుతోంది. సృష్టి, ప్రళయం దయాదేవి చర్యలే. రెండూ దయతోకూడిన కార్యాలే. దయాదేవియైన లక్ష్మీదేవి

శ్రీనివాసుని హృదయపీఠం అలంకరించడంవలన బాలాజీప్రభువు పరమదయామయుడై భక్తుల్ని అనుగ్రహిస్తున్నాడన్న భావన లక్ష్మీ దేవిస్తుతిపరమైన శ్లోకాలవలన వ్యక్తమవుతోంది. సాహసలక్ష్మి, భాగ్యలక్ష్మి, మోక్షలక్ష్మి, శ్రీలక్ష్మికటాక్షం వలన లభిస్తాయి. అమృతంపుట్టిన పాలసముద్రంనుండి పద్మనేత్రయై, చంద్రముఖియై పుట్టి శ్రీహరిని శ్రీనివాసుని చేసింది. భారతి, పార్వతి, ఇంద్రునిసతి పూజలు అందుకొంది. ధ్యానించి సేవించినవారి గృహాలలో నిలుస్తుంది. ఇహపరసుఖాలు కలిగిస్తుంది. ఆ ఫలితాలు సాధించటానికే శ్రీ లక్ష్మిని మేల్కొల్పడం, స్తోత్రం చేయడం జరిగింది.

శ్రీనివాసుని ఆనందనిలయం తూర్పుగా ఉంది. దానికి ఉత్తరంగా ఆకాశగంగ ఉంది. ఆకాశంలో ఉత్తరదిక్కున ధ్రువనక్షత్రం పైన సప్తఋషిమండలం ఉంది. ఉదయసమయంలో ఆకాశసింధుకమలాలు సేకరించి శ్రీనివాసుని పూజించడానికి ఆనందనిలయంముందు నిలుస్తారు, ఆ సప్తఋషిపుంగవులు. ఆ ఖగోళదృశ్యానికి 'అత్ర్యాది సప్తఋషయః' అన్న శ్లోకం ప్రతిబింబం. సప్తఋషుల దీవెనలను భక్తులకు, శ్రీనివాసుని సేవలు సప్తఋషులకు కలిగించే శ్లోకమిది. బృహస్పతిచెప్పే తిథివారనక్షత్రాలు, కొలువులలో ఉండి విని వాని దోషాలు భక్తులకు నివారిస్తాడు. ఈభావనకు రూపకల్పన ఆరవ శ్లోకంలో ఇవ్వబడింది. ఆదిశేషునిపై తనకు విజయం చేకూర్చిన శ్రీనివాసుని ఉపకారస్మృతికి గుర్తుగా ఉదయాన్నే వాయుదేవుడు వాయురూపం ధరించి, ప్రకృతిలో భాగస్వామిని సేవిస్తాడు. చల్లని పిల్లవాయువులతో భక్తుల్ని ఆహ్లాదపరుస్తాడు. 'ఈషత్ప్రఫుల్ల' అన్న శ్లోకపఠనంవలన వాయుదేవుని అనుగ్రహం లభించి ఆయురారోగ్యాలు సిద్ధిస్తాయి. శ్రీనివాసుడు ఏకాంతసమయంలో ఆరగించగా మిగిలిన పండ్లుతినే శుకసంతతులవలె మనంకూడ శ్రీనివాసుని ప్రసాదంకోసం

నిత్యం నిరీక్షించాలనే సందేశం 'ఉన్మీల్యనేత్రయుగముత్తమపంజరస్థాః' అన్న సుప్రభాతశ్లోకం అందిస్తోంది. నాభక్తులు ఎక్కడ గానం చేస్తారో నేను అక్కడ ఉంటాను'' అన్నాడు భగవంతుడు. ఇది నారదభక్తి సూత్రం. ఈ నారదభక్తిసూత్రం పాటించవలసిన ప్రాముఖ్యాన్ని 'తంత్రీప్రకర్ష మధురస్వనయా' అన్నశ్లోకం తెలుపుతోంది. వీణావేణు నాదాలతో శ్రీనివాసుని సంకీర్తనం చేయాలని భక్తులకు తెలియ జేస్తోంది.

మకరందరసాస్వాదనకు ఉదయాన్నే బయలుదేరే భృంగసము హాలవలె భక్తసముహాలూ గోవిందనామామృత పానానికి సన్నద్ధులు కావాలని 10 వ శ్లోకం హెచ్చరిస్తోంది. గోపికల పాలూ, పెరుగూ వెన్నా కృష్ణుడు దొంగిలించాడు. కృష్ణుని మనస్సును గోపికలు దొంగి లించారు. ఆ గొల్లభామలు పెరుగుకవ్వలు చిలికిన చప్పుడులలో గోపీ కృష్ణుల సరససల్లాపాల కథలు వినిపిస్తూ శ్రీనివాసుని మేల్కొల్పిన భావం 11వ శ్లోకంలో కనపడుతోంది. భక్తహృదయపద్మాలను విక సింపజేసే భాస్కరుడు శ్రీనివాసుడు. నల్లకలువలవంటి భక్తుల పాపా లను హరించే భానుడు శ్రీవెంకటేశ్వరుడు. ఇట్టిభావనకు సుప్రభాతమ్ లోని 12వ శ్లోకం రూపకల్పన చేసింది.

భక్తాభీష్టవరదుడు శ్రీనివాసుడు. అతడు లోకానికి బంధువు. జగానికి దయాసింధువు. ఈవిధమైన భక్తిభావాలకు - శ్రీనివాసానురక్తి భావాలకు 13వ శ్లోకం ప్రాధాన్యం కల్పిస్తోంది. 'శ్రేయాంసి బహు విఘ్నాని.' శివుడు, బ్రహ్మదేవుడు, సనందుడు శ్రీనివాసదర్శనంకోసం బెత్తపుదెబ్బలు తిన్నారు. భక్తులు ఎంతశ్రమనైనా భరించి విఘ్నా లను తొలగించుకొని శ్రీనివాసుని చూచి, నమస్కరించి తరించాలి. ఈ సంకల్పం బలపరచే శ్లోకం సుప్రభాతమ్‌లోని 14వ శ్లోకం. 15వ శ్లోకం శ్రీనివాసుడు ఆరుకొండలపై నిత్యం ఉంటున్నాడని తెలిపింది. ఏడవ

కొండ సింహాచలంపేరు చెప్పలేదు. భక్తులలోని అరిషడ్వర్గాలను తొల గించడానికే శ్రీవేంకటేశ్వరుడు ఆరుకొండలపై నిత్యనివాసం కావిస్తు న్నాడు. వాటిని భక్తులు తొలగించకొనగలిగితే సప్తగిరివాసుడు ఏడవ కొండపై కనపడతాడు. సింహాచలనివాసుడై భక్తులను నరసింహాలను కావిస్తాడు. శేష, గరుడ, నారాయణ, వృషభ, వృషాద్రులవలె మనం స్వామిని సేవించాలి. మాధవునివలె వ్యవహరించకూడదు. స్వామి సేవలో ఈవిధినిషేధాలు ఉన్నాయి. విధిని పాటించక నిషేధాలను అమలుచేసే మాధవులు నేటి కలియుగ మానవులు. వారిని రక్షించ డానికే కలియుగేశ్వరుడై శ్రీవేంకటేశ్వరు డున్నాడు. ఇట్టి రమణీ యార్థాలు, పుణ్యపురాణగాథలు 15వ శ్లోకంలో ఉన్నాయి.

ఇంద్రాది దేవతలు ఎనిమిది దిక్కుల్ని పాలించినా నీదర్శనం కావించవలసినవారే. నీదిక్కు ఉండబట్టే వారు అష్టదిక్పాలకులయ్యారు. విహగరాజు గరుడుడు. మృగరాజు సింహం. నాగరాజు ఆదిశేషుడు. గజరాజు ఐరావతం. హయరాజు ఉచ్చైఃశ్రవం. గరుడగతి విమాన గతి. గంభీరగమనం సింహగతి. వంకరటింకరగాను, వేగంగాను పాకడం సర్పగతి. భూమికంపించేలాగ అడుగులువేస్తూ రాజసంగా నడవడం గజగతి. పిక్కలబలంచూపుతూ, డెక్కలచప్పుడుచేస్తూ పరుగులు తీయడం అశ్వగతి. శ్రీపతి సేవలవలన వీనికి గతులువచ్చాయి. శ్రీపతి స్థితిగతులుచూచి తమగతులంతే అని తలవంచుకొన్నాయి. శ్రీనివాసుని సేవించడానికి పోటీపడాలి. శ్రీనివాస సన్నిధానంలో పదవులు సంపా దించడానికి ఆరాటపడకూడదని ఆ జంతువులు తెలిసికొన్నాయి. భక్తులైన మానవులు వానిని అనుసరించాలి. మానవుల జీవితచక్రా లను నడిపించే నవగ్రహాధిపుల జాతకచక్రాలు మార్చగలిగినవాడు శ్రీనివాసుడు. నవగ్రహాలు మానవులకు గ్రహగతులనుబట్టి ఫలితా లిస్తారు. వారు ఆఫలితాలను మార్చలేరు. కాని శ్రీనివాసుడు భక్తుల

గ్రహాచార, గోచార దుష్ఫలితాలను మరుస్తాడు. సుఖశాంతు లిస్తాడు. శ్రీనివాసునకే కాదు, శ్రీనివాసదాసులకు నవగ్రహాధిపులు దాసులే ! కాలగతి తెలిసిన నవగ్రహమూర్తులు శ్వేతవరాహ కల్పం దాటితే శ్రీనివాసుని సేవదుర్లభమవుతుందని భయపడి స్వర్గమోక్షా లకు ఆశపడక స్వామివారి పవిత్ర పాదపరాగం నిత్యం శిరస్సున ధరించా లని ఆశపడుతున్నారు. కాలగమనం తెలిసికొనలేని మానవులు స్వామి వారి పాదసేవకు త్వరపడాలి. నిత్యముక్తులైనవారు కూడ శ్రీనివాసుని స్వర్ణఆనందనిలయవిమానం చూచి మానవులై తిరుమలపై నిత్య నివాసం కావిస్తూ సేవించాలని ఆశిస్తారు. ముక్తికోరే మానవులు శ్రీని వాసదాసులై స్వామిని, ఆనందనిలయవిమానాన్ని భావించి సేవిం చాలి. 16 వ శ్లోకం నుండి 20 వ శ్లోకం వరకుగల శ్లోకాలు ఇట్టి రమణీయార్థప్రతిపాదన కావించే భావాలను ప్రకటించాయి.

నిత్యముక్తులు, నిత్యశూరులతో నిండి ఉంటుంది వైకుంఠం. శేషతల్పంపై శ్రీసతి సేవలు స్వీకరిస్తూ ఆమె సౌందర్యంపై దృష్టిప్రస రిస్తూ పవ్వళించిఉంటాడు శ్రీనివాసుడు. అనంత గరుడులపాదసేవలు పొందుతూంటాడు. శరణాగతపారిజాతుడై, భక్తులకు సులభప్రాప్యుడై దివ్యవైకుంఠధామాన్ని పాలిస్తాడు. వైకుంఠాన్ని విడచి శ్రీనివాసుడు దశావతారాలలో లోకరక్షణ కావించాడు. వైకుంఠంతో వచ్చి తిరు మలపై నెలకొన్నాడు స్వామి. అందుకే తిరుమలలోని శ్రీనివాసుని ఆనందనిలయం కలియుగవైకుంఠం, కన్నులవైకుంఠం. శ్రీనివాసుని పాదంనుండి ఉద్భవించిన ఆకాశగంగ బంగారుకడవలలోనిండి స్వామి సుప్రభాతసేవకు తరలివచ్చింది. వైదిక శిఖామణులు, శ్రీవైష్ణవోత్త ములు స్వామిసుప్రభాత సేవకుసన్నద్ధులయ్యారు. బ్రహ్మాది దేవతలు, సనకసనందనాదియోగివర్యులు మంగళవస్తుసముదాయాన్ని హస్తాలలో

ఉంచికొని స్వామికి ఆచారంప్రకారం శుభోదయసమయంలో చూపించడానికి సిద్ధంగాఉన్నారు. ఉదయం మేల్కొని దక్షిణహస్తం, అద్దం, జలంవంటి మంగళవస్తు సముదాయాన్ని చూడాలి ఎవరైనా. కాగా దేవతలు, యోగులు, ఆచార్యులు, వైదికులు, భక్తులు తనపాదాలను సేవింపుమనిచూపే స్వామి దక్షిణహస్తాన్ని దర్శించాలని, తెచ్చిన జలంతో స్వామిపాదసేవ చెయ్యాలని, అద్దంలో స్వామిఅందం చూడాలని అరుణోదయసమయాన స్వామి సన్నిధానములో వేచిఉన్నారు. ఈసేవలు చేసినవారికి సంసారసాగరం కటిదఘ్నం కాగలదు. వేదాంతంద్వారా తెలిసికొనవలసినవాడు శ్రీవేంకటేశ్వరుడు. లక్ష్మీనివాసుడైన శ్రీనివాసుణ్ణి సుప్రభాతసమయంలోచూచి పూజించడమే ఆవేదాంతరహస్యం. ఆలక్ష్మీనివాసుని అనుగ్రహం వలన భక్తులు మోక్షలక్ష్మీ వరప్రసాదులై తరిస్తారు. నిత్యం ఉదయాన్నే శ్రీవేంకటేశ సుప్రభాతం పఠించడంవలన సులభంగా అట్టి వరానుగ్రహప్రయోజనం లభిస్తుంది. 16 వ శ్లోకంనుండి 29 వ శ్లోకం వరకుగల సుప్రభాతశ్లోకాలలో సదృశమైన భావపరంపరలు దృగ్గోచరమవుతాయి. శ్రీవేంకటేశసుప్రభాత పఠనంలో భక్తులైన పఠితల మనోనేత్రాలకు సుందరమైన, మనోహరమైన, మధురానుభూతిప్రేరకమైన, అసదృశమైనభావదృశ్యాలు సాక్షాత్కరిస్తాయి. శ్రీవేంకటేశ సుప్రభాతపఠనజనితమైన భావాంబర దృశ్యాలు మానవునిలో జ్ఞానదృష్టిని, జ్ఞానానుష్ఠాననిష్ఠను పటిష్ఠం కావిస్తాయి.

శ్రీ వేంకటేశ సుప్రభాతము పఠించడం ముగించిన పిమ్మట భక్తుడు కావించేది శ్రీవేంకటేశ స్తోత్రం. దీనిలో నాలుగు దశలున్నాయి. మొదటి దశలో, చివర దశలో శ్రీవేంకటేశ స్తోత్రం, రెండు మూడుదశలలో శ్రీకృష్ణ, శ్రీరామ స్తోత్రా లున్నాయి.

సీతాదేవి నొసట తిలకం శ్రీరాముని వక్షస్థలానికి అంటుకొని అరుణకాంతిని విరజిమ్ముతోంది. అదేవిధంగా గోపీకృష్ణునకూ జరిగింది. శ్రీరామ, శ్రీకృష్ణావతార స్వరూపుడైన శ్రీ వేంకటాచలపతికి విజయ మగుగాక! నాలుగు, ఐదు, ఆరు ముఖాలు గల దేవుళ్లు శ్రీనివాసుణ్ణే తమ నాయకునిగాను, పరమప్రాప్యునిగాను భావించి ఆశ్రయించారు. ఒకే ముఖం గల సామాన్య మానవుడు శ్రీనివాసుని వినా అన్యుని ఆశ్రయించడం సంభవమా? అన్ని ముఖాలు, అన్ని కన్నులున్న ఆ దేవుళ్ళకే శ్రీనివాసుని సౌందర్యం సంపూర్ణంగా గ్రహించడం సాధ్యం కాలేదు. ఒకే ముఖం, రెండు కన్నులున్న సాధారణ మానవునకు శ్రీనివాసుని సౌందర్యం సమగ్రంగా గ్రహించడం ఎన్నటికీ సాధ్యం కాదు. అందుకే శ్రీపాదాన్ని మనం ఆశ్రయించాలి. ప్రతి కలియుగ మానవుడూ అజామిళుని వంటివాడే! అజామిళ రక్షకుడు శ్రీమన్నారాయణుడైన శ్రీ వేంకటేశ్వరుడు. దయకు అనర్హుడైన వానిపై కూడ విశేషంగా దయచూపే దయామయుడైన శ్రీ వేంకటేశ్వరుడు అర్థించినవారికి అర్థించినదానికి మించి అనుగ్రహిస్తాడు అనడంలో ఆశ్చర్య మేముంది? ఇట్టి భావాలు శ్రీ వేంకటేశ స్తోత్రం మొదటి దశలో వ్యక్త మయ్యాయి. చివరి దశలో శ్రీ మార్కండేయమహర్షి కృత 'వినా వేంకటేశం' అన్న స్తోత్రశ్లోకాలు కనపడతాయి. శ్రీకృష్ణుని, శ్రీరాముని అనంత కళ్యాణగుణాలు మధ్య అభివర్ణింపబడ్డాయి. ఈ స్తోత్రం పఠిస్తే భక్తిలేనివారికి కూడ భక్తి కలుగుతుంది. భక్తి కలవారు పఠిస్తే వారి భక్తిభావం బలపడుతుంది. భక్తిభావం బలపడినవారు చదివితే వారికి శ్రీ వేంకటేశ్వరుని అనుగ్రహం లభించి, తద్వారా దైవానుభూతి కలుగుతుంది.

ధర్మార్థ కామ మోక్షాలనే పురుషార్థాలలో మోక్షం పరమ పురుషార్థం. పరమపదంలో పరమేశ్వరుని పాదసేవను పొంది ఆనందించ

డమే మోక్షం. 'మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ' అన్నది శాస్త్రవచనం. ప్రీతి, ఆసక్తి, రతి గల చిత్తవృత్తిని భగవత్పరం చేస్తే అది భక్తి అవుతుంది. 'ఆత్మావా౽రే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః' అన్నది బృహదారణ్యక వాక్యం. 'ధ్యానంచ తైలధారావద విచ్ఛిన్న స్మృతి సంతానరూపమ్' అని శ్రీ భాష్యకారులు ప్రవచించారు. మానసికంగా ధ్యానం, వాచికంగా సంకీర్తనం, కాయకంగా అర్చనం - ఈ విధంగా త్రికరణాలతో అవిచ్ఛిన్నంగా శ్రీనివాసుని సేవించేవారికి మోక్షం లభించి తీరుతుంది.

'యత్కర్మభిర్యత్తపసా జ్ఞాన వైరాగ్య తశ్చయద్
యోగేన దానధర్మేణ శ్రేయోభి రితరై రపి
సర్వం మద్భక్తి యోగేన మద్భక్తో లభతేంజసా
(శ్రీమద్భాగవతము)

'కర్మజ్ఞానాది పెక్కు మార్గాలద్వారా విశేషశ్రమపడి ఏ మోక్షాన్ని సాధింపవచ్చునో భక్తి యోగంవలన మానవుడు అతి సులభంగా, అనాయాసంగా ఆ మోక్షాన్ని పొందవచ్చును. 'అగ్ని కట్టెలను కాల్చినట్లు భక్తి పాపాలను హరిస్తుంద' న్నది వ్యాసవాక్యం. 'భక్తివశః పురుషః.' 'భక్తిరేవైనంగమయతి' పరమాత్మ భక్తికి వశుడవుతాడు. ఈశ్వరుడు భక్తికి ప్రాప్తుడవుతాడు. జాతికి, మతానికి, కులానికి అతీతమైనది భక్తి. శ్రీభాష్యకారులు భక్తి సంపాదనకు ఏడు సాధనాలు నిర్దేశించారు. వివేకం, విమోకం, అభ్యాసం, క్రియ, కల్యాణం, అనవసాదం, అనుద్ధర్షం అన్నవి ఆ ఏడు సాధనాలు. సాత్త్వికాహారం తీసికొని మనస్సును, దేహాన్ని సాత్త్విక కార్యాలలో నిమగ్నం చేయుడమే వివేకం. జీవకోటిపట్ల ప్రేమ చూపాలి. ఆర్తులను కనికరంతో ఆదుకోవాలి. పుణ్యపురుషులపట్ల ఆపేక్ష, దుష్టపురు

షులపట్ల ఉపేక్ష చూపాలి. అరిషడ్వర్గాలను దూరంగా ఉంచాలి. దీన్ని విమోకం అంటారు. ఆచార్యులు చూపిన మార్గం అనుసరిస్తూ దైవప్రాప్తి సాధనాలైన మంత్రజపాలను అనవరతం చెయ్యడాన్ని అభ్యాసం అని పిలుస్తారు. నిష్కామ్యంగా ఆశ్రమకోర్చి కర్మలను శ్రద్ధగా పరమేశ్వరారాధన దృష్టితో చేయడాన్ని క్రియ అంటారు. సత్యం, ధర్మం, దానం, శాంతి, ప్రేమ, అహింస మొదలైన ఆత్మ, లోక కల్యాణ హేతువులైన గుణాలను అలవరచుకోవడం కల్యాణంగా భావింపబడుతోంది. కష్టనష్టాలకు ద్వంద్వాలకు అతీతంగా సాధన సాగించడం అనవసాదం అనే పేరుతో వ్యవహరింపబడుతోంది. అహంకార మమకారాలకు లోనుగాకుండా సాధన చేస్తూ వినయ శీలియై ప్రవర్తించడాన్ని అనుద్ధర్షం అంటారు. ఇవి భక్తియోగ సాధకుడు భగవత్ప్రాప్తికై అధిరోహించవలసిన ఏడు ముఖ్యమైన భక్తి సోపానాలు.

'అఖిల భువన జన్మస్థేమ భంగాదిలీలే
వినత వివిధ భూత వ్రాత రక్షైక దీక్షే
శ్రుతి శిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే
భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా'

– శ్రీ భాష్యము.

'జగముల సృష్టి, స్థితి లయకారకుడు, ఆపన్న ప్రసన్నుడు, ఉపనిషద్వాణి శిరోభూషణుడు పరమేశ్వరుడు అయిన శ్రీనివాసుని యందు నాకు స్థిరమైన భక్తి నిలచుగాక అని శ్రీభాష్యకారులైన శ్రీ రామానుజాచార్యులవారు ప్రకటించుకొన్నారు.

'పూర్వకర్మనుబట్టి ఏది ప్రాప్తించినా నేను పట్టించుకోను. ఒకటిమాత్రం గట్టిగా ఇవ్వమని ప్రార్థిస్తాను. జన్మ జన్మలకు అచంచలమైన నీ పాదసేవను, భక్తిని అనుగ్రహింపమని కోరతాను. అని

ముకుందమాలలో కులశేఖరులు కోరారు. 'నేను నీవాడను. నిన్ను నావాడను కావించుకోవాలి. దానికై నీవై నాకు అనన్యమైన భక్తిని ప్రసాదింపు'మని యామునాచార్యవర్యులు అర్థించుకొన్నారు. నవవిధ భక్తి పద్ధతులలో ప్రహ్లాదుడు శ్రీహరిని సేవించాడు. తీవ్రతమమైన భక్తికి ప్రతిరూపం ప్రపత్తియోగం. దీనికే శరణాగతి, న్యాసం, సన్న్యాసం, భరన్యాసం, సాధ్యభక్తి, త్యాగం అనే పేర్లు ఉన్నాయి. ప్రపత్తి దర్శనాన్ని వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు, భగవద్గీత, పాంచరాత్రాగమం ప్రతిపాదించాయి. యజుర్వేదం ప్రపత్తి ధర్మాన్ని ప్రతిపాదించింది. పరమేశ్వర శరణాగతియే ముక్తిసాధనకు ముఖ్యమైన ఉపాయమని తైత్తిరీయారణ్యకం నిశ్చయించింది. 'ఓంకారమే విల్లు. జీవాత్మ అమ్ము. పరమాత్మయే గుఱి. సాధకుడనే విలుకాడు మిక్కిలి మెలకువతో ఆ గుఱిని కొట్టాలి. అమ్ము వెళ్ళి గుఱిలో చొచ్చుకొని పోయినట్లు జీవాత్మ పరమాత్మలో చేరాలి' అని ముండకోపనిషత్తు ప్రపత్తి యోగాన్ని గూర్చి వివరించింది. శ్రీమద్రామాయణానికి దీర్ఘశరణాగతి అని పేరు.

జటాయు కాకాసురులు పక్షులు. కాళీయనాగం విషసర్పం. గజేంద్రుడు మత్త జంతువు. ప్రహ్లాద విభీషణులు రాక్షసవంశ సంజాతులు. శబరి, గుహుడు నిషాదులు. ప్రపత్తియోగం అవలంబించి వారు తరించారు. ఆధ్యాత్మికరంగంలో ప్రపత్తియోగం సామ్యవాద సిద్ధాంతం వంటిది. దేశకాలాది నియమాలు పాటించనవసరం లేనిది. పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చా స్వరూపాలని పరమేశ్వర స్వరూపాలు ఐదు విధాలని శాస్త్రాలు వర్ణించాయి. ప్రపత్తియోగ సాధనకు ముముక్షువులకు మిక్కిలి తోడ్పడే రూపం అర్చాస్వరూపం. దివ్య వైకుంఠధామంలో పరస్వరూపాన్ని వేదాలు ప్రశంసించాయి.

పురాణేతిహాసాలు భగవానుని వ్యూహ, విభవ స్వరూపాలను వర్ణించాయి. పుణ్యాత్ములు తమ అంతరంగాలలో అంతర్యామి స్వరూపాన్ని ఆరాధిస్తారు. భక్తజన సౌలభ్యంకోసం వేంకటాచలంపై శ్రీనివాసుడు అర్చాస్వరూపుడై అవతరించాడు.

"సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే
అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్ వ్రతం మమ"
- శ్రీరాముడు

"సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః"
- శ్రీకృష్ణుడు

"ఎవరైనా శ్రీరామా, నేను నీవాడను, నన్ను రక్షింపుము అంటే అట్టివారికి అభయమిచ్చి రక్షించడమే నావ్రతం. నా శత్రువు తమ్ముడైన విభీషణుడేకాదు, నాకు పరమ శత్రువైన రావణుడే వచ్చి నన్ను అభయ మడిగితే వానిని రక్షిస్తాను. అడిగినవారికి అభయమిచ్చి రక్షించడం నా ధర్మం" అన్నాడు శ్రీరాముడు.

"సకల కర్మ ఫల త్యాగంచేసి నన్నే శరణు పొందుము. నిన్నే పాపాలు సోకకుండా చేసి నీకు ముక్తిని ప్రసాదిస్తాను" అన్నాడు శ్రీకృష్ణుడు. త్రేతాయుగంలో శ్రీరాముడు, ద్వాపరయుగంలో శ్రీకృష్ణుడు భక్తులకు రక్షణ మోక్షం ప్రసాదిస్తామని చేసిన అభయ ప్రదానాన్ని కలియుగంలో ప్రత్యక్షంగా అనులుపరచడానికి శ్రీనివాసుడు తిరుమలపై ఆవిర్భవించాడు. విభీషణుడు శ్రీరామ పాదాల్ని ఆశ్రయించినట్లు, పార్థుడు శ్రీకృష్ణ చరణాలను సేవించినట్లు మనం శ్రీ వేంకటేశ చరణాలను శరణు చేడడానికి 'శ్రీ వేంకటేశ ప్రపత్తి' తోడ్పడుతోంది.

శ్రీ వేంకటేశ ప్రపత్తిలో 16 శ్లోకాలు మాత్రమే ఉన్నాయి. వానిలో మొదటి శ్లోకం శ్రీలక్ష్మీ స్తవం. 'శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే' అనే చరణంతో ప్రతి శ్లోకం సమాప్త మవుతుంది. శ్రీ పాదాల వైభవం, శ్రీ పాదాలసేవలోని దివ్యానుభవం శ్రీ వేంకటేశ ప్రపత్తి పఠనంలో భక్తునకు లభిస్తుంది దివ్యమహిమల సేవలు పొందిన చరణాలు శ్రీ వేంకటేశ చరణాలు. బ్రహ్మదేవుడు, శివుడు పూజించిన చరణాలు శ్రీ వేంకటేశ చరణాలు. వేదాలు వినుతించిన చరణాలు. పార్థుడు ఆశ్రయించిన చరణాలు. కాళీయుని తలపై నృత్యం చేసిన పాదాలు, ఆపన్న ప్రపన్నులపై అమృతం వర్షించే పాదాలు సంసార సాగరంనుండి తరింపజేసే దివ్యచరణాలు అవే తిరు వేంకటగిరిపై వెలసిన శ్రీ వేంకటేశ చరణాలు. సర్వులూ శరణు వేడవలసినవి ఆ శ్రీ వేంకటేశుని దివ్యచరణాలనే. అట్టి శ్రీనివాసు దివ్య పాదాలకుపయోగపడే పాదుకలపై వేదాంత దేశికాచార్యులవారు 'పాదుకాసహస్రమ్' రచించి తరించారు. అట్టి మధురము అనుగ్రహించే శ్రీ పాదాలను ఆశ్రయించి, ప్రపత్తి యోగాన్ని అనుసరించి తరించడానికి తరణోపాయం చూపే 'శ్రీ వేంకటేశ ప్రపత్తి' చేయడం ప్రతిమానవుని ప్రథమ కర్తవ్యం. ప్రతి భక్తుని పవిత్ర ధర్మం పరమ భాగవత ధర్మరహస్యం 'శ్రీ వేంకటేశ ప్రపత్తి'లో ఇమిడిఉంది. దాన్ని అనుసంధానం చేయడంద్వారా ఆ పరమ ప్రయోజనం పొందడం ప్రతి భక్తుని పవిత్ర కర్తవ్యం.

జీవుడు దైవసందర్శనంలో చేసే అభివాదం సుప్రభాతం. జీవుడు దైవాన్ని సమీపించి కావించే స్వామివారి అనంతకల్యాణ గుణ గానం స్తోత్రం. దైవానికి అతి సన్నిహితుడై స్వామివారి పాదాలను ఆశ్రయించి ఆత్మార్పణం కావించుకోవడం ప్రపత్తి. ప్రపత్తిద్వారా

జీవుడు దేవునిచేరి పొందిన అనుభవానందగానమే మంగళానుశాసనం. మన ఆరాధనాక్రమంలో స్వామికి మంగళహారతు లివ్వడం అనూచానంగా ఉన్న ఒక మంచి ఆచారం. భక్తిసాహిత్యంలో మంగళానుశాసనశ్లోకాలు, మంగళహారతి పాటలు కోకొల్లలుగా ఉన్నాయి. 'మంగళం కోసలేంద్రాయ మహనీయ గుణాత్మనే' అని శ్రీరాముని పైనను, 'మదనగోపాలతే మంగళం - మందర ధరతే మంగళం'- 'మంగళం రుక్మిణీ రమణా శ్రీమతే మంగళం రమణీయ మూర్తయే మంగళం' అని శ్రీకృష్ణుని పైన మంగళానుశాసనాలు ఉన్నాయి. ఆళ్వారులు, ఆచార్యపురుషులు దైవ మంగళానుశాసనాలు కావించి తరించారు. లోకరక్షకుని రక్షణ కాంక్షిస్తూ పెరియాళ్వారు 'పల్లాండు' సంకీర్తనం కావించారు. సత్యత్వం, జ్ఞానత్వం, అనంతత్వం, ఆనందత్వం పరబ్రహ్మ గుణాలు. ఆ ఐదు గుణాలకు నెలవై తిరుమలపై వెలసిన స్వామి శ్రీ వేంకటేశ్వరస్వామి. శ్రీ వేంకటేశ మంగళానుశాసనంలో స్వామివారి ఆ ఐదు లక్షణాలు ప్రస్తుతింపబడ్డాయి. శ్రీ వేంకటేశునకు మంగళం కోరితే భక్తునకు మంగళం, లోకానికి మంగళం కలుగుతుంది. శ్రీ వేంకటేశ మంగళానుశాసనగానం వలన ఆత్మకళ్యాణం, లోక కళ్యాణం ప్రాప్తిస్తాయి. శ్రీనివాసుని మంగళగానం వలన శ్రీనివాస దాసుడై సత్యత్వం, జ్ఞానత్వం, అనంతత్వం, అమలత్వం, ఆనందత్వం అనుభవించ గలుగుతాడు. భక్తి యోగసాధనకు, ప్రపత్తి యోగానుష్ఠానానికి శ్రీ వేంకటేశ సుప్రభాతానుసంధానం సాధకునకు ఉపకరించే ఉత్తమ సాధనం. స్వామివారి నిత్యారాధనం సుప్రభాత సేవతో ప్రారంభమై ఏకాంతసేవతో పరిసమాప్త మవుతుంది.

1959 - 1960 సంవత్సరాలలో ఆంధ్రప్రభ సచిత్రవార పత్రికలో శ్రీ వేంకటేశ్వర భక్తుల అనుభవాలు 'తిరుపతి నిదర్శనాలు'

అనే శీర్షికతో ధారావాహికంగా ప్రచురిత మయ్యాయి. ఒక భక్త శాలి భర్త తీవ్రమైన క్షయవ్యాధికి లోనయ్యాడు. నిపుణులైన వైద్యులు ఆ వ్యాధి నయంకాదని, అతడు మరణిస్తాడని నిర్ణయించారు. అతడు పొందే మరణయాతనకు విముక్తి ఒక శస్త్ర చికిత్సవల్ల మాత్రమే సాధ్యమవుతుందని, జీవించడం అసాధ్యమని వారు నిర్ధారించి శస్త్రచికిత్స చేయడానికి ఒక తేదీని ప్రకటించారు. భర్త పరిస్థితిని తెలిసికొన్న అతని భార్య నిత్యం పిల్లలతో కలసి భక్తితో శ్రీ వేంకటేశ సుప్రభాతము పఠించింది. శస్త్రచికిత్స చేయడానికి నిర్ణయించిన నాడు అతణ్ణి పరీక్షించగా అతని వ్యాధి నిశ్శేషంగా నివారణమైనట్లు కనుగొన్న వైద్యులు ఆశ్చర్య పడ్డారట. శ్రీ వేంకటేశ సుప్రభాత పఠనం వలన ఆ కుటుంబానికి అట్టిమేలు జరిగినట్లు తిరుపతి నిదర్శనాలలో ప్రకటిత మైనది. ప్రకటింపవలసినవి, ప్రకటింపబడనివి ఎన్నో ఇట్టి నిదర్శనాలు, అనుభవాలు అసంఖ్యాకంగా ఉంటాయి. లౌకిక, పారలౌకిక సుఖశాంతులు జనావళికి, భక్తజనావళికి అందించే కల్ప వృక్షం శ్రీ వేంకటేశ సుప్రభాతమ్. శ్రీనివాస వైభవాన్ని ద్విగుణీ కృతం చేస్తోంది ఈ సుప్రభాతసేవా వైభవం.

"విన్నపాలు వినవలె వింత వింతలు
పన్నగపు దోమతెర పైకెత్తవేలయ్యా ॥పల్లవి॥
తెల్లవారె జాముకెక్కె దేవతలు మునులు
అల్లనల్ల నంత నింత నదివో వారే
చల్లని తమ్మిరేకల సారసపుఁ గన్నులు
మెల్ల మెల్లనె విచ్చి మేలుకొనవేలయ్యా ॥విన్నపాలు॥
గరుడ కిన్నెర యక్ష కామినులు గములై
విరహపు గీతముల వింతాలాపాల

పరి పరి విధముల బాడేరు విన్నదివో
సిరి మొగము దెరచి చిత్తగించవేలయ్యా ॥విన్నపాలు॥
పొంకపు శేషాదులు తుంబురు నారదాదులు
పంకజభ నాదులు నీ పాదాలు చేరి
అంకెలనున్నారు లేచి అలమేలు మంగను
వెంకటేశుడా రెప్పలు విచ్చి చూచి లేవయ్యా ॥విన్నపాలు॥

—తాళ్ళపాక అన్నమాచార్యులు



# తిరుప్పావు

1వ పాశురం - మార్గషిత్తింగళ్ ....

శ్రీహరికి ప్రీతిపాత్రమైన మార్గశిరమాసం వచ్చింది. మాసాలలో ఉత్తమమైన మార్గశిరమాసం వచ్చింది. 'మాసాలలో నేను మార్గశిర మాసాన్ని' అన్నది శ్రీకృష్ణుని వాక్యం. అందునా శుక్లపక్షం ప్రాప్తించింది. తిథులలో ప్రధానమైన పౌర్ణమితిథి చేరబడింది. నేను మార్గశిర శుక్లపౌర్ణమీ మహా పర్వదినం. సిరిసంపదలతో తులతూగే భాగ్యవంతులారా! సర్వాభరణభూషితులైన సౌందర్యమూర్తులారా! ఈ బ్రాహ్మీముహూర్త శుభసమయంలో మేల్కొంచండి. ధనుర్మాస వ్రతసంకల్పం కావించండి. వ్రతదీక్షితులైన సుదతులందరూ స్నానానికి బయలుదేరండి. ఓ గొల్లకన్నియలారా! శ్రీనివాసుడే మనకు సంభారాలు సమకూరుస్తాడు. వ్రతానుకూలత కలిగిస్తాడు. వ్రతసాఫల్యతను సిద్ధింపజేస్తాడు. నందనందనుడు, యశోదానందవర్ధనుడూ, దివ్యమంగళ విగ్రహుడు అయిన శ్రీనివాసుని మనం నిండుమనస్సుతో మననోము పండడానికై నమ్ముదాం. శ్రీ చరణుని కరుణాదృష్టులు మనపై వర్షింపమని అర్థించుదాం. ప్రార్థించుదాం. ఈవ్రతదీక్షాసమ

యంలో శ్రీనివాసానుగ్రహ ప్రవాహంలో, శ్రీరమణుని కరుణామృత స్రవంతిలో స్నానమాడి దేహాల్ని, ఆత్మల్ని పునీతం కావించుకొందాం. మనస్సుగల మగువలంతా జాగుచేయక వేవేగంగా తరలి ముందుకు రండి. తరుణం మించకుండా తరుణులారా! త్వరత్వరగా ప్రయోగ మించండి ! రమణీరమణులారా ! సువ్రతుని వ్రతమాచరింప శీఘ్ర గమనలై నడవండి.

## 2వ పాశురం – వైయత్తువాళ్ వీర్గాళ్ ....

శ్రీనివాసునికోసం మనం కావించే వ్రతం సువ్రతం కావడానికి కొన్నినియమాలు క్రమభంగంలేకుండా పాటించాలి. ఓ గోపికలారా ! అందుచేత ప్రవృత్తి, నివృత్తి రూపాలైన కొన్నినియమాలు వివరి స్తాను. వానిని హృదయపూర్వకంగా స్వీకరించి, ఆచరించండి ! పాల కడలిపై శేషతల్పంపై యోగనిద్రతో పవ్వళించిన శ్రీపతి శ్రీచరణా లను సేవించండి, స్మరించండి, స్తుతించండి. పూజించండి. శ్రీనివాసుని గుణగుణాలను గానంచేస్తూ ఆ మంగళకైశికీ గానపారవశ్యంతో శుద్ధో దకస్నాన మాచరించండి. శ్రీచరణుని కీర్తన ఫలితంగా మీ ఆత్మలు పరిశుద్ధమవుతాయి. శీతల జలస్నానం మూలంగా మీ దేహాలు పవిత్రము లవుతాయి. ఆ విధంగా పవిత్రత సంపాదించిన మీరు అర్థితుల ప్రార్థనలు వ్యర్థపుచ్చక పూరించండి. దానధర్మాలు విరివిగా కావించండి. భోగాలను త్యజించండి. త్యాగాలను చేయండి. సుప్ర భాతసమయంలో దేవదేవునిగానం, పవిత్రశీతలజల స్నానం, దానం మనం ఆచరింపవలసిన ప్రవృత్తిరూపాలైన నియమాలు. క్షీరాబ్ధిశయ నుని సేవించాలి కాని క్షీరాన్ని సేవించరాదు. నవనీతచోరుని స్మరిం చాలి కాని నవనీతాన్ని స్పృశించకూడదు. పరమపురుషుని పదాలు పాడాలి కాని పరులను నిందించరాదు. మనకన్నులకు అంజనాన్ని

అలంకరించుకోనరాదు. శ్రీనివాసుని సౌందర్యాంజనంతో మన కన్ను లను అలంకరించుకోవాలి ! మన శిరస్సులను పుష్పాలతో అలంక రించుకొనకూడదు. శ్రీనాథుని పాదపద్మాలను మనశిరస్సులపై ధరిద్దాం. పాలను వెన్నను ముట్టుకొనకపోవుట, కాటుక, పుష్పాలు ధరింపకుండుట, కొండెములు చెప్పకుండుట ఆదిగాగల నివృత్తిరూపా లైన నియమాలు మనం పాటించాలి. ఈవిధమైన ప్రవృత్తి నివృత్తి రూపాలైన నియమాలు మనం పాటించిననాడు మనవ్రతం సువ్రతమై ఫలిస్తుంది. మననోము పండుతోంది. శ్రీనివాసుని అనుగ్రహరూపమైన చల్లని దీవన లభిస్తుంది.

3వ పాశురం - ఓఙ్గియులగళన్ద ....

శ్రీమన్నారాయణుడు జనుల జన్మలకు మూలకారణుడు. అట్టి శ్రీహరి నారాయణుడు వ్యూహమూర్తియై క్షీరాబ్ధిశయనుడయ్యాడు. పాలకడలిలో శయనించిన వ్యూహమూర్తియైన శ్రీపతి త్రివిక్రమ రూపుడై చారు చరిత్రుడై విభవమూర్తిగా అవతరించాడు. బలిని పాతాళానికి పంపాడు. దేవతలను రక్షించాడు. ఆవిధంగా వామనావ తార స్వరూపుడై తన త్రివిక్రమ చారుచరిత్రను ప్రకటించాడు. అట్టి త్రివిక్రమమూర్తిని మనసారాధ్యానం కావింతుదాం. కీర్తించు దాం. అతనిని శతసహస్రనామాలతో సంకీర్తన కావించుదాం. పావై నోముకి సంకల్పించి, స్నానం చేద్దాం. పరమపురుషుని సంస్మరణ ఫలితంగాను, వ్రతసంకల్పస్నానఫలితంగాను వర్షం కురిసి భూమాతకు హర్షం కలుగుతుంది. తొమ్మిది దినాలు ఎండ, ఒకరోజు వర్షవంతున నెలకు మూడు వర్షాలు పడతాయి. కరువుకాటకాలు తొలగుతాయి. క్షామం రాదు, ధాన్యసంపద, ధనసంపద, జలసంపద, పశుసంపద, క్షీరసంపద కలుగుతాయి. ఎర్రకలువ పువ్వులలో నల్లని తుమ్మెదలు

మధుపానం కావిస్తూ విశ్రమిస్తాయి ! క్షీర ప్రవాహాలతో కుండలు నిండిపోతాయి ! లోకం నిత్యకల్యాణంతో, పచ్చతోరణంతో ప్రాభవవైభవాలు పొందుతుంది. సకలశుభాలతో, సమస్తసంపదలతో లోకం తులతూగిపోతుంది ! ఓ గోపభామినులారా ! అందుచేత త్వరగా శ్రీనివాససంకీర్తలంతో పావైనోము ఫలింపగా స్నానసంకల్పం చేద్దాం. రండి. త్వరపడండి. శుచిగా స్నానం కావించండి !

4వ పాశురం - ఆషిమప్పైక్కణ్ణా ....

శ్రీదేవదేవుడా ! ఓ ఆదిదేవుడా ! సముద్రజలాన్ని పుష్కలంగా పానం కావింపుము. నీలమేఘశరీరుని కాంతిని సంతరించుకొని నీలమేఘానివై గగనతలంలో విహరింపుము. పద్మనాభుడవై సృష్టికి మూలకారకుడయ్యావు. బ్రహ్మదేవుని జన్మకు మూలధారమైన పద్మంవలె సుదర్శనచక్రం నీదక్షిణహస్తమందు అలరారుతోంది. ఓ శ్రీనివాసా ! నీ సుదర్శనచక్రంవలె పరిభ్రమిస్తూ, నీ మేనికాంతితో అలరారే మేఘసముదాయం ఆకాశమంతా వ్యాపించాలి. లోకాన్ని మబ్బుచీకట్లలో ముంచాలి. పాంచజన్యశంఖనాదం వలె పర్జన్యగర్జనలు భూనభోంతరాళాలలో ప్రతిధ్వనించాలి. శార్ఙ్గశరధారలవలె వర్షధారలు కురవాలి. వాహినులు జలపూర్ణములై ప్రవహించాలి. మేము వానిలో జలకములాడి పవిత్రగాత్రులం కావాలి ! శ్రీనివాసా ! మావిన్నపాన్ని మన్నించవయ్యా. మామనవిని ఆలకింపవయ్యా! నీహర్షాన్నే వర్షంగా కురిపించవయ్యా !

5వ పాశురం - మాయనై మన్నువడ మధురై ....

శ్రీహరీ! ఓ మురారీ! గోకులానికి, భాగవతకులానికి మధుసాను భూతిపరంపరలు కలిగించే ఓ మధురానగర విహారి! ఎంత మధురమైనది మధుర. ఉత్తర మధురానగరం వామనావతారమూర్తికి

తపస్సు కావించుకోవడానికి తోడ్పడిన సిద్ధాశ్రమం. రామాయణ కాలంలో శత్రుఘ్నుడు లవణాసురుని సంహరించి రాజ్యపాలనం నిర్వ హించడానికి అవకాశం సంకల్పించిన ఉత్తమప్రదేశం ఉత్తర మధురా నగరం. అట్టి ఉత్తరమధురానగరం భక్తులముంగొంగుబంగారం. గోకులానికి కల్పవృక్షం. శ్రీహరి సేవకులపాలిటి కామధేనువు. శ్రీ కృష్ణుడు విహరించిన దివ్యసుందరసీమ. అట్టి మధురానగరవాసిని, యమునాతీరవిహారిని, నందగోపసుందరుని, గోపకుల దివ్యజ్యోతిస్వరూ పుని, త్రాటితో రోటికి బంధించిన యశోద భవబంధాలచే బాపిన, నోటిలో సకలలోకాలను చూపిన ఆ విశ్వరూపుని మనకు లభించిన మంచి చిరునవ్వులతో పూజించుదాం! ఆ వేణుగానలోలుని, ఆ దివ్య మురళీమోహన గానప్రియుని, ఆ మోహనవంశీవల్లభుని గుణగణాలను వేడుకతో నోటినిండుగా పాడుదాం! అట్టి శ్రీచరణుని పూజాఫలితంగా శ్రీనివాసుని మంగళానుశాసనగాన ఫలితంగా మనం కావించిన పాప సముదాయాలు అగ్నిలోబడ్డ దూదివలె భస్మమవుతాయి. అజ్ఞాతంగా మనం భవిష్యత్తులో కావించే పాపాలుకూడ నశించిపోతాయి. శ్రీని వాస సేవకై, పాదపూజకై, స్మరణకై, ధ్యానానికై, మంగళకైశికీ గానానికై పావైవ్రత సంకల్పం కావిద్దాం. పావనగాత్రులం కావడా నికై మనం పవిత్రతోయాలలో క్రుంకులిడదాం !

6వ పాశురం - పుళ్ళుమ్ శిలమ్బినకాణ్ ....

శ్రీనివాసునకు సుప్రభాతసమయమైంది. అవిగో – పక్షుల కిల కిలారావాలు వినపడడంలేదా? గరుడధ్వజుని దివ్య దేవాలయ ప్రాంగ ణం నుండి సుప్రభాత సమయంలో ప్రసరించే శంఖారావం నీవీనులకు సోకడంలేదా? మాయాపూతనను మట్టుపెట్టిన, శకటాసురుని సంహ రించిన గోవిందుని శుభోదయసమయంలో మునులు, యోగులూ క్షీరాబ్ధిశయనుడై, యోగనిద్రాముద్రితుడై, జగత్కారణుడై, జగ

త్కల్యాణకారణ కారణుడైన శ్రీనివాసుని భక్తులు, మునులు, యోగులు ఉదయాన్నే మేల్కొంచి 'శ్రీహరీ! ముకుందా! గోవిందా! అంటూ కీర్తించేవారి సంకీర్తనారావం నీ చెవులను తాకడం లేదా? ఈ సుప్రభాతనాదాలు, యీ శుభోదయసూచనలు నీహృదయానికి చల్లదనం కల్గించి మేల్కొలపాలి! ప్రియసఖీ! ఇకనైనా మేల్కొన వమ్మా! మేల్కొని మనను ఏలుకొను శ్రీనివాసుని మేల్కొలపవమ్మా! శ్రీనివాసునకు సేవలు సలుపవమ్మా! శ్రీనివాసునకు పూజలు చేయ వమ్మా! చెల్లీ! లేవమ్మా! ఇక రావమ్మా!

7వ పాశురం - కీశుకీ శెన్గెజ్గుమ్ ఆనై ....

శ్రీపతి పూజాసమయమైంది. ఓతరుణీమణీ! సుప్రభాత సమయ మైంది. మేల్కొనవమ్మా! భరద్వాజమిథునం వియోగసమయంలో కావించే విషాదరావాలను వినిపించుకోవడం లేదా? ఓపిచ్చిదానా! ఉద యాన్నే దధిమథనానికి సిద్ధపడిన గోపకాంతల వేణీభారాలనుండి, దివ్యకుంతల శోభలనుండి ప్రసరిస్తూన్న మత్తైన సువాసనలు నీమన స్సును మేల్కొలపడంలేదా? ఆ కమ్మని దివ్యపరిమళాలు నిన్ను గాఢ సుషుప్తినుండి లేపడంలేదా ? పెరుగు కడవలు చిలకడంలో వారు కావించే హస్త విన్యాసాలవల్ల జనించిన హస్తాలంకారాలధ్వనులు నీ శ్రవణపుటాలను చేరడంలేదా? దధిభాండాలను చిలుకుతూ, కవ్వపు సవ్వడులుచేస్తూ, గోవిందుని భజిస్తూ గానంచేసే గోపకాంతల మంగళ గీతాలాపనలు, మధురమైన, శ్రావ్యమైన, లలితమైన, శ్రీనివాసుని మంగళాశాసనగీతాలు నీ కర్ణేంద్రియాలలో పడడంలేదా? కేశిని సంహ రించడంద్వారా శ్రీపతి కేశవుడయ్యాడు. అట్టి దివ్యసుందరమూర్తి యైన, కల్యాణలావణ్యమూర్తియైన శ్రీనివాసమూర్తిని స్తుతిస్తూ, ప్రస్తు తిస్తూ మేముకావించే దివ్యమైన మంగళగానం శ్రవణసుఖంగా అను భవించికూడా పవ్వళించే ఉన్నావా? ఓ వెఱ్ఱిపడుచా! నీవు వేగంగా

నిద్రనుండి మేల్కొనాలి. శయనమందిరం నుండీ బయటకు రావాలి. నీ మునివాకిలి తెరవాలి. శ్రీనివాససేవావ్రతం సలుపుదాం. వేగంగా మాతో జలకమాడ రావమ్మా. శ్రీపతిని సేవించుదాం. శ్రీచరణుని ఆరాధించుదాం. శ్రీనివాసునకు పూజ కావించుదాం.

8వ పాశురం - కీష్ వానమ్ వెళ్ళెన్ఱు ఎరుమై....

శ్రీ సూర్యభగవానుడు తూర్పున ఉదయిస్తున్నాడు. తూర్పున తెల్లవారుతోంది. పశువులశాలలనుండి పశువులను మంచుగడ్డి మేయడానికై గోపాలురు వదలిపెట్టారు. ఈ అరుణోదయ సమయంలో పశువులు మంచుగడ్డి మేయడానికై నలుదిశలకూ పోతున్నాయి. శుభోదయ సమయంలో మంచుగడ్డి మేసిన పశుసంతతి అధికంగా క్షీరాన్నిస్తుంది. ఈ ప్రశాంత శుభోదయ నిమిత్తాలను తిలకిస్తూ, పులకిస్తూన్న శరీరాలతో మన గోపభామినులు, మందమలయానిలాన్ని అనుభవిస్తూ పవిత్రతోయాలలో స్నానమాచరించడానికి పురోగమిస్తున్నారు. వారి ప్రయాణాన్ని నిరోధించి, నిన్ను పిలుచుకొనిపోవడానికై నీ వాకిట నిలిచాము. ఇంక నిద్రలేవవమ్మా చెల్లీ! జాగుచేయక వేగమే మాతో తరలిరావమ్మా! అశ్వాసురుని సంహరించిన శ్రీహరిని కీర్తించుదాం. కంసునిచే నియోగింపబడిన మల్లవీరులను చీల్చి చెండాడిన భండన పండితుడైన పురుషోత్తముని ప్రశంసించుదాం. దుష్ట దుర్యోధనుని రాజప్రసాదంలోని మల్లులను మట్టుపెట్టిన మాయామానుష విగ్రహుని, లీలామానుష శరీరుని, విశ్వరూపుని వినుతించుదాం. అట్టి శ్రీనివాసుని దివ్యచరణాలను శరణు వేడుదాం. శ్రీచరణుడు మనల్ని కరుణిస్తాడు. మన కష్టసుఖాలను విచారించి మనల్ని అనుగ్రహిస్తాడు. జాలితో లాలిస్తాడు. పరిపాలిస్తాడు.

9వ పాశురం - తూమణి మాడత్తు చ్చుత్తు....

శ్రీనివాసుని సహస్రనామాలతో కీర్తిస్తున్నాం. మంగళ మైన మణిదీపాలు వెలుగుతున్న రత్నసౌధంలో, సుగంధ ద్రవ్యావాస నలుగుబాళిస్తూన్న శయనమందిరంలో మృదులమైన, రమణీయమైన, దివ్యమైన హంసతూలికాతల్పాన సుఖంగా పవ్వళించిన ఓ సఖి! ఇక మేల్కొనవమ్మా! ఓ మందయానా! మణిసౌధమందిరద్వారాన్ని తెరచికొని గజగమననై బయటకు రావమ్మా. మా గళముల నీగళము కలుపవమ్మా. మాతో సంకీర్తనం కావింపవమ్మా. ఎంత పిలచినా చెలి పలుకడం లేదు. మా వదినెకు మూగతనం వచ్చిందా? బధిరత్వం సంప్రాప్తించిందా? మంత్రప్రభావ జనితమైన నిద్రలో మునిగి పోయిందా? శ్రీలక్ష్మీనాయకుని, శ్రీవైకుంఠనాథుని, కరుణాసాగ రుని, శ్రీహరిని, ముకుందుని, శ్రీనివాసుని శతసహస్రనామాలతో సంకీర్తన కావిస్తున్నాం. స్నానమాచరించి, వ్రతదీక్షవహించి, ఆ రమారమణుని, శ్రీచరణుని, శ్రీనివాసప్రభుని సేవించుతాం. స్మరిం చుతాం. పూజించుతాం. అర్చించుతాం. స్వామికి మా సర్వస్వం సమర్పించుకుంటాము. స్వామికి మమ్ములను మేము అర్పించుకుంటాము. స్వామి సేవకై మమ్ములను మేము అంకితం కావించుకుంటాము. నీ ప్రియపుత్రికను మాతో పంపవమ్మా!

10వ పాశురం - నోత్తుచ్చువర్ క్కమ్ పుగుగిన్ర....

శ్రీనివాసుని ప్రణయానుభవం అనే స్వర్గసీమలో పరమసుఖాను భవాన్ని పొంది పరవశించి, మేను మరచి, నిన్ను నీవే మరచి, మైమరచి నిదురించడం న్యాయమేనా? ఓ నాయకరమణీమణీ! సుందర మైన నీ మందిర ద్వారాన్ని మూసికొన్నావు సరే, అతిమధురంగా సంభాషించే నీ కోకిల కంఠాన్ని దాచుకొని, నీ సుధామధురమైన గళాన్ని మూసికొన్నావా? ఓ కలభాషిణీ! ఓ మృదుభాషిణీ! మాకు

వీనులవిందు కావించే మధురాలాపాలు కావించకుండా మూగనోము పట్టావు. కనీసం నీ మందిరద్వారాన్ని తెరచి, నీ సుందర రూపాన్ని కనువిందు కావించే భాగ్యాన్నైనా మాకు కలిగింపుము. కల్పింపుము. మాకు శ్రవణానందమో, నేత్రానందమో ప్రసరింపవలసిన పవిత్ర కర్తవ్యం నీపై ఉంది. దాన్ని విస్మరించడానికి వీలులేదు. అయినా నీవు పలకడం లేదు. తలుపు తెరపడంలేదు. మన వ్రతాధిష్ఠానదైవమైన పురుషోత్తముడు, దివ్యతులసీధామాన్ని శిరస్సున అలంకరించుకొన్న శ్రీమన్నారాయణుడు, లక్ష్మీనారాయణుడు, వైకుంఠనారాయణుడైన శ్రీనివాసుడు యమసదనం చేరిన కుంభకర్ణుణ్ణి నీకు కానుకగాను, బహుమానంగాను ప్రసాదించాడా? లేకపోతే నీకు యీ కుంభకర్ణనిద్ర ఎచ్చటినుండి దాపురించి, నిన్ను ఆవహించింది? శ్రీనివాస సేవాసమయమైంది. వేగమే మేల్కొని, మాకు నాయకురాలివై నడిపింపవమ్మా. శ్రీనివాసుని పాదాలచెంత మమ్ము నిలుపవమ్మా. నీనాయకత్వంలో మా చిత్తాలను శ్రీనివాసుని పాదాలపై నిలుపుతాము. మా చింతలు తొలగించుకుంటాం. స్వామివారి అనుగ్రహావిశేష మూలంగా తప్పక మా సంకల్పాలు నెరవేరుతాయి. మా వ్రతాలు ఫలిస్తాయి, నీసుందరమైన మందిర ద్వారాలు తెరచి రావమ్మా! శ్రీనివాస సేవా సమయమైంది. లేవమ్మా!

## 11వ పాశురం - కత్తుక్కఱవై క్కణంగళ్....

శ్రీ గోవిందునకు పరమప్రీతిపాత్రులు గోపాలురు. గోవత్సాలకు, గోసమూహాలకు మేతవేసి, పాలుపిదికి సుఖంగా జీవించే సాధుపుంగవులు గోపాలురు. నిరపరాధులు. సాధువులైన తమపైకివచ్చిన అరివీరులను, రిపుకోవిదులను రణరంగంలో గోపాలురు జితోస్మి హతోస్మి అనిపించారు. ఆ భండనపండితులు పిక్కబలంచూసి పలాయనం చిత్తగించేలాగ గోపాలురు అరివీరభయంకరులై, రణరంగ

రుదులై, సంగ్రామపార్థులై పోరుసలిపారు. ఓ రమణీమణీ! అట్టి కర్మవీరులైన, ధర్మవీరులైన, సత్యపరాక్రములైన గోపకులవంశంలో జన్మించావు. ఓ నవయవ్వనశోభనాంగీ! ఓ విద్యుల్లతావిగ్రహమూర్తీ! ఓ సుమకోమల సుందరసుమచూరాగిణీ! ఓ శరత్పూర్ణిమాతజనీ వికసితనీలోత్పలముఖీ! నీ ముంగిట చెలులు, చుట్టాలు అయిన మేమంతా నిలిచి, నీ రాకకై వేచి, ఘననీలమేఘశ్యాముడైన శ్రీనివాసుని వివిధనామాలతో సంకీర్తనం చేస్తున్నాం. నీవు నీలమేఘశ్యాముని సంకీర్తనం విన్నంతనే మృదులమందహాసరోచులు ప్రసరిస్తూ, కేకివై గానంచేస్తూ, వయారివై, మయూరివై నాట్యంచేస్తూ, నీ సుందరమైన శయనమందిరద్వారం తెరచి మమ్మ చేరవమ్మా! శ్రీనివాసుని సేవింప నిదురవలదమ్మా. దేవదేవుని పవిత్రనామం స్మరింపవమ్మా! ఆదిదేవుని దర్శింపకదలిరావమ్మా! మమ్మచేర నీ మందిరంద్వారం తెరవవమ్మా! వేగమే మాతో తరలిరావమ్మా! శ్రీపతిని సేవించుదాం. శ్రీనాథుని పూజించుదాం, శ్రీనివాసుని అర్చించుదాం!

12వ పాశురం - కనైత్తిళజ్గైతెరుమై ....

శ్రీ గోపాలకృష్ణునకు నీసోదరుడు ఆప్తమిత్రుడై, ప్రియవయస్యుడై మెలగుతున్నాడు. ఓ సఖీ! అందుచేత నీ అన్న గృహసంబంధమైన నిత్యకృత్యాలను సక్రమంగా నిర్వహించలేకపోతున్నాడు. అతడు ఉదయాన్నే పశువుల పాలుపిండకపోవడం మూలంగా వాని పొదుగులు బరువెక్కి, దూడల్ని తలచి పాలు చేపుకురాగా, పాలను పొదుగుల నుండి జారవిడుస్తున్నాయి. అందుచేత పాలతో నీ గృహం బురదగా తయారైంది. అట్టి ఐహిక, ఆముష్మికసంపదను లౌకిక పారలౌకికవైభవాన్ని, యిహపరసుఖాన్ని అనుభవించేవాని చెల్లెలా! నీతలవాకిట గడపనుపట్టుకొని నిన్ను మేల్కొలుపుతున్నాం. మాపాదాల

క్రింద క్షీరం ప్రవహిస్తోంది. మా అంతరంగాలలో శ్రీనివాసుని యందలి ప్రణయానుబంధం ప్రవహిస్తోంది. మాగళాలనుండి శ్రీరామ సంకీర్తనాత్మికమైన గానరసం ప్రవహిస్తోంది. ఈ మహాప్రవాహ సమూహాలమధ్య తెప్పకొయ్యను పట్టుకొన్నవారిలాగ నీతలవాకిటి ద్వారబంధాన్ని పట్టుకొని, నిలువలేక నిలుస్తూ, నిన్ను పిలువలేక పిలుస్తూ, నీరాకకై నిరీక్షిస్తూ నీ కోసం ఒడలంతా కన్నులుచేసికొని ఎదురుచూస్తున్నాం. నీవు నిద్దురవదిలించుకొని ముందుకు రావమ్మా. మమ్ము చేరరావమ్మా. శ్రీనివాసుని సేవాసమయమైంది. వేగంగా మేల్కొనవమ్మా. దేవదేవుని ఆరాధనకు పూజాద్రవ్యాలు కొని రావమ్మా. శుచిగా స్నానంచేసి, స్వామిని స్మరించి, సేవించి, తరించుదాం!

13వ పాశురం – పుళ్ళిన్‌వాయ్‌కీణ్డానై ....

శ్రీరాముడు పురుషులను కూడా మోహింపజేసే మోహన రూపుడుమాత్రమే కాడు. శ్రీరాముడు ధర్మవిగ్రహుడు. సత్యపరాక్రముడు. దుష్టరాక్షసులను సంహరించిన మహాపరాక్రమవంతుడు. కోదండరాముడు దుష్టదశకంఠుని పరిమార్చాడు. మహాసతి సీతను పరిగ్రహించాడు. పట్టాభిరాముడై ప్రాభవవైభవాలను ప్రకటించాడు. ప్రదర్శించాడు. శ్రీకృష్ణావతారసమయంలో బకాసురాది దానవులను సమూలంగా నాశనం కావించాడు. శ్రీరాముని సత్యధర్మాలను, శ్రీకృష్ణుని శాంతిప్రేమలను స్తుతిస్తూ, గానంచేస్తూ, మనకన్న చిన్న కన్యలందరూ పావై నోముసాగే స్థలానికి తరలివెళ్ళారు. వారు మన రాకకోసం అచ్చట ఎదురుచూస్తున్నారు. అప్పుడే శుక్రుడుదయిస్తున్నాడు. దేవగురుడైన బృహస్పతి అస్తమించాడు. కుహుకుహు రావాలుచేస్తూ బయటకు వచ్చిన పక్షిసంతతులు ఆహారసంపాదనార్థం నలుదిశలకు సాగిపోతున్నాయి. విశాలనేత్రాలుగల చానా! తెల్ల

తామరపువ్వులలో నల్లని తుమ్మెద అమరినట్లున్న నేత్ర సౌందర్యం గల ఓ విశాలాక్షి ! శ్రీనివాసుని ఏకాంతంగాను, రహస్యంగాను, దొంగతనంగాను చేరి నీవు స్వార్థపరురాలవై అనుభవించడాన్ని మేము క్షమించము. మన్నించము, సహించము, ఓ పద్మనయనా ! ఓ పద్మవదనా ! ఓ పద్మగాత్రీ ! మాతో కలసి పద్మసరోవరంలో జలకమాడి, యీదులాడి, జలక్రీడలాడి, శ్రీనివాసుని పాదపద్మాలను సేవించి, శిరస్సునదాల్చవమ్మా ? ఇక నిదుర మేల్కాంచవమ్మా !

14వ పాశురం - ఉజ్జళ్ పుషక్కడత్తోట త్తువావియుళ్ ....

శ్రీపతిసేవాసమయమైంది. ఓ చెలీ ! నీ సుందరమందిరాంత మందలి ఉద్యానవన సరస్సులోని చెంగలువపువ్వులు వికసించాయి. నల్లకలువలు ముకుళించాయి. శివభక్తులు కాషాయాంబరధారులై, తమ కుంచెకోలలతో శివమందిర ద్వారాలు తెరచి, శంఖనాదాలు కావించి, శివపూజలు చేయడానికై, శివాభిషేకాలు నిర్వహించ డానికై, శివార్చనలు కావించడానికై తరలిపోతున్నారు. ద్వాదశోర్ధ్వ పుండ్రాలను ధరించి. కావిధోవతులు కట్టుకొని, మంగళశంఖాలు చేత పట్టుకొని వైష్ణవోత్తములు శ్రీనివాసుని దివ్యదేవాలయ ప్రాంగ ణంలో జరిగే తిరువారాధనసమయంలో మంగళశంఖారావాలు కావించడానికి వెడలిపోతున్నారు. ఓ కీరవాణీ ! ఓ మధురవాణీ ! ఓ కలభాషిణీ ! ఎన్ని బీరాలు పలికావు. మాపటివేళ చీకటిపోకమునుపే మిమ్ము మేల్కొలిపి స్వామిసేవకై తోడ్కొని పోతానని బాసచేశావే! నీభాషలు, వేషాలు అన్నీ మోసాలేనమ్మా, నీవే మేల్కొనలేదు కదా, యింకమమ్ము నీవు ఎలా మేల్కొలుపుతావమ్మా ? ఆ శ్రీవర ణుని, ఆ అభయహస్తుని, ఆ దివ్యచక్రధారిని, ఆ శ్రీ వత్సాంకిత వక్షస్కుని, ఆ పీతాంబరధారిని, నొసట ముత్యపునామం ధరించిన ఆ మోహనాంగుని, ఆఘననీలమేఘశ్యాముని, ఆనవరత్నకిరీటాలంకార్ధ

దివ్యభూషితుని, ఆ లక్ష్మీవల్లభుని, ఆ దివ్యసుందరమూర్తిని, ఆ కల్యాణ లావణ్యమూర్తిని, ఆ శ్రీనివాసమూర్తిని కీర్తించడానికై, సంకీర్తన కావించడానికై ఓకొమ్మా! లెమ్మా! వేగమే లేచిరావమ్మా.

15 వ పాశురం - "ఎల్లేయిళఙ్గిళియే: ఇన్నముఱఙ్గుదియో:"

"శ్రీభగవానుని సంకీర్తనాసమయమైంది. ఓ యిందువదనా! ఓ మందయానా! ఓ కీరవాణీ! ఓ శుకవాణీ! ఇంకా మేల్కొంచలేదా? ఇంకా నిద్రపోతున్నావా? ఓసీ! నీవు ఎంత మాయలాడివే? ఓ రమణీ మణులారా! నన్ను మీరు శ్రీనుపడి పిలువపనిలేదు. నేనే వస్తున్నాను" అంటున్నావా! నిన్ను ఎవరునమ్ముతారే? నీవు కట్టుకథలు చెప్పడంలో దిట్టమైనదానవు. కల్పనలు చెయ్యడంలో కడుసమర్థురాలవు. దానికి సమాధానంగా "మమ్మే మాటకారులంటున్నావా? మమ్ములను జాణ లని పిలుస్తూ మాపైకే బాణాలు వేస్తున్నావా? ఓచిరిబోణీ!" నాశక్తి సామర్థ్యాలతో మీకు సంబంధం లేదంటున్నావా? మంచిసొగసుగా ఉంది నీసంభాషణ, మేము అందరం వచ్చామో, లేదోనని నీకు అను మానం వచ్చిందా? అందుకోసం ప్రశ్నిస్తున్నావా? నీవు లేచివచ్చి, మమ్ములను చూచి, లెక్కించుకుంటే సంగతులన్నీ నీకే చక్కగా అర్థ మవుతాయి. అదిసరేకానీ, నీవు వెంటనే లేచి రావమ్మా! మనం కువ లయాపీడసంహారం కావించిన శ్రీహరిని, కంసాదులను సంహరించిన ముకుందుని, ఆ మాయామోహనరూపుని, ఆనారాయణస్వరూపుని, అనంతలీలను చూపే ఆ భగవంతుని, అసంఖ్యాకములైన మహిమలను ప్రదర్శించే ఆ శ్రీనివాసుని, ఆ ఆదిదేవుని, ఆ దేవదేవుని, ఆ మహాను భావుని అనంతకల్యాణగుణాలనుగూర్చి గానం చేద్దాం. రావమ్మా, ఆ పరంధాముని, ఆ పరమేశ్వరుని అవతారతత్త్వమాధుర్యాలనుగూర్చి సంకీర్తన చేద్దాం, లేవమ్మా!

## 16వ పాశురం - నాయగనాయ్ నిన్ఱనన్దగోపనుడై య ....

శ్రీనందగోపుని దివ్యభవనపు ద్వారపాలకులారా! దివ్యధ్వజాలతో, విజయపతాకాలతో, మణితోరణాలతో అలరారే, విరాజిల్లే నందమందిరద్వారాలను పాలించే సేవకులారా! భువనసుందరుడు, మదనమోహనుడు, వంశీమోహనుడు, విహరించే యీ భవనద్వారానికి నవరత్నాలతో, మణులతో అమర్చబడిన గడియను తియ్యండయ్యా! మీకు పుణ్యముంటుంది. మేము అశుభం, శుభం తెలియని అమాయకులైన గొల్లపడుచులం. ఆ మాయకృష్ణుడు, ఆ దొంగకృష్ణుడు, ఆ కొంటెకృష్ణయ్య, ఆ నల్లనయ్య నిన్న మాకు మాట యిచ్చాడు. మమ్మల్ని ఉదయమే రమ్మన్నాడు. తప్పెటలు, తాళాలు యిస్తానని ఒట్టువేసి గట్టిగా చెప్పాడు. మమ్మల్ని నమ్మించాడు. ఆ దివ్యకల్యాణగుణభూషణుని, ఆ నీలరత్న కాంతిశోభిత దేహుని, ఆ నిర్మలచిత్తుని, ఆ ప్రసన్నవదనుని, ఆ శ్రీనాథుని, ఆ శ్రీనివాసుని సుప్రభాతగీతాలు పాడి మేల్కొలపడానికి వచ్చాము. ఆ భాగ్యంకోసం నిరీక్షిస్తున్నాం. మేము స్వామివారి పాదదాసులం. స్వామివారి చరణసేవకులం. ఓ నందగోపుని ద్వారపాలకులారా! మీ అభిభాషణలతో నిషేధించకండి. మీ ఆచరణలతో మమ్ము ఆహ్వానించండి. స్వామిమందిరద్వారాన్ని మూయకండి. స్వామి మావాడు. స్వామి మాకు చెందాలి. స్వామిని దర్శించుకొని, సేవించుకొనే మా జన్మహక్కును రద్దుచేయకండి. మా కోసం స్వామిమందిరద్వారాలు తెరచి ఉంచండి. మా హృదయమందిరద్వారాలు మా స్వామి రాకకోసం తెరచి ఉంచుకొన్నాం. మా స్వామి మందిరంలో మేము ఉండాలి. మా హృదయమందిరాలలో మా స్వామి కాపురముండాలి. ఓ ద్వారపాలకులారా! జాగు చేయకండి. వేగమే స్వామివారి దివ్యమందిర ద్వారాలను తెరవండి !

17వ పాశురం - అమ్బరమే, తణ్ణీరే, శోఱే ....

శ్రీ నందగోపాలా! అర్థితుల ప్రార్థనలు నిరాకరించక, తిరస్కరించక సదా పూరిస్తున్నావు. ఆహార, ఆహార్య, నీరాలను అపేక్షితులకు ఉపేక్షచేయక దానంచేసే ఓ దయాస్వరూపా! శ్రీకృష్ణుడే మా ఆకలితీర్చగలవాడు. అభిమానధనులమైన మా మానాలను కాపాడడానికి అతడే మాకు వస్త్రదానం చేస్తాడు. మాతీరనిదాహాన్ని తీరుస్తాడు. మాకు ఊరట కలిగిస్తాడు. మాకు చిత్తశాంతిని ప్రసాదిస్తాడు. మేము అన్నదానం, వస్త్రదానం, జలపానంకోసం వచ్చి నిన్ను మేల్కొలిపి సూచించము. మాకు శ్రీకృష్ణుని స్వాధీనం చేయుమని ప్రార్థించడానికి వచ్చాము. ఓ నందగోపాలా! మా మనవి ఆలకించవయ్యా! మా విన్నపాన్ని మన్నించవయ్యా! వేగమే మేల్కాంచవయ్యా! కృష్ణుడు మా చెంత నుండాలి. మా చింత తొలగాలి.

జగత్తును రక్షించేవానిని సంరక్షించే ఓ యశోదాదేవీ! పూదీగలవలె అలరారే మాకు చిరుగుటాకువై సౌభాగ్యాన్ని ప్రసాదించే తల్లీ! మెట్టినింటికి మణిదీపానివై, మంగళదీపానివై వెలశావు. శ్రీకృష్ణుని ప్రసాదం, తీర్థం, కైంకర్యం అందజేయుమని నందగోపుని అర్థించాము. జగజ్జ్యోతియైన శ్రీకృష్ణ తేజస్సును మాపై ప్రసరింపజేయుమని నిన్ను ప్రార్థిస్తున్నాము. సకలలోకస్థులను తన ఒడిలో కాపాడే ఆ లోకేశుని నీ ఒడిలో లాలించి పెంచావుతల్లీ! ఆ పిల్లనగ్రోవి ఊదే ఆ నల్లనయ్యను మేల్కొలిపి అతని దర్శనం మాకు కల్పించవమ్మా!

బలిని మూడడుగుల నేల అడిగి, త్రిమూర్తులను మించిన త్రివిక్రమచారుమూర్తివై, త్రిగుణాతీతసుగుణమూర్తివై త్రి, కాలస్వరూపమూర్తివై, సర్వవ్యాపకమూర్తివై విజృంభించిన శ్రీకృష్ణమూర్తీ !

మేను కదల్చి, మేల్కొంచి, నీమోము మాకు చూపవయ్యా! ఓ చక్కనయ్యా! ఓ చల్లనయ్యా! ఓ నల్లనయ్యా! దేవవయ్యా!

ఓ శేషమూర్తీ! శ్రీరాముని సేవించడానికి రాముని అనుజుడైన లక్ష్మణమూర్తిగా అవతరించావు. శ్రీకృష్ణునికి సేవలు కావించడానికై అగ్రజుడైన బలరామమూర్తిగా ఆవిర్భవించావు. శ్రీరంగనాథునకు పవ్వళింప పాన్పువయ్యావు. శ్రీనివాసుని శిరస్సునవహించి సేవించడానికై శేషాచలమై వెలశావు. స్వామికి నీవు శయనమయ్యావు. వస్త్రమయ్యావు, వాహనమయ్యావు, అలంకారమయ్యావు. స్వామిని నీవు వీడని నీడవై అనుసరిస్తూ సేవిస్తున్నావు. అట్టి బలరామా! బలదేవా! జీవుల తమోనిద్రను తొలగించడానికి అవతరించిన నీవే నిద్రించడం న్యాయమా? మాలో జ్ఞానాన్ని మేల్కొలపడానికి ఆవిర్భవించిన నిన్ను మేము మేల్కొలపవలసివస్తోంది. నీవు మేల్కాంచి, నీ తమ్ముడైన శ్రీకృష్ణుని తోడ్కొనిరావయ్యా. మేము మీపాదసేవలు కావించుకునే భాగ్యంకోసం ఎదురుచూస్తున్నాం.

18వ పాశురం - ఉన్దుమద గళిత్తన్ ఓడాదతోళ్ వళియన్ ....

శ్రీనందగోపుడు మదగజాలను జయింపగలిగిన మహాబాహు బలవీరుడు. అరివీరులను కరిసత్త్వుడై జయింపగల భుజబలసంపన్నుడు. అట్టి విజయవీరుని ముద్దుకోడలా! ఓ నీళాసుందరీ! పరిమళంకూడా నీముంగురులలో చేరి తేనే పరిమళిస్తోంది. అట్టి సుగంధశోభితమైన కుంతలసంపదకల ఓ నీళాసుందరీ! నీ సుందరమైన మందిరద్వారాన్ని తెరవమ్మా. కురులను పూలమాలలతో అలంకరించుకొన్న ఓ పూలముంగురుల నారీ! మా తలపు తెలిసికొని తలుపుతీయవమ్మా.. కక్కుట సముదాయాలు 'కొక్కొరోకో' అంటూ దిక్కులు పిక్కటిల్లేలాగ రావాలు కావిస్తున్నాయి. మామిడిగున్నల లేతచిగుళ్ళను మెక్కి, మత్తెక్కి మాధవీలతలు కల్పించిన పూలపందిళ్ళలో పవ్వళిస్తూన్న

కోకిల గుంపులు 'కుహూ కుహూ' అంటూ పంచమస్వరాలాపనలు చేస్తున్నాయి. స్వామితో పూలబంతులాట లాడి, స్వామిని గెలుచుకొని, చేత పుష్పకందుకాన్ని అందుకొన్న ఓ అందాల నీళాసుందరీ! అందెల రవళుల సందడితో, మాకు వీనులవిందుగా పద విన్యాసాలు చేస్తూ కదలిరావమ్మా. నీ హస్తాభరణాలు గలగలలాడగా, నీ మందిర ద్వారాలు తెరవవమ్మా. నీతో కలసి స్వామివారి దివ్యకళ్యాణనామాలను, అనంతకళ్యాణగుణాలను గానం చేస్తామమ్మా!

19వ పాశురం - కుత్తువిళక్కెరియకోట్టుకాల్ కట్టిల్ మేల్ ....

శ్రీనివాసస్వామీ! ఏనుగుదంతాలతో చేయబడిన కోళ్ళుగల మంచంపై చక్కనైన, చల్లనైన, మెత్తనైన, పూలగుత్తులు హత్తుకొన్న తెల్లనిశయ్యపై పవ్వళించిన స్వామీ! శయనమందిరపు దీప కాంతులతో మెరసిపోయే మామనోహరమూర్తీ! నీవు వీరరసావతార మూర్తివి. మా నీళ వీరపత్ని. నీవు శృంగారరసావతార స్వరూపివి. మా నీళ శృంగారరసాధిష్ఠాన దేవత. వలపులకేళిలో తేలిస్తూ, నీబిగి కౌగిలిలో నీళను లాలిస్తూ పవ్వళించిన ఓ ప్రణయసుందరమూర్తీ! శ్రీనివాసమూర్తీ! మేనువాల్చిన నీవు నీపాదాలను కదపలేకపోతున్నావు. సరే! పెదవి కదిపి ఒక్కపలుకైనా పలుకలేవా? స్వామీ!

ఓ నీళా! నీ కన్నులలో అనంతాకాశపు నీలినీడల్ని నింపుకున్నావు. నిలుపుకున్నావు. నీకాటుక కన్నులతో, నీ విశాల నేత్రాలతో స్వామిని ఆకర్షించి మంత్రముగ్ధుని చేస్తున్నావా! నీ భక్తి దృక్కులతో స్వామిని వివశహృదయునిగా చేస్తున్నావా? అతణ్ణి పరవశుణ్ని చేశావా? అతణ్ని కరగించివేసుకొన్నావా? అతణ్ని మూగవానిగా మార్చివేశావా? ఇది నీ స్వభావానికి, నీస్వరూపానికి విరుద్ధమైన దమ్మా! స్వామిసౌందర్యం తిలకించి, పులకించి, ఆ సౌందర్యంలో మేము కరగిపోయే భాగ్యం కలిగించవమ్మా! స్వామివారి అమృత

వాక్కును విని మంత్రముగ్ధులయ్యే మహాభాగ్యాన్ని మాకు అనుగ్రహించవమ్మా! అమ్మా! నీళాదేవి మమ్మ చక్కగా చూడవమ్మా! తల్లీ! నీచల్లని దీవనలతో మమ్మ కాపాడవమ్మా!

20వ పాశురం - ముప్పత్తు మూవరమరర్ క్కుమున్ శెన్ఱు

శ్రీనివాసమూర్తీ! అష్టవసువులు, ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు, అశ్వినీదేవలు కలిసిన ముప్పైమూడు మంది దేవతల నాయకత్వంలోని ముప్పైమూడుకోట్ల దేవతల ఆపదలుబాపి, వారి భయసందేహాలను తొలగించి, వారికి సుఖశాంతులు ప్రసాదిస్తున్న ఓ వీరరసావతారమూర్తీ! సౌందర్య శోభితమైన దివ్యమూర్తీ! మేల్కొనవయ్యా!

ఓ దివ్యతేజోమూర్తీ ఓ ధీరోదారమూర్తీ! ఓ మహా పరాక్రమమూర్తీ! ఓ భక్తత్రాణపరాయణమూర్తీ! ఓ క్షమా సాగర మూర్తీ! భక్తుల ఆపదలు తొలగించి, వారికి సంపదలు సమకూర్చే ఓ మహాదయాసముద్రమూర్తీ! భక్తుల భౌతిక, మానసిక క్లేశాలు పరిహరించి వారికి ధైర్యసంపద, మోక్షసంపద ప్రసాదించే ఓ శుద్ధ సత్వస్వరూపమూర్తీ! నీకు శరణాగతులైన భక్తుల శత్రువులను గడగడలాడించే, నీచరణదాసులైన భక్తుల విరోధులను భయజ్వరపీడితులను కావించే ఓ అరిభయంకరమూర్తీ! ఓ భక్తప్రసన్నమూర్తీ! ఓ సుప్రసన్న శ్రీనివాసమూర్తీ! పాన్పువదలివచ్చి మాపజ్జ నిల్వవయ్యా! మాసరసను నిలిచి, నీలో మామనస్సులు నిలిపేలాగ చేయవయ్యా!

ఓ మహాలక్ష్మీ మాతా! ఓ లోకోత్తర సౌందర్యంగల దేవతా! ఓ స్వర్ణకలశస్తనీ! ఓ అరుణబింబోష్ఠీ! ఓ అణుమధ్యా! ఓ నీళాదేవి! మావ్రతానికి కావలసిన విసనకర్ర, అద్దం దయచేయు

వమ్మా! విశ్వనాథుడు, జగన్నాథుడు, శ్రీనాథుడైన నీప్రాణ నాథుణ్ణి మాకు అనుగ్రహింపవమ్మా! ఈక్షణంలోనే వ్రతదీక్ష వహించడానికై, పవిత్రంగా స్నానం చేయడానికై మమ్ము అనుమతించవమ్మా!

21వ పాశురం - ఏత్తకలఙ్గ ళెదిల్ పొఙ్గిమీదళిప్ప ....

శ్రీకృష్ణా! ఉంచిన పాత్రిలను క్షీరంతో నింపుతున్నాయి ఆ గోసమూహాలు. ఆవిధంగా పాడిపంటలతో, సిరిసంపదలతో తుల తూగుతున్న. విరాజల్లుతూన్న నందగోపుని అనుంగుపుత్రుడవైన ఓగోపాలకృష్ణమూర్తి! మేల్కాంచవయ్యా! భక్తులపై కృపా కటాక్షవీక్షణాలను ప్రసరించి, వారిని సదా రక్షించడంలో అపూర్వమైన శ్రద్ధాశక్తులు ప్రదర్శించే ఓ పరమపురుషా! ఓ వేదవేద్యా! ఓ వేదస్వరూపా! వేదాలుకూడా నీస్వరూప, స్వభావ, వైభవాలను సముచితంగా ప్రతిపాదించలేకపోతున్నాయి. అబలలమైన మేము నీస్వరూప, స్వభావమహావైభవాలను, తేజోవిరాజితమైన నీ అవతార రహస్యాలను, ఆవిర్భావకారణాలను యేవిధంగా గ్రహించగలం? ఓ నారాయణా! నీ శత్రువులు నీవు సంధించిన బాణాలకు ప్రాణా పహిష్ఠులై, నీపవిత్రమైన చరణాలను శరణువేడడానికై నీ గడపకడ, పడిగాపులు పడియున్నారు. నీ అనంతమైన కల్యాణగుణాలచేత ఓడింపబడిన మేము నిన్ను శరణువేడుకొంటున్నాము. ఓ సుగుణభూషణా! సంకటహారణా! శ్రీచరణా! నీదివ్యపాదారవిందాల నాశ్రయించాము. నిన్ను ప్రశంసిస్తు మంగళాశాసనం కావిస్తున్నాం. మంగళగానం చేస్తున్నాం, వేగమే మేల్కాంచి మమ్ము అనుగ్రహింపుము స్వామీ!



22వ పాశురం - అఙ్గణ్ మాఞాలత్తర శర్ అభిమాన పఙ్గమాయవన్దు ....

శ్రీపతీ ! సుందరమైన, సువిశాలమైన అవనీతలాన్ని ఏకచ్ఛత్రాధిపత్యంగా పాలించిన జగజెట్టీలు, హేమాహేమీలు, మహామహులు, దిశానాథులు, విశాంపతులు అహంకార మమకారాలను వర్జించి, 'దేహీ ప్రభూ' 'పాహి ప్రభూ' అంటూ నీవు అధిష్ఠించిన సింహాసనం క్రిందగా నిలచినట్లుగా మేము నీవు శయనించిన మంచం ప్రక్కగా నిలిచాము. నిన్ను పిలచి, కొలచి, నీవలపుచూపులకై ఎదురు చూస్తున్నాం. సూర్యచంద్రులు కలసి ఒకసమయంలో ఉదయించినట్లుగా ఉండే నీ నేత్రద్వయాన్ని మాపై ప్రసరింపుము. స్వామీ ! మా అజ్ఞానాంధకారాన్ని, నీ నేత్రజ్ఞాన భాస్కరుడు పటాపంచలం కావించాలి. నీ ఎడబాటును సహించలేక విరహవిషాదాలతో బాధపడే మాపై నీకగుణామృత పూర్ణమైన, అతిశీతలమైన జోత్స్నలను, నిండుజాబిల్లి పండువెన్నెల వెలుగుల్ని వర్షించి, మాకు హర్షం కలిగించాలి. ఒకేసమయంలో సూర్యచంద్రు లుదయింపగా సగం వికసించి, సగం వికసింపక ఉన్న పద్మాలవంటి నీ నేత్రాలతో మమ్ము కటాక్షింపవయ్యా. ఓ నల్లనయ్యా ! ఓ చల్లనయ్యా ! ఓ నల్లని కన్నయ్యా ! కెందామరలవంటి నీ అరమూసిన కన్నుదోయితో మమ్ము దయచూడవయ్యా ! వేగమే మేల్కాంచవయ్యా ! మా లోపాలను, దోషాలను, పాపాలను క్షమాదృష్టితో తిలకింపవయా! నీ దయాదృష్టిమూలంగా మా దిగులు తొలగుతుంది. మాకు క్షేమం, లాభం సిద్ధిస్తుంది. శ్రీనివాసా ! శీఘ్రంగా మేల్కాంచి నీ కరుణా కటాక్ష వీక్షణాలను నీ క్రీగంట ప్రసరించి మమ్ము ఉద్ధరింపవయ్యా ! ఇక లేవవయ్యా !

23వ పాశురం - మారిమలై ముషంజిల్ ....

శ్రీనివాసా! కొండగుహాలో అలసి, సొలసి, నిద్రించిన కొదమ సింహం మేల్కొని, కళ్ళు తెరచి, వళ్ళుకదల్చి, విరచి, వీరగర్జనలు కాస్తూ గుహానుండి బయటపడినట్లు, నీవు రాజసింహుడవై, సింహగర్జనలు చేస్తూ, వీరగర్జనలు కావిస్తూ, నీలమేఘశరీరకాంతులతో సింహాసనం అధిష్టించి, అలంకరించవయ్యా! మావిన్నపాలను నీశయనమందిరంలో వినిపించడం మాకు సమ్మతం కాదు. మా అభిమతం గ్రహించి, మన్నించి, సభామంటపంలోని ధర్మపీఠమైన సింహాపీఠాన్ని నీవు ఆక్రమించి, నల్లని అవిసి పువ్వువలె శోభించే నీగాత్రకాంతులను దశదిశలా వ్యాపింపచేయకోరుతున్నాం. శ్రీనివాసా ! ఆ దివ్యసింహాసనంపై వేంచేసి మారాకకు కారణాలను విచారించి, మా అభిలాషలను, మా కాంక్షలను, మా ఆకాంక్షలను, వాంఛితాలను నెరవేర్చి, అనుగ్రహించవయ్యా!

24వ పాశురం - అన్రివ్వులగమళన్దాయ్ అడిపోత్తి ....

శ్రీదివ్యవైకుంఠనివాసా! నీదివ్యపాదాలను బ్రహ్మ సేవించాడు. అఖిలాండకోటి బ్రహ్మాండాలను నీపాదాలు ఆక్రమించాయి. అట్టి నీ దివ్యపాదారవిందాలతో గంభీరంగా నడచి సింహాసనం అలంకరించడానికి దయచేస్తున్నావా ? స్వామీ ! అట్టి పవిత్రమైన నీ తిరు చరణాలను దర్శింపగలిగాము. సేవింపగలిగాము. నీ దివ్యచరణాలతో పోల్చదగినవి నీ దివ్య చరణాలే ! అట్టి మంగళప్రదమైన పాదాలకు మంగళహారతులు సమర్పిస్తున్నాం. నీ పాదమహిమపై మంగళానుశాసనం గానం చేస్తున్నాం.

ఓ శ్రీరామచంద్రా! మానభంగంచేసి పతివ్రతలను, గౌరవభంగంచేసి ధరణీపతులను, తపోభంగంచేసి మునులను హింసించిన రావణుని ప్రాణభంగం చేయుటానికై శివధనుర్భంగం చేసి సీతా

మాతను పరిగ్రహించావు అట్టి మహాసతి సీతామాత నపహరించిన దుష్టరాక్షసులకు, రావణాసురునకు శృంగభంగం చేసావు. ప్రాణభంగం కావించావు. ఓ కోదండరామా! శ్రీపట్టాభిరామా! అట్టి నీ భుజబల సంపదకు మంగళ మగుగాక !

శ్రీగోపాలకృష్ణమూర్తీ! దుష్టశకటాసురుని పాదఘాతంతో పైకి తన్నిన శ్రీకృష్ణమూర్తీ! నీకు మంగళమగుగాక! వత్సదైత్యుని గగన తలంలోనికి పంపిన ఓ గోపాల భూపాలా! వెలగపండు రూపాన ఉన్న అసురుని ఆకాశంలోనికి విసరిసంహరించిన ఓ వాసుదేవా! నీకు శుభ మంగళమగుగాక! బాలగోపాలుడవై గోకులంలో విహరిస్తున్న సమ యంలో శిలావర్షంనుండి గోపకుల్ని, గోవుల్ని రక్షించడానికై గోవ ర్థనపర్వతాన్ని వెల్లగొడుగుగా చేత ఎత్తి ధరించిన నందనందనా! నీ దివ్యమైన కల్యాణగుణాలకు నిత్యమంగళ మగుగాక! పోరున అరివీరుల తలలు సంహరించి, హరించు నీకరమందలి దివ్యాయుధానికి మంగళ మగుగాక! ఇట్టి ఘనతవహించిన నీ వీరచరితలను గానం చేస్తున్నాం. నీ మహామహిమాన్వితమైన కల్యాణగుణాలను ప్రశంసిస్తున్నాం. ఓ మంగళస్వరూపా! నీమంగళప్రదమైన అనుగ్రహం సంపాదించడానికై 'పఱై' (తప్పెట) అనే నీ మంగళవాద్యం గ్రహించడానికి వచ్చాం. వేగంగా మాకు ఆ తప్పెటను అనుగ్రహించవయ్యా! శ్రీనివాసా! మమ్ము కరుణించవయ్యా!

25వ పాశురం - ఒరుత్తి మగనాయ్ పిరన్దు ....

శ్రీకృష్ణా! దేవకీదేవి దివ్యగర్భాన జన్మించావు. మహాభాగ్య శాలినియైన యశోదాదేవి ఒడిలో పెరిగావు. శ్రీహరీ! నీవు చెఱసాలలో పుట్టావు. వ్రేపల్లెలో పెరిగావు. నీవు వసుదేవుని తనయుడవు. నందు ని ఆనందంకూర్చే నందనందనుడ వయ్యావు. ఈవిధంగా నీవు కంసుని వలెరి రహస్యంగా సంచరించావు. నీ రహస్యం కంసుడు కనిపెట్టి నిన్ను

వదలిపెట్టకుండా నిన్ను వధించి, దేవకికి వేదన కల్పించాలని, ఆమె కడుపులో చిచ్చురగల్చాలని ఎడతెగని ప్రయత్నాలు కావించాడు. లోకానికి కంసునిబాధ, వేదనలేకుండా చేయడానికై కంసుని వధించావు. లోకానికి సుఖశాంతులు ప్రసాదించావు. ఒకేతల్లి రక్తాన్ని పంచుకొని, ఒకేతల్లి కడుపున పుట్టిన సొంతచెల్లెలి కడుపులో చిచ్చురగల్చడానికి పంతంపట్టిన కంసుని కడుపులో బడబాగ్నిని సృష్టించి అంతమొందించావు. అట్టి నిన్ను చేరి యాచింపవచ్చాము. మా ప్రార్థనను మన్నించి 'పఱై' (తప్పెటలు) అనే మంగళవాద్యం అనుగ్రహింపకోరుతున్నాం. నీ దేవేరియైన శ్రీదేవి సంభావన చేసే విధానంలో నీ ధైర్యసంపదను, నీ సిరిసంపదను, నీ కల్యాణగుణసంపదను గానంచేసి నీ వియోగం మూలంగా మేము అనుభవిస్తున్న విరహతాపాన్ని, చలిలో రావడం మూలంగా కలిగిన పరితాపాన్ని నివారించుకొని ఆనందాన్ని అనుభవిస్తున్నాము. హద్దులు, సరిహద్దులులేని పరమానందాన్ని పొందుతున్నాము.

27వ పాశురం - మాలేమణివణ్ణా....

శ్రీనివాసా! ఓ వాసుదేవా! ఓ కరుణారసస్వరూపా! శరణాగత వాత్సల్యరూపా! నీలోత్పలాలవంటి నీ నేత్రాలలో మాపై కరుణ జాలువారుతోంది. నీలమణికాంతులతో నీ దేహం అలరారుతోంది. మా కన్నులలో నీరూపం నిలుపుకోవడానికి, మాజిహ్వలపై నీ నామాన్ని తాండవింపజేసికోవడానికి యీవ్రతమాచరించమని పెద్దలు ఆదేశించారు. దాన్ని మేము శిరసావహించి ఆచరిస్తున్నాం. మార్గళిస్నానానికి బయలువెడలుతున్నాం.

మావ్రతం సువ్రతం కావడానికై వ్రతాధిష్ఠాన దైవమైన నీవు అనుగ్రహంతో వ్రతసంభారాలు ప్రసాదింపుము స్వామీ! మేల్కొలప

డానికి అవసరమైన, మేలైన, తెల్లనైన శంఖాలు మాకు దయచేయుము స్వామీ! మా ఆగమన సూచనలను ప్రకటించడానికి పెద్దపెద్ద తప్పెటలు కావాలి! పల్లాండు పాటకులు, మంగళగీతాలాపకులు మాకు కావాలి. మాకు ధ్వజాలు, మంగళదీపాలు కావాలి. మా తలలపై మంచుపడకుండా నివారించే చాందినీ గుడ్డలు కావాలి. ఓ వటపత్రశయనా! ఓ కమలనయనా! మావ్రత విజయానికై ఆ వ్రతపరికరాలను, సాధనాసామగ్రులను అనుగ్రహించి మమ్మ కృతార్థులను కావింపకోరుతున్నాం. మాజీవితాలను సార్థకంచేసి, మమ్మ చరితార్థులను చేయవేడుతున్నాం. మాకు వ్రతపరికరాలు సమకూర్చి, వ్రతపరమార్థాన్ని సిద్ధింపజేయ నిన్ను ప్రార్థిస్తున్నాం.

27వ పాశురం - కూడారై వెల్లుమ్ తిర్ కోవిన్దా ....

శ్రీహరీ! ఓ కరివరదా! అరిగణాలను నీ కల్యాణ ప్రదమైన వరగుణాలతో జయించిన ఓగోవిందా! వ్రతానికి అవసరమైన శంఖ, వాద్య, మంగళదీప, ధ్వజ,వితానాలను పల్లాండు పాడువారలతో అనుగ్రహించావు. నీవు లోకులు పొగడే విధానంలో నోము ముగించిన మమ్మ సన్మానించాలి. నీ ఆశ్రితులైన మమ్మ నీ స్వజనంగా భావించి స్వీకరించి మా హృదయాలను నీవు చల్లపరచాలి. మా మనస్సులను రంజింపచేయాలి. మాకు హస్తాభరణాలైన కంకణాలు, భుజాభరణాలైన బాజీబందులు, కర్ణాభరణాలైన కమ్మలు, చెవిపూవులు, పాదభరణాలైన అందెలు, మట్టెలు నీవూ నీళాదేవీ కలసి అనుగ్రహించి అలంకరించాలి. మీ దివ్య హస్తాలతో అనుగ్రహించి, అలంకరించిన ఫలితంగా మా రూపాలు మహాసౌందర్యశోభలతో వర్ధిల్లుతాయి. మేము కట్టుకొనడానికి పట్టుబట్టలు దయచేయండి. మీ అమృతహస్తాలతో నెయ్యితో మునిగిన క్షీరాన్నం మాచేత భుజింపచెయ్యండి. నిన్ను కీర్తించినదానికి ప్రయోజనంగా, నీ అనుగ్రహంతో మావ్రతం

ముగించుకొన్నదానికి ఫలితంగా ఆ విధంగా నీనుండి సన్మానం పొందా లని ఆశిస్తున్నాం. శ్రీనివాసా! నీప్రేమతో మాహృదయాలను చల్ల బరచి సన్మానింపుము. మా మనస్సులు నిన్నే కోరి నీపైనే నిలచాయి. అందుచేత ఆవిధంగా నీవు మా ఆత్మలను సన్మానించాలి. మా దేహాలు నీకోసమే శ్రమించి, పరిశ్రమించి, పరితపించిపోయాయి. దివ్యాభరణా లతో మా దేహాలను అలంకరించి నీవు సన్మానించాలి. మా జిహ్వాలు నీకల్యాణగుణాలనే గానంచేయడంలో లీనమయ్యాయి. ఆవిధంగా గానంచేసిన మాజిహ్వాలకు నీదివ్యప్రసాదమైన క్షీరాన్నాన్ని అందించి సముచితంగా సన్మానించాలి. గోవిందా! మేము నీనుండి ఆశించే యీ సన్మానాల్ని నీవు కృపతో, కరుణతో అనుగ్రహించాలి.

28వ పాశురం - కఱవైగళ్ పిన్ శెన్ఱుకానమ్ శేర్న్దు ఉణ్బోమ్....

శ్రీగోపాలా! పశువులను మేపడానికై అడవులకు పోతాము. పాములు కరుస్తాయని కూడా తెలియని పశువులు అవి. ఆవిధంగా పశువులతో అడవులలో తిని తిరుగుతున్నాం. మేము అశుభం, శుభం తెలియని గొల్లపిల్లలం. అమాయకులైన ఆడపిల్లలం. నీవు పరమపదనివా సాన్ని వదలి గోవుల్ని పాలించడానికి గోకులంలో అవతరించావు. ఓ నందగోపాలా! గోకులంలో జన్మించిన నీవు గోవుల్ని పాలించడమే కాదు మా ప్రణయరాజ్యాలను, మాప్రేమసామ్రాజ్యాలను నీవు పరి పాలించాలి. మనసంబంధం యుగయుగాలనాటిది. మన సంబంధం విడ దియ్యడానికి వీల్లేనిది. విడదియ్యరానిది. లౌక్యధర్మాలు, లోకమర్యా దలు తెలియని చిన్నికన్యలం మేము. మేము యే ఉపాయాలు తెలియని వారలం. ఓ గోవిందా! నీవు ఆదిఆద్యుడవు. ఆద్యంతరహితుడవు. నిన్ను మా ప్రేమపారవశ్యంలో నల్లనయ్యా, కన్నయ్యా అంటూ చిట్టిపేర్లతో, పొట్టిపేర్లతో, అమాయకత్వంతో నిన్ను ఆవిధంగా పిలిచాము. ఓ జగన్నాథా! మాప్రాణనాథా! ఓ జగన్నాయకా! మా

ప్రణయనాయకా! మా అపరాధాల్ని మన్నింపుము. మాపై ఆగ్రహాన్ని ప్రదర్శింపకుము. స్వామీ! కృపతో మాపై అనుగ్రహదృష్టుల ప్రసరింపుము. మావ్రతదీక్షకవసరమైన 'పఱై' (తప్పెట) ను నీవు దయచేయుము స్వామీ!

29వ పాశురం - శిత్తం శిఱుకాలై వన్దు న్నైచ్చేవిత్తు ....

శ్రీబాలగోపాలా ! గోపబాలకులతో పసందైన మాగాయ పచ్చడి నంజుడుతో చల్లు లారగించిన ఓ బాల గోపాలమూర్తి! అల వైకుంఠపురంలో, నగరిలో, ఆమూల సౌధంలో రమారమణుడవై విహరించిన ఓ శ్రీనివాసమూర్తీ! గోపకులంలో జన్మించావా? గోకులంలో నివసించావా? గోవుల్ని పాలించావా? చల్లు లారగించావా? నీవు వైకుంఠంనుండి గోకులానికి తరలిరావడం మా భాగ్యం! శుభోదయ సమయంలో నిన్ను సందర్శించి, నీపాదాలను సేవించి, నీపై జయ గీతాలు, మంగళగానాలు చేసి తరించగలుగుతున్నాం. నీ పాదాలపై మా శిరాలు వంచి మ్రొక్కులు చెల్లిస్తున్నాం. నీపై పదాలు పాడి పులకించినగాత్రాలతో పరవశించిన నేత్రాలతో అవధులు లేని ఆనందాన్ని అనుభవిస్తున్నాం. మార్గళి నోముకి అవసరమైన మంగళ వాద్యంకోసం మాత్రమే నీ కీసేవలు చెయ్యడంలేదు. దానితోబాటు పరమప్రయోజనాన్ని, ప్రయోజనకరమైన పరమార్థాన్ని నీ నుండి సాధించడానికై మేము ఆశిస్తున్నాం. అభిలషిస్తున్నాం. ఆకాంక్షిస్తున్నాం. ఓ గోవిందా! ఓ గరుడధ్వజా! ఓ శేషశయనా! ఓ కమల నయనా! శ్రీపతీ! శ్రీనివాసా! ఊహలోకూడా నీ ఎడబాటును మేము సహించలేము. భావనలో నీ వియోగాన్ని మేము భరించలేము. నీలో మేము ఉంటాము. సదా నీతోనే మేము ఉంటాము. నిన్ను విడచిపెట్టము. నీవు మాలో ఉండడమే కాదు మాకు నీవు తోడు నీడవై ఉండాలి. నీ ప్రతి అవతారంలో మేము భాగస్వాములం కావాలి.

దీనికి భిన్నమైన, ప్రతిబంధకమైన భావాల్ని, ఉద్దేశాల్ని మా హృదయాల నుండి శాశ్వతంగా బహిష్కరించి నిర్మూలింపుము స్వామీ! నీ నిత్యసందర్శనాన్ని, నీ నిత్య పాదసేవను, నీ నిత్య సంకీర్తనాన్ని మేము కోరుచున్నాం. ఆ అవకాశం మకు అనుగ్రహింపుము స్వామీ! శ్రీనివాసా! మా కా భాగ్యం కలిగింపుము స్వామీ!

## తిరుప్పావు ఫలశ్రుతి

30వ పాశురం - వఙ్గక్కడల్ కడైన్ద మాదవనై క్కేశవనై ....

శ్రీమహావిష్ణువు దివ్యమైన క్షీరసాగరమథనం కావించి దేవతలకు అమృతం ప్రసాదించాడు. సిద్ధమైన అమృతమై తానుండగా, మధించిన అమృతం దేవతలు ఆశింపగా వారి అపేక్ష నుపేక్షింపక శ్రీహరి అనుగ్రహించాడు. దేవతలకు కావలసిన అమృతాన్నే కాదు, సమస్త భువనాలలోని సకల ప్రాణులకు అవసరమైన మహాలక్ష్మిని కూడా సంపాదించి హరి సిరికి భర్త అయ్యాడు. ఆ విధంగా శ్రీహరి శ్రీనాథు డయ్యాడు. శ్రీపతి అయ్యాడు. శ్రీనివాసు డయ్యాడు. శ్రీనివాసుడు శ్రీకృష్ణుడై ఆవిర్భవించాడు. గోవిందుడు గోపాలుడై అవతరించాడు. ఆ లక్ష్మీవల్లభుని, చంద్రవదనలైన, దివ్యాభరణ భూషితలైన గోపభామినులు తలచి, చూచి, చెంతను నిలచి, పిలచి, వలచి ప్రణయపారవశ్యంతో ప్రేమించారు. శ్రీనివాసుని సేవలకై వారు తమ జీవితాలను అర్పణ కావించుకొన్నారు. అంకితం చేసికొన్నారు. తమ ఆత్మలను పూజాప్రసూనాలుగా మలచికొని స్వామి పాదాలముందు సమర్పించుకొన్నారు. ఆ గోపభామినుల భక్తవిజయ గాథలను, ఆ గోవిందుని లీలావైభవాలను శ్రీవిల్లిపుత్తూరులోని పెరియాళ్వారు పుత్రికారత్నమైన శ్రీగోదాదేవి ముప్పది పాశురాలలో గానం చేసింది. ఈ ముప్పది పాశురాలను భక్తితో క్రమంగా

పఠించి గానం చేసేవారు ఆ చతుర్భుజుడైన, ఆ కమలనేత్రుడైన, ఆ సుందరవదనారవిందుడైన, దివ్యకల్యాణగుణ సంపన్నుడైన శ్రీనివాసుని చల్లని దీవనలు పొందుతారు. గోవిందుని దివ్యానుగ్రహాన్ని అనుభవిస్తారు. ఈ తిరుప్పావను గానం చేసినవారిని స్వామి దివ్యానంద సామ్రాజ్యానికి పట్టాభిషిక్తులను కావిస్తాడు.



## శ్రీ వేంకటేశ సుప్రభాతమ్

కౌసల్యా సుప్రజా రామ పూర్వా సంధ్యా ప్రవర్తతే !
ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవమాహ్నికమ్ ॥

తూరుపున బలబల తెలవారుతోంది. తొలిసంజ చిరువెలుగు దొంతరలు చిమ్ముతోంది. ఉదయభాను కిరణసముదాయం ప్రసరిస్తోంది. శుభశ్రీ చెలువొందుతోంది. దేవపూజాది నిత్యనైమిత్తిక కృత్యాలు పూర్తి కావించుకొనే సమయమైంది. ఓ కౌసల్యాసుప్రజా రామా! ఓ ప్రవిమల పుణ్యధామా ! మేలుకో. మేలుకొని మమ్మేలుకొనుము స్వామీ !

ఉత్తిష్ఠోత్తిష్ఠ గోవింద ఉత్తిష్ఠ గరుడధ్వజ !
ఉత్తిష్ఠ కమలాకాన్త త్రైలోక్యం మంగళం కురు ॥

ఓ గోవిందా ! ఓ గరుడధ్వజా ! సుప్రభాతమైనది. శ్రీలక్ష్మీవల్లభా ! వేగమే మేల్కొనుము. మేలుకొని యీ సమస్తలోకాలకు సకలశుభాలు, సర్వసుఖాలు సమకూర్చుము స్వామీ !

మాతస్సమస్త జగతాం మధుకైటభారేః
వక్షోవిహారిణి మనోహర దివ్యమూర్తే !
శ్రీస్వామిని శ్రితజన ప్రియదానశీలే
శ్రీ వేంకటేశ దయితే తవ సుప్రభాతమ్ ॥

ఓ మాతా ! నీవు సర్వలోకైక జననివి. జనులకు మాతవు. నీవు జగన్మాతవు. సదా విష్ణు వక్షస్థలస్పర్శచే పునీతం, పవిత్రం, పావనం అయిన గాత్రం ధరించినదానవు. నీవు మనోహరరూపిణివి. అనుపమగుణ మనోహారిణివి. సుందరరూప ధారిణివి. నీవు మంగళాంగివి ఆశ్రితజన మనోరథపూర సముద్ధరాలవు. శ్రితజనప్రియ దానశీలవు. నీవు మహాలక్ష్మీమాతవు. అట్టి ఓ శ్రీవేంకటేశదయితా ! వేగమే నిదురమేల్కొని సకలలోకాలకు సమస్తమంగళాలు చేకూర్చుమమ్మా !

తవసుప్రభాత మరవింద లోచనే
భవతు ప్రసన్న ముఖచంద్రమండలే !
విధిశంకరేంద్ర వనితాభి రర్చితే
వృషశైలనాథ దయితే దయానిధే ॥

ఓ కమలనయనా ! ఓ చంద్రవదనా ! ఓ అరవిందలోచనా ! ఓ యిందుబింబభావనా ! ఓ ప్రసన్నురాలా ! ఓ దయామయురాలా! పద్మజురాణి వాణి, శివప్రియురాలైన సుమకోమల సుషమారాగిణి పార్వతి, మహేంద్రుని దేవేరి పులోమజ ఆదిగాగల సాధ్వీరత్నాల, మహా పతివ్రతాశిరోమణుల గౌరవ, సత్కార, పూజలను పొందే ఓ కరుణానిధీ ! ఓ దయావారిధీ ! సర్వకాల సర్వావస్థల్లోను వృషభాచలంపై వసించే కలిదోష సంహారకుడైన శ్రీవేంకటప్రభుని నాథునిగా బడసిన ఓ మహాలక్ష్మీదేవీ దివ్యమైన సుప్రభాతమైనది. లేవమ్మా !

అత్ర్యాది సప్తఋషయ స్సముపాస్య సంధ్యాం
ఆకాశ సింధు కమలాని మనోహరాణి।
ఆదాయ పాదయుగ మర్చయితుం ప్రపన్నాః
శేషాద్రిశేఖరవిభో తవ సుప్రభాతమ్॥

ఓ శేషాద్రిశేఖరవిభూ! ఓ శ్రీనివాస ప్రభూ! నీ దివ్యమంగళ విగ్రహాన్ని దర్శించడానికై కశ్యప, అత్రి, భరద్వాజ, విశ్వామిత్ర, గౌతమ, జమదగ్ని, వశిష్ఠాది మాన్యులైన మునిపుంగవులు, మహాత్ములైన తపోధనులు, తపోనిష్ఠాగరిష్ఠులైన సప్తఋషిపుంగవులు సంధ్యావందన, జప, తప, ఉపాసనాది సర్వానుష్ఠానాలను పూర్తి కావించుకొన్నారు. పిమ్మట వారు మంజులం, మనోహరం, మోహనం అయిన ఆకాశసింధు కమలాలను గ్రహించి, నీ పాదసేవ చేయడానికై నిన్ను దర్శించి, పూజించి, సేవించి, తరించడానికై భక్తిభావపరంపరలతో, శరణాగత భావ ప్రపత్తులతో నీ మునివాకిట నిలిచియున్నారు. నీ ముంగిటకు వచ్చి వేచియున్నారు స్వామీ! ఓ వేంకటేశ్వరస్వామీ! నీకు దివ్యమైన మహోదయ మగుగాక!

పంచాననాబ్జభవ షణ్ముఖ వాసవాద్యాః
త్రైవిక్రమాది చరితం విబుధాః స్తువంతి।
భాషాపతిః పఠతి వాసరశుద్ధి మారాత్
శేషాద్రిశేఖరవిభో తవ సుప్రభాతమ్॥

బ్రహ్మ, మహేశ్వర, మహేశ్వరకుమార (కుమారస్వామి), మహేంద్రాది వివిధ దేవతామూర్తులూ, నానావిధ సురోత్తములూ నీ మహిమాన్వితమైన, నీ మహత్తరమైన, నీ మహనీయమైన, అప్రతిహత త్రివిక్రమచారుచరిత్రను వివరంగాను, విపులంగాను, విశదంగాను, ప్రకటించే ప్రధానమైన ప్రముఖప్రశంసను పఠిస్తూ స్తోత్రం చేస్తున్నారు. ఆ శుభసమయంలో, ఆ మంగళముహూర్తంలో, నీ సన్నిధానవర్తియై నీ సమీపంలో దేవగురుడు బృహస్పతి తిథివార నక్షత్ర యోగకరణాది దినశుద్ధిని ప్రవచిస్తున్నాడు. ఓ వేంకటాద్రి ప్రభో ! ఓ శేషాద్రిశేఖర విభూ ! నీకు శుభోదయమగు గాక !

ఈషత్ప్రఫుల్ల సరసీరుహ నారికేళ
పూగద్రుమాది సుమనోహర పాలికానామ్
ఆవాతి మందమనిలః సహదివ్యగంధైః
శేషాద్రిశేఖరవిభో తవ సుప్రభాతమ్॥

నవవికసిత, యువపులకిత కోమలకమలాల కమనీయమైన సువాసనలు వీస్తున్నాయి. కమ్మని కొబ్బరి వాసనలు వస్తున్నాయి. పోకల పరిమళాలు ప్రసరిస్తున్నాయి. వీని కమనీయమైన సువాసనలతో కమ్మని తావి మందంగా, మంజులంగా, మనోహరంగా, మృదులంగా వీస్తూ సుప్రభాత సమయసూచనధ్వనులు కావిస్తోంది. ఓ శ్రీ వేంకటపతీ! ఓ శ్రీ శేషశైలాధిపతీ! నీకు మంగళప్రదమైన ప్రభాత మగుగాక!

ఉన్మీల్య నేత్రయుగ ముత్తమ పంజరస్థాః
పాత్రావశిష్ట కదళీఫల పాయసాని।
భుక్త్వా సలీలమథ కేళిశుకాః పఠంతి
శేషాద్రిశేఖరవిభో తవ సుప్రభాతమ్॥

కేళీ శుకసంతతులు మేలైన పంజరాలలో చాలా ఉల్లాసంగా ఉన్నాయి. పాత్రావశిష్టమైన తీయనైన ఫలద్రవాన్ని, మధురమైన పాయసాన్ని ఆ పంజరాలలోని పెంపుడుచిలుకలు వికసిత నేత్రయుగాలతో ఆప్యాయంగా ఆస్వాదిస్తూ భుజిస్తున్నాయి. ఆ చిలుకల గుంపులు వినోదంగాను, శ్రవణసుభగంగాను కిలకిలమంటూ నాదాలు చేస్తున్నాయి. కలకలారావాలు కావిస్తున్నాయి. ఆ విధమైన శ్రవణపేయమైన నాదాలతో చిలుకలు సుప్రభాతగీతాలు ఆలపిస్తున్నాయి. ఓ వేంకటేశ్వరస్వామీ! నీకు దివ్యమైన సుప్రభాత మగుగాక!

తంత్రీప్రకర్ష మధురస్వనయా విపంచ్యా
గాయత్యనంత చరితం తవ నారదోపి॥
భాషాసమగ్రమసకృత్కరచార రమ్యం
శేషాద్రిశేఖరవిభో తవ సుప్రభాతమ్॥

లోకకల్యాణకారకుడు, గాయకసార్వభౌముడు, మహాభక్తి పరతంత్రుడు, పుణ్యచరిత్రుడు, లోకారాధ్యుడు, అయిన నారదమహా మునీంద్రుడు మహతీవిపంచిక ధరించి యీ సుప్రభాత సమయంలో నీ దివ్యగాథను, నీ భవ్యకథను లలితంగా, రసపూరితంగా, సుధా మధురభరితంగా గానం చేస్తున్నాడు. మహతిపై నీ మహనీయమైన నీ మహాత్మ్యమైన, నీ మనోహరమైన నీ మధురమైన చరిత్రను పలికిస్తున్నాడు. దానికై సమగ్రభాషాప్రకర్షను ప్రకటిస్తున్నాడు. సముజ్జ్వలభావ సంపదను ప్రదర్శిస్తున్నాడు. అనుకూలమైన హస్త విన్యాసాన్ని మేళవిస్తున్నాడు. రాగమాధుర్యాన్ని రంగరించి అందిస్తున్నాడు. ఈ విధంగా నారదుని స్తుతికి, ప్రస్తుతికి పాత్రుడవయిన ఓ శ్రీవేంకటనివాసా! శ్రీనివాసా! నీకు సుప్రభాత మగుగాక!

భృంగావళీ చ మకరంద రసానువిద్ధ
ఝంకారగీత నినదైః సహ సేవనాయ।
నిర్యాత్యుపాంత సరసీ కమలోదరేభ్యః
శేషాద్రిశేఖరవిభో తవ సుప్రభాతమ్॥

మకరంద రసపాన మత్త మధుపాలు సమీపమందలి సుందర కాసారాలలోని కమలాలనుండి వెలువడ్డాయి. ఆ విధంగా బయలు దేరిన తుమ్మెదల గుంపులు ఝంకార గీతికాధ్వానాలను కావిస్తున్నాయి. వానిని ప్రసరిస్తూ ప్రతిధ్వనింప జేస్తున్నాయి. అవి ఆ విధమైన గీతికాలాపనతో నిన్ను నుతించి, స్తుతించి, సేవించి, సమీ

సించడానికై వస్తున్నాయి. ఓ వేంకటరమణా! ఓసుగుణమణిరమణా! నీకు సుప్రభాత మగుగాక!

> యోషాగణేన వరదధ్ని విమథ్యమానే
> ఘోషాలయేషు దధిమంథన తీవ్రఘోషాః ।
> రోషాత్కలిం విదధతే కకుభశ్చ కుంభాః
> శేషాద్రిశేఖరవిభో తవ సుప్రభాతమ్ ॥

గొల్లవారియిండ్లలో గొల్లభామలు కడవలలో పెరుగును కవ్వాలతో వయ్యారంగా చిలుకుతున్నారు. ఆకవ్వపు త్రిప్పుడుల సవ్వడులతో, ఆకడవల చప్పుడులతో, దధిమంథన తీవ్రధ్వనులతో దశదిశలూ ప్రతిధ్వనులతో మారుమ్రోగిపోతున్నాయి. దిక్కులు పిక్కటిల్లిపోతున్నాయి. దధిపాత్రిలూ దశదిక్కులూ పోరుసలుపుకుంటున్నాయా అన్నట్టుగా ఘోషారావాలు, ప్రతిధ్వనులు వినవస్తూ ప్రభాతసమయసూచనలను ప్రకటిస్తున్నాయి. స్వామీ! ఓ శ్రీవేంకటేశ్వరస్వామీ! ఓ శ్రీశేషాద్రిశేఖరస్వామీ! నీకు సుప్రభాతమగుగాక!

> పద్మేశమిత్రశతపత్ర గతాళి వర్గాః
> హర్తుం శ్రియం కువలయస్య నిజాంగలక్ష్మ్యా
> భేరీనినాదమివ బిభ్రతి తీవ్రనాదం
> శేషాద్రిశేఖరవిభో తవ సుప్రభాతమ్॥

భానుసఖులైన శతపత్రిసుందరుల వెచ్చని, నులివెచ్చని కౌగిలింతలనుండి భృంగసమూహాలు విశేషప్రకాశంతో, ప్రకాశవిశేషంతో, విన్నూత కాంతి ప్రసారంతో వెలువడ్డాయి, ఈ విధంగా బయల్వెడలిన భృంగసముదాయాలు నిగనిగలాడే నల్లకలువల, ధగధగలాడే కువలయాల మేలికాంతి సంపదను, విశేషప్రకాశఐశ్వర్యాన్ని కొల్లగొట్టి దోచుకోవడానికై భేరీనినాదతుల్యమైన తీవ్రినాదం కావిస్తూ

వస్తున్నాయి స్వామీ! ఓ దివ్యప్రభో! ఓ భవ్యవిభో! నీకు రమ్యమైన సుప్రభాత మగుగాక!

శ్రీమన్నభీష్ట వరదాఖిల లోకబంధో
శ్రీ శ్రీనివాస జగదేక దయైకసింధో।
శ్రీ దేవతాగృహ భుజాంతర దివ్యమూర్తే
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్॥

ఓ మహనీయమూర్తీ! ఓ మనోహరాకృతీ! ఓ మధురప్రకృతీ! ఓ జగజ్జనరక్షకా! ఆశ్రితజనకల్పవృక్షా! ఓ విశ్వనాథుడా! ఓ విశ్వనాయకుడా! విశ్వశ్రేయఃసాధనమే ధ్యేయంగా, లక్ష్యంగా, పరమావధిగా, యిడుకొని తపించి, పరితపించి, దానికోసం శ్రమించి, పరిశ్రమించి ఆ పరమప్రయోజనాన్ని సాధించిన ఓ పుణ్యమూర్తీ! ఓ పవిత్రమూర్తీ! ఓ పావనచరితా! ఓ ప్రమోదభరితా! సతతం కృపా కటాక్షవీక్షణాలు సారించే ఓ కరుణాసాగరుడా! నిరంతరం నిర్విరామంగా దయాదృష్టిని ప్రసరించే ఓ దయాసముద్రుడా! ఆత్మవక్షస్థలం ప్రేయసీ వాసానికి నిత్యనివాసప్రదేశం గావించిన ఓ శ్రీనివాసా! ఓ వేంకటాచలవాసా! ఓ ప్రతిభాప్రభాసా! ఓ సుహాసా! నీకు సుప్రభాత మగుగాక!

శ్రీస్వామి పుష్కరిణికాప్లవ నిర్మలాంగాః
శ్రేయోర్థినో హరవిరించి సనందనాద్యాః।
ద్వారేవసంతి వర వేత్ర హతోత్తమాంగాః
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్॥

స్వామీ! శివుడు, బ్రహ్మదేవుడు, సనందుడు ఆదిగాగల మహానుభావులు నీపవిత్రపుష్కరిణీ తోయంలో మునక లిడ్డారు ఈ విధంగా స్నానాదులు పూర్తికావించుకొని వారు నిర్మలగాత్రు లయ్యారు, పవిత్రదేహు లయ్యారు, పావనశరీరు లయ్యారు. ఆత్మ శ్రేయఃకాములై వేత్రహస్తుల వేత్రతాడనాలను వహించి, సహించి,

శిరోభూషణలుగా స్వీకరించి, ధరించి సీద్వారసీమలో నిలచి వేచి యున్నారు. ఓ శ్రీ వేంకటాచలపతీ! ఈ మంగళప్రదమైన ప్రభాత సమయంలో నీ దివ్యదర్శనమహాభాగ్యం వారికి అనుగ్రహించి ఆదరింపుము స్వామీ!

శ్రీశేషశైల గరుడాచల వేంకటాద్రి
నారాయణాద్రి వృషభాద్రి వృషాద్రిముఖ్యామ్।
ఆఖ్యాం త్వదీయవసతే రనిశం వదంతి
శ్రీవేంకటాచలపతే తవ సుప్రభాతమ్॥

నీ నివాసప్రదేశమైన తిరుమల కృతయుగసమయంలో వృషాచలం, త్రేతాయుగసమయంలో అంజనాచలం, ద్వాపరయుగసమయములో శేషశైలం, కలియుగసమయంలో వేంకటాచలం అనే ప్రసిద్ధమైన, ప్రముఖమైన, ప్రధానమైననామాలను ధరించింది. నారాయణాచలం, వృషభాచలం, క్రీడాచలం, పుష్కరాచలం, కనకాచలం, వైకుంఠాద్రి, సింహాచలం, వరాహగిరి, నీలగిరి, శ్రీనివాసగిరి, ఆనందాద్రి, శ్రీశైలం అనే శతవిధనామాలతో శతసహస్ర సార్థకనామాలతో ప్రసిద్ధమై, కన్నులవైకుంఠమై, కలియుగవైకుంఠమై, భూలోకకైలాసమై, తిరుమల మిక్కిలిచెలువంతో అలరారుతోంది. వృషాసురుడు శేషశైలంపై ఆత్మనిలిపి మహోగ్రతపం కావించి తన నామంతో యీశైలం వ్యవహరింపబడాలనే వరం సంపాదించిన ఫలితంగా నేడు వృషాచలం అనే వ్యవహారప్రసిద్ధిని పొందింది. అంజనాదేవి తపఃసార్థక్యం సమకూర్చిన యీశైలం నాటినుండి అంజనాచలమైంది. వాయుదేవునికీ, ఆదిశేషునికీ మధ్య సాగిన బలపరాక్రమప్రదర్శనం నాటినుండీ శ్రీనివాసస్థలం శ్రీశేషశైలమయింది. 'వేం' అనగా సర్వపాపాలనీ, 'కట' అనగా దహనమనీ అర్థము. వేంకటేశ్వరుడనగా సర్వపాపాలను హరించువాడని భావము. వేంకార మమృతబీజం, కట

మనగా ఐశ్వర్యం. అమృతైశ్వర్యాల సమ్మేళనమని ఒక సిద్ధాంతం నిజమే! పాపాలను తొలగించి, వానిని నిర్మూలించి, వాని స్థానంలో అమృతైశ్వర్యాలను కలిగించి నెలకొల్పే స్వామి కావడంవల్ల శ్రీవేంకటేశ్వరస్వామిగా విఖ్యాతుడవయ్యావు. అట్టి విశ్వవిఖ్యాతుడవైన నీవు వెలసిన శైలం కావడం చేత నీ నిత్యనివాసస్థలమైన యీ తిరుమల వేంకటాచలమైంది. అట్టి వేంకటాచలంపై వసించే కలిదోష సంహారకుడైన ఓ వేంకటేశ్వరస్వామీ! నీకు సుప్రభాత మగుగాక!

సేవాపరాః శివ సురేశ కృశానుధర్మ
రక్షోంబునాథ పవమాన ధనాధినాథాః।
బద్ధాంజలి ప్రవిల సన్నిజ శీర్ష దేశాః
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్॥

ఈశ్వరుడు, దేవేంద్రుడు, అగ్నిహోత్రుడు, యముడు, వరుణుడు, వాయుదేవుడు, కుబేరుడు, నైఋతిదిక్పరిపాలకుడు ఆదిగా గల అష్టదిక్పతులు వినయవినిమిత గాత్రాలు దాల్చి, శిరాలువాల్చి, కరాలు మోడ్చి, నిన్ను భావించి, ధ్యానించడానికై నిన్ను అర్థించి, ప్రార్థించడానికై, అర్చనద్వారా సేవించి, పూజించి తరించడానికై నీ సన్నిధానంలో సంసిద్ధులై ఉన్నారు స్వామీ! ఓ వేంకటాచలపతీ! నీకు సుప్రభాత మగుగాక!

ధాటీషు తే విహగరాజ మృగాధిరాజ
నాగాధిరాజ గజరాజ హయాధిరాజాః।
స్వస్వాధికార మహిమాదిక మర్థయంతే
శ్రీవేంకటాచలపతే తవ సుప్రభాతమ్॥

గరుత్మంతుడు, మృగరాజేంద్రుడు, ఆదిశేషుడు, గజేంద్రుడు, తురగేంద్రుడు ఆదిగా గల వాహనాధిపతుల నీ వాహ్యాళులందు సస్వా

ధికార మహిమాదికాన్ని యథాన్యాయంగా నీవు నిర్దేశించిన నిర్ణయాలను ప్రకటించవల్సిందిగా వినమ్రులై అర్థిస్తున్నారు. వినయపూర్వకంగా అభ్యర్థిస్తున్నారు. విధేయపూర్వకంగా ప్రార్థిస్తున్నారు. వారి వారి సమస్యలను పరిష్కరింపుము. ఓ వేంకటాచలపతీ! నీకు సుప్రభాతమగుగాక!

సూర్యేందు భౌమ బుధవాక్పతి కావ్యసౌరి
స్వర్భాను కేతు దివిషత్పరిషత్ప్రధానాః।
త్వద్దాస దాస చరమావధి దాసదాసాః
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్॥

దేవపరిషత్తులో ఉత్తమస్థానాలు అలంకరించి, దేవ సభాప్రధానులుగా ఉచితమైన, ఉన్నతమైన, ఉదాత్తమైన, ఉజ్జ్వలమైన గౌరవ సత్కారాలను పొందుతున్న సూర్యుడు, చంద్రుడు, అంగారకుడు, బుధుడు, గురుడు, శుక్రుడు, మందుడు ఆదిగా గల నవగ్రహాధిపతులు యీ విపులమహీతలాన్ని, ఈ సువిశాల భూతలాన్ని పాలిస్తున్నారు. ఈ సకల భువనాలలోని సమస్త జీవరాసుల జీవితాలను శాసిస్తూ, వారి భూతభవిష్యద్వర్తమానాలను నిర్దేశిస్తూ పరిపాలిస్తున్నారు. అట్టి నవగ్రహాధిపతులూ త్వదీయ దాసదాసచరమావధి దాసానుదాసులై వర్తిస్తున్నారు. ప్రవర్తిస్తున్నారు స్వామీ! ఓ వేంకటేశ్వర స్వామీ! నీకు సుప్రభాతమగుగాక!

త్వత్పాదధూళి భరిత స్ఫురితోత్తమాంగాః
స్వర్గాపవర్గ నిరపేక్ష నిజాంతరంగాః।
కల్పాగమాఽఽకలనయాఽఽకులతాం లభంతే
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్॥

భక్తులు సర్వమోక్షాలవల్ల లభించే ఆనందానుభూతిని, ఆత్మసంతృప్తిని మించిన దివ్యానుభూతిని, అనిర్వాచ్యమైన ఆత్మానందాన్ని

నీ పవిత్రపాదపరాగం శిరస్సులపై ధరించడంద్వారా పొందుతున్నారు. ఈ శ్వేతవరాహకల్పంలో నీవు ప్రదర్శించి ప్రసరిస్తూన్న ఘనమైన మహిమమూలంగా భక్తులు కేవలం ఆత్మానందాన్ని అనుభవించడం మాత్రమే గాకుండా అపూర్వమైన, అపురూపమైన, అనుపమానమైన, కాంతిరేఖలతో, తేజఃశిఖలతో భాసిస్తున్నారు. ప్రకాశిస్తున్నారు. తరువాతి కల్పంలో నీ మహిమ తగ్గుతుందనే పురాణప్రసిద్ధప్రవచనం తలచుకొని వారు ఆందోళనతో, ఆవేదనతో ఆక్రోశిస్తున్నారు. వ్యాకులభరవిషణ్ణచిత్తులై చింతిస్తున్నారు. విషాదహృదయంతో విలపిస్తున్నారు. అందుచేత నీకు దాసానుదాసులై సేవలు చేస్తున్నారు. ఓ వేంకటాచలపతీ! నీకు సుప్రభాత మగుగాక!

త్వద్గోపురాగ్ర శిఖరాణి నిరీక్షమాణాః
స్వర్గాపవర్గపదవీం పరమాం శ్రయంతః।
మర్త్యా మనుష్యభువనే మతిమాశ్రయంతే
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్॥

పూర్వజన్మ సుకృత ఫలితంగా మానవజన్మ లభిస్తుంది. ఉత్తమ మానవ జీవితంద్వారా జన్మరాహిత్యం సిద్ధిస్తుంది. దాని ఫలితంగా మోక్షం ప్రాప్తిస్తుంది. అట్టి మోక్షాన్ని పొందడానికై స్వర్గయాత్రా మార్గం గుండా భక్తులు ప్రయాణం కొనసాగిస్తున్నారు. మార్గమధ్యంలో ఏడుకొండలపై బంగారుకోనేటిని, దాని సరసనే నీవు అధిష్టించిన బ్రహ్మాండమైన దేవాలయ గోపురాగ్రపు సువర్ణశిఖరాలను విలోకించిన పుణ్యపురుషులు నిన్ను సేవించే మహాభాగ్యం, నిన్ను పూజించే మహత్తరావకాశం వినియోగించుకొన సంకల్పించుకొన్నారు. వారు యీ మర్త్యలోకంలోనే జన్మించాలనీ, నీ సమీపంలోనే జీవిస్తూ నీ సారుప్య, సామీప్య, సాన్నిధ్యాలనే పొందాలనీ కాంక్షిస్తున్నారు.

వాంఛిస్తున్నారు. ఇంద్రాది దేవతలు సహితం నీ దేవాలయ గోపురాగ్రాన విలసిల్లు శిఖరసందర్శన భాగ్యంద్వారా స్వర్గాపవర్గాలు సంప్రాప్తిస్తాయనే సద్భావంలో మర్త్యత్వం వహించి చిక్కని మక్కువతో నిన్ను సేవించ వేచియున్నారు స్వామీ ! ఓ శ్రీవేంకటేశ్వరస్వామీ ! నీకు సుప్రభాతమగుగాక !

శ్రీ భూమినాయక దయాది గుణామృతాబ్ధే
దేవాధిదేవ జగదేక శరణ్యమూర్తే !
శ్రీమన్ననంత గరుడాదిభి రర్చితాంఘ్రే
శ్రీ వేంకటాచలపతే ! తవ సుప్రభాతమ్ ॥

ఓ దేవదేవా ! ఓ దేవాధిదేవా ! ఓ మహానుభావా ! నీవు శ్రీనాయకుడవు. నీవు క్షితినాయకుడవు. అట్టి ఓ దయాసుధాసాగరమూర్తీ ! ఓ కరుణరసావతారమూర్తీ ! ఓ జగదేకశరణ నిశ్చలమూర్తీ ! ఆదిశేషుడు, గరుడుడు, విష్వక్సేనుడు ఆదిగా గల సమస్త పుణ్యవ్రతుల ప్రార్థనలకు పాత్రుడైన ఓ పవిత్రమూర్తీ ! ఓ పద్మావతీ చరణ చారణ చక్రవర్తీ ! ఓ శ్రీనివాసమూర్తీ ! నీకు సుప్రభాతమగుగాక !

శ్రీ పద్మనాభ పురుషోత్తమ వాసుదేవ
వైకుంఠమాధవ జనార్దన చక్రపాణే
శ్రీ వత్సచిహ్న శరణాగత పారిజాత
శ్రీ వేంకటాచలపతే ! తవ సుప్రభాతమ్ ॥

ఓ పద్మనాభా ! ఓ పురుషోత్తమా ! ఓ వాసుదేవా ! ఓ వైకుంఠవాసా ! ఓ మాధవా ! ఓ జనార్దనా ! ఓ చక్రపాణీ ! ఓ శ్రీవత్సచిహ్నా ! ఓ శరణాగత పారిజాతా ! ఓ వాసవార్చితా !

ఓ హృషీకేశా ! ఓ నారాయణా ! ఓ వేంకటాచలపతీ ! నీకు సుప్రభాతమగుగాక !

కందర్ప దర్పహర సుందర దివ్యమూర్తే
కాంతా కుచాంబురుహ కుట్మలలోలదృష్టే ।
కల్యాణ నిర్మల గుణాకర దివ్యకీర్తే
శ్రీవేంకటాచలపతే ! తవ సుప్రభాతమ్ ॥

ప్రియురాలి పద్మాలవంటి కుచములపై భృంగదృష్టిని ప్రసరించే ఓ సుధామధురమూర్తీ ! సుమబాణుని సౌందర్యగరిమను గెలువజాలెడు ఓ దివ్యసుందరమూర్తీ ! ఓ నవమోహనమూర్తీ ! ఓ కల్యాణ నిర్మల గుణాకర దివ్యకీర్తీ ! ఓ వేంకటరమణమూర్తీ ! నీకు మంగళకరమైన అరుణోదయ మగుగాక!

మీనాకృతే కమఠకోల నృసింహ వర్ణిన్
స్వామిన్ పరశ్వథ తపోధన రామచంద్ర !
శేషాంశరామ యదునందన కల్కిరూప
శ్రీవేంకటాచలపతే ! తవ సుప్రభాతమ్ ॥

లోకాల శోకాలు, తాపాలు హరించడానికై దుష్టశిక్షణ, శిష్టరక్షణ కావించడానికై దశావతారాలను ఎత్తావు. మత్స్యావతారం ధరించావు. కూర్మమూర్తివయ్యావు. ఆదివరాహమూర్తి అవతారం వహించావు. ఉగ్రనరసింహమూర్తివై విజృంభించావు. వామనమూర్తివై నీ త్రివిక్రమ చారుచరిత్రను ప్రకటించావు. పరశురామావతార సమయంలో నీ ప్రతాప పరాక్రమాలను ప్రదర్శించి ప్రఖ్యాతుడవయ్యావు. శ్రీరామచంద్రమూర్తివై యీ సువిశాల విశ్వానికి శాంతిసౌఖ్యాలను ప్రసాదించావు. ఆదిశేషావతారమూర్తివై ఈ బృహత్ మహీతలాన్ని వహించావు. జీవిత కురుక్షేత్రంలో ఆస్తికీ, నాస్తికీ - ధర్మానికీ, అధర్మానికీ - న్యాయానికీ, అన్యాయానికీ -

శాంతివాంఛకీ, యుద్ధకాంక్షకీ - అహరహం, అనునిత్యం, అనుక్షణం విపరీత విపత్కర విషాదమయమైన, దుర్భర దుస్సహ పీడిత తాడిత యాతనామయమైన మహాసంగ్రామం సాగుతూన్న ఆ సమయంలో శ్రీకృష్ణావతారమూర్తివై అశ్వాల్ని అదలిస్తూ, హృదయం బెదరి చెదిరిన నరుని కదిపి, కరగించి, కార్యోన్ముఖుని కావించి, ముందుకు నడిపించేందుకై మధురగంభీరమైన గీతాదేవదత్తం పూరించావు. పిమ్మట కల్క్యవతారమూర్తివై వెలశావు. ఈ విధంగా సజ్జన సంరక్షణార్థం, సద్ధర్మసంస్థాపనార్థం వివిధములైన దశావతారాల నెత్తిన ఓ దశావతారమూర్తివైన ఓ వేంకటరమణమూర్తీ ! నీకు సుప్రభాతమగుగాక !

ఏలాలవంగ ఘనసార సుగంధతీర్థం
దివ్యం వియత్సరితి హేమఘటేషు పూర్ణం।
ధృత్వాద్య వైదికశిఖామణయః ప్రహృష్టాః
తిష్ఠంతి వేంకటపతే తవ సుప్రభాతమ్॥

స్వర్ణకలశాలలో ఆకాశగంగ సుగంధభరితమై పరిమళ సహితమై విశేషప్రకాశంతో మెరసిపోతోంది. అట్టి యేలాలవంగఘనసార సుగంధి తీర్థాన్ని వేదవేదాంగ పారంగతులైన విప్రవరేణ్యులు బంగారు కడవలతో ఆకాశగంగ నుండి గ్రహించారు. పండితప్రకాండులు సకలశాస్త్రపారంగతులైన భూసురోత్తములు అట్టి హేమపాత్రలను ధరించి నిన్ను అర్చించడానికై, ఆరాధించడానికై నీవు సంతుష్ట హృదయాంతరంగులై తృప్తానుతృప్తులై అభిషేకం కావించటానికై నీ గర్భాలయప్రాంతంలో నిలచి వేచియున్నారు. ఓ వేంకటేశ్వర స్వామీ ! ఈ సుప్రభాత సమయంలో ఆ వైదికోత్తములకు నీకు అభిషేకంగావించే సదవకాశం అనుగ్రహింపుము స్వామీ !

భాస్వా నుదేతి వికచాని సరోరుహాణి
సంపూరయంతి నినదైః కకుభో విహంగాః ।
శ్రీవైష్ణవా స్సతత మర్థిత మంగళాస్తే
ధామాశ్రయంతి తవ వేంకటసుప్రభాతమ్॥

ముదమున దినకరుడు ఉదయిస్తున్నాడు. తన శతసహస్ర కిరణ సముదాయాన్ని ప్రసరిస్తున్నాడు. సమీప సుందర కాసారాలలోని, రమ్యమైన కోనేళ్ళలోని పద్మాలు వికసిస్తున్నాయి. శకుంత సంతతులు కలకలారావాలు కావిస్తున్నాయి. "న చలతి నిజధర్మ వర్ణతో యః సమమతి రాత్మ సుహృద్విపక్షపక్షే న హరతి నచ హంతి కించిదుచ్చైః సిత మనసం తమవేహి విష్ణుభక్తమ్." అని శాస్త్రములో విష్ణుభక్త లక్షణము వివరింపబడింది. అట్టి లక్షణముగల వివిధ భాగవతోత్తములు, మహాభక్త శిరోమణులు అయిన శ్రీవైష్ణవపుంగవులు నీ మంగళనామ సంకీర్తనలు కావిస్తున్నారు. నీ శుభప్రశంసను పఠిస్తున్నారు. ఓ వేంకటేశ్వరస్వామీ! అట్టి యీ సమయంలో నీకు రమణీయమైన అరుణోదయమగుగాక!

బ్రహ్మాదయ స్సురవరా స్సమహర్షయస్తే
సంత స్సనందన ముఖాస్త్వథ యోగివర్యాః ।
ధామాంతికే తవహి మంగళవస్తుహస్తాః
శ్రీవేంకటాచలపతే! తవ సుప్రభాతమ్॥

బ్రహ్మ విష్ణు మహేశ్వరాది త్రిమూర్తులు, యింద్రాది దేవతలు, సప్తఋషిపుంగవులు, నవగ్రహాధిపతులు, అష్టదిక్పాలకులు, నారదాదిమహాజ్ఞానసంపన్నులు, సనకసనందనాది ముఖ్యయోగివర్యులు, మాన్యులైన మహాత్ములు, తపోనిష్ఠాగరిష్ఠులు, జ్ఞానులు, విజ్ఞానులు, అభిజ్ఞులు, విద్యాసంపన్నులు, వివేకవంతులు, వివిధశాస్త్ర పారంగతులు, మహాభక్తులు, విప్రోత్తములు పూజాద్రవ్యసముదా

యాన్ని, మంగళవస్తుసమూహాన్ని కేలబూని నీసన్నిధానంలో పరమ భక్తిభావాలను ప్రదర్శిస్తూ, నీ దివ్యదర్శన మహాభాగ్యాన్ని గాఢంగా అభిలషిస్తూ నిలచి వేచియున్నారు స్వామీ! ఓ వేంకటేశ్వరస్వామీ! నీకు దివ్యమైన సుప్రభాత మగుగాక!

లక్ష్మీనివాస నిరవద్యగుణైక సింధోః
సంసారసాగర సముత్తరణైక సేతో ।
వేదాంతవేద్య నిజవైభవ భక్తభోగ్య
శ్రీవేంకటాచలపతే! తవ సుప్రభాతమ్॥

ఆత్మవక్షస్థలం ప్రేయసీవాసానికి నిత్యనివాసప్రదేశంగా సమర్పించిన ఓ శ్రీనివాసప్రభో! ఓ సంసారసాగరవారధీ! ఓ ఉపనిషత్సారపరమావధీ! ఓ కల్యాణగుణసాగరా! ఓ వేదాంతవేద్యా! ఓ భక్తభోగ్యా! ఓ శ్రీనివాసా! ఓ శ్రీమహేశా! నీకు రమ్యమైన సుప్రభాత మగుగాక!

ఇత్థం వృషాచలపతే రిహ సుప్రభాతం
యే మానవాః ప్రతిదినం పఠితుం ప్రవృత్తాః ।
తేషాం ప్రభాతసమయే స్మృతిరంగ భాజాం
ప్రజ్ఞాం పరార్థసులభాం పరమాం ప్రసూతే॥

ఈలోకంలో యీ శ్రీవేంకటేశ సుప్రభాతాన్ని ప్రతిదినం ప్రభాతసమయంలో యే మానవులు భక్తిప్రపత్తులతో పఠిస్తారో వారు ఆ వేంకటేశ్వరస్మరణచేత సద్బుద్ధిని, సద్భక్తిని సాధించి పరమార్థప్రదమైన ప్రజ్ఞను, మోక్షాన్ని సులభంగాను, సుకరంగాను, సత్వరంగాను సముపార్జిస్తారు.

శ్రీవేంకటేశ సుప్రభాతం సమాప్తమ్.

— o —

# శ్రీ వేంకటేశ్వర స్తోత్రమ్

కమలాకుచ చూచుక కుంకుమతో
నియతారుణితాతుల నీలతనో ।
కమలాయతలోచన లోకపతే
విజయీభవ వేంకటశైలపతే ॥

రమాకుచాగ్రి కుంకుమాంకితారుణ విలసిత నీలగాత్రుడవు. నియతారుణితాతుల నీలతనూవిలసితుడవు. శ్యామసుందరుడవు.కమలాయతలోచనుడవు. నీవు జగత్పితవు. జగత్పతివి. నీవు జగన్నాయకుడవు. నీవు జగన్నాథుడవు. అట్టి ఓ వేంకటేశ్వరస్వామీ! నీకు జయము. విజయము. దిగ్విజయము స్వామీ!

స చతుర్ముఖ షణ్ముఖ పంచముఖ
ప్రముఖాఖిల దైవతమౌళిమణే ।
శరణాగతవత్సల సారనిధే
పరిపాలయమాం వృషశైలపతే॥

ఓ శేషాచలపతీ! ఓ వృషశైలపతీ! నీవు చతుర్ముఖుడు. పంచముఖుడు, షణ్ముఖుడు ఆదిగాగల ప్రముఖదేవతాపరిషత్తునకు అధినాయకుడవు. ప్రధానదేవతలలో ప్రముఖుడవు. దేవతా సమూహ మౌళిమణి భూషణుడవు. ఓ స్వామీ! నిన్ను శరణువేడితే కరుణిస్తావు. నీవు కరుణాశరణుడవు. నీవు శరణాగతవత్సలుడవు. నీవు దయామయుడవు. నీవు అనుపమపరాక్రమ సంపన్నుడవు నీవు నన్ను జాలితో లాలించి, లాలితో పాలించి, పరిపాలించి కాపాడుము స్వామీ!

అతివేలతయా తవదుర్విషహై
రను వేలకృతై రపరాధశతైః ।
భరితం త్వరితం వృషశైలపతే
పరయా కృపయా పరిపాహిహరే ॥

ధార్మికశాసనాలను, నైతికసూత్రాలను పాటించక కట్టు బాట్లను అతిక్రమించి, క్రమశిక్షణ విధానాలను వ్యతిరేకించి, జ్ఞాతంగాను, అజ్ఞాతంగాను. విధివిరామం లేకుండా దోషాలు చేశాను. నిష్కృతిలేని దుష్కృత్యాలను కావించాను. ఈవిధంగా నీపట్ల నేను అసంఖ్యాకములైన మహాపరాధాలను కావించిన దోషిని. కలుషమతిని. మహాపాపిని. ఓ వృషశైలపతీ! ఓ వేంకటాచలపతీ! అతిత్వరితంగా నీ అపారమైన కృపతో నన్ను కాపాడుము. అనుపమానమైన దయతో నన్ను ఉద్ధరించి రక్షింపుము స్వామీ!

అధివేంకటశైల ముదారమ తే
ర్జనతాభిమతాధిక దానరతాత్।
పరదేవతయా గదితాన్నిగమైః
కమలాదయితా న్నపరం కలయే॥

అనిశం వేంకటాచలమందు అధివసించే ఓ తిరుమలవేంకటేశ్వర స్వామీ! భక్తుల వాంఛితాలు నెరవేర్చటంలో, వారి మనోరథాలు పూరించడంలో, వారికోరికలు యీడేర్చడంలో ఉదారమైన దాన పర తంత్రితతో వారు ఆశించి, అర్థించినదానికి అధికంగా వరాలు ప్రసాదించే భక్తజన సులభుడవు. అట్టి నిన్ను శృతి, స్మృతి, పురాణేతిహాస ఆగమ శాస్త్రాదులు పరమప్రమాణభూతమైన పరదైవంగా, ప్రత్యక్ష దైవంగా ప్రశంసిస్తూ, ప్రతిపాదిస్తున్నాయి. అందుచేత నిన్ను వినా అన్యులను నేను కొనియాడను. పలువురు యితర దైవాలను ఆశ్రయించను. ప్రార్థించను స్వామీ!

కలవేణురవావశ గోపవధూ
శతకోటి వృతాత్స్మరకోటి సమాత్।
ప్రతివల్లవికాభిమతా త్సుఖదాత్
వసుదేవసుతా న్నపరం కలయే॥

నీవు నవకోటిమన్మథ లావణ్యమూర్తివి. నీవు సుందరమూర్తివి. నీవు దివ్యసౌందర్యరాశివి. నీవు కావించే మధురం, మనోహరం అయిన వేణుగానరసం ఒక వలపు పిలుపుగా, ఒక ప్రణయసందేశంగా, ఒక సుందరస్వాప్నిక మధురానుభూతిగా భావించి, స్వీకరించి వేనవేలు గోపికలు శరీరాలు పులకరింపగా, హృదయాలు పరవశింపగా, శిరాలు వాల్చి, కరాలు మోడ్చి ప్రేమభిక్షను అర్థిస్తూ నిన్ను చుట్టుముట్టారు. కారుణ్యమూర్తివై వారి అభ్యర్థనలను ఆలించి, ప్రణయ లావణ్యమూర్తివై వారి ప్రార్థనలను మన్నించి ప్రతీ గోపికయొక్క ఆర్తిని ఆర్ద్రతతో, దయార్ద్రతతో తొలగించావు ఆనందభావం కలిగించావు. అట్టి వాసుదేవుని అవతార స్వరూపుడవైన ఓ వేంకటేశ్వరస్వామీ! నిన్ను వినా అన్యదైవాలను దర్శించను. స్మరించను. ప్రార్థించను.

అభిరామగుణాకర దాశరథే
జగదేకధనుర్ధర ధీరమతే।
రఘునాయక రామ రమేశవిభో
వరదో భవ దేవ దయాజలధే॥

నీవు కౌసల్యా వరకుమారుడవు. కోసలాధిపుడవు. సరసిజాక్షుడవు. రమాసతీ విభుడవు. సద్గుణ పూజితుడవు. సుగుణశోభితుడవు. సద్గుణోత్తముడవు. జగదేక ధనుర్ధరధీరుడవు. విశ్వమహావీరుడవు. సకలభువనాలకు అధినాయకుడవు. నీవు సర్వవ్యాపకుడవు. విశ్వవ్యాప్తుడవు. నీవు విశ్వవిఖ్యాతుడవు. చరిత్రప్రసిద్ధుడవు. భవ్యచరిత్రుడవు. నీవు దయా సముద్రుడవు. కరుణాసాగరుడవు అట్టి ఓ శ్రీనివాసా! మా అభీష్టాలను సిద్ధింపజేయుము. మేము అర్థించిన వరాలను అనుగ్రహించి కాపాడుము స్వామీ!

అవనీతనయా కమనీయకరం
రజనీకర చారు ముఖాంబురుహామ్ ।
రజనీచర రాజ తమోమిహిరం
మహనీయ మహం రఘురామమయే ॥

నీవు సీతామనోహరుడవు మహాసాధ్వి, మహాసతియైన సీతాదేవికి సంతోషభావం కలిగించిన సుందరాకారుడవైన రఘువంశోత్తముడవు. నీవు రజనీకర చారు ముఖాంబురుహుడవు. నెలరాజువెన్నెల వన్నెలను గెలువజాలెడు మోముకలవాడవు. నీవు రజనీ చర రాజతమోమిహిరుడవు. రాక్షసాంధకారాన్ని పటాపంచలు కావించే దివ్యభానుడవు. నీవు మహనీయుడవు. నీవు మహోన్నతుడవు. మహోదారుడవు. అందుచేత ఓ స్వామీ! నిన్ను శరణువేడుతున్నాను. నన్ను కరుణింపుము.

సుముఖం సుహృదం సులభం సుఖదం
స్వనుజం చ సుకాయ మమోఘశరమ్ ।
అపహాయ రఘూద్వహ మన్యమహం
న కథంచన కంచన జాతు భజే ॥

ఓ శ్రీరామా! నీదేహం దివ్యసుందరమైనది. నీ చంద్రవదనం బహుప్రసన్నమైనది. నీ హృదయం సుమకోమలమైనది. కనుక నీవు సుందరుడవు. సుముఖుడవు. సహృదయుడవు. సులభుడవు. అనుజ సంపద్విలసితుడవు. అమోఘశరుడవు. రఘుకులోద్ధారకుడవు. అట్టి నిన్ను విడచి వేరొకని ఎవ్వరినీ, ఎందులకూ, ఎప్పుడూ, ఏ విధంగాను స్మరించను. సేవింపను. సతతమూ నీరూపాన్నే భావించి, నిరంతరమూ నీ పవిత్ర నామాన్నే జపించి, స్మరించి, సేవిస్తాను.

వినా వేంకటేశం ననాథో ననాథః
సదా వేంకటేశం స్మరామి స్మరామి ।
హరే వేంకటేశ ప్రసీద ప్రసీద
ప్రియం వేంకటేశ ప్రయచ్ఛ ప్రయచ్ఛ ॥

ఓ శ్రీనివాసప్రభూ ! ఓ శేషాద్రిశేఖర విభూ ! నీవే నా నాథుడవు. సఖుడవు. బాంధవుడవు. నాయకుడవు. పాలకుడవు. ప్రభుడవు. నీవే నా పతివి గతివి. నీవే నా భవిష్యన్నిర్దేశకుడవు నీవే నా భావిజీవితవ్యాఖ్యాతవు. నా సర్వం, నా సర్వస్వం, నువ్వే స్వామీ! అట్టి నిన్ను వినా అన్యుని నేను భావించను. నిరంతరం నిర్విరామంగా నిన్నే ధ్యానిస్తున్నాను. అహరహం, అనుక్షణం, నిన్నే ఆరాధిస్తున్నాను. సర్వకాల సర్వావస్థల్లోనూ నిన్నే స్మరిస్తున్నాను. ఉపాసిస్తున్నాను. నీ దివ్యరూపాన్నే నా హృదయంలో నిలుపుకొన్నాను. నీ పావన నామాన్నే జపిస్తున్నాను నీ కోసం పరిపరివిధాల తపిస్తున్నాను. పరితపిస్తున్నాను. నీవు నను దయాదృష్టితో ప్రసన్నుడవై నాకు అభీష్టసిద్ధి పరంపరలను వర్షించి, నాకు సముచిత స్థానం సమకూర్చుము స్వామీ !

అహం దూరతస్తే పదాంభోజయుగ్మ
ప్రణామేచ్ఛయాఽఽగత్య సేవాం కరోమి।
సకృత్సేవయా నిత్యసేవాఫలం త్వం
ప్రయచ్ఛ ప్రయచ్ఛ ప్రభో వేంకటేశ॥

ఓ వేంకటేశ్వరస్వామీ! నీ దివ్యసుందరరూపం దర్శించడానికై, నీ పవిత్ర పాదపరాగం శిరస్సున ధరించడానికై, నీ సుధామధురమైన నామం స్మరించి, జపించి, తరించడానికై, దూరతీరాలను లెక్కచేయకుండా, మార్గాయాసాన్ని సరకుకొనకుండా, నీ సన్నిధానం

లోకి వచ్చి నిన్ను ధ్యానించి, పూజిస్తున్నాను. నేను నీకు యీ తరుణంలో కావించిన స్వల్పసేవను దయచేసి ఫలాధిక్యాన్ని ప్రసాదింపుము. నీకు నేను చేసిన యీ పరిమిత సేవను నిత్యసేవగా స్వీకరింపుము. నేను నీపట్ల కావించిన యీ యేకైక సత్కృతికి బహువిధములైన సత్కృతులుగా భావించి, శత సహస్ర సుకృతులుగా సంభావించి, స్వీకరించి నిన్ను నిత్యం సేవించిన కలిగే ఫలితాన్ని, ప్రయోజనాన్ని, పరమార్థాన్ని, ధన్యతను, జన్మసార్థకతను దయతో అనుగ్రహింపుము స్వామీ!

అజ్ఞానినా మయా దోషా
నశేషాన్ విహితాన్ హరే।
క్షమస్వ త్వం క్షమస్వ త్వం
శేషశైల శిఖామణే॥

ఓ గరుడాచలశిరోమణీ! ఓ శేషశైలశిఖామణీ! అవివేకంతో, అజ్ఞానంతో, అహంకారంతో, అసంఖ్యాకములైన అపరాధాలను కావించాను. మూఢుడనై, మూర్ఖుడనై అనేక నేరాలను చేసాను. నా సమస్తదోషాలను, సకల నేరాలను, సర్వ మహాపరాధాలను, సహించి, భరించి, క్షమించి, రక్షింపుము స్వామీ!

శ్రీ వేంకటేశ్వర స్తోత్రమ్ సమాప్తమ్.



# శ్రీ వేంకటేశ ప్రపత్తి

ఈశానాం జగతోఽస్య వేంకటపతే ర్విష్ణోః పరాం ప్రేయసీం
తద్వక్షః స్థల నిత్యవాసరసికాం తత్క్షాంతి సంవర్ధినీమ్ !
పద్మాలంకృత పాణిపల్లవయుగాం పద్మాసనస్థాం శ్రియమ్
వాత్సల్యాది గుణోజ్జ్వలాం భగవతీం వందే జగన్మాతరం ॥

నీవు సకలలోకాలకు నాయకురాలవు. నీవు శ్రీవేంకటాచలపతికి పరమప్రియురాలవు. సతతం విష్ణుహృదయంలో కాపురంచేస్తున్న దానవు. ఆ కారణంగా అతని లోకక్షమాగుణసంపదను నెలకొల్పడానికి కారణభూతురాలవు నీవు. పద్మాలంకృత పాణిపల్లవ సౌందర్యశోభితురాలవు. పద్మాసనభూషితురాలవు. నీవు వాత్సల్యాదిమేలైన గుణాల చేత ప్రకాశించుదానవు. నీవు సుగుణవత్సలవు. నీవు ముల్లోకాలకు తల్లివి. ఎల్లలోకాలకు రాణివి. నీవు దయామయురాలవు. నీవు పరమ పూజ్యురాలవు. అట్టి ఓ మహాలక్ష్మీమాతా! నిన్ను స్తుతించి, ప్రస్తుతించి, అర్చించి, ప్రార్థిస్తున్నాను.

శ్రీమన్ కృపాజలనిధే! కృతసర్వలోక!
సర్వజ్ఞ! శక్త! నతవత్సల! సర్వశేషిన్ ।
స్వామిన్! సుశీలసులభాశ్రిత పారిజాత!
శ్రీవేంకటేశచరణౌ శరణం ప్రపద్యే ॥

శ్రీవేంకటేశ్వరస్వామీ! నీవు శ్రీమంతుడవు. ధీమంతుడవు. శుభశ్రీమంతుడవు. కరుణాసాగరుడవు. సర్వలోక జనరంజకుడవు, సర్వజ్ఞుడవు. సర్వశక్తిమంతుడవు. సకలలోకరక్షకుడవు. లోకపాలకుడవు. భక్తవత్సలుడవు. భక్తజనసులభుడవు. ఈచరాచరప్రపంచమున నీవు ప్రధానుడవు. ప్రముఖుడవు. ఆపేక్షితుల నుపేక్షచేయని ప్రభుడవు. ఆశ్రితపారిజాతుడవు, ఓస్వామీ! అట్టి నీ చరణాలే నాకు శరణ్యం.

ఆనూపురార్చిత సుజాత సుగంధిపుష్ప
సౌరభ్య సౌరభకరౌ సమసన్నివేశౌ ।
సౌమ్యౌ సదానుభవనేఽపి నవానుభావ్యౌ
శ్రీవేంకటేశచరణౌ శరణం ప్రపద్యే॥

ఓ వేంకటేశ్వరస్వామీ! నీ పవిత్రపాదయుగాన్ని పూజించడానికై సమర్పించిన అతికోమల కుసుమాలు మృదులాధిక్యాన్ని

పొంచాయి. నీ పాదాలమోళ్ళిల సమర్పించిన సుజాత సుగంధిపుష్పాలు పరిమళాధిక్యతను, సౌరభవిశేషాన్ని ప్రసరిస్తున్నాయి. అట్టి పూజా ప్రసూనాలు విశేషమైన సువాసనలతో, వినూత్నమైన కాంతులతో నీపాదాలగ్రమోల వెలలేని అలంకారాలుగా అలరారుతూ సౌందర్యగరిమను ప్రదర్శిస్తున్నాయి. ఈవిధంగా సుమనోహరమైన, సుగంధభరితమైన, అతిలలితమైన, సౌందర్యశోభితమైన, నీచరణయుగాన్ని నిరంతరం సేవించినా, నిత్యనూతన సేవాపరమైన అవాఙ్మానస గోచరానుభూతి పరంపరలు నాహృదయసీమలో కలిగి, కనలి, మెదలి, తొంగి చూచి, తొణికిసలాడుతున్నాయి. ఓ స్వామీ! అట్టి నీచరణాలే నాకు శరణ్యం.

సద్యోవికాసి సముదిత్వరసాంద్రరాగ
సౌరభ్యనిర్భర సరోరుహ సామ్యవార్తామ్ ।
సమ్యక్షు సాహసపదేషు విలేఖయంతౌ
శ్రీవేంకటేశచరణౌ శరణం ప్రపద్యే॥

ఓ వేంకటేశ్వరస్వామీ! నవవికసితమైన నవసౌరభభరితమైన, రాగరంజితమైన తామరపువ్వులవలె నీపాదాలు కోమలమై, కమనీయమై, పరిమళపూర్ణమై, సౌరభభరితమై, రాగయుక్తమై, రమణీయమై, చెలువొందుతున్నాయి. పద్మాలతో నీపాదాలను ఉపమించడం కాని, నీపాదాలను పద్మాలతో పోల్చడంగాని, కమలసామ్యాన్ని స్మరింపజేసే చిహ్నాలుగల పాదాలనేభావాన్ని స్ఫురింపజేయడంగాని, ధ్వనింపజేయడంగాని, అలంకారయుక్తంగా ప్రకటించడంగాని, నేను భక్తిభావంతో చేసే అపరాధమనీ, ప్రీతితో చేసేప్రమాదమనీ, సేవాభావంతో కావించే సాహసకృత్యమనీ నాకు విదితపూర్వమే! నీపాదాలే నాచేత ఆవిధంగా పలికించాయి. ఓస్వామీ! కమలాలకన్న భిన్నమైన, ఘనమైన, ఘనతరమైన, ఘనతమమైన నీచరణాలనేశరణు వేడుతున్నాను.

రేఖామయధ్వజ సుధాకలశాతపత్ర
వజ్రాంకుశాంబురుహకల్పక శంఖచక్రైః ।
భవ్యైరలంకృతతలౌ పరతత్త్వ చిహ్నైః
శ్రీవేంకటేశచరణౌ శరణం ప్రపద్యే ॥

ఓ వేంకటేశ్వరస్వామీ! రేఖాసమన్వితమైనపతాకం, అమృత కలశం, ఛత్రం, వజ్రం, అంకుశం, పద్మం, కల్పవృక్షం, శంఖం, చక్రం, ఆదిగాగల వివిధాలంకారాలతో, బహువిధములైన భూషణాదులతో నీ పవిత్రపాదద్వయం ప్రకాశిస్తోంది. విశిష్టమైన యీ అలంకారాలు సుస్పష్టంగా, పరమోత్కృష్టమైన పరమార్థతత్త్వ లక్షణాల్ని ప్రవచిస్తున్నాయి. పరమార్థ సూచకాలైన శుభచిహ్నాలకు ప్రతిరూపాలుగా ప్రాతినిధ్యం వహిస్తున్నాయి. ఓస్వామీ! అట్టి నీచరణాలనే శరణు వేడుతున్నాను.

తామ్రోదరద్యుతి పరాజితపద్మరాగౌ
బాహ్యైర్మహోభి రభిభూత మహేంద్రనీలౌ ।
ఉద్యన్నఖాంశుభి రుదస్త శశాంక భాసౌ
శ్రీవేంకటేశచరణౌ శరణం ప్రపద్యే॥

ఓ వేంకటేశ్వరస్వామీ! నీపాదాల అధోభాగపు అరుణ కాంతులు పద్మరాగాల ప్రకాశాన్ని అధిగమిస్తున్నాయి. నీపాదాల ఊర్ధ్వ భాగపుకాంతులు ఇంద్రనీలమణులకాంతిని తిరస్కరిస్తున్నాయి. నీగోటి కాంతులు చంద్రకాంతులను ఎకసక్కెం చేస్తున్నాయి. పద్మరాగాల కాంతుల సౌకుమార్యాన్ని, ఇంద్రనీలమణుల సౌందర్యాన్ని, నిండుజాబిలి పండువెన్నెల వెలుగుల చల్లదనాన్ని మించిన సౌకుమార్యాన్ని, సౌందర్యాన్ని, చల్లదనాన్ని నీపాదాలు కైసేసికొన్నాయి. ఓ స్వామీ! అట్టి నీపాదాలను శరణు వేడుతున్నాను.

సప్రేమభీతి కమలాకర పల్లవాభ్యాం
సంవాహనేఽపి సపది క్లమమాదధానౌ !
కాంతావవాఙ్మనస గోచరసౌకుమార్యౌ
శ్రీవేంకటేశచరణౌ శరణం ప్రపద్యే ॥

ఓ వేంకటేశ్వరస్వామీ ! మహాలక్ష్మీమాత కుసుమాలవంటి కోమలమైన, మృదువైన, లలితమైన హస్తాలతో అనురాగంతో, అభిమానంతో, ప్రేమ పురస్సరంగా నీ పాదసేవ చేస్తూనే ఆమె అంత సున్నితంగా, సుకోమలంగా నీ పాదాలను స్పృశించినా, పూలగుత్తులతో తాకినట్లు అతిమెత్తగా ఒత్తినా, నీ సుకుమారములైన పాదాలు కందిపోయి అరుణారుణమయ్యాయి. అట్టి నీ పాదాల సౌకుమార్యాన్ని, సౌందర్యాన్ని మాటలు వర్ణించలేవు. మనస్సులు అందుకోలేవు. అట్టి నీ పాదాలను శరణు వేడుతున్నాను.

లక్ష్మీ మహీ తదనురూప నిజానుభావ
నీళాది దివ్యమహిషీ కరపల్లవానామ్ ।
ఆరుణ్య సంక్రమణతః కిల సాంద్రరాగౌ
శ్రీవేంకటేశచరణౌ శరణం ప్రపద్యే ॥

ఓ వేంకటేశ్వరస్వామీ ! శ్రీదేవి, భూదేవి నీ పట్టమహిషులు. నీళాదేవి సహితం వీరితో సమానమైన మహాత్వం సంపాదించిన సాధ్వి. శ్రీదేవి, భూదేవి, నీళాదేవి ఆదిగాగల దివ్యమహిషులు నీ పాదసేవను తమ కెంజిగురు చేతులతో కావించి పునీతులయ్యారు. నీ పాదసేవ కావిస్తున్న సమయంలో వారి కరపల్లవాల తాకిడివలన, వారి చేతులలోని ఎర్రదనం నీ పాదాలు సంక్రమింపజేసుకున్నాయా అన్నట్టు సాంద్రరాగయుక్తమై నీ చరణాలు గోచరిస్తున్నాయి. అట్టి అరుణారుణమైన నీ చరణాలను శరణు వేడుతున్నాను.

నిత్యానమద్విధి శివాదికిరీటకోటి
ప్రత్యుప్తదీప్త నవరత్నమహః ప్రరోహైః
నీరాజనావిధి ముదార ముపాదధానౌ
శ్రీ వేంకటేశచరణౌ శరణం ప్రపద్యే॥

ఓ వేంకటేశ్వరస్వామీ! చతుర్ముఖుడు, మహేశ్వరుడు ఆదిగా గల సకల ప్రముఖ దేవతలూ, సమస్త దేవప్రధానులూ, సతము స్తుతులై, సాష్టాంగ దండప్రమాణం కావిస్తుంటారు. ఆ సమయంలో వారి శిరోభూషణాలైన కిరీటాలలోని నవరత్న కాంతులు నీపాదాలకు నివాళులు సలుపుతున్నాయి. సకల ప్రముఖ దేవతల, సమస్త దేవప్రధానుల రత్నకిరీటకాంతిహారతులను యే పాదాలు స్వీకరిస్తున్నట్లు గోచరిస్తున్నాయో అట్టి నీపాదాలను నేను శరణు వేడుతున్నాను.

"విష్ణోః పదే పరమ" ఇత్యుదిత ప్రశంసౌ
యౌ 'మధ్వఉత్స' ఇతి భోగ్యతయాఽప్యుపాత్తౌ।
భూయస్తథేతి తవ పాణితలప్రదిష్టౌ
శ్రీ వేంకటేశచరణౌ శరణం ప్రపద్యే॥

ఓ వేంకటేశ్వరస్వామీ! ఋగ్వేదం విష్ణుపాదాలు పరమ ఉత్కృష్టములైనవని ప్రవచిస్తోంది. వైకుంఠమందు విష్ణుపాదములను తేనె ఊటగాను, సుధామధురమైన భోగ్యవస్తువుగాను ఋగ్వేదం ప్రకటిస్తోంది. ఋగ్వేదం ప్రవచించి, ప్రకటించి, ప్రతిపాదించి, పరమ ప్రమాణభూతమైనవని సూచించినదాన్ని, నీ వరదహస్తం నిర్ధారించి, నిర్ణయించి, నీ చరణయుగాన్ని భక్తులను సేవించుకొని తరించమని నిర్దేశిస్తోంది. అట్టి నీచరణాలను శరణు వేడుతున్నాను.

పార్థాయ తత్సదృశ సారథినాత్వయైవ
యౌ దర్శితౌ స్వచరణౌ శరణం వ్రజేతి।

భూయోఽపి మహ్యమిహ తౌ కరదర్శితౌ తే
శ్రీవేంకటేశచరణౌ శరణం ప్రపద్యే॥

ఓ వేంకటేశ్వరస్వామీ! కురుక్షేత్రమహాసంగ్రామ సమయంలో రథియైన పార్థునకు సమర్థుడవైన సారథివై నీ చరణయుగాన్ని సేవించి, తరించమని ఆజ్ఞాపించావు. అట్టి నీ పవిత్ర చరణాలను, నీ పావన పాద పద్మాలను నీ వరదహస్తంతో నిర్దేశించి నాకు చూపిస్తున్నావు. నీ ఆదేశం శిరసావహించి నిర్వహిస్తాను. విధిగా నీ పాదాలనే శరణు వేడుతున్నాను.

మన్మూర్ధ్ని కాళియఫణే వికటాటవీషు
శ్రీవేంకటాద్రిశిఖరే శిరసి శ్రుతీనామ్।
చిత్తేఽప్యనన్యమనసాం సమమాహితౌ తే
శ్రీవేంకటేశచరణౌ శరణం ప్రపద్యే॥

ఓ శ్రీ వేంకటేశ్వరస్వామీ! కలుషమతిని, దురితమతిని అయిన నా శిరస్సుపైన నీ పవిత్ర పాదాలు ప్రకాశిస్తున్నాయి. వేద శిరములైన ఉపనిషత్తులు నీ పవిత్ర పాదసంస్మరణ మహాభాగ్యప్రభావాన్ని పొందుతున్నాయి. పరమాత్ముని గురించి సంతసించే పరమయోగిపుంగవుల హృదయసీమలలో, పరమభాగవతోత్తముల మానసవీథులలో నీ చరణాలు విహరించి వికసిస్తున్నాయి. భక్తుల నిశ్రేణికైన ఆ వేంకటాద్రి పర్వతశ్రేణిపైన నీ పాదపద్మాలు వెలుగొందుతున్నాయి. ఆయా ప్రదేశాలలో సమభావంతో సదా గోచరించే నీ చరణాలను శరణు వేడుతున్నాను.

అమ్లానహృష్య దవనీతల కీర్ణపుష్పౌ
శ్రీవేంకటాద్రి శిఖరాభరణాయమానౌ।

ఆనందితాఖిల మనోనయనౌ తవైతౌ
శ్రీవేంకటేశచరణౌ శరణం ప్రపద్యే॥

ఓ శ్రీవేంకటేశా! నీ పవిత్రమైన పాదాలముందు సమర్పించిన పూజాప్రసూనాలు నిత్యవికాసంతో, సతతప్రకాశంతో అవనీతలంలో వెలుగొందుతున్నాయి. భూతలంపై వ్యాపించి పుష్పాలవలె నీపాదాలు నిత్యవికాసంతో మెరసిపోతున్నాయి. ఈ సువిశాల మహీతలమందలి తిరుమల ప్రాంతమందలి శేషశైలశిఖరంపైన నీ నిరుపమానములైన పాదాలు వెలిశాయి. అట్టి నీ అరుణారుణమైన చరణాలు నాగాయుణాదికి భూషణాలై భాసిస్తున్నాయి. సర్వజనులకూ కన్నులపండువ కావిస్తున్నాయి. సకల జనుల మనస్సులను ఆనందంతో నింపుతున్నాయి. అట్టి నీ దివ్యచరణాలనే శరణు వేడుతున్నాను.

ప్రాయః ప్రపన్నజనతా ప్రథమావగాహ్యౌ
మాతుః స్తనావివ శిశో రమృతాయమానౌ।
ప్రాప్తౌ పరస్పరతులా మతులాంతరౌ తే
శ్రీవేంకటేశచరణౌ శరణం ప్రపద్యే॥

ఓ శ్రీవేంకటేశా! నీకు ప్రీతిపూర్వకంగా ప్రణమిల్లే పరమ భక్తాగ్రేసరులకు ప్రప్రథమంగా నీ పాదాలే సాక్షాత్కరిస్తాయి. నీ పాదాలు మాతృస్తన్యాలవలె అమృతతుల్యాలై సదా సర్వులకూ అనుభవనీయాలు. అవి కేవలం ఆపాత మధురాలే కావు. అవి అతిలోక సౌందర్య సంపద్విలసితాలు కూడా! నీ పాదాలు అవాఙ్మానస గోచరానుభూతి పరంపరలను కలిగించి, కన్పించే చల్లని, చక్కని తియ్యని పాదాలు. అట్టి నీ పాదాలతో నీ పాదాలే ఉపమింప దగినవి. ఈ బ్రహ్మాండంలోని యే వస్తుసమూహమూ నీ చరణ యుగముతో పోల్చదగినది కాదు. అట్టి అసమానగుణ విశేషాలతోను, అట్టి నిరుప

మాన విశేషగుణాలతోను వేంకటాచలంపై అలంకారాలుగా అలరారే నీ చరణాలను శరణు వేడుతున్నాను.

సత్త్వోత్తరై సతతసేవ్య పదాంబుజేన
సంసారతారక దయార్ద్ర దృగంచలేన !
సౌమ్యోపయంతృ మునినా మమ దర్శితౌ తే
శ్రీవేంకటేశచరణౌ శరణం ప్రపద్యే ॥

ఓ శ్రీవేంకటేశ్వర స్వామీ ! నీ పాదాలు సత్త్వగుణ సంపన్నులగు ఉత్తమమునులచే సేవింపబడ్డాయి. కరుణాంతరంగుడైన, కమనీయలోచనుడైన, దయామయుడైన మహామహితాత్ముడైన రమ్యాజామాతృముని (మనవాళమహాముని) మహాఘోరభీకరమైన, అతి కఠోరమైన సంసారసాగరాన్ని దాటడానికై నీ పవిత్ర చరణయుగమనే నౌకను చూపించాడు. ఆ విధంగా సాత్త్విక స్వభావ సంపన్నులచేత, మునులచేత, తపోధనములచేత, మాన్యులచేత, మహితాత్ములచేత సేవింపబడి, మునికులతిలకుడై మణవాళ మహామునిచేత భక్తులకు నిర్దేశింపబడిన నీ దివ్యచరణములే నాకు శరణ్యములు.

శ్రీశ శ్రియాఘటికయా త్వదుపాయభావే
ప్రాప్యే త్వయి స్వయముపేయతయా స్ఫురంత్యా !
నిత్యాశ్రితాయ నిరవద్యగుణాయ తుభ్యం
స్యాం కింకరో వృషగిరీశ నజాతు మహ్యమ్ ॥

ఓ శ్రీవేంకటేశ్వరస్వామీ ! నీవు భక్తుల ముక్తిసాధనకు ఉపాయభూతుడవు. నీవు సాధుజనసులభుడవు. అట్టి నిన్ను సదా సేవిస్తూ నీ హృదయసీమలో రమవసిస్తోంది. నీవు శ్రీలక్ష్మీవల్లభుడవు. రమాశ్రితుడవు. సుగుణసంపన్నుడవు. సుగుణభూషణుడవు. స్వామీ! నిన్ను నుతిస్తూ, స్తుతిస్తూ, సన్నుతిస్తూ నిస్వార్థంగా నీ సేవకులకు సేవకుడనై, నీకు కింకరుడనై, నీ భృత్యానుభృత్యుడనై, నీ దాసాను

దాసుడనై నిన్నాశ్రయించి సంచరిస్తాను. నీ ఆదేశాలను శిరసావహిస్తాను. నీ కనుసన్నలలో మెలగి నీ ఆజ్ఞలను వినయపూర్వకంగాను, విధేయపూర్వకంగాను నెరవేరుస్తాను. అనుమతించుము స్వామీ! అనుగ్రహింపుము స్వామీ!

శ్రీ వేంకటేశ ప్రపత్తి సమాప్తమ్



## శ్రీవేంకటేశ మంగళాశాసనమ్

శ్రియః కాంతాయ కల్యాణ
నిధయే నిధయేఽర్థినామ్ ।
శ్రీవేంకట నివాసాయ
శ్రీనివాసాయ మంగళమ్ ॥

నీవు రమాధవుడవు. శ్రియః కాంతుడవు. శ్రీనివాసప్రభుడవు. కల్యాణగుణసంపన్నుడవు. సుగుణభూషణుడవు. పుణ్యవ్రతుడవు. మంగళకారకుడవు. శుభాశ్రితుడవు. అర్థిజనుల ప్రార్థనలు వ్యర్థం కావించక పూరించగల సమర్థుడవు. పేదలపాలిటి పెన్నిధివి. దయానిధివి. శ్రీవేంకటాచల నివాసివి. అట్టి ఓ శ్రీవేంకటేశ్వర స్వామీ! నీ కల్యాణ నామసంకీర్తనములో కల్యాణదాయకమై, నీ దివ్యమంగళ రూప సందర్శనం జగన్మంగళప్రదమై చెలువొందుగాక!

లక్ష్మీ సవిభ్రమాలోక
సుభ్రూ విభ్రమ చక్షుషే ।
చక్షుషే సర్వ లోకానాం
వేంకటేశాయ మంగళమ్ ॥

నీవు కల్యాణ సుందరస్వామివై, ప్రణయ లావణ్యస్వామివై, పవిత్రప్రేమోపాసివై, చిత్ర, విచిత్ర ప్రణయ దృక్కులను ప్రియు

రాలిపై ప్రసరిస్తున్నావు. సిరిచెలిని నీ ప్రేమ వీక్షణబంధాలతో నీ హృదయమందిరంలో బందీని కావించుకొన్నావు. శ్రీనివాసుడవై సకలలోకాలకూ నయనోల్లాసం కలిగిస్తున్నావు. శ్రీవత్సుడవైన నీవు లోకరక్షకుడవై, విశ్వానికి విజ్ఞానచక్షువు ప్రసాదించి చల్లనివెన్నెల వెలుగును అందిస్తున్నావు. అట్టి ఓ వేంకటేశ్వరస్వామీ ! నీ కల్యాణ నామ సంస్మరణము లోకకల్యాణదాయకమై, నీ దివ్యమంగళరూప సందర్శనము జగన్మంగళప్రదమై చెలువొందుగాక !

శ్రీవేంకటాద్రి శృంగాంగ్రి
మంగళాభరణాంఘ్రయే !
మంగళానాం నివాసాయ
వేంకటేశాయ మంగళమ్ ॥

భక్తకోటికి ముక్తివాటిక వేంకటాచలం. తిరుపతి పర్వతశ్రేణి భోగమోక్షాలకు కాణాచి, శ్రీవేంకటాచలధీశుని చరణదాసి. నీవు అట్టి వేంకటాద్రి శిఖరాన వెలసిన పుణ్యపురుషుడవు. ధ్వజం, అమృత కలశం, ఛత్రం, అంకుశం, పద్మం, కల్పవృక్షం, శంఖం, చక్రం, వజ్రం ఆదిగాగల శుభచిహ్నాలచేత అలంకరింపబడిన పవిత్ర పాదపద్మాలతో అచ్చట నువ్వు వెలిశావు. అందుచేత నీవు శుభప్రదుడవు. వరదహస్త భూషణుడవు. అట్టి ఓ శ్రీవేంకటేశ్వరస్వామీ ! నీ కల్యాణ నామ సంకీర్తనము లోక కల్యాణదాయకమై, నీ దివ్యమంగళరూప సందర్శనము జగన్మంగళ ప్రదమై శోభించుగాక !

సర్వావయవ సౌందర్య
సంపదా సర్వచేతసామ్ ।
సదా సమ్మోహనాయాస్తు
వేంకటేశాయ మంగళమ్ ॥

నీవు నవమోహనమూర్తివి. నీవు రూపలావణ్యమూర్తివి. నీవు సుందరాకారుడవు. సర్వాంగసుందరుడవు. సర్వావయవసౌందర్య సంపద్విఖ్యాతుడవు. నీసౌందర్యసంపదచేత సదా సకలజనులనుసమ్మోహింపజేస్తున్నావు. అట్టి ఓ శ్రీవేంకటేశ్వరస్వామీ! నీ కల్యాణనామసంస్మరణము లోకకల్యాణదాయకమై, నీ దివ్యమంగళరూప సందర్శనము జగన్మంగళప్రదమై విరాజిల్లుగాక!

నిత్యాయ నిరవద్యాయ
సత్యానంద చిదాత్మనే ।
సర్వాంతరాత్మనే శ్రీమ
ద్వేంకటేశాయ మంగళమ్ ॥

నీవు త్రికాల వేద్యుడవు. కాలాతీతుడవు. కాలనిర్ణేతవు. నిత్యుడవు. దోషరహితుడవు. నిత్యసత్యవ్రతుడవు. నిర్మలుడవు. నిర్వికారుడవు. నిత్యసంతోషితుడవు. శాంతస్వాంతుడవు. ఆదిమధ్యాంత రహితుడవు. అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడవు. సచ్చిదానందరూపుడవు. సర్వవ్యాపకుడవు. సర్వాంతర్యామిస్వరూపుడవు. అట్టి ఓ శ్రీవేంకటేశ్వరస్వామీ! నీ కల్యాణనామసంస్మరణము లోకకల్యాణదాయకమై, నీదివ్యమంగళరూప సందర్శనము జగన్మంగళప్రదమై అలరారుగాక !

స్వతస్సర్వవిదే సర్వ
శక్తయే సర్వశేషిణే ।
సులభాయ సుశీలాయ
వేంకటేశాయ మంగళమ్ ॥

నీవు సర్వజ్ఞుడవు. సర్వశక్తుడవు. శక్తిసంపన్నుడవు. సర్వసమర్థుడవు. ప్రముఖుడవు. ప్రధానుడవు సులభుడవు. భక్తజనసులభుడవు. సాధుజనసంరక్షకుడవు. శీలసంపన్నుడవు. సుశీలుడవు. సాధుశీలుడవు.

అట్టి ఓ శ్రీ వేంకటేశ్వరస్వామీ! నీకల్యాణనామసంస్మరణము లోక కల్యాణదాయకమై, నీ దివ్యమంగళ రూపసందర్శనము జగన్మంగళ ప్రదమై ప్రభవించుగాక !

పరస్మైబ్రహ్మణే పూర్ణ
కామాయ పరమాత్మనే ।
ప్రయుంజే పరతత్త్వాయ
వేంకటేశాయ మంగళమ్ ॥

నీవు పరబ్రహ్మస్వరూపుడవు. పరమాత్ముడవు, పూర్ణపురుషుడవు. వాంఛారహితుడవు. మమకారదూరుడవు. పరతత్త్వపరిశోధనా నిష్ఠాగరిష్ఠుడవు. సర్వతత్త్వసారసంగ్రహపారీణుడవు. వరముడవు. శుభప్రదుడవు. అట్టి ఓ శ్రీ వేంకటేశ్వరస్వామీ! నీకల్యాణనామసంకీర్తనం లోకకల్యాణదాయకమై, నీదివ్యమంగళవిగ్రహ సందర్శనం జగన్మంగళ ప్రదమై వర్ధిల్లుగాక !

ఆకాలతత్త్వ మశ్రాంత
మాత్మనా మనుపశ్యతామ్ ।
అతృ ప్త్యమృతరూపాయ
వేంకటేశాయ మంగళమ్ ॥

శ్వేతవరాహ కల్పాంతంవరకూ, యీకలికాలంలో సర్వకాల సర్వావస్థల్లోనూ భక్తజనసులభుడవై, సదా సాధుజనసంరక్షకుడవై, పుణ్యపురుషులపాలిటి పెన్నిధివై సాక్షాత్కరిస్తున్నావు. అట్టినిన్ను సతతమూ సందర్శించువారికి, అనునిత్యమూ సేవించువారికి తనివితీరని అమృతమూర్తివై నీ దివ్యదర్శనమహాభాగ్యం వారికి కలిగిస్తున్నావు. అట్టి ఓ శ్రీ వేంకటేశ్వరస్వామీ! నీ కల్యాణనామసంకీర్తనము లోక కల్యాణదాయకమై, నీ దివ్యమంగళరూపసందర్శనవిశేషం జగన్మంగళ ప్రదమై ప్రవర్ధిల్లుగాక!

ప్రాయ స్స్వచరణౌ పుంసాం
శరణ్యత్వేన పాణినా ।
కృపయా దిశతే శ్రీమ
ద్వేంకటేశాయ మంగళమ్ ॥

నీవు భక్తజనకోటికి, సర్వప్రాణికోటికి, నీ పాదపద్మాలను సేవించి, తరించమని ఆదేశిస్తున్నావు. ప్రాణికోటిని నీ చరణాలను శరణు పొందమని నీవరదహస్తంతో – పరమదయామయమూర్తివై, కరుణాసాగరమూర్తివై నిర్దేశిస్తున్నావు. నీ దక్షిణహస్తం భక్తులకు నీ పాదాలను సేవించమనే ఆజ్ఞను సూచిస్తోంది. ఆ విధంగా సేవించిన వారికి దుర్ఘటం, దుస్సహమైన సంసారసాగరం మోకాలిలోతు మాత్రమే కాగలదని నీ వామహస్తం సౌంజ్ఞారూపంగా ప్రతిపాదించి, ప్రకటిస్తోంది. ఈ ఉద్దేశాలనే నీవరదముద్ర ప్రతిబింబింప చేస్తూంది. అట్టి ఓ శ్రీవరదవేంకటేశ్వరస్వామీ! నీ కల్యాణనామ సంకీర్తనం లోక కల్యాణదాయకమై, నీ దివ్యమంగళరూప సందర్శనం జగన్మంగళ ప్రదమై విరాజిల్లుగాక!

దయామృతతరంగిణ్యా
స్తరంగైరివ శీతలైః
అపాంగై స్సించతే విశ్వం
వేంకటేశాయ మంగళమ్ ॥

నీవు దయామయుడవు కరుణాశీతలలోచనుడవు. అమృతహృదయుడవు. నీ కన్నులు చల్లని వెన్నెల జల్లులు కురిపిస్తున్నాయి. నీ కరుణాశీతల దృక్కులు దయామృతనది అలలై, అవని అంతా వ్యాపిస్తున్నాయి. కరుణాసాగర తరంగాలై యీ సువిశాలమహీతలాన్ని ఆనందడోలలో ఉయ్యాల లూగిస్తున్నాయి. సయ్యాటలాడిస్తున్నాయి. పరవశంతో పరవళ్ళుత్రొక్కిస్తున్నాయి. అట్టి ఓ శ్రీ వేంక

టేశ్వరస్వామీ! నీకల్యాణ నామసంకీర్తనము లోకకల్యాణదాయకమై, నీదివ్య మంగళరూప సందర్శనము జగన్మంగళకరమై ఒప్పుగాక!

స్రగ్భూషాంబర హేతీనాం
సుషమాఽఽవహ మూర్తయే ।
సర్వార్తిశమనాయాస్తు
వేంకటేశాయ మంగళమ్॥

నీవు తులసిపేరులు, పూలమాలలు ధరించావు. స్వర్ణరత్నాభరణాలతో అలంకరించుకొన్నావు. వజ్ర, వైఢూర్య, గోమేధిక, పుష్యరాగ సమన్వితమైన భూషణాదులతో తులతూగుతున్నావు. శిరమున తళతళ మెరిసే రత్నకిరీటంతో భాసిస్తున్నావు. ధగధగ మెరిసే వజ్రహస్తంతో ప్రకాశిస్తున్నావు. విలువైన పీతాంబరాలనుధరించి మురిసిపోతున్నావు. చక్రకుంత కృపాణాదిషోడశాయుధాలు వహిస్తున్నావు. అలంకారాలకు, ఆయుధాలకు నీదివ్యమంగళవిగ్రహం శోభను, ప్రతిభను సమకూరుస్తోంది. నీవు సర్వమంగళమూర్తివి. నీవు దివ్యసుందరమూర్తివి. అట్టి ఓ శ్రీవేంకటేశ్వరస్వామీ! నీదివ్యమంగళరూపసందర్శనం జగన్మంగళప్రదమై, నీ కల్యాణనామ సంకీర్తనము లోకకల్యాణదాయకమై వెలుగొందు గాక!

శ్రీవైకుంఠ విరక్తాయ
స్వామిపుష్కరిణీతటే ।
రమయా రమమాణాయ
వేంకటేశాయ మంగళమ్ ॥

నీవు వైకుంఠనివాసాన్ని త్యజించావు. కిన్నెర, కింపురుష, యక్షగంధర్వులసేవలను పరిత్యజించావు. క్షీరసాగరశయనంపై విరక్తిభావం ప్రకటించావు. శేషతల్పాన శయనించి లక్ష్మీదేవిపాద సేవలు విర

క్తితో నిరాకరించి, శేషశైలముపైన స్వామి పుష్కరిణీతటాన రక్తితో, అనురక్తితో రమాసతిసేవలను స్వీకరిస్తూ, వినోదంతో, విలాసంతో ఆమెతో విహరిస్తూ క్రీడిస్తున్నావు. అట్టి ఓ శ్రీ వేంకటేశ్వర స్వామీ! నీకల్యాణనామసంకీర్తనము లోకకల్యాణదాయకమై, నీదివ్య మంగళరూపసందర్శనము జగన్మంగళప్రదమై ఒప్పుగాక!

శ్రీమత్సుందరజామాతృ
మునిమానస వాసినే ।
సర్వలోక నివాసాయ
శ్రీనివాసాయ మంగళమ్ ॥

నీవు శ్రీరమ్యజామాతృముని మానసవాసుడవు. మణవాళమహా మునిహృదయ నివాసుడవు. నీవు శ్రీనివాసుడవు. సకలలోకపాలకుడవు. విశ్వవ్యాప్తుడవు. జగన్మోహనుడవు. విశ్వమోహనుడవు. విశ్వమోహితుడవు భక్తజనహితుడవు. అట్టి ఓ శ్రీవేంకటేశ్వరస్వామీ! నీ కల్యాణనామసంకీర్తనము లోకకల్యాణదాయకమగుగాక! నీ దివ్య మంగళరూపసందర్శనము జగన్మంగళ ప్రదమగుగాక !

మంగళాశాసనపరై
ర్మదాచార్య పురోగమైః ।
సర్వైశ్చ పూర్వై రాచార్యైః
సత్కృతాయాస్తు మంగళమ్ ॥

నీ మంగళాశాసనం నాపూర్వాచార్యులు భక్తి ప్రపత్తి భావాలతో మధురంగా గానంచేసారు. ఆ విధంగా నా పూర్వాచార్యులు, పూర్వాచార్యులకు పూర్వాచార్యులైనవారి పూజలు, మంగళహారతులు, మంగళానుశాసనాలు అందుకొన్నావు. నీకు మంగళమగుగాక! మంగళప్రదుడవైన నీకు నీకు నిత్య మంగళం, శుభమంగళం, జయమంగళమగుగాక! శ్రీనివాసా! నీవు లోకానికి మంగళ పరంపరలు ప్రసాదించి కల్యాణప్రదం కావింపుము స్వామీ!

# శ్రీవేంకటేశ్వర కరావలంబ స్తోత్రమ్

శ్రీ శేషశైల సునికేతన దివ్యమూర్తే
నారాయణాచ్యుతహరే నళినాయతాక్ష
లీలాకటాక్ష పరిరక్షిత సర్వలోక
శ్రీ వేంకటేశ మమ దేహి కరావలంబమ్॥

శ్రీ శేషశైలశిఖరవాసా! శ్రీనివాసా! శ్రీ వేంకటేశా! ఓగరుడధ్వజా! ఓ దివ్యమంగళమూర్తీ! ఓమంగళమోహనమూర్తీ! ఓకల్యాణలావణ్యమూర్తీ! ఓ దివ్యసుందరమూర్తీ! పవిత్రమైన ఉదకంనుండి ఉద్భవించి నారాయణస్వరూపుడవయ్యావు. అందుచేత నీవు సత్వగుణ సంపన్నుడవు. శాంతస్వభావుడవు. నీవు నాశరహితుడవు. శాశ్వతుడవు. అందుచేత అచ్యుతవాచ్యుడవయ్యావు. నీవు సర్వాన్ని హరింపజేయ గలవు గాన నీకు హరి అనేపేరు సార్థకమైంది. ఓ నారాయణాచ్యుత హరి స్వరూపుడవైన శ్రీ వేంకటరమణా! నళినాయతాక్షుడవై లీలా కటాక్షాలను, కరుణాకటాక్షవీక్షణాలను సర్వలోకాలపై ప్రసరించి, సకల జీవులపై ప్రసాదించి లోకాల్ని, లోకేశుల్ని, లోకస్థుల్ని రక్షించి, పరిరక్షించే శ్రీ వేంకటేశా! నాకు చేయూత నియ్యవయ్యా. సహాయం అపేక్షించి చాచిన నా హస్తానికి నీ అభయహస్తంఅందించి నన్ను ఉద్ధరించవయ్యా! నన్ను చేకుకొని, ఆదుకొని ముందుకు నడిపించవయ్యా!

బ్రహ్మాదివందిత పదాంబుజ శంఖపాణే
శ్రీమత్సుదర్శన సుశోభిత దివ్యహస్త
కారుణ్యసాగర శరణ్య సుపుణ్యమూర్తే
శ్రీ వేంకటేశ మమ దేహి కరావలంబమ్॥

శ్రీ వేంకటేశా! సప్తఋషిపుంగవులు, అష్టదిక్పాలకులు, నవగ్రహాధిపతులు, ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు, బ్రహ్మాది

ముక్కోటి దేవతలు సతమస్తకులై నీపాదాలకు వందనాలు కావిస్తు న్నారు. నీ పాదాలను సేవిస్తున్నారు. పూజిస్తున్నారు. నీ పవిత్ర పాదా లకు పూజలు సలుపుతున్నారు. శంఖచక్రాలను నీ దివ్యహస్తాలతో ధరించి దుష్టశిక్షణ, శిష్టరక్షణ కావిస్తున్నావు. నీ పాణి యుగంలో సుదర్శనచక్రం, పాంచజన్యశంఖం దివ్యదీప్తులు సంతరించుకొని సుశో భితమై వర్థిల్లుతున్నాయి! సదా అర్థితుల ప్రార్థనలు మన్నించే కరుణా సాగరశరణ్యుడవై, దయాసముద్రస్వరూపుడవై, అనుకంపావారిధికి నిధివై - పుణ్యమూర్తివై, పావనమూర్తివై సాక్షాత్కరించే శ్రీవేంక టేశా! నాకు చేయూత నియ్యవయ్యా! సహాయం అపేక్షించి చాచిన నా హస్తానికి నీ అభయహస్తం అందించి నన్ను ఉద్ధరించవయ్యా! నన్ను చేదుకొని, ఆదుకొని ముందుకు నడిపించవయ్యా!

వేదాంతవేద్య భవసాగర కర్ణధార
శ్రీపద్మనాభ కమలార్చిత పాదపద్మ
లోకైకపావన పరాత్పర పాపహారిన్
శ్రీవేంకటేశ మమ దేహి కరావలంబమ్.

శ్రీవేంకటేశా! నీవు అతిలోకపావనుడవు. చతుర్దశభువనాలకు పవిత్రతను ప్రసాదించు వరదుడవు. పాపహరుడవు! మహాపుణ్యప్రదు డవు. పరాత్పరుడవు. సకల నిగమాంత వేద్యుడవు. వేదాంత గోచరు డవు. జనన మరణాల విషవలయంలోపడి నలిగిపోతూన్న జీవులనావను భవసాగరంలో నడిపించే నాయకుడవు. సురక్షితంగా గమ్యాన్ని చేర్చే సుశిక్షితుడైన కర్ణధారుడవు! శ్రీ పద్మనాభుడవు! రమారమణి నీ అరుణారుణమైన తిరుచరణాలను సదాసేవిస్తోంది! స్మరిస్తోంది! పూజి స్తోంది. ఆవిధంగా పూజలందుకొనే ఓ శ్రీచరణా! శ్రీసుగుణమణి రమణా! శ్రీవేంకటరమణా! నాకు చేయూత నియ్యవయ్యా! సహా

యం అపేక్షించి చాచిన నా హస్తానికి నీ అభయహస్తం అందించి నన్ను ఉద్ధరించవయ్యా! నన్ను చేదుకొని, ఆదుకొని ముందుకు నడిపించవయ్యా!

లక్ష్మీపతే నిగమలక్ష్య నిజస్వరూప
కామాదిదోష పరిహారిత బోధదాయిన్
దైత్యాలిమర్దన జనార్దన వాసుదేవ
శ్రీవేంకటేశ మమ దేహి కరావలంబమ్॥

ఓ శ్రీపతీ! శ్రీనివాసా! శ్రీసతివల్లభా! శ్రీనాథా! జగన్నాథా! వేదవేద్యా! వేదసన్నుతా! వేదగోచరమూర్తీ! ఓ అవతారమూర్తీ! స్వయంవ్యక్తానతానిస్వరూపా! సుస్థిరస్వరూపా! కామాదిసర్వదోషాలను పరిహరించే ఓ పావనరూపా! నిత్యం సుబోధలు - బోధసుధలు జనాళికి ప్రసాదించి ప్రసరించే సదాచార స్వరూపా! దుష్టరాక్షససంహారం సాధించిన వీరరసావతారస్వరూపా! అర్థిజనుల ప్రార్థనలు మన్నించే జనార్దనమూర్తీ! ఈ చతుర్దశ భువనాలలోని సకలచరాచర జీవరాశులలో నీవు ప్రాణమై, శక్తివై, ఆత్మవై, తేజస్సువై వెలిగి, యీ సువిశాల వసుంధరావలయాన్ని నీ అపూర్వమైన కృపతో, అనుపమానమైన కరుణతో కాపాడి రక్షిస్తూన్న, సంరక్షిస్తూన్న ఓ వాసుదేవమూర్తీ! జాలితో లాలించి, లాలిగా భక్తజనులను పాలించి పరిపాలించే ఓ కరుణాలవాలా! తిరుమలవాసా! శ్రీవేంకటేశా! చిద్విలాసా! సుహాసా! ఓ శ్రీనివాసా! నాకు చేయూత నియ్యవయ్యా! సహాయం అపేక్షించి చాచిన నా హస్తానికి నీ అభయహస్తం అందించి, నన్ను ఉద్ధరించవయ్యా! నన్ను చేదుకొని, ఆదుకొని ముందుకు నడిపించవయ్యా!

తాపత్రయం హరవిభో రభసం మురారే
సంరక్ష మాం కరుణయా సరసీరుహాక్ష

మచ్చిత్తమప్యనుదినం పరిరక్ష విష్ణో
శ్రీవేంకటేశ మమ దేహి కరావలంబమ్॥

శ్రీహరీ ! మురారీ ! ఘోరభీకరములైన తాపత్రయాలను పరిహరించే సుచరిత్రమూర్తీ ! ధన, దార, పుత్రేషణలుగా వ్యవహరింపబడే యీషణత్రియాన్ని దూరంకావించే సుగుణభూషణా ! రాజస, తామస సంబంధమైన ఉద్రేకాన్ని నివారించే మురారీ ! శ్రీపద్మనాభా ! పద్మలోచనుడా ! పద్మావతీ వల్లభుడా ! నీ కరుణా కటాక్ష వీక్షణాలను, నీ దయాదృష్టులను నాపై ప్రసరించి నన్ను రక్షింపుముస్వామీ ! నన్ను సదా రక్షింపుముప్రభో ! నీపై నిలచు మనసునియ్యవయ్యా ! నీపై నామనస్సు నిలపనియ్యవయ్యా ! సర్వకాల సర్వావస్థలలో సదా నీపాదాలను స్మరించి, సేవించి, తరించే చిత్తాన్ని - నిర్మలమైన చిత్తవృత్తిని ప్రసాదింపవయ్యా! నీవు సర్వజన సంరక్షకుడవు ! నీవు సకలలోక పరిరక్షకుడవు ! నీవు రక్షాదక్షుడవు ! నీ సంకల్పబలమే లోకవ్యాపారమైంది. జీవకోటికి ప్రాణాధారమైంది. ఏది సాధించాలన్నా నీకు అసాధ్యంకాదు. ప్రతిదీ నీకు సుసాధ్యమే ! సులభసాధ్యమే ! అందుచేత నాకు చెయ్యూతనివ్వడం నీకు బహు తేలిక. నీకది చాలా స్వల్పవిషయం. కానీ నాకది జీవికకుఫలాధికం సమకూర్చే అనల్ప విషయం. అది గుర్తించి, గమనించి, నాకు చేయూతనియ్యవయ్యా ! సహాయం అపేక్షించి చాచిన నా హస్తానికి నీ అభయహస్తం అందించి, నన్ను ఉద్ధరించవయ్యా ! నన్ను చేదుకొని, ఆదుకొని ముందుకు నడిపించవయ్యా !

శ్రీజాత రూప నవరత్న లసత్కిరీట
కస్తూరికాతిలక శోభి లలాట దేశ
రాకేందు బింబ వదనాంబుజ వారిజాక్ష
శ్రీవేంకటేశ మమ దేహి కరావలంబమ్

శ్రీనివాసా ! నిర్మలమైన రూపంగల నిరుపమ సౌందర్య స్వరూపా ! ధగధగమని మెరిసే కిరీటకాంతులతో శోభించే నవరత్న కిరీటాలంకారరూపా ! కమ్మని కస్తూరికా తిలకంతో సాక్షాత్కరించే ఓ మహా సౌందర్యమూర్తీ ! నిండుజాబిల్లి పండువెన్నెల వెలుగులు ప్రసరించే ఓ చంద్రవదనమూర్తీ ! చంద్రికలలోని వెలుతురు, చల్లదనం వ్యక్తమయ్యే ఓ పద్మవదనమూర్తీ ! పద్మములవంటి కన్నులు కల ఓ పరమపావనమూర్తీ ! నీ సౌందర్యంతో సమ్మోహితుడనయ్యాను. నీ నవరత్న కిరీటం, కస్తూరికానామం, చంద్రవదనం, పద్మనయనద్వయం నాలో దివ్యానుభూతి పరంపరలు కల్పిస్తున్నాయి ! కలిగిస్తున్నాయి. నిన్నే అర్థించమని ఆజ్ఞాపిస్తున్నాయి ! నన్ను చనువుతో కోరనియ్యవయ్యా ! నాకు చేయూతనియ్యవయ్యా ! సహాయం అపేక్షించి చాచిన నా హస్తానికి నీ అభయహస్తం అందించి, నన్ను ఉద్ధరించవయ్యా ! నన్ను చేదుకొని, ఆదుకొని ముందుకు నడిపించవయ్యా !

వందారులోక వరదానవచోవిలాస
రత్నాఢ్యహారపరిశోభిత కంబుకంఠ
కేయూరరత్నసువిభాసి దిగంతరాళ
శ్రీవేంకటేశ మమదేహి కరావలంబమ్.

ఓ తిరుమల తిరుపతి వేంకటరమణమూర్తీ! నవరత్నహారాలతో శోభించే దివ్యసుందరమూర్తీ! నవలావణ్యమూర్తీ! కల్యాణసుందరమూర్తీ! మంగళమోహనమూర్తీ! నీ భుజకీర్తుల కాంతులు దిక్కుల సరిహద్దులవరకూ వ్యాపిస్తున్నాయి. నీ కేయూరరత్న దీప్తులు దిగంత విశ్రాంత పరివ్యాప్త మవుతున్నాయి. నీ గళసీమ రత్నహారాలతోను దివ్యాభరణాలతోను, బంగారు కంఠితోను, స్వర్ణలక్ష్మీమాలతోను,

స్వర్ణఅష్టోత్తర శతనామమాలతో పరిపరివిధాలుగా పరిశోభిస్తోంది. ఒకపరి కొకపరి ఒయ్యారంగా కనపడుతోంది. ఈ విధంగా దివ్య కాంతులు, దేదీప్యమానమైన దీప్తులు ప్రసరిస్తూ - అర్థిజనుల ప్రార్థ నలు పరిపాలిస్తున్నావు. మొక్కినవారి చిక్కులు తీరుస్తున్నావు. ఆశ్రితుల పాలిటి ముంగొంగు బంగారానివై, కామధేనువై, కల్ప వృక్షమై, వరాలు ప్రసాదిస్తున్నావు. నేను నీ ఆశ్రితకోటిలోనివాణ్ని! నన్ను విస్మరించకు. నిన్ను అడిగేహక్కు నాకు ఉంది. నా హక్కును మన్నించవలసిన బాధ్యత నీపై ఉంది. అందుకే - అడుగుతున్నాను. నాకు చేయూత నివ్వవయ్యా! సహాయం అపేక్షించి చాచిన నా హస్తానికి నీ అభయహస్తం అందించి, నన్ను ఉద్ధరించవయ్యా! నన్ను చేనుకొని, ఆదుకొని ముందుకు నడిపించవయ్యా!

దివ్యాంగదాంచిత భుజద్వయ మంగళాత్మన్
కేయూరభూషణసుశోభిత దీర్ఘబాహో
నాగేంద్రకంకణ కరద్వయ కామదాయిన్
శ్రీవేంకటేశ మమ దేహి కరావలంబమ్॥

శ్రీనివాసా! నీ సర్వాంగాలూ బంగారుహారముల కాంతులతో విరాజిల్లుతున్నాయి. నీదీర్ఘబాహువులు స్వర్ణభుజకీర్తులతో శోభిస్తు న్నాయి. నాగేంద్రకంకణాలతో నీ కరద్వయం ఒప్పారుతోంది. నీ సౌందర్యాన్ని బంగారుహారాలు, భుజకీర్తులు, రత్నకంకణాలుయినుమ డింపజేస్తున్నాయి. నీ సౌందర్య శోభితమైన స్వరూపం, నీదివ్యమంగళ మైనరూపం నాకు నేత్రపర్వం కలిగించింది. నీవు సర్వాభీష్ట ప్రదుడవు. అర్థిజనుల వాంఛితాలు వ్యర్థం కావించక - సార్థకం కావించే కోమ లాంగుడవు. కమనీయరూపుడవు. పిలిస్తే పలికే దేవుడవు. అర్థిస్తే

వరాలు అనుగ్రహించే అమృత స్వరూపుడవు. అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడవు. అద్వితీయుడవు. అమోఘుడవు. సర్వజనులకు సులభసాధ్యుడవు. సుప్రసన్నుడవు. నిన్ను అర్థించడానికి అనుమతించవయ్యా! నాకు చేయూత నియ్యవయ్యా! సహాయం అపేక్షించి చాచిన నా హస్తానికి నీ అభయహస్తం అందించి, నన్ను ఉద్ధరించవయ్యా! నన్ను చేదుకొని, ఆదుకొని ముందుకు నడిపించవయ్యా!

స్వామిన్ మహాజననవారిధి మధ్యమగ్నం
మాముద్ధరాద్య కృపయా కరుణాపయోధే
లక్ష్మీంచ దేహి విపులామృణ వారణాయ
శ్రీవేంకటేశ మమ దేహి కరావలంబమ్.

ఓ శ్రీనివాసా! ఓ కరుణాపయోధీ! ఓ దయావారిధీ! ఓ కృపాసాగరమూర్తీ! జనన మరణ మహాసాగరమధ్యమంలోపడి సతమతమై నలిగిపోతున్నాను. నన్ను ఉద్ధరింపుము స్వామీ! పుట్టుక చావులనెడి మహాసముద్రంలో అంతూ దరి కానక పీడిత తాడిత యాతనామయ జీవితాలను గడుపుతున్నాను. దుర్భరమూ దుస్సహమూమైన జననమరణ దుఃఖాలను పొందుతున్నాను. దరిద్రనారాయణుడనై అలమటించి పోతున్నాను. శ్రీమన్నారాయణుడవైన నిన్ను శరణువేడుకుంటు న్నాను. ఆకటితో, అలసటతో, ఆవేదనతో, దీనుడనై, కడుహీనుడనై కూడు, గూడు, గుడ్డలు లేక ఆక్రోశించిపోతున్నాను. ఓ లక్ష్మీవల్లభా! లక్ష్మీకటాక్షం కలిగించవయ్యా! శ్రీనివాసా! నన్ను శ్రీమంతుణ్ణి, ధీమంతుణ్ణి, శుభశ్రీమంతుణ్ణి కావించవయ్యా! జనన మరణ, దారిద్ర్య దుఃఖాలను నివారించి, మోక్షలక్ష్మిని, శ్రీలక్ష్మిని నాకు ప్రసాదింపవయ్యా! అందుకై నాకు చేయూతనియ్యవయ్యా! సహాయం అపేక్షించి చాచిన నా హస్తానికి నీ అభయహస్తం అందించి,

నన్ను ఉద్ధరించవయ్యా! నన్ను చేదుకొని, ఆదుకొని ముందుకు నడిపించవయ్యా!

దివ్యాంగరాగపరిచర్చిత కోమలాంగ
పీతాంబరావృతతనో తరుణార్క భాస
సత్కాంచనాభపరిధాన సుపట్టబంధ
శ్రీ వేంకటేశ మమ దేహి కరావలంబమ్.

శ్రీనివాసమూర్తీ! శ్రీ వేంకటరమణమూర్తీ! దివ్యపరిమళాలు వెదజల్లే సుమనోహరమూర్తీ! సౌరభాలు వెదజల్లే సరళ సుందర మూర్తీ! కమ్మని సువాసనలు నీ సర్వావయవములకు అలదబడిన గంధ పూతల నుండి ప్రసరిస్తున్నాయి. ఓ పీతాంబరధారీ! సుమకోమలశరీర ధారీ! నీవు శిరోవేష్టంగా ధరించిన సువర్ణవస్త్రం బాలభానుని రోచులు ప్రసరిస్తోంది. నీవు ప్రసరించే దివ్యపరిమళాలతో నా గుండె నిండి పోయింది. నీ పీతాంబరపు కాంతులు నా కన్నులలో నిలచిపోయాయి. నీ శిరమున విలాసంగా ధరించిన సువర్ణపరిధాన కాంతులు ఉదయ భాస్కరుని కిరణాలై నాలోని అజ్ఞానాంధకారాన్ని తొలగించి, విజ్ఞాన వికాస వివేకాల్ని కలిగిస్తున్నాయి. అట్టి అపూర్వమైనలాభా లను - ప్రయోజనాలను నాకు సదా ప్రసాదింపమని ప్రార్థిస్తున్నాను. అనుగ్రహించవయ్యా! అందుకై నాకు చేయూత నియ్యవయ్యా! సహాయం అపేక్షించి చాచిన నా హస్తానికి నీ అభయహస్తం అందించి, నన్ను ఉద్ధరించవయ్యా! నన్ను చేదుకొని, ఆదుకొని ముందుకు నడిపించవయ్యా!

రత్నాఢ్యదామ సునిబద్ధకటిప్రదేశ
మాణిక్యదర్పణ సుసన్నిభజాను దేశ
జంఘాద్వయేన పరిమోహితసర్వలోక
శ్రీ వేంకటేశ మమ దేహి కరావలంబమ్.

శ్రీవేంకటేశ్వరా! శ్రీ తిరుమలేశ్వరా! తాపసమందారా! పాప హరా! శిరమున నవరత్న కిరీటం, వక్షస్థలాన వైజయంతి, ఉరమున మాణిక్యం, నడుమున బంగారు ఒడ్డాణం, జంఘికలపై పీతాంబరం, జానువులపై కెంపులు నూతన కాంతులను - వింతసోయగాలను సంతరిస్తున్నాయి. సర్వలోకాలలో ఏవంవిధమైన నీ సౌందర్యగరిమలు వ్యాపిస్తున్నాయి. సర్వలోకాలను సమ్మోహపరుస్తున్నాయి. నీ ప్రతి అంగమూ సౌందర్యవంతమైనదే! నీవు ధరించిన సర్వాభరణాలు దివ్యమైనవే! అపూర్వమైనవే! మనోహరమైనవే! విశేష ప్రకాశవంతమైనవే! అమితాకర్షణీయమైనవే! నీ అవయవ సౌందర్యం - నీ ఆభరణ సౌందర్యాన్ని ద్విగుణీకృతం కావిస్తోంది. వీనికి మించిన నీ వజ్రకవచం బహుధా దర్శనీయమైంది. ఇట్టి విశ్వరూప దర్శనభాగ్యం సర్వలోకాలకు ప్రసాదించి సమ్మోహనపరచే మోహన వంశీగానలోలా! ఓ నవరత్న కిరీటాలంకారా! కస్తూరితిలకా! స్వర్ణకర్ణాభరణభూషితా! ఓ శంఖచక్రధారీ! వైజయంతీ మాలాలంకారా! నాగాభరణభూషితా! స్వర్ణకటిధారీ! స్వర్ణయజ్ఞోపవీతధారీ! దేవతాసమర్పిత కరవాలాలంకారా! చందనచర్చిత శ్రీ చరణా! నిన్నే శరణు వేడుకుంటున్నానయ్యా! నాకు చేయూత నియ్యవయ్యా! సహాయం అపేక్షించి చాచిన నా హస్తానికి నీ అభయహస్తం అందించి, నన్ను ఉద్ధరించవయ్యా! నన్ను చేదుకొని, ఆదుకొని ముందుకు నడిపించవయ్యా!

లోకైకపావన లసత్పరిశోభితాంఘ్రే
త్వత్పాదదర్శన దినేశ మహాప్రసాదాత్
హార్దంతమశ్చ సకలం లయమాపభూమన్
శ్రీవేంకటేశ మమ దేహి కరావలంబమ్.

శ్రీరమణా! శ్రీచరణా! నీ దివ్యచరణాలు లోకాలను పునీతం కావిస్తున్నాయి. నీ తిరుచరణాలు సర్వులకూ ప్రాప్యాలు. నీ పాదా

లతో పోల్పదగినవి నీ పాదాలే! నీ పాదాలను ఋగ్వేదం పరిపరివిధాలుగా నుతించింది. స్తుతించింది. ప్రస్తుతించింది. "శంనోవిష్ణురురుక్రమః" అనే ఋక్కు గొప్ప అడుగులువేయు దేవుడూ, ఉరుక్రముడగు విష్ణుదేవుడు మమ్ము కటాక్షించి రక్షించుగాక అంటూ విష్ణుపాదాన్ని ప్రశంసించింది. "విష్ణోఃపదేపరమ మధ్వఉత్సః" అంటూ విష్ణుపాదాన్ని ఋగ్వేదం స్మరించింది. భక్తులకు విష్ణుపాదం నుండి అక్షయమధుప్రదాయకమైన తేనె ఊట లభించుతోంది.

"ఇదం విష్ణుర్విచక్రమే। త్రేధానిదధేపదం సమూహ్మమస్య పాంగ్ సురే,
త్రీణిపదావిచక్రమే, విష్ణోర్గోపా అదాభ్యాః అతోధర్మాణి ధారయన్"
—ఋగ్వేదం

విష్ణుభగవానుడే విశ్వమున అడుగులు వేశాడు. అతడు మూడడుగులే వైచినా అతని పాదధూళి విశ్వపరివ్యాప్తమైంది. విశ్వగోపుడు, విశ్వరక్షకుడు విష్ణుభగవానుడే! అతణ్ని మోసగించగలవాడేడి! అతడు మూడడుగులతో విశ్వాన్ని ఆక్రమించి ధర్మాన్ని నాలుగు పాదాలా నడిపింపజేసి ప్రతిష్ఠించాడు. అట్టి అక్షయ మధుస్థానమైన, ధర్మప్రతిష్ఠాపకమైన విష్ణుపాదం నుండి పరమపావనమైన గంగ ఉద్భవించింది. బ్రహ్మసేవ లందుకొన్నది యీ పాదమే! బ్రహ్మమై వెలసిందికూడా యీ పాదమే! శ్రీపతిసేవలందుకొన్నది యీ పాదమే! బలిని పాతాళానికి పంపినది యీ పాదమే! బ్రహ్మ, శివ, ఇంద్రాది ముక్కోటి దేవతల, ద్వాదశాదిత్యుల, ఏకాదశరుద్రుల, నవగ్రహాధిపతుల, అష్టదిక్పాలకుల కిరీటకాంతుల హారతులు స్వీకరించింది యీ పాదమే! తిరువేంకటాచలమే స్థిరమైన పరమపదమని చాటి ప్రకటించి అచ్చట వెలసింది యీ పాదమే! అట్టి నీ పాదాన్ని ఆశ్రయించాను.

సేవించాను. స్మరించాను. పూజించాను. తులసిదళాలతో, దివ్య శ్రీచందనంతో అర్చించాను. ఆ శ్రీపాదం ఆదిత్యావతారమై నాలోని అజ్ఞానాంధకారాన్ని తొలగించింది. నా ఆత్మలో జ్ఞాన జ్యోతిని వెలిగించి వికాస కాంతిని నింపింది. శ్రీచరణా ! నా యీ స్థితిని రక్షింపమని నిన్ను వేడుకొంటున్నానయ్యా ! ఆలసింపక వేగ రావయ్యా ! ఇంక ఆలోచనకు సమయం కాదయ్యా ! త్వరపడ వయ్యా ! నాకు చేయూత నియ్యవయ్యా ! సహాయం అపేక్షించి చాచిన నా హస్తానికి నీ అభయహస్తం అందించి, నన్ను ఉద్ధరించ వయ్యా ! నన్ను చేదుకొని, ఆదుకొని ముందుకు నడిపించవయ్యా !

కామాదివైరి నివహో విలయం ప్రయాతో
దారిద్ర్య మప్యపగతం సకలం దయాళో
దీనం చ మాం సమవలోక్య దయార్ద్ర దృష్ట్యా
శ్రీ వేంకటేశ మమ దేహి కరావలంబమ్.

జనన దుఃఖాన్ని, జన్మ దుఃఖాన్ని, జరా దుఃఖాన్ని భరించ లేను. రాజసతామసతత్త్వాలను అధిగమించలేకపోతున్నాను. అహంకార మమకార, అధికార గర్వాలకు లోనౌతున్నాను. షడ్వికారాలు పొందుతూ సహించలేకపోతున్నాను. పంచభూతాలను వశం కావించు కోలేకపోతున్నాను. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరా లను జయించలేకపోతున్నాను. వానికి బానిసనై సంచరిస్తున్నాను. లౌకిక పారలౌకిక, భౌతిక, ఆధ్యాత్మిక సుఖశాంతులకు దూరమ య్యాను. ఈ విధంగా సతమతమైపోతున్నాను. స్పర్ధలతో, వ్యర్థ కలహాలతో, ఆర్థిక యిబ్బందులతో, నీచులమధ్య తిరుగుతూ అర్థంలేని జీవితాన్ని, సార్థకత సాధించుకోలేని జీవనాన్ని గడుపుతున్నాను. దీనుడనై నీ దయకై ఎదురు చూస్తున్నాను. నీ కరుణాకటాక్షాలను

పొందడానికై వేచియున్నాను. అనుగ్రహంతో, అనుకంపతో, నన్ను ఉద్ధరించవయ్యా ! నా జీవితాన్ని చరితార్థం కావించవయ్యా ! నాకు యిహపర సౌఖ్యాలను ప్రసాదించవయ్యా ! నాకు శత్రువులైన అరిషడ్వర్గాలను జయింపవయ్యా ! నాలోని అహంకారమమకారాలను తొలగింపవయ్యా ! నన్ను సత్వగుణ సంపన్నునిగా రూపొందింపవయ్యా ! నాకు త్రిగుణాలను, త్రికాలాలను, పంచకోశాలను, షడ్వికారాలను అతీతునిగా వ్యవహరించే శక్తి నియ్యవయ్యా ! నా శిరస్సు ఎప్పుడూ నీ పాదాలవ్రాలే భాగ్యం ప్రసాదింపవయ్యా ! నీ పాదాలను నా శిరస్సు ధరించే అదృష్టాన్ని అనుగ్రహింపవయ్యా ! అన్నిరూపాలలో నీ రూపం దర్శించే అవకాశ మియ్యవయ్యా ! నీ రూపరహిత స్థితిని గ్రహింపనీయవయ్యా ! నీవు సర్వనామధారుడవు, నామరహితుడవు, సాకారరహితుడవు నిత్యుడవు, శాశ్వతుడవు, సర్వాంతర్యామి స్వరూపుడవు, అచ్యుతుడవు, అనంతుడవు, అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుండవు అనే పరమసత్యాన్ని నా మనస్సు స్థిరంగా సంకల్పించుకొని, ఆ విధంగా ఆచరించే అవకాశాన్ని కల్గించవయ్యా ! నన్ను రక్షించడానికి సత్వరంగా రమ్మని నిన్ను త్వరపెట్టి ఆజ్ఞాపించే అధికారం నాకుందయ్యా ! భక్తవరదుడు, భక్త సులభుడు, భక్త దాసుడు అనే బిరుదాలను నన్ను రక్షించడంద్వారా మరొకసారి, వేరొక పర్యాయం యదార్థం కావించుకోవయ్యా ! లోకంలో భక్తుడు దైవాన్ని నివా ఎవరినీ అర్థించడనీ, శాసించడనీ, అనే విషయం నీవు గ్రహించలేనిది కాదయ్యా ! నీకు అది స్వానుభవంలోని సంగతే నయ్యా ! తిరుమలగిరిపై దొరవలె తిరిగే శ్రీవేంకటరమణా ! త్వరగా తరల్లి రావయ్యా ! తరుణం మించిపోకుండా త్వరపడవయ్యా ! నాకు చేయూత నియ్యవయ్యా ! సహాయం అపేక్షించి చాచిన నా భుజ

కంపితమైన హస్తానికి నీ అభయహస్తం అందించి నన్ను ఉద్ధరించవయ్యా ! నన్ను చేదుకొని ఆదుకొని ముందుకు నడిపించవయ్యా !

ఫలశ్రుతి : శ్రీవేంకటేశ పద పంకజ షట్పదేన
శ్రీమన్నృసింహ యతినా రచితం జగత్యాం
ఏతత్పఠంతి మనుజాః పురుషోత్తమస్య
తే ప్రాప్నువంతి పరమాం పదవీం మురారేః.

ఫలశ్రుతి :

శ్రీవేంకటేశ్వరస్వామివారి పాదపద్మాలలో విహరించే దివ్య భృంగమైన శ్రీనరసింహయతి రచించిన యీ కరావలంబస్తోత్రాన్ని పఠించిన పురుషుడు పురుషోత్తముడైన శ్రీనివాసుని దివ్యమందిరమైన పరమపదాన్ని పొందుతాడు. శాశ్వత వైకుంఠవాస భాగ్యం సంపాదిస్తాడు.

మూలం : శ్రీనరసింహయతి
స్వేచ్ఛానువాదం : శ్రీ వెలమకన్ని శ్రీరామమూర్తి



# పూజా వైభవము

శ్రీభగవానుడు మానవులు తనను పూజించాలని వాంఛిస్తాడా? మానవులపూజలు ఆశించేవాడు దేవుడా? పూజలుకోరని దేవునకు పూజలెందుకు! ఈ ప్రశ్నలకు సమాధానాలు శ్రీమద్భాగవతంలో ఉన్నాయి. "జగదీశ్వరుడైన ఈశ్వరుడు సర్వపరిపూర్ణుడు. సర్వజ్ఞుడు. జనులపూజలను స్వార్థపరుడై అపేక్షించడు. తనను పూజించేవారికి మేలుచేయడానికై, దయతో వారిపూజలు స్వీకరిస్తాడు. ఏ లాభం కోసం మానవుడు పూజిస్తాడో, భగవంతుడు ఆ లాభం మానవునకు కలిగిస్తాడు. పూజలందుకొన్నవానికి ప్రయోజనంరాదు. పూజచేసినవానికే ప్రయోజనం చెందుతుంది. అద్దంలోని తన ముఖప్రతిబింబానికి బింబమైన తన ముఖమందు చేసిన అలంకారం చెందుతుంది. భగవంతుడు బింబం. మానవుడు ప్రతిబింబం. పూజారూపంలో బింబరూపమైన భగవంతునకు చేసిన ఉపచారాలు ప్రతిబింబరూపమైన మానవునకు చెందుతాయి. మానవులుచేసే దైవారాధన మానవుల ప్రయోజనం కోసమే– ఈశ్వరుని లాభంకోసం కాదు." అని శ్రీమద్భాగవతం ఆ ప్రశ్నలకు సమాధానాలు చెప్పింది. 'నేను పరమేశ్వర సంబంధమైనవాడను, పరమేశ్వరుడు నా సంబంధమైనవాడు, నేను పరమేశ్వరుడనే' అనే భావంతో పూజాసమయంలో భగవంతుని శరణువేడాలి అని మధుసూదన సరస్వతి 'భక్తిరసాయనం'లో ప్రకటించాడు. ఆనుకూల్యం, ప్రాతికూల్యరాహిత్యం, రక్షించితీరుననే విశ్వాసం, ఆత్మార్పణం, దీనత్వం అన్నవి శరణాగతిలక్షణాలు. ఈపద్ధతిలో పూజాసమయంలో పరమేశ్వరుని శరణుపొందాలి.

సముద్రానికి తరంగానికి భేదంలేదు. తరగం సముద్రసంబధమైనది. సముద్రుడు తరంగసంబంధుడు కాడు. పరమేశ్వరుడు సాగరుడు. మానవుడు పడిలేచే కెరటంవంటివాడు, సముద్రానికి కెరటానికి భేదం

లేనట్లే భగవంతునకు భక్తునకు భేదం లేదు. భక్తుడు పరమేశ్వరసంబంధుడు. భగవానుడు భక్తసంబంధసంజనితుడు కాడు. ఈ భావనబల పరచుకొని భక్తుడు భగవంతుని పూజించాలి. "శ్రీకృష్ణా! బలంతో నాచేతిపట్టు వదలించుకొని వెళ్ళిపోయావు. నాహృదయంనుండి ఎంత బలమున్నా ఎలా వెళ్ళిపోగలవు!" గోపిక శ్రీకృష్ణుని ప్రశ్నించింది. ఆ గోపికవలె ప్రశ్నించే స్థితిలో శ్రీనివాసుని పూజించాలి. "ఈ సకల చరాచరజగత్తు, దానిలోను తాను పరమేశ్వరుని ప్రతిరూపమనే నిశ్చల భక్తిభావంతో, అచంచలవిశ్వాసంతో ఏ భక్తుడు సంభావిస్తూ దైవాన్ని ఆరాధిస్తాడో అట్టివానిని సమీపింపవద్దు" అంటూ యమ ధర్మరాజు తనదూతలను సదా ఆజ్ఞాపిస్తోంటాడట. ఈ బాహ్యప్రకృతి పరమేశ్వరుని ప్రతిరూపమనే దృఢవిశ్వాసంతో మానవుడు పరమేశ్వరుని అర్చించాలి. ఆస్థితిలో బాలాజీని పూజించాలి.

శ్రీనివాసుని పూజించి అనుగ్రహపాత్రులై అభీష్టాలను పొందాలని అందరూ అనుకుంటారు. శ్రీనివాసుని సులభంగా ప్రసన్నుని చేసికోవడానికి మార్గాలు తెలుపమని మహర్షులు సూతుని అడిగారు. శ్రీవేంకటేశ్వరుని, సత్వరంగా ప్రసన్నుని చేసికోవడానికి శ్రీవేంకటేశ్వరాష్టోత్తర శతనామస్తోత్రం చేయడం, ఆనామాలతో పూజించడం సులభమార్గాలని వారికి ఉపదేశించాడు. "ఇది పరమేశ్వరునకు ప్రీతికరమైనది. ఉపదేశపరంపరలో పరమగోప్యంగా రక్షింపబడింది. దీన్ని ఆదిశేషుడు కపిలమహామునికి ఉపదేశించాడు. బ్రహ్మసృష్టి కార్యారంభసమయంలో సప్తఋషిపుంగవులు శ్రీవేంకటేశ్వరుని అష్టోత్తర శతనామాలను పఠిస్తూండగా ఆకాశసింధు కమలాలతో శ్రీనివాసునకు పూజ కావించాడు. అభీష్టాలను పొందాడు. ఇట్టి శ్రీవేంకటేశ్వర అష్టోత్తరశతనామ పూజవలన జనులు, భక్తజనులు లౌకిక పారలౌకిక ప్రయోజనాలు పొందుతారు. శ్రీవేంకటేశ్వరునిపై గల నూట ఎనిమిది

నామాలకు '(శ్రీ)వేంకటేశాయనమః' అనే నామాన్ని కలిపి చతుర్థ్యంతంగా పఠిస్తూ తులసిదళాలతో పూజించడం ఫలప్రదం. ఈ అష్టోత్తర శతనామావళిస్తోత్రం మహామంత్రం. దీని ఋషి బ్రహ్మ. మంత్రం అనుష్టుప్‌ఛందస్సులో ఉంది. మంత్రప్రతిపాద్యుడు శ్రీనివాసుడు. నీలగోక్షీరోద్భవుడని అర్థమిచ్చేపదం మంత్రబీజం. మంత్రానికి శక్తిని శ్రీనివాసుడే ప్రసాదిస్తున్నాడు. మంత్రసిద్ధులు మంత్రాంగాలు తెలిసికొని, వినియోగం చేసికొని ఇష్టార్థాలు పొందుతారు" అని సూతుడు శ్రీవేంకటేశ్వర అష్టోత్తర శతనామప్రశస్తిని వివరించాడు.

సుప్రభాత, తోమాల, కొలువుసేవల పిమ్మట బాలాజీకి బ్రహ్మాండ పురాణాంతర్గతమైన శ్రీవేంకటేశ్వర సహస్రనామాలతో సహస్రనామపూజ జరుగుతుంది. లక్ష్మినామాలతో శ్రీభూదేవులకు పూజలు జరుగుతాయి. దీనినే ప్రథమఅర్చన అంటారు. మధ్యాహ్న సాయం సమయాలలో శ్రీనివాసునకు వరాహపురాణాంతర్గతమైన శ్రీవేంకటేశ్వరాష్టోత్తరశతనామాలతో పూజలు జరుగుతాయి. నిత్యం శ్రీనివాసునకు సహస్రనామ, అష్టోత్తరశతనామపూజలు శ్రీవేంకటేశ్వర భక్తులు చేయడం శుభప్రదం. ఫలప్రదం. మోక్షప్రదం. శ్రీవేంకటేశ్వర సహస్రనామపూజ చేయడానికి కాలం, శక్తి, అవకాశంలేని వారు కనీసం శ్రీవేంకటేశ్వరాష్టోత్తర శతనామపూజైనా చేయాలి. దాని వలన ఇహపరసుఖాలు లభిస్తాయి.

శ్రీకృష్ణజన్మ ఖండంలో ఉద్ధవునకు శ్రీకృష్ణుడు భక్తుని లక్షణాలు వివరిస్తూ "నాప్రతిమలలో నన్నుచూచి ఆరాధించాలి. నా భక్తులలో నన్ను చూడాలి. నాకథలు వినాలి. నన్నే ధ్యానించాలి. పర్వదినాలలో దేవాలయాలలో గీత, నృత్యవాద్యాలతో ఉత్సవాలు చేయాలి. తీర్థయాత్రలు, క్షేత్రదర్శనాలు కావించాలి. బలివిధానం నడుపుతూ వైదిక, తాంత్రికదీక్షలు వహించి హరివాసరాదివ్రతాలు

నిర్వహించాలి. దైవతాప్రతిమలు స్థాపించి పూజించాలి. దైవప్రీతికై దేవతార్పణానికై ఉద్యానవనాలు, ఫలవృక్ష శ్రేణులు కల్పించాలి. దేవమందిరనిర్మాణాదులకై ప్రయత్నించాలి. కృషి చేయాలి. ఇతరుల్ని వానికై ప్రోత్సహించాలి. దేవాలయప్రాంగణాలముంగిల రంగవల్లులు తీర్చిదిద్దాలి. భక్తుడు అహంకార మమకారాలను విడనాడాలి. ఆత్మార్పణ భావనతో దైవానికి సర్వం సమర్పించాలి. నివేదించాలి. దైవానికి అర్పించినదానిని తాను వినియోగించుకోనరాదు. తనకు పరమప్రీతిపాత్రమైనదానిని విధిగా పరమేశ్వరునకు సమర్పించాలి.'' ఈవిధంగా చెప్పాడు. ఏ భక్తుడైనా ఈ లక్షణాలను అలవరచుకొని భగవంతుని సేవించాలి, ఆర్తుడైనా, జిజ్ఞాసువైనా, అర్థార్థియైనా, జ్ఞానియైనా ఏవంవిధమైన భక్తుని లక్షణాలను అనుసరించి తీరాలి. పరమ శ్రీనివాసదాసులు, శ్రీవేంకటేశ్వరుని భక్తులు ఈ గుణాలకు నిజమైన వారసులై స్వామిభక్తితో అష్టోత్తర శతనామపూజ చేసి పత్ర, పుష్ప, ఫల, తోయాదాలు సమర్పిస్తే సుప్రసన్నుడై స్వీకరించి కరుణాంతరంగుడై కనికరించి అనుగ్రహిస్తాడు.

''శ్రవణం, కీర్తనం, విష్ణోస్మరణం, పాదసేవనమ్
అర్చనం, వదనం, దాస్యం, సఖ్యమాత్మనివేదనమ్''

''తనుహృద్భాషల సఖ్యమున్, శ్రవణమున్, దాసత్వమున్ వందనా
ర్చనముల్, సేవయు నాత్మలో నెఱుకయున్ సంకీర్తనల్ చింతనం
బను నీతొమ్మిదిభక్తిమార్గములు సర్వాత్మున్ హరిన్ నమ్మిస
జ్జనుడై వుండుట భద్రమంచు తలతున్ సత్యంబు దైత్యోత్తమా''

శ్రీమద్భాగవతం ఈవిధమైన నవవిధభక్తి మార్గాలను తెలిపింది. వానిలో అర్చనం ఒకటి. పద్మపురాణాంతర్గతమైన పాతాళఖండంలోని అంబరీష నారదసంవాదంలో అర్చన కుపయోగింపవలసిన పుష్పాల వివరాలు తెలుస్తున్నాయి. అహింసఅనే ప్రథమ పుష్పంతో,

ఇంద్రియ నిగ్రహం అనే ద్వితీయ పుష్పంతో, భూతదయ అనే తృతీయ పుష్పంతో, క్షాంతి అనే చతుర్థ పుష్పంతో, శమం అనే పంచమ పుష్పంతోను, దమం అనే షష్ఠ పుష్పంతోను, ధ్యానం అనే సప్తమ పుష్పంతోను, సత్యం అనే అష్టమ పుష్పంతోను, పురుషుడు పురుషోత్తముని పూజించాలి. మానవులలోని ఈ ఆంతరంగిక గుణ పుష్పాల పూజ శ్రీనివాసునకు ప్రీతికరమైనది. ఆ విధంగా చేయలేని వారు ప్రకృతిలోని బాహ్యపుష్పాలతో పూజించినా భక్తప్రియుడైన శ్రీలక్ష్మీనాథుడు సంతుష్టి చెందుతాడు. భక్తులను రక్షిస్తాడు.

సలిల రూపమైన వారుణపుష్పంతో, ఘృతపయోదధిరూపమైన సౌమ్యపుష్పంతోను, అన్నరూపమైన ప్రాజాపత్య పుష్పంతోను, ధూపదీప రూపమైన ఆగ్నేయ పుష్పంతోను, ఫలపుష్పాది రూపమైన వానస్పత్య పుష్పంతోను, కుశమూలాది రూపమైన పార్థివ పుష్పంతోను, చందన రూపమైన వాయువ్య పుష్పంతోను, శ్రద్ధా రూపమైన విష్ణు పుష్పంతోను, వాద్యరూపమైన విష్ణుపద పుష్పంతోను శ్రీనివాస ప్రభుని పూజిస్తే సుప్రసన్నుడై, సుప్రీతుడై భక్తులను అలరిస్తాడు. శ్రీమద్భాగవతంలో కపిలుడు దేవహూతికి భక్తి యోగాన్ని తెలుపుతూ తామస, రాజస, సాత్త్విక భక్తిపద్ధతులను గూర్చి ప్రకటించాడు. తామస, రాజస భక్తిపద్ధతులను పరిహరించాలన్నాడు. సాత్త్వికభక్తివిధానం మహోన్నతమైనదని ధృవీకరించాడు.

"అనుపమ పాపకర్మ పరిహారముకై భజనీయుడైనశ్రీ
భన చరితుం డితండనుచు భావమునం దలపోసి భక్తిచే
ననితర యోగ్యతన్ భగవదర్పణబుద్ధి నొనర్చి కర్మముల్
జనహితకారియై నెగడ సాత్త్విక యోగ మనంగఁ జొప్పడున్."

శ్రీమద్భాగవతంలో కపిలుడు తెలిపిన ఈ సాత్త్వికయోగాన్ని అనుసరిస్తూ లౌకిక, వైదిక, ఆధ్యాత్మిక, మానసిక, వాచిక, కాయిక

భక్తిక్రియా కలాపాలు కావిస్తూ శ్రీనివాసుని అర్చించాలి. శ్రీనివాసునకు సహస్రనామపూజ కాని, అష్టోత్తరపూజ కాని ఈ విధమైన భక్తిపద్ధతులు గ్రహించి అనుసరించాలి.

"శ్రీనివాసుని నూటఎనిమిది నామాలకు అర్థం గ్రహిస్తూ చతుర్థ్యంతంగా శ్రీవేంకటేశాయ నమః అనే అష్టాక్షరీ మంత్రాన్ని కలిపి భక్తిశ్రద్ధలతో ఏభక్తుడు నిత్యం పఠిస్తాడో అట్టివాడు శ్రీనివాసుని దయకు పాత్రుడవును. శ్రీవేంకటేశ్వర అష్టాక్షరీమంత్ర జపసిద్ధిని పొందుతాడు. ఈ గొంం నామాలతో పూజించే మానవుడు మోక్షాన్ని అందుకుంటాడు. ఇట్టి అపూర్వమైన ఫలితాలను, ఈ వేంకటేశ్వరాష్టోత్తర శతనామావళితో పూజించడంవలనగాని, స్తోత్రం కావించడం ద్వారా గాని సిద్ధింపజేసికొనవచ్చును" అని వరాహపురాణంచెప్పింది. శ్రీబాలాజీ పూజాలీల శ్రీవేంకటేశ్వర అష్టోత్తరశతనామాలకు అర్థం, అంతరార్థం ప్రతిపాదించే సులభమైన, సరళమైన విపుల వ్యాఖ్యానం ఈ శ్రీవేంకటేశ్వర దివ్యనామావళి. భక్తులపాలిట తారాతోరణం. తన దివ్యమైన లీలలతో భక్తులకు దివ్యానుభూతి పరంపరలు ప్రసాదించే బాలాజీని ఈ శ్రీవేంకటేశ్వర అష్టోత్తర శతనామపూజతో అలరింపచేద్దాము. దీన్నే అలంకారంగా అర్పిద్దాము. బాలాజీని అర్చించి, ఆరాధించి, సేవించి, పూజించి ధన్యతను పొందుదాము.

## 1. ఓం శ్రీమతే వేంకటేశాయ శ్రీవేంకటేశాయ నమః

"వేం" కార మమృతబీజం. "కట" అనే శబ్దం ఐశ్వర్యబీజం. "వేం" అనగా పాపసముదాయమని భావం. "కట" శబ్దానికి దహించుట అని అర్థం. జీవుని పాపసముదాయాన్ని దహించి అమృతైశ్వర్య సిద్ధిని ప్రసాదించే దివ్యశైలం వేంకటాచలం. అందుచేత "సర్వపాపాని వేం ప్రాహుః కట స్తద్దాహ ఉచ్యతే తస్మాద్వేంకట శైలోయం

లోకే విఖ్యాత కీర్తిమాన్" అనెడి ప్రసిద్ధి యేర్పడింది. అట్టి సుప్రసిద్ధుడు, సుప్రసన్నుడైన శ్రీవేంకటాచలాధీశుని నామం భక్తి పురస్సరంగా, ధ్యాననిష్ఠా గరిష్ఠంగా స్మరించి, పఠించి, స్వామి పాదాల ముందు దాసానుదాసుణ్ణై నిత్యకింకరుణ్ణై పూలదోసిలతో నిలిచి నమస్కరిస్తున్నాను.

2. ఓం శేషాద్రి నిలయాయ శ్రీవేంకటేశాయ నమః

అది ద్వాపరయుగ సమయం. వైకుంఠంలో శ్రీమన్నారాయణుడు లక్ష్మీనారాయణుడై విహరిస్తున్నాడు. శేషుడు వైకుంఠ ద్వారాన్ని పాలిస్తున్నాడు. వాయుదేవుడు కార్యార్థియై శ్రీహరి కోసం వచ్చి వైకుంఠంలోకి ప్రవేశింప ప్రయత్నించాడు. ఆదిశేషుడు వాయుదేవుని వారించాడు. వారిమధ్య వాదప్రతివాదాలు చెలరేగాయి. విష్ణువు వాయువుని వారించి, వారిరువురికి బలపరాక్రమ ప్రదర్శనావకాశం కల్పించాడు. మేరుగిరి తనయుడైన ఆనందగిరిని శేషుని తన బలంతో గట్టిగా చుట్టుకొని పట్టుకోమన్నాడు. వాయుదేవుణ్ణి శేష సహితమైన ఆనందాద్రిని చలింపజేయమని ఆదేశించాడు. ఆనందగిరి కదలకపోతే శేషుడు వాయుదేవునిపై విజయం సాధించినట్లు ఆనంద గిరి చలించితే వాయుదేవుడు శేషుని ఓడించినట్లు, అంటూ శ్రీమహావిష్ణువు నియమాలు ప్రకటించాడు. వారు అంగీకరించి బలప్రదర్శన ప్రారంభించారు. ఆనందాద్రి కదలడంలేదు. తీవ్రవాయుప్రసారం ఆగడంలేదు. ఫలితంగా సర్వలోకాలు అల్లకల్లోలమైపోతున్నాయి. సర్వదేవతా సముదాయం వాయువుని శాంతించమని ప్రార్థించింది. కాని ఫలించలేదు. శేషుని సర్వదేవతాసముదాయం అర్థించింది. శేషుడు వారి ప్రార్థనను భగవానుని వాంఛితంగాను, శాసనంగాను, స్వీకరించి శిరసావహించాడు. వాయుదేవుడు విజయం సాధించాడు.

ఆ నందగిరి కదలింది. మహావేగంగా చలించి ప్రయాణం సాగించింది. శేషసహితమైన ఆనందగిరి ఆంధ్రభూమిలో సువర్ణముఖీనదికి ఉత్తరంగా గల మూడు యోజనాల వెడల్పు, ముప్పై యోజనాల పొడవుగల దేశంలో నిలిచింది. అట్టి శేషరూపమైన, శ్రీహరికి శేషభూతమైన, సర్వభూతాలకు శేషమైన శేషపరివేష్టితమైన శైలం కావడం మూలంగా అది శేషశైలమైంది. అట్టి శేషశైలవాసునకు, శేషాద్రిశిఖర నివాసునకు యీ పూజాసమయంలో నతమస్తకుడనై నమస్కరిస్తున్నాను.

8. ఓం వృషదృగ్గోచరాయ శ్రీవేంకటేశాయ నమః

"కృతే వృషాద్రిం వక్ష్యంతి త్రేతాయామంజనాచలమ్ ద్వాపరే శేషశైలంతు కలౌ శ్రీవేంకటాచలమ్ నామాని యుగభేదేన శైలస్యాభవంతి హి". కృతయుగసమయంలో వృషుడు ఉండేవాడు. అతను బలసంపన్నుడు. పరమనారాయణ పరాయణుడు. వేంకటాచలంపై గల తుంబురతీర్థంలో నిత్యం స్నానమాచరించేవాడు. ఆ విధంగా పరిశుద్ధ శరీరుడై పరమభక్తి భావంతో నృసింహ సాలగ్రామాన్ని అర్చించేవాడు. కత్తితో కత్తుక నుత్తరించుకొనేవాడు. ఛేదించిన ప్రదేశంలో మరల శిరస్సు మొలిచి నిలిచేది. తన శిరస్సును పూజాప్రసూనంతో కలిపి సమర్పించేవాడు. ఇట్టి అపూర్వమైన పూజాక్రమం నిరంతరాయంగా, నిర్విఘ్నంగా, నిరాఘాటంగా ఐదువేల సంవత్సరాలు జరిగింది. శ్రీమన్నారాయణుడు వృషునకు ప్రత్యక్షమై వరం అర్థించమని ఆదేశించాడు. వృషుడు దేవదేవునకు నమస్కరించి తనతో యుద్ధంచేసే అవకాశం కల్పించమని వరం అర్థించాడు. ఫలితంగా భక్తునకు – భక్తమందారునకు మధ్య తీవ్రమైన సమరం సాగింది. శ్రీహరి వృషునిపై చక్రం ప్రయోగించాడు. తాను నివసించి,

పూజించి, జపించి, సర్వసేవాకార్యక్రమాలు సాగించి, సిద్ధిపొంది - శాశ్వత విష్ణులోకం పొందడానికి అవకాశం చూపిన ఆ శైలం తన నామంతో వ్యవహరింపబడే నిర్ణయం చేయమని వృషుడు శ్రీహరిని అర్థించాడు. శ్రీమహావిష్ణువు దానిని మన్నించాడు. విష్ణుచక్రసంయోగం మూలంగా వృషుడు విష్ణులోకం పొందాడు. తదాదిగా యీ శైలం వృషాచలంగా వ్యవహార ప్రాచుర్యం సంపాదించుకొంది. అట్టి వృషాద్రిపతియైన శ్రీవేంకటాచలపతికి యీ పవిత్ర అష్టోత్తర శత నామపూజా సమయంలో వినయ వినమితగాత్రుణ్ణై మనఃపూర్వకంగా నమస్కరిస్తున్నాను.

4. ఓం విష్ణవే శ్రీవేంకటేశాయ నమః

వాణీపతి సృష్టికర్త. లక్ష్మీపతి సృష్టిభర్త. పార్వతీపతి సృష్టి హర్త. శ్రీ విష్ణుపాదం పరమశరణ్యమని సకల వేదశాస్త్రాలు ప్రకటిస్తున్నాయి. విష్ణునామస్మరణం లౌకిక, పారలౌకిక జీవనసాధనమని శ్రుతి స్మృతిపురాణ ఆగమ శతాదులు ప్రకటిస్తున్నాయి. సకల లోకానికి సమస్త జీవరాసుల పోషణభారం నిర్వహించే శ్రీమహావిష్ణువు సదా ఆరాధ్యుడు. భగవానుని అర్థించి, ప్రార్థించి, స్మరించే అనంత నామాలలో విష్ణునామం మహా పవిత్రమైంది. పాపహరమైంది. మోక్షకారకమైంది. అట్టి శ్రీవిష్ణునామంతో చేతనా చేతనాలలో అంతర్బహిః వ్యాప్తి కలిగి జగన్నిర్వహణ భారం వహించి సాగించే శ్రీవేంకటేశ్వరస్వామికి యీ పూజా సమయంలో నమస్కరిస్తున్నాను.

5. ఓం సదఞ్జన గిరీశాయ శ్రీవేంకటేశాయనమః

త్రేతాయుగసమయంలో శ్రీ వేంకటేశ్వరుడు వెలసిన తిరుమల అంజనాచలంగా ప్రఖ్యాతమైంది. మతంగమహర్షి ఆదేశానుసారం అంజన శేషశైలం అధిరోహించింది. శ్రీ్ళాహస్వామిని దర్శించింది.

స్వామిపుష్కరిణి సమీపంలోని ఆకాశగంగ ప్రాంతం సమీపించింది. అచ్చట మహోగ్రమైన తపం కావించింది. వాయుదేవుడు ప్రత్యక్షమై వీర్యప్రపూరితమైన మహాఫలాన్ని సమర్పించాడు. అంజన స్వీకరించి, గర్భంధరించి మహావీరుడు, పరమభక్తాగ్రేసరుడైన ఆంజనేయస్వామిని ప్రసవించింది. శ్రీ వేంకటగిరి ఉత్తమురాలైన అంజన తపం కావించిన ప్రదేశంకావడంవల్లనూ ఆంజనేయస్వామి అవిర్భవించిన పవిత్రస్థలం కావడంవల్లనూ అంజనగిరిగా ప్రఖ్యాతమైంది. అట్టి అంజన గిరీశుడైన శ్రీవేంకటేశ్వరస్వామికి యీ పవిత్ర పూజాసమయంలో నమస్కరిస్తున్నాను.

6. ఓం వృషాద్రిపతయే శ్రీవేంకటేశాయ నమః

వైవస్వతమనువుకాలంలో ధర్ముడనేవాడు ఉండేవాడు. అతడు ధర్మనిష్ఠాగరిష్ఠుడు, విద్యాసంపన్నుడు, పరమనారాయణ పరాయణుడు. అతడు శ్రీవేంకటాచలానికి వచ్చాడు. భక్తజనసులభుడు ఆపన్నప్రసన్నుడు ఆదిదేవుడు అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడు అర్థితార్థప్రదుడు సర్వజననయనానందకరుడైన శ్రీవేంకటప్రభునిగూర్చి ధర్ముడు మహోగ్రతపం కావించాడు. అతని తపః ప్రభావఫలితంగా యీ సువిశాలవిశ్వంలో ధర్మం నాలుగుపాదాల నడిచింది. శాంతి నెలకొంది. పాడిపంటలతో, సిరిసంపదలతో, భోగభాగ్యాలతో తులతూగింది. ఈవిధమైన లోకసంగ్రహబుద్ధితో లోకరక్షణవాంఛతో తపం కావించిన ధర్మునకు శ్రీనివాసుడు ప్రత్యక్షమయ్యాడు. వరం కోరుకొమ్మని ఆజ్ఞాపించాడు. ధర్మునకు వృషుడనే నామాంతరముంది. తను తపంకావించిన ప్రదేశం వృషాద్రిగా వ్యవహరింపబడేవరం ప్రసాదించమని ధర్ముడు శ్రీనివాసుని ప్రార్థించాడు. శ్రీనివాసుడు ఆశీః పూర్వకంగా అనుగ్రహించాడు, తదాదిగా ఆ పర్వతం వృషాద్రిగా

విఖ్యాతమైంది. అట్టి వృషాద్రిపతియైన శ్రీవేంకటేశ్వరస్వామికి యీ దివ్యపూజా సమయంలో దివ్యకుసుమాలు, మల్లికాహారాలు, తులసి దామాలు సమర్పిస్తూ, చందనగంధాలు అర్పిస్తూ మనః పూర్వకంగా ప్రణామం కావిస్తూయున్నాను.

7. ఓం మేరుపుత్రి గిరీశాయ శ్రీవేంకటేశాయ నమః

శ్రీమహావిష్ణువు వాయుదేవునకు ఆదిశేషునకు మధ్య తన మాయమూలంగా పరస్పర జిగీష కల్పించాడు. ఫలితంగా మేరుపుత్రి తనయుడైన ఆనందగిరి కదలి ఆంధ్రభూమిలో నిలిచింది. అందుచేత దానికి ఆనందాద్రి, క్రీడాద్రి అనే పేర్లు వచ్చాయి. ఆనందగిరి సకల దేవతలకు నివాసం. అట్టి ఆనందగిరి పైగల ఆనందనిలయ వాసుడైన శ్రీనివాసునకు ప్రీతిపూర్వకంగా ప్రేమపురస్సరంగా యీ పూజాసమయంలో నమస్కరిస్తున్నాను.

8. ఓం సరస్స్వామితటీజుషే శ్రీవేంకటేశాయ నమః

"స్వామిపుష్కరిణీస్నానం సద్గురోః పాదసేవనమ్
ఏకాదశీవ్రతం చాపి త్రయమత్యంత దుర్లభమ్
దుర్లభం మానుషం జన్మ, దుర్లభమ్ తత్రజీవనమ్
స్వామిపుష్కరిణీస్నానం త్రయమత్యంత దుర్లభమ్."

స్వామిపుష్కరిణి తిరుమలలో శ్రీవేంకటేశ్వరస్వామి ఆలయానికి యీశాన్యమూల వుంది. ఇది మనోహరమైంది. అతిపవిత్రమైంది. అప్రాకృత జలంతో నిండి సుగంధభరితమై వుంటుంది. గంగాది సర్వ నదులూ దీని నుండి జన్మించాయి. ఇది సర్వపాపాలను తొలగిస్తుంది. పంచమహాపాతకాలను నిర్మూలిస్తుంది. దీనిలో స్నానం చేసినవాణ్ణి యముడు సహితం జయించలేడు. సహస్ర గోసముదాయం దానం చేసిన మహాపుణ్యఫలం స్వామి పుష్కరిణి స్నానంవల్ల లభిస్తుంది.

ఇది శ్రీ భూ దేవులకు ప్రీతిపాత్రమైంది. శ్రీహరి వైకుంఠాన్ని త్యజించి, కిన్నెర, కింపురుష, యక్ష, గంధర్వుల సపర్యలను పరిత్యజించి క్షీరసాగరశయనంపై విరక్తిభావం ప్రకటించి, శేషశైలంపై గల స్వామిపుష్కరిణీతటాన రమాపతి సేవలను రక్తితో, అనురక్తితో స్వీకరించి వినోదంతో, విలాసంతో విహరిస్తూ క్రీడిస్తాంటాడు. "శ్రీవైకుంఠవిరక్తాయ స్వామిపుష్కరిణీతటే రమయా రమమాణాయ వేంకటేశాయ మంగళమ్" అనే శ్లోకం పై భావాన్ని వ్యక్తం చేస్తోంది. పద్మపురాణంలోని ముప్పైరెండవ అధ్యాయం అగస్త్యుడు స్వామిపుష్కరిణీ వైభవాన్ని ప్రస్తుతించినట్లు వర్ణిస్తోంది. స్కాంధ, వరాహ పురాణకథలనుబట్టి స్వామిపుష్కరిణీ స్నాన ప్రభావం వలన ఉన్మత్తచిత్తుడైన ధర్మగుప్తుడు స్వస్థచిత్తుడయ్యాడు. బ్రహ్మహత్యాపాతక భీతితో కృంగి, కృశించి నశించిపోయిన సుమతి బాధానివృత్తిని పొందాడు. స్వామిపుష్కరిణికి "తిరుకోనేరు" అనే పేరు వుంది. ప్రతి ముక్కోటి ద్వాదశికి ముల్లోకాలలోని ముప్పైమూడు కోట్ల తీర్థాలూ స్వామిపుష్కరిణిలో సంగమిస్తాయి. అట్టి స్వామిపుష్కరిణీ స్నానం, దర్శనం, పానం, స్మరణం, ద్వారా సమస్త సిద్ధులూ సంప్రాప్తిస్తాయి. అందుచేత "వేంకటేశ సమోదేవో నాస్తి నాస్తి మహీతలే స్వామిపుష్కరిణి తీర్థం సమం నాస్తి నచాస్తివై" అనెడి ప్రఖ్యాతి ఏర్పడింది. తీర్థములన్నిటికీ స్వామి కావడం వల్లనూ, స్వామిత్వం ప్రసాదించే తీర్థం కావడం వల్లనూ దీనికి స్వామిపుష్కరిణి అనే పేరు అన్వర్థభాజనమైంది. అట్టి స్వామిపుష్కరిణీ తీరంలో నిత్యనివాసం ఏర్పాటు చేసుకొన్న సకలదేవతాస్వామియైన శ్రీవేంకటేశ్వరస్వామికి యీ పవిత్ర పూజాసమయంలో నమస్కరిస్తున్నాను.

9. ఓం కుమారాకల్ప సేవ్యాయ శ్రీ వేంకటేశాయ నమః

దక్షాధ్వర ధ్వంసానంతరం దేవజాతిపై రాక్షసజాతి విజయం సాధించింది. అమరావతిని తారకాసురుడు స్వాధీనం చేసికొన్నాడు. దేవజాతి బ్రహ్మను ఈ అపాయం తప్పించమని ప్రార్థించింది. ఫలితంగా పార్వతీ పరిణయం సంభవించింది. కుమారసేనాని ఉద్భవించాడు. క్రౌంచవ్యూహనిర్మాణంతో తారకాసురుని సంహరించాడు. తారకాసురవధ మూలంగా సంక్రమించిన బ్రహ్మహత్యాదోషం నివారించుకోవడానికి కుమారస్వామి తపమాచరించాడు. శ్రీహరి ప్రీతుడై శ్వేతవరాహకల్పాంతం వరకు వేంకటాచలంపై వసియించమని ఆదేశించాడు. కుమారధారా సమీపంలో తదాదిగా దేవసేనా సమేతుడై కార్తికేయుడు నివసిస్తున్నాడు. ఆ విధంగా కుమారస్వామి స్మరించి, సేవించే శ్రీవేంకటేశ్వరస్వామికి యీ అష్టోత్తర శతనామ పూజాసమయంలో నమస్కరిస్తున్నాను.

10. ఓం వజ్రిదృగ్విషయాయ శ్రీవేంకటేశాయ నమః

ఇంద్రుడు అహల్యాజారుడు కావడం వలన గౌతము డింద్రుణ్ని శపించాడు. ఫలితంగా యింద్రుని శరీరంపై సహస్రములైన మర్మావయవాలు వెలశాయి. ఇది భరించలేక అతడు హిమాలయపర్వత ప్రాంతంలోని తామరకొలనులో ఆశ్రయం పొందాడు. దేవతలు దేవగురుడైన బృహస్పతి వలన తమ నాయకునిస్థితి గ్రహించి ప్రార్థనలు సలిపి అవి సహస్రలింగాలుగా వెలయునట్లు చేశారు.

అప్పు డింద్రుడు అమరావతి చేరి దేవతాస్త్రీలను రమించాడు. కాని యింద్రుని విషయవాంఛలు నివృత్తి కాలేదు. దీనికి కారణం అన్వేషించడానికై వేంకటాద్రిని చేరుకొన్నాడు. వేంకటాద్రిపై స్నాన సంధ్యావందనాది దైవకార్యాలు నెరవేర్చుకోవడానికి ఒక ప్రదేశంపై

తన వజ్రాయుధఘాతంతో పాతాళగంగను రావించుకొన్నాడు. అదే వజ్రతీర్థమైంది. ఇది కపిలతీర్థానికి ఎగువగాను, విష్వక్సేన తీర్థానికి దిగువగాను వుంది. దీనికే శక్రతీర్థం, యింద్రతీర్థం అనేపేర్లు కూడా ఉన్నాయి. అట్టి వజ్రతీర్థ సమీపంలో సహస్రాక్షుడు సహస్రవర్షాలు సుదీర్ఘంగా తపం కావించాడు. శ్రీనివాసుడు భూదేవీ సమేతుడైన ఆది వరాహస్వామిగా శచీపతికి సాక్షాత్కరించి అభిమతం అభివ్యక్తీకరింపమని ఆదేశించాడు. శచీపతి తన శరీరంపై గల సహస్రలింగాలు తొలగిపోయే చర్య గైకొనమనిఅర్థించాడు. అవి భూపతనమయ్యాయి. ఆ విధంగా యింద్రునికి శాపాన్తం అనుగ్రహించి సహస్రాక్షుని చేసిన శ్రీవేంకటేశ్వరస్వామికి ప్రీతిపూర్వకంగా నమస్కరిస్తున్నాను.

11. ఓం సువర్చలా సుతన్యస్త సైనాపత్యభరాయ శ్రీవేంకటేశాయనమః

పూర్వకాలంలో వీరబాహుడనే కిరాతుడుండేవాడు. అతని ధర్మపత్ని సువర్చలాదేవి ఆ పుణ్యదంపతులకు ఒక సుపుత్రుడుదయించాడు. అట్టి సువర్చలా తనయుడు నియమసంపన్నుడు. నిష్ఠాగరిష్ఠుడు. వృషాద్రినాథుని అనుగ్రహం సంపాదించడానికై అతడు ద్వాదశ వర్షపరిమాణమైన మహోగ్రతపం వృషాద్రిపై నిర్వహించాడు. శ్రీ వేంకటాచలపతి సుప్రసన్నుడై ఒకానొక ఆశ్వయుజమాసమందు పూర్వాషాఢా నక్షత్రయుక్త శుభదినమందు సాక్షాత్కరించాడు. అతనికి సారూప్య, సామీప్య, సాయుజ్యాలు ప్రసాదించాడు. సర్వ సైన్యాధ్యక్ష పదవి అనుగ్రహించి సత్కరించాడు. ఆ విధంగా సువర్చలాతనయుని మన్నించిన శ్రీవేంకటేశ్వరస్వామికి నమస్కరిస్తున్నాను.

13. ఓం రామాయ శ్రీవేంకటేశాయ నమః

త్రేతాయుగసమయంలో శ్రీమహావిష్ణువు రామావతారం ధరించాడు పురుషులను సహితం సమ్మోహితం చేసే స్వరూపం వహించాడు. రాముడు ధర్మవిగ్రహుడు. ఓం నమోనారాయణాయ అనే అష్టాక్షరీ మంత్రంలో ప్రాణబీజమైన 'రా' అనే అక్షరంతో 'ఓం నమశ్శివాయ' అనే పంచాక్షరీ మంత్రంలోని ప్రాణబీజమైన 'మ' కారంతో కలిసి రామశబ్దం యేర్పడింది. అందుచేత రామనామస్మరణం అష్టాక్షరీ, పంచాక్షరీ మహామంత్ర జపముల పుణ్య ఫలితాన్ని ప్రసాదిస్తుంది. రామనామజపంలో యోగులు రమించారు. వాల్మీకి తరించాడు. పోతరాజు, త్యాగరాజు, గోపరాజులు రామనామం ఆశ్రయించి ధన్యత చెందారు.

రాముడు ఆదర్శపుత్రుడు, సోదరుడు, మిత్రుడు, భర్త, శత్రువు, ప్రభువు, మానవుడు. సంపూర్ణ ఆదర్శమానవత్వం అతనిలో గోచరిస్తుంది. ఉత్తమ మానవత్వం దైవత్వం అని నిరూపించి, ఉత్తమ ఆశయాలు, ఉదాత్తలక్ష్యాలు, ఉన్నత ఆదర్శాలు సాధించి భావియుగాల వారికి చూపించాడు. ఆ విధంగా శ్రీరామావతారమెత్తిన శ్రీమహావిష్ణువైన శ్రీవేంకటేశ్వరస్వామికి సభక్తికంగా నమస్కరిస్తున్నాను.

13. ఓం పద్మనాభాయ శ్రీవేంకటేశాయనమః

సర్వలోకాలలోని సకల ప్రాణులను బ్రహ్మదేవుడు సృజిస్తున్నాడు. సమస్తభువనాలను సృష్టిస్తున్నాడు. వాణీ వీణానాదం వింటూయీ అఖిలాండకోటి బ్రహ్మాండాలలో సృష్టి కార్యభారం నిర్వహిస్తున్నాడు. అట్టి చతుర్ముఖుడు శ్రీమహావిష్ణువు నాభికమలంనుండి ఆవిర్భవించాడు. హిరణ్యగర్భుని జన్మస్థానమైన పద్మాన్ని నాభి

యందు ధరించి యీ సకల చరాచరజీవుల సృష్టికి కారణకారణుడవు తున్న శ్రీవేంకటేశ్వరస్వామికి వినమ్రుడనై నమస్కరిస్తున్నాను.

14. ఓం సదా వాయుస్తుతాయ శ్రీవేంకటేశాయ నమః

త్రేతాయుగ సమయంలో అంజనాదేవి మతంగమహర్షి ఆదేశానుసారం పుత్రలాభంకోసం శేషశైలం చేరింది. స్వామి పుష్కరిణికి సమీపంలోని ఆకాశగంగ ప్రాంతంలో పన్నెండు సంవత్సరాల తపం చేసింది. అప్పుడు వాయుదేవుడు ప్రత్యక్షమై శ్రీఆంజనేయస్వామిని ప్రసాదించాడు. పిమ్మట వాయుదేవుడు దేవదేవుని సాన్నిధ్యంకోరి ఆ వెంకటాచలంపై మహోగ్రమైన తపస్సు ప్రారంభించాడు. స్వామిని నిశ్చలభక్తితో భావించి, ధ్యానించి సాక్షాత్కరించమని ప్రార్థించాడు. శ్రీనివాసుడు అనుగ్రహించి తన సాన్నిధ్యం ప్రసాదించాడు. కృతకృత్యుడైన వాయుదేవుడు ఉపకారస్మృతికై శ్రీనివాసుని సదా స్తుతిస్తున్నాడు. ఆ విధంగా వాయుదేవునిచే నిర్విఘ్నంగా, నిరంతరాయంగా, నిర్విరామంగా, సదా సర్వకాల సర్వావస్థలలో సేవింపబడి స్తుతింపబడే శ్రీవేంకటేశ్వరస్వామిని యీ నిత్యపూజాసమయంలో నమస్కరిస్తున్నాను.

15 ఓం త్యక్త వైకుంఠలోకాయ శ్రీవేంకటేశాయ నమః

భృగువు త్రిమూర్తులను పరీక్షించాడు. అతను చేసిన పరీక్ష శ్రీసతికీ, శ్రీనివాసునికీ మధ్య వివాదం కల్పించింది. శ్రీసతి అవమానం పొందిన వైకుంఠస్థానం వదలి కరవీరాపురానికి కదలిపోయింది. శ్రీనివాసుడు శ్రీసతిలేని, వైకుంఠాన్ని త్యజించి వేంకటాచలం చేరుకొన్నాడు. పద్మావతీ పరిణయసమయంలో శ్రీమహాలక్ష్మి వచ్చింది. అట్టి మహాలక్ష్మి సమేతుడైన శ్రీహరి వైకుంఠానికి తరలిపోకుండా మానవులకు దేవతలకూ అందుబాటులో ఉండేలాగ వేంకటాచలంపై

స్వామిపుష్కరిణీ తీరంలోని ఆనందనిలయంలో వేంచేసి భూమండలం లోని కలిదోషదూషితులైన మానవుల సర్వపాపాలు, కష్టాలు తొలగించ డానికి సంకల్పించాడు. సర్వప్రాణులపట్ల అవ్యాజ కరుణాకటాక్షాలు ప్రసరిస్తున్నాడు. మ్రొక్కితే చిక్కులు విప్పుతున్నాడు. అర్థిస్తూ ప్రార్థిస్తే ఆపదలు తప్పిస్తున్నాడు. అప్రాకృతం, దివ్యం అయిన వైకుంఠవాసాన్ని త్యజించి వేంకటాచలంపై సర్వజనసులభుడై సమస్త భక్తకోటికి – ప్రాణికోటికి – మానవకోటికి సకలశుభాలు, సర్వసుఖాలు సమకూరుస్తూ అర్చావతారమూర్తియై ఆవిర్భవించిన అమృతమూర్తి – ఆనందనిలయవర్తియైన శ్రీవేంకటరమణమూర్తికి యీ పూజాసమయంలో కుసుమాంజలి సమర్పిస్తున్నాను.

16. ఓం గిరికుంజవిహారిణే శ్రీవేంకటేశాయ నమః

అప్రాకృత మనోహరమైంది శ్రీవేంకటాచలం. చూడముచ్చట గొలిపే దివ్యమైన, రమణీయమైన, కమనీయమైన ప్రకృతి సౌందర్యం, ఎత్తైనశిఖరాలు, లోతైనలోయలు, ఎచ్చటచూచినా సుందరములైన ఉద్యానవనాలు, మనస్సును వికసింపచేసి, పరిమళింపచేసి, తన్మయింప జేసే మందమలయానిలయాలు అఘహారాలైన పవిత్ర తీర్థరాజాలు. ఇన్నిసొగసులు, సోయగాలు, సంపదలను ఆ కొండ తన గుండెలలో నింపుకొని దాచుకొంది. అట్టి వేంకటాచలంపై గల పూపొదరిండ్లలో నిత్యశృంగార క్రీడలు సలిపే లక్ష్మీనారాయణుడు, శ్రీమన్నారాయ ణుడు, వైకుంఠనారాయణుడైన శ్రీవేంకటేశ్వరస్వామికి నమస్క రిస్తున్నాను.

17. ఓం హరిచన్దన గోత్రేన్ద్రస్వామినే శ్రీవేంకటేశాయ నమః

శ్రీవేంకటగిరి సర్వౌషధులకూ నిలయం. అది తరులతా నికుం జాలతో ఒప్పారుతూంటుంది. చిత్రవిచిత్రములైన నానావిధ వృక్ష

సంతతేటలు శీతలచ్ఛాయలు ప్రసరిస్తూంటాయి. చందనచర్చలు అందు కొనేస్వామి శ్రీవేంకటేశ్వరస్వామి చందనతీర్థంతో అభిషేకం అందు కొనే సమయంలో కుందనపు బొమ్మలాగ, పసిడిసగనిగలతో ధగ ధగలతో తళుకులతో సాక్షాత్కరిస్తాడు. స్వామి చరణయుగం, హృదయం చందనగంధంతో నిక్షిప్తం చేయబడతాయి. అట్టి చందన గంధప్రియుడైన స్వామి సతతం నిరంతరం చందనవృక్ష సమృద్ధమైన శ్రీవేంకటాచలంపై విహరిస్తూంటాడు. అట్టి శ్రీవేంకటేశ్వరస్వామికి నమస్కరిస్తున్నాను.

18. ఓం శంఖరాజన్య నేత్రాబ్జవిషయాయ శ్రీవేంకటేశాయ నమః

శంఖనృపతి హైహయ కులాలంకారుడైన శ్రుతుని పుత్రుడు. ఇతడు సకలశాస్త్ర పారంగతుడు. శ్రీనివాసుని చూచి తరించాలని తీవ్రంగా వాంఛించాడు. కాంక్షించాడు. శ్రీమన్నారాయణుడు అశరీరవాణిరూపంగా తిరుమలకేగి తపమాచరింపుమని ఆదేశించాడు. దైవశాసనాన్ని శంఖుడు శిరసావహించాడు. తాను నిర్వహించే రాజ్య పాలనం పుత్రునికి స్వాధీనం చేశాడు. శేషాద్రికేగి యమనియమంతో తపస్సు నిర్వహించాడు. అట్టిశంఖుని మన్నించి అతనికి ప్రత్యక్షమై తన అవ్యాజకృపాకరుణాకటాక్షాలతో రక్షించిన శ్రీవేంకటేశ్వర స్వామికి నమస్కరిస్తున్నాను.

19. ఓం వసూపరిచరత్రాత్రే శ్రీవేంకటేశాయ నమః

ధర్మశీలుడైన ఉపరిచరవసువు చేదిరాజ్యాన్ని పాలిస్తున్నాడు. ఆ సమయంలో దేవతలకు, మహర్షులకు ధర్మసందేహం కలిగింది. దాన్ని నివారించుకోవడానికై ఉపరిచరవసువును సమీపించారు. యాగం ప్రత్యక్షపశువుతో చెయ్యాలనేది దేవతల వాదం. పిష్టపశు వుతో చెయ్యాలనేది ఋషులవాదం, దేవతా పక్షపాతంతో వసువు

వారివాదాన్ని సమర్థించాడు. మహర్షులు ధర్మవిరుద్ధంగా ప్రవర్తించి నందుకు ఉపరిచరవసువును పాతాళకుహరమున పడునట్లు శపించారు. వసువు శ్రీనివాసుని ధ్యానిస్తూ అతని దివ్యసుందరరూపం మనస్సులో నింపుకొని పూజిస్తూ అసురులు కల్పించే అసంఖ్యాకములైన చిక్కులను చిరునవ్వులతో సహిస్తున్నాడు. భక్తమందారుడైన శ్రీనివాసుడు తన సుదర్శనచక్ర ప్రయోగంద్వారా అసురసంహారం కావించి వసువునకు సుఖశాంతులు ప్రసాదించాడు. గరుడునకు వసువును పాతాళం నుండి విముక్తుణ్ణి చేయమని ఆజ్ఞాపించాడు. గరుడభగవానుడు పాతాళా నికి పోయి వీపున ఎక్కి రమ్మన్నాడు. శ్రీహరి అసాధారణ వాహనం తాను అధిరోహించడం క్షమించరాని నేరమని, మహాపాపమని వసువు నిరాకరించాడు. గరుడుడు అతని భక్తి తాత్పర్యానికి, శ్రీనివాసదాస త్వానికి ముగ్ధుడై బాహువులమధ్య పెట్టుకొని చేదిరాజ్యానికి తరలిం చాడు. ఈ విధంగా వసువును పాతాళంనుండి విముక్తుణ్ణిచేసి కరుణతో కాపాడి రక్షించిన శ్రీవేంకటేశ్వరస్వామికి యీ పవిత్రపూజాసమ యంలో అర్చించి పూజించి ప్రణామం చేస్తున్నాను.

## 20. ఓం కృష్ణాయ శ్రీవేంకటేశాయ నమః

ద్వాపరయుగంలో శ్రీహరి కృష్ణావతారం ధరించాడు. కృష్ణావ తారం పరిపూర్ణఅవతారం. శ్రీకృష్ణుడు లీలామానుషవిగ్రహుడు. దుష్ట శిక్షణ, శిష్టరక్షణ నిర్వహించిన మహానీయుడు. అపూర్వమైన అప్రా కృత దివ్యచర్యలు ప్రదర్శించిన మహాపురుషుడు. అస్తికి- నాస్తికి, అహింసకు- హింసకు, మంచికి- చెడుగునకు, న్యాయానికి- అన్యాయా నికి మధ్య అహరహం అనుక్షణం సాగిన మహాకురుక్షేత్ర సంగ్రామంలో ఏకైక సూత్రధారియై విశ్వరూపం ప్రదర్శించిన శ్రీకృష్ణపరమాత్మ శ్రీవేంకటేశ్వరస్వామిగా, అర్చారూపంలో ఆవిర్భవించాడు. అట్టి శ్రీ వేంకటేశ్వరస్వామికి నమస్కరిస్తున్నాను.

## 21. ఓం అబ్ధికన్యా పరిష్వక్త వక్షసే శ్రీవేంకటేశాయ నమః

గతకాలంలో వారణాశీనగరంలో సప్తఋషి పుంగవులు ప్రమాణ బుద్ధితో క్రతుకలాపం సాగిస్తున్నారు. నారదుని ఆదేశానుసారం మునులు భృగుమహర్షిని యజ్ఞఫలం స్వీకరింప అర్హుడైన వ్యక్తి నన్వేషింప నియోగించారు. భృగువు త్రిమూర్తులను పరీక్షించాడు. విష్ణుమూర్తి సత్వగుణం పరీక్షించడానికై శ్రీనివాసుని వక్షస్థలంపై పాదఘాతం చేశాడు. శ్రీనివాసుడు ఓరిమితో సహించి క్షమించాడు. కాని భృగువుచేసిన పరీక్ష శ్రీనివాసునకూ శ్రీసతికిమధ్య వివాదం కల్పించింది. లక్ష్మీదేవి తన నిత్యనివాసస్థానం మునికాల తన్నుబడ్డదనే అవమానంతో వైకుంఠాన్ని విడనాడి కరివీరపురం (కొల్హాపూర్) చేరి కేశవనామజపంతో కాలక్షేపం చేస్తోంది. శ్రీదేవిని అన్వేషిస్తూ కరివీరపురంచేరాడు. అచ్చట నారాయణస్మరణతో అగస్త్యుని పూజలందుకుంటోంది. శ్రీమహాలక్ష్మిని దర్శిస్తూ, స్మరిస్తూ, పూజిస్తూ శ్రీనివాసుడు పదిసంవత్సరాలు యమనియమ సంపన్నుడై తపస్సుగావించాడు. అప్పుడు లక్ష్మీదేవి సువర్ణముఖరీతీరంలో సరోవరంసృష్టించి దాని తీరంలో నన్ను ఏకాక్షరమంత్రంతో గాని, సహస్రాక్షరమంత్రతో గాని స్వర్ణకమలాలతో పూజించమని ఆదేశించింది. మహాసతిఆదేశానుసారం శ్రీనివాసుడు శ్రీశుకపురం (మంగాపురం) సమీపించాడు. అతిలోక మనోహరమైన, దివ్యసుందరమైన, అపూర్వరమణీయమైన సరోవరాన్ని నిర్మించాడు. స్వర్ణకమలాలు దేవలోకంనుండి సేకరించి సరోవరంలో నిలిపాడు. అట్టి దివ్యపద్మాలతో లక్ష్మిని పూజిస్తూ పద్మసరోవర సమీపంలో ద్వాదశవర్షాలు తపం కావించాడు. శ్రీనివాసుని తపస్సు ఫలించింది. ఆశయం సిద్ధించింది. అది కార్తీకమాసం. శుక్లపక్షం. శుక్లపంచమీ శుభసమయం. ఉత్తరాషాఢా నక్షత్రం. శుక్రవారం మిత్రముహూర్తం. ఆ మంగళ ముహూర్తంలో, ఆ పుణ్యసమ

యంలో పద్మరథంపై, పద్మకాంతులతో, పద్మనేత్రియై, పద్మవదనయై, పద్మశరీరయై, పద్మాలంకృతయై, పద్మపాణియై, పద్మహారంతో, పద్మ సరోవరంలోని మహాపద్మంనుండి పద్మావతీదేవియై శ్రీమహాలక్ష్మి ప్రాదుర్భవించి శ్రీనివాసుని కంఠాన్ని కల్హారమాలతో అలంకరించి శ్రీనివాసుని హృదయసీమ చేరింది. ఆవిధంగా శ్రీనివాసుడైన శ్రీవేంక టేశ్వరస్వామికి యీ పవిత్రపూజాసమయంలో నమస్కరిస్తున్నాను.

22. ఓం వేంకటేశాయ శ్రీవేంకటేశాయ నమః

పాపసముదాయాన్ని తొలగించి, అమృతైశ్వర్యాలను ప్రసాదించి, యిహ పారలౌకిక సౌఖ్యాలను కల్పించే శ్రీవేంకటేశ్వర స్వామికి యీ పూజాసమయంలో నమస్కరిస్తున్నాను.

23. ఓం సనకాదిమహాయోగిపూజితాయ శ్రీవేంకటేశాయ నమః

ఈ సకల చరాచర జగత్తులలోని సమస్తజీవరాశులను సృష్టి స్తున్న బ్రహ్మదేవుడు ప్రప్రథమంగా సనకసనందన, సనకసుజాతాది మహాయోగిపుంగవులను జన్మింపజేశాడు. వారు నిర్వికారులై, విషయ వాంఛా విముఖులై, పరమవిరక్తిభావంతో సదా ధ్యాననిష్ఠాగరిష్ఠులై, పరమవేదాంతశిఖామణులై, మోక్షకాములై, ప్రవర్తిలినట్లు శాస్త్రాలు ప్రకటిస్తున్నాయి. ఆదిజీవులైన, ఆదర్శప్రాయులైన, ఆచార్యపురుషు లైన సనకాది మహాయోగిపుంగవుల ఆరాధనలు, అర్చనలు అందు కున్న శ్రీవేంకటేశ్వరస్వామికి యీ పూజాసమయంలో నమస్క రిస్తున్నాను.

24. ఓం దేవజిత్ప్రముఖానన్త దైత్యసంఘ ప్రణాశినే శ్రీవేంకటే శాయ నమః

శాపవశమున వైకుంఠ ద్వారపాలకులైన జయవిజయులు హిర ణ్యాక్ష హిరణ్యకశిపులుగా పుట్టారు. వీరు అతిక్రూరులై ముల్లోకాలను తల్లడిల్లచేశారు. హిరణ్యాక్షుడు భూమండలాన్ని చాపగాచుట్టి పాతాళం

లోకి త్రోశాడు. శ్రీహరిని సంహరింప వైకుంఠం ప్రవేశింపప్రయత్నించి శ్రీహరిచేత హరింపబడ్డాడు. శ్రీహరి వరాహావతారందాల్చి భూమిని ఉద్ధరించాడు. ఆవిధంగా లోకాన్ని, లోకేశుణ్ణి తహ తహ లాడించిన హిరణ్యాక్షునివంశంలో దేవజిత్తు, మృత్యుజిత్తు, శత్రుజిత్తు అనే ముగ్గురు సోదరు లుద్భవించారు. వారు సాధుపుంగవుల్ని, సజ్జనుల్ని హింసించడం నిత్యకర్మానుష్ఠానంగా సాగించారు. అట్టి దుర్మార్గులను సేనాపతియైన విష్వక్సేనుని పంపి సంహరింపజేసి సాధులోకంలో శాంతిని సృష్టించిన శ్రీవేంకటేశ్వరస్వామికి యీ పుణ్యపూజా సమయములో వినయాంజలి ఘటిస్తున్నాను.

25. ఓం శ్వేతదీప వసన్ముక్త పూజితాంఘ్రియుగాయ శ్రీవేంకటేశాయ నమః

ఈ చతుర్దశ భువనాలలో శ్రీహరికి శ్వేతదీపం, పాలసముద్రం, వైకుంఠం మహాప్రీతిపాత్రులైన పుణ్యప్రాంతాలు. ఆస్థానాలలో శ్రీహరి నివాసం చేస్తుంటాడు. శ్రీహరి ప్రేమించే ఆ మూడుస్థానాలలోని శ్వేతదీపంలో నిత్యముక్తులైన మహానుభావులు ఉంటారు. అట్టి మహా పురుషులు నీనామాన్ని జపిస్తూ, నీరూపాన్ని దర్శిస్తూ, నీపవిత్రపాద యుగళాన్ని సేవిస్తూంటారు. ఆవిధంగా శ్వేతదీపవాసులైన ముక్తుల నిత్యసేవలు అందుకొనే శ్రీవేంకటేశ్వరస్వామికి నమస్కరిస్తున్నాను.

26. ఓం శేషపర్వత రూపత్వ ప్రకాశన పరాయ శ్రీవేంకటేశాయ నమః

శేషుడు కద్రూవి కుమారుడు. ఇతని తండ్రి కశ్యపుడు. వినతపట్ల తనతల్లి, తమ్ములుచేసే అన్యాయం భరించలేక వారిని విడిచి బ్రహ్మను గూర్చి తపస్సుచేసి అతని వరప్రసాదంమూలంగా నిత్యసత్యధర్మనిరతు డయ్యాడు. అనంతుడైన భూభారాన్ని వహించాడు. శ్రీహరికి పాలకడలిపై పానుపై వెలశాడు. శ్రీనివాసుని అభిమతాన్ని, ఆదేశాన్ని,

శిరసావహించి తన పడు తలల్ని పడుకొండలు చేసి శేషపర్వత స్వరూపు డయ్యాడు. ఆ విధంగా ఆదిశేషుని తన క్రీడార్థమై భూలోకంలో పర్వతస్వరూపంగా అవతరింప చేసిన శ్రీ వేంకటేశ్వరస్వామికి యీ పుణ్యపూజాసమయంలో నమస్కరిస్తున్నాను.

27. ఓం సానుస్థాపితతార్క్ష్యాయ శ్రీవేంకటేశాయ నమః

శేషాచలం, గరుడాచలం, వేంకటాచలం, నారాయణాచలం, వృషభాచలం, వృషాచలం, అంజనాచలం ఆదిగా గల పర్వతాలపై శ్రీనివాసుడు ప్రేమపురస్సరంగాను, ప్రీతి పూర్వకంగాను నివసిస్తూంటాడు. శ్రీహరి గరుత్మంతుని తన వాహనంగాను, ధ్వజంగాను స్వీకరించాడు. ఇతడు అనూరునిసోదరుడు. వినత ఇతనితల్లి. కశ్యపుడుతండ్రి. మాతృదాస్యవిముక్తికై యింద్రుణ్ని జయించి అమృతం సాధించిన మహాపరాక్రమశాలి. శ్రీహరికి పరమదాసుడు. ఛందోమయుడైన గరుడభగవానుడు శ్రీహరి నివాసానికి ఒక పర్వతం తెచ్చాడు. అదే గరుడాచలమైంది. అట్టి గరుడాచలంపై నిత్యనివాసం ఏర్పరచుకొన్న శ్రీవేంకటేశ్వరస్వామికి నమస్కరిస్తున్నాను.

28. ఓం తార్క్ష్యాచలనివాసినే శ్రీవేంకటేశాయ నమః

గరుడుడు కొనివచ్చినందువల్ల గరుడాచలంగా ప్రసిద్ధిపొందిన పర్వతంపై శ్రీమహాలక్ష్మితో సతతం వసించి విహరించే శ్రీవేంకటేశ్వరస్వామికి నమస్కరిస్తున్నాను.

29. ఓం మాయాగూఢవిమానాయ శ్రీవేంకటేశాయ నమః

బ్రహ్మాది సర్వదేవతాసముదాయానికీ ఒక మహాదివ్య విమానంలో శ్రీనివాసుడు దర్శనమిచ్చాడు. ఒక మహాశబ్దం ప్రసారమైంది. దానితో దివ్యకాంతి ప్రవహించింది. ఆ కాంతితో ఒక దివ్యవిమానం ఆవిర్భవించింది. దానిలో వెలలేని గోపురాలు, సువిశాలమైన ఆవర

ణాలు, బంగారు వాకిళ్ళు గోచరించాయి. నీలాలతో, మకరాలతో చేయబడ్డ గుమ్మాలు, వితానాలతో, ముక్తాహారాలతో, పుష్పమాలలతో అలంకరింపబడ్డ క్రీడామండపాస్థానమండపాలతో కూడి సహస్ర స్తంభమండపయుక్తమై, శ్రీరథాశ్వ గజాదివాహన సమేతమై భేరీ మృదంగ పటహమురజ ఢక్కాది వాద్యనాద ప్రతిధ్వనితమైన రూప యవ్వన సంపన్న దివ్యస్త్రీ - లాస్యయుక్తమై శ్రవణానందజనకమై, హృదయాహ్లాదకారకమై, నయనానందకరమై, సర్వమంగళశోభితమై, అపూర్వమై, రమణీయమై ఒక విమానం గోచరించింది. దానిలో మంగళమోహనమూర్తియై, కల్యాణలావణ్యమూర్తియై, దివ్యసుందర మూర్తియై శ్రీవేంకటరమణమూర్తి బ్రహ్మాది దేవతలకు, సనకాది మునులకు, అగస్త్యాది ఋషులకు, అష్టదిక్పాలకులకు, నవగ్రహాధిపతు లకు దర్శనమిచ్చి ధన్యుల గావించాడు. ఆ దివ్యవిమానం కలియు గాంతం వరకూ ఎవ్వరికీ గోచరించకుండా మాయం చేశాడు. ఆ విధంగా చేసి కలియుగమానవులకు తనకు దివ్యవిమానం నిర్మించే అపూర్వ అవకాశం కల్పించాడు. (తొండమానుడు విమానం నిర్మిం చాడు.) క్రీ.శ. 1262 సం॥లో సుందరపాండ్యుడు, 1369 సం॥లో మహా మండలేశ్వర మంగిదేవ సార్వభౌముడు, 1630 సం॥లో వేంకటపతి రాయలు శ్రీనివాసునికి స్వర్ణవిమానంపై బంగారు కలశాలు నెల కొల్పారు. 13వ శతాబ్దంలో సుందరపాండ్యుడు, 16వ శతాబ్దములో శ్రీకృష్ణదేవరాయలు స్వర్ణతులాభారము తూగి స్వామివారి ఆనంద నిలయ విమానానికి బంగారుపూత పూయించారు. భక్తుల కానుక లతో 18 లక్షల రూపాయలు ఖర్చు చేసి 12 వేల తులాల బంగా రంతో 1958 సం॥లో ఆ విమానానికి బంగారుపూత పూయించ బడింది. మాయాగూఢ విమానంలో నివసించి, పిమ్మట కలియుగం

లోని భక్తులకు తన విమాన నిర్మాణానికి అవకాశం కల్పించిన శ్రీవేంకటేశ్వరస్వామికి మనఃపూర్వకంగా నమస్కరిస్తున్నాను.

30. ఓం గరుడస్కంధవాసినే శ్రీవేంకటేశాయ నమః

"దాసః సఖా వాహన మాసనం ధ్వజో యస్తే వితానం వ్యజనం త్రయీమయః" అనే విధంగా ఆది ఆద్యుడు, దేవదేవుడు అయిన శ్రీనివాసుడు తన అనన్య సామాన్యమైన, అసాధారణమైన, అప్రతిహతమైన, సర్వజన హృదయాహ్లాదకరమైన గరుడవాహనాన్ని అధిరోహించి భక్త జనులకు దర్శనమియ్యడం ఆచారం. ఆ విధంగా దివ్య గరుడ వాహనారూఢుడై, దివ్యప్రభతో, అపూర్వ వైభవంతో శోభిల్లే శ్రీవేంకటేశ్వరస్వామికి యీ పవిత్రపూజాసమయంలో నమస్కరిస్తున్నాను.

31. ఓం అనన్తశిరసే శ్రీవేంకటేశాయ నమః

32. " అనన్తాక్షాయ శ్రీవేంకటేశాయ నమః

33. " అనన్తచరణాయ శ్రీవేంకటేశాయ నమః

"సహస్రశీర్షా పురుషః" "సహస్రశీర్షం దేవం" "అనేక బహూదరవక్త్ర నేత్రం" అనే ప్రమాణవాక్యాలు వింటూంటాం. ఈ సృష్టి కోటికి బుద్ధిని, దృష్టిని, శక్తిని ప్రసాదించి నడిపిస్తూన్న అనంతరూపి, విశ్వస్వరూపియైన శ్రీవేంకటేశ్వరస్వామికి నమస్కరిస్తున్నాను.

34. ఓం శ్రీశైలనిలయాయ శ్రీవేంకటేశాయ నమః

తిరుమల సంపదకు నిలయం. లౌకిక పారలౌకిక సంపదలకు యిది దివ్య కేంద్రం. ఇది భక్తుల పాలిటి ముంగొంగు బంగారం. ఇది శ్రీపాదయుక్తం కావడంచేతనూ, శ్రీనివాసమయం కావడంవల్లనూ యిది శ్రీశైలంగా ప్రఖ్యాతమైంది. అట్టి శ్రీశైలవాసుడైన, శ్రీగిరి నివాసుడైన, శ్రీనివాసప్రభుడైన శ్రీవేంకటేశ్వరస్వామికి నమస్కరిస్తున్నాను.

35. ఓం దామోదరాయ శ్రీవేంకటేశాయ నమః

ద్వాపరయుగాంతమున శ్రీకృష్ణుడు అవతరించాడు. యశోద బాలగోపాలుని పోషణభారం వహించి నిర్వహించింది. చిన్నికృష్ణుడు కొంటెకృష్ణుడై చిలిపిచేష్టలతో, అల్లరిపనులతో యశోదను విసిగించే వాడు. అతని ఆగడాన్ని భరించలేక వానిని నిరోధించడానికై ఒక నాడు త్రాటితో కృష్ణుని రోటికి కట్టింది. ఆ సమయంలో ఉదరానికి కట్టబడిన త్రాడుతో బొజ్జ పెంచి తన అనన్యసామాన్యమైన సౌలభ్య పరాకాష్ఠను యశోదకు ప్రదర్శించాడు. తన కడుపులో సర్వలోకాలు నిండి ఉన్నట్లు నిరూపించుకొన్నాడు. ఆ శ్రీకృష్ణభగవానుడే నేడు తిరుమలపై శ్రీనివాసునిగా ఆవిర్భవించి, అర్చారూపియై, అర్చకపరా ధీనత చెంది అంగరంగవైభవాలతో భక్తుల అర్చనలు, ఆరాధనలు, ఉత్సవాలు కరుణతో స్వీకరించి ఆమోదించి, కనుసన్నలలో ఆశీర్వ దిస్తున్నాడు. అట్టి శ్రీవేంకటేశ్వరస్వామికి యీ పవిత్రపూజాసమ యంలో భక్తిపురస్సరంగా నమస్కరిస్తున్నాను.

36. ఓం నీలమేఘనిభాయ శ్రీవేంకటేశాయ నమః

నిర్మల నీలాకాశంలో దట్టంగా పట్టిన వర్షకారకమైన మేఘాన్ని చూస్తే భౌతిక తాప పీడితులైన భూజనులు హర్షపులకిత గాత్రులవుతారు. తాప నివృత్తిని పొంది సంతుష్ట హృదయాంతరంగు లవుతారు. దుర్భర దుస్సహాపీడిత తాడిత సంసారతాపార్తులైన భూజ నులకు నీలమేఘకాంతులు ప్రసరించే నీ మనోహర రూప సందర్శనం హర్ష వర్షమై తాపాన్ని హరింపజేసి, తృప్తిని కల్పించి, తన్మయుల్ని చేసి, పులకింపజేసి, పరవశింపజేసి, పరవళ్ళు త్రొక్కిస్తుంది. అట్టి నీల మేఘవర్ణుడైన, కోమలనీలమేఘాకారుడైన శ్రీవేంకటేశ్వరస్వామికి వినమ్రుడనై వందనం అర్పిస్తున్నాను.

37. ఓం బ్రహ్మాదిదేవదుర్దర్శ విశ్వరూపాయ శ్రీవేంకటేశాయ నమః

శ్రీవేంకటేశ్వరస్వామి దివ్యమంగళమైన, మనోహరమైన విశ్వరూపం బ్రహ్మాది దేవతలకు సహితం దుర్లభమైంది. ఆ విశ్వరూప సందర్శన భాగ్యంవల్ల భయ, విస్మయ, సందేహాలు తొలగిపోతాయి. ఆత్మశాంతి, ఆత్మవందనం, అపూర్వానుభూతి సిద్ధిస్తాయి. "సుదుర్దర్శమిదంరూపం దృష్టవానసి యన్మమ, దేవా అపస్య రూపస్య నిత్యం దర్శన కాంక్షిణః" "అదృష్టపూర్వం హృషితోస్మి దృష్ట్వా భయేనచ ప్రవ్యథితం మనో మే" అనే విధంగా గోచరించే విశ్వరూపాన్ని ప్రదర్శించే శ్రీవేంకటేశ్వరస్వామికి యీ పవిత్ర పూజాసమయంలో అంజలి ఘటిస్తున్నాను.

38. ఓం వైకుంఠాగత సద్హేమ విమానాన్తర్గతాయ శ్రీవేంకటేశాయ నమః

శ్రీనివాసుడు గరుడుని వైకుంఠం నుండి క్రీడాచల సమన్వితమైన దివ్యవిమానాన్ని తోడ్కొని రమ్మని ఆజ్ఞాపించాడు. భగవానుని ఆదేశానుసారం గరుడుడు వైకుంఠం నుండి క్రీడాచలంతో కూడిన దివ్యవిమానాన్ని తోడ్కొని వచ్చాడు. శ్రీదేవి భూదేవీ సమేతుడై శ్రీహరి ఆ విమానాన్ని అధిరోహించి, సర్వదేవతాసముదాయానికి, మునిపరిమత్తుకి, ఋషిసముదాయానికి దర్శనమిచ్చాడు. ఆ విధంగా మహాపురుషసంఘానికి తన సేవాభాగ్యం, తన రూపదర్శనలాభం తన నామస్మరణ విశేషం కల్పించిన శ్రీవేంకటేశ్వరస్వామికి యీ పుణ్య పూజాసమయంలో ప్రణామం చేస్తున్నాను.

39. ఓం అగస్త్యాభ్యర్థితాశేష జనదృగ్గోచరాయ శ్రీవేంకటేశాయ నమః

శ్రీనివాసుడు పద్మావతిని పరిణయమాడిన పిమ్మట వేంకటగిరికి పయనమయ్యాడు. మామగారైన ఆకాశరాజు పినమామగారైన

తొండమానుడు, అత్తగారైన ధరణీదేవి, బావమరది వసుధానుడు నూతనదంపతులను సాగనంపారు. వివాహదీక్ష వలన ఆరుమాసాల వరకు కొండ ఎక్కరాదనే కారణం మూలంగా వేంకటాచల పాద సమీపమందలి అగస్త్యాశ్రమంలో ఆతిథ్యం స్వీకరించి విడిది చేశాడు. స్వామి నివాసానికై తిరుమలపై తొండమానుడు గోపుర ప్రాకారాలతో దివ్యవిమానం నిర్మించాడు. అగస్త్యుని అభ్యర్థనను, ప్రార్థనను మన్నించి సకల భక్తజన సులభగోచరుడై వేంకటాచలంపై అర్చారూపివై, అవతరించి, ఆవిర్భవించడానికి ఆమోదించిన శ్రీవేంకటేశ్వర స్వామికి యీ శుభపూజాసమయంలో నమస్కరిస్తున్నాను.

40. ఓం వాసుదేవాయ శ్రీవేంకటేశాయ నమః

ఈ చతుర్దశ భువనాలలోని సకల చరాచర జీవరాసులకు నీవు ప్రాణమై, శక్తివై, ఆత్మవై, తేజస్సువై వెలిగి వారిని సదా సంరక్షిస్తున్నావు. ఈ సువిశాల వసుంధరావలయాన్ని నీ అపూర్వమైన కృపతో, అనుపమానమైన కరుణతో కాపాడి రక్షిస్తున్నావు. అట్టి ఓ వేంకటేశ్వరస్వామీ! నీకు యీ మంగళప్రదమైన పూజాకాలంలో వినమ్రంగా నమస్కరిస్తున్నాను.

4. ఓం హరయే శ్రీవేంకటేశాయ నమః

మహాప్రళయ కాలమందు కాలవశ్యులైన బ్రహ్మరుద్రాదులను హరించేవాడూ, దుష్టులను సంహరించేవాడూ భక్తజనుల పాపాలను హరించేవాడూ అయిన శ్రీవేంకటేశ్వరస్వామికి నమస్కరిస్తున్నాను.

42. ఓం తీర్థపంచకవాసినే శ్రీంకటేశాయ నమః

వేంకటాద్రిపై అసంఖ్యాకములైన తీర్థాలు ఉన్నాయి. వానిలో సుమారు యాభై తీర్థాల గూర్చిన వివరాలు పురాణాలలో గోచ

రిస్తాయి. సప్తతీర్థాలు, సప్తాదశతీర్థాలు, నవతీర్థాలు, సనకసనందనతీర్థం, కాయరసాయనతీర్థం, ఫల్గుణీతీర్థం ,జాబాలితీర్థం, అస్థితీర్థం, కటాహతీర్థం, పంచతీర్థాలు పేర్కొనదగినవి. ఇట్టి అతిపవిత్రమైన పుణ్యతీర్థాలు నెలకొనడంమూలంగా తిరుమలకు తీర్థాద్రి అనే నామం సార్థకమైంది. వీనిలోని పంచతీర్థాలు కపిలతీర్థానికి పశ్చిమభాగంలో ఉన్నాయి. ఇవి విప్రతీర్థం, క్షత్రియతీర్థం, వైశ్యతీర్థం, శూద్రతీర్థం, పంచమతీర్థం అనే పేర్లతో వ్యవహరింపబడుతున్నాయి ఈ పంచతీర్థాలలోను శ్రీవేంకటేశ్వరస్వామి అంతర్లీనుడై వసిస్తూ వర్ణాశ్రమ క్రమానుసారంగా ఆయా తీర్థాలలో స్నానం చేసేవారికి ముక్తిని ప్రసాదిస్తుంటాడు. అట్టి తీర్థపంచకవాసియైన శ్రీవేంకటేశ్వరస్వామికి భక్తిపురస్సరంగా నమస్కరిస్తున్నాను.

43. ఓం వాసుదేవప్రియాయ శ్రీవేంకటేశాయ నమః

జనక మహారాజుచేత మిథిలానగరంలో వామదేవుడు ఒక అపూర్వమైన యజ్ఞం చేయిస్తున్నాడు. అట్టి యజ్ఞవాటికకు విచ్చేసిన మహాఋషి సముదాయం వామదేవునిపై జటిలమైన ప్రశ్నలవర్షం కురిపించి పరీక్షింప నారంభించారు. వారి సందేహాలకు సమధానాలుయిచ్చే శక్తి ప్రసాదింపమని ప్రార్థించిన వామదేవుని స్తోత్రంతో ప్రీతిచెందిన శ్రీవేంకటేశ్వరస్వామికి భక్త్యావేశంతో నమస్కరిస్తున్నాను.

44. ఓం జనకేష్టప్రదాయ శ్రీవేంకటేశాయ నమః

వ్యాసభగవానుని ఉత్సాహప్రోత్సాహంతోను, వామదేవుని ఉపదేశానుసారం జనకమహారాజు వేంకటాచలం సేవించాడు. స్వామి పుష్కరిణిలో స్నానమాచరించాడు. శ్రీవేంకటేశ్వరుని సందర్శించి వేంకటేశాష్టాక్షరిజపం తీవ్రంగా సాగించాడు. శ్రీనివాసుడు ప్రత్యక్షమై జనకమహారాజు అభీష్టాలు సిద్ధింపజేశాడు, ఆవిధంగా జనకాభీష్ట సిద్ధి కావించిన శ్రీవేంకటేశ్వరస్వామికి నమస్కరిస్తున్నాను.

45. ఓం మార్కండేయ మహాతీర్థజాత పుణ్యప్రదాయ శ్రీవేంక టేశాయ నమః

మనస్వినీ మృకండుల తనయుడైన భక్తమార్కండేయుడు మహా తపస్సంపన్నుడై మృత్యుంజయుడయ్యే వరం పొందాడు. అట్టి మార్కం డేయుడు ఒక పుణ్యముహూర్తంలో తీర్థయాత్రకు బయలుదేరాడు. ఈ అఖిలాండకోటి బ్రహ్మాండాలలోని సకలతీర్థాలలోను స్నానమాచరించిన దివ్యఫలం తిరుమలపై గల స్వామిపుష్కరిణీ స్నానంవలన సిద్ధిస్తుందని గరుడభగవానుడు మార్కండేయునికి ఆదేశపూర్వకంగా ఉపదేశిం చాడు. అంతట మార్కండేయుడు తిరుమలకు తరలిపోయి స్వామి పుష్కరిణిలో స్నానమాచరించి, శ్రీనివాసుని సేవించాడు. అప్పుడు శ్రీవేంకటేశ్వరస్వామి మార్కండేయునికి సమస్త తీర్థస్నాన జన్య మహాఫలాన్ని ప్రసాదించి మన్నించాడు. అట్టి శ్రీ వేంకటేశ్వరస్వామికి యీ పవిత్రపూజాసమయంలో నమస్కరిస్తున్నాను.

46. ఓం వాక్పతి బ్రహ్మదాత్రే శ్రీ వేంకటేశాయ నమః

పూర్వకాలంలో 'కార్యవిత్తు'ను పరమబ్రహ్మజ్ఞాని ఉండేవాడు. అతను ఒకానొక సమయంలో అర్హతగల ఒకశిష్యుని సంపాదించి అయాచితంగా పరతత్వ బోధగావించి బ్రహ్మవేత్తగా రూపొందిం చాడు. ఆ విధంగా తన బ్రహ్మవిద్యను సార్థకపర్చుకొన్న కార్యవిత్తు నకు శ్రీవేంకటేశ్వరుడు సుప్రీతుడై, సుప్రసన్నంగా వాచస్పతిత్వాన్ని అనుగ్రహించాడు. అట్టి శ్రీవేంకటేశ్వరస్వామికి నమస్కరిస్తున్నాను.

47. ఓం చంద్ర లావణ్యదాయినే శ్రీవేంకటేశాయ నమః

నిర్మలమైన పండువెన్నెల వెలుగులు చల్లే చక్కని చంద్రుడు వేంకటాచలం సేవించి, స్వామిపుష్కరిణిలో స్నానమాచరించి పుష్క రిణీతీరంలో భగవదర్పితంగా భూరి సువర్ణరాసులు దానంచేశాడు.

దానితో శ్రీవేంకటేశ్వరుడు సుప్రసన్నుడై కుముదబాంధవునకు నవ లావణ్యసంపదను, సౌందర్యగరిమను ప్రసాదించాడు. ఆ విధంగా చంద్రుని జయంత వసంతులను గెలువ జాలెడి సుకుమారునిగాను, సౌందర్యశోభితునిగాను రూపొందించిన శ్రీవేంకటేశ్వరస్వామికి యీ పవిత్ర పూజాసమయములో హృదయాంజలి సమర్పిస్తున్నాను.

48. ఓం నారాయణ నగేశాయ శ్రీవేంకటేశాయ నమః

పూర్వకాలంలో నారాయణుడనే విప్రుడు శ్రీవేంకటాచలంపై స్వామిపుష్కరిణీ తీరంలో తపస్సు చేయగా దేశము సుఖశాంతులతో తులతూగింది. శ్రీనివాసుడు సంతుష్టుడై శ్రీదేవితో నారాయణునకు ప్రత్యక్షమై వరం కోరుకొమ్మన్నాడు. నారాయణుడు శ్రీమన్నారాయణున్ని బహుభంగుల నుతించి, స్తుతించి, ప్రస్తుతించి తనపేరు మీదుగా తను తపమాచరించిన ప్రదేశము భావిజనుల చేత స్మరింపబడాలని వాంఛించాడు. శ్రీనివాసుడు దాన్ని ఆమోదించి ప్రసాదించాడు. ఆ విధంగా నారాయణుని అభిమతము నెరవేర్చి అతని పేరు మీదుగా నారాయణాద్రి అని పిలువబడేటట్లు అనుగ్రహించిన శ్రీవేంకటేశ్వరస్వామికి యీ పవిత్రపూజాసమయంలో మనఃపూర్వకముగా నమస్కరిస్తున్నాను.

49. ఓం బ్రహ్మక్లృప్తోత్సవాయ శ్రీవేంకటేశాయ నమః

బ్రహ్మ కలియుగాంతము వరకూ ఉండే రెండు దీపాలు శ్రీనివాసునకు సమర్పించాడు. ధ్వజారోహణముతో ప్రారంభమై రథారోహణముతో పరిసమాప్తమయ్యే అపూర్వమైన కల్యాణోత్సవాన్ని బ్రహ్మ శ్రీనివాసునకు నిర్వహించాడు. అందుచేత అది శ్రీహరి బ్రహ్మోత్సవమైంది. ఆ బ్రహ్మోత్సవానికి అపూర్వమైన వాహనాలను, మనోహరమైన రథాలను, రమణీయమైన ఛత్ర, చామర, ధ్వజ

సాలను విశ్వకర్మ నిర్మించి సమర్పించాడు. వైదికమార్గానుసారం పర మేశ్వరారాధన క్రమం నిర్వహించడానికి ఆగమశాస్త్రం నిర్మించి బ్రహ్మ శ్రీనివాసుని అర్చావతారంగా రూపొందించాడు. మూలవరు లైన శ్రీనివాసునకు తోడుగా ఉత్సవ శ్రీనివాసమూర్తి, ఉగ్ర శ్రీనివాస మూర్తి, కొలువు శ్రీనివాసమూర్తి, విమాన శ్రీనివాసమూర్తి విగ్రహా లను బ్రహ్మ నిర్మించాడు. ఆ బ్రహ్మోత్సవ సమయములో షడ్విధా న్నములైన గుడాన్న, తిలాన్న, పరమాన్న, ముద్గాన్న, మాషాన్న, దధ్యన్నాలతో గుడాపూప, తిలాపూప, మాషాపూప, మనోహర మోదకాది భక్ష్యాలతో కూడిన వివిధములైన చిత్రవిచిత్ర నైవే ద్యాలు బ్రహ్మ స్వామికి నివేదన చేశాడు. శేషవాహనము, హంస వాహనము, సింహవాహనము, కల్పవృక్షవాహనము, పల్లకీవాహనము, గరుడవాహనము, హనుమంత వాహనము, ఐరావత వాహనము, సూర్యమండల వాహనము, హయవాహనము, రథవాహనము ఆదిగా గల బహువిధ వాహనోత్సవాలు స్వామివారికి చతుర్ముఖుడు ఏర్పాటు చేశాడు. అపూర్వ శోభతో, మహావైభవోపేతంగా బ్రహ్మోత్సవం ముగిసింది. ఆ బ్రహ్మోత్సవము జగతికి శాంతిని, జనతకు ప్రశాంతిని ప్రసాదించింది. పిమ్మట బ్రహ్మదేవుడు వైఖానస ఆగమశాస్త్ర సమ్మ తంగా శ్రీనివాసునకు నిత్యోత్సవ, వారోత్సవ, పక్షోత్సవ, మాసో త్సవ, సంవత్సరోత్సవాలు వివిధోత్సవాలు నిర్వహించి స్థిరపరచాడు. ఆ విధంగా బ్రహ్మ నిర్వహించిన వివిధోత్సవాలు నిర్వహించి స్థిరపరచాడు. ఆ విధంగా బ్రహ్మ నిర్వహించిన వివిధోత్సవాలు పుత్రవాత్సల్యభావంతో స్వీకరించిన శ్రీవేంకటేశ్వరస్వామికి యీ అపూర్వ అనుభూతితో కూడిన పూజాసమయములో వందనం సమర్పిస్తున్నాను.

50. ఓం శంఖ చక్రవరానమ్ర లసత్కరతలాయ శ్రీవేంకటే
శాయ నమః

శ్రీహరి పాంచజన్య, సుదర్శన, కౌమోదకి, సారంగనందకాది ఆయుధాలను ధరించి సంచరించేవాడు. కాని తిరుమలపై వెలసిన శ్రీని వాసుడు ఒక చేత అరివీరులను తల్లడిల్లజేసే పాంచజన్యాన్ని, ఇంకొక చేత దుష్టశత్రుసమూహాలను సర్వనాశనముచేసే సుదర్శనచక్రాన్ని ధరించాడు. అర్థితుల ప్రార్థనలు మన్నించి శరణాగత పరాయణత్వం నిలుపుకొని అభయదానము, వరదానము చేసే కరద్వయాన్ని కలిగి భక్తులకు సాక్షాత్కరిస్తున్నాడు. ఈ విధంగా చతుర్భుజ శోభితుడై యేక కాలమందు కాదనక, లేదనక భక్తజనుల మనోరథాలైన ధర్మార్థకామమోక్షాలైన చతుర్విధ పురుషార్థాలను పూరించి, అను గ్రహిస్తున్న శ్రీవేంకటేశ్వరస్వామికి పుష్పాంజలి సమర్పిస్తున్నాను.

51. ఓం ద్రవన్మృగమదాసక్త విగ్రహాయ శ్రీవేంకటేశాయ
నమః

వేంకటేశ్వరస్వామివారిని గంబుర, పునుగు, జవ్వాజి, మంచి గంధము ఆదిగా గల వివిధ సుగంధద్రవ్యాలతో అభిషేకిస్తారు. పచ్చ కర్పూరంతో కరిగిన కస్తూరి కలిపి స్వామివారి దివ్యమంగళవిగ్రహానికి పూస్తారు. "సర్వగన్ధః సర్వరసః" అన్నట్లు దివ్యపరిమళాలతో భాసించే శ్రీవేంకటేశ్వరస్వామికి పూలకానుకలు సమర్పించి పూజానమస్కారం చేస్తున్నాను.

52. ఓం కేశవాయ శ్రీవేంకటేశాయ నమః

నీవు బ్రహ్మ రుద్రాదుల జన్మకారకుడవు. కంసుని ఆదేశాను సారము కృష్ణుని సంహరించడానికి కేశి అనే రాక్షసుడు వచ్చాడు. వానిని కృష్ణావతారంలో మట్టుపెట్టావు – త్రిజగన్మోహిని, జగదేక

సుందరి, భువనసౌందర్యదేవత అయిన కమలవాసినిని మోహింపజేసి, మైమరపింపజేసి, ప్రేమింపజేసిన కేశసంపద నీది. భక్తుల కేశాలు స్వీకరించి వారి క్లేశాలు తొలగిస్తావు. అందుచేత నీకు కేశవుడనే నామము సార్థకమైంది. అట్టి కేశవనామధారుడైన శ్రీవేంకటేశ్వర స్వామికి యీ దివ్యపూజాసమయములో సుమాంజలి సమర్పిస్తున్నాను.

53. ఓం నిత్యయౌవన మూర్తయే శ్రీవేంకటేశాయ నమః

జగతీ రథాన్ని స్వర్ణపథాలలో నడిపించే సమర్థమైన సారథివి నీవు. జనతకు శాంతి సుఖాలు సమకూర్చే పార్థసారథివి నీవు. నీవు త్రిగుణాతీతుడవు. షడ్వికారాలు నీ దరి చేరవు. పంచకోశాలకు భిన్నుడవు. త్రికాలజ్ఞుడవు. శీతవాతాతపములు నిన్ను బాధించవు. నీవు సర్వశక్తిమంతుడవు. మహాసౌందర్య శోభితుడవు. అట్టి ఓ వేంకటే శ్వరస్వామీ ! నీకు యీ దివ్యార్చనకాలంలో సుమాంజలి సమర్పిస్తున్నాను.

54. ఓం అర్థితార్థ ప్రదాత్రే శ్రీవేంకటేశాయ నమః

నీవు భక్తజనసులభుడవు. కరుణాంతరంగుడవు. కమనీయ రూపుడవు. నీవు పిలిస్తే పలికే ప్రత్యక్షదైవానివి. మొక్కితే చిక్కులు విప్పే మోహనాంగుడవు. 'ఓ స్వామీ' అంటూ పిలిస్తే 'ఆ' అంటూ కదలి వస్తావు. ఆపదలు నివారిస్తావు. అర్థితుల ప్రార్థనలు వ్యర్థం చేయక ప్రసాదించే అర్థితార్థప్రదాతవు. అట్టి ఓ శ్రీవేంకటేశ్వరస్వామీ ! నీకు యీ పవిత్ర సేవాసమయంలో ప్రణామం చేస్తున్నాను.

55. ఓం విశ్వతీర్థాఘహారిణే శ్రీవేంకటేశాయ నమః

ఈ సువిశాల మహీతలంలో మూడుకోట్ల యాభై లక్షల దివ్యతీర్థాలు ఉన్నాయి అవి సర్వమానవుల పాపాలు హరిస్తున్నాయి,

ఆ సకల తీర్థాలలోని కలుషాన్ని, దోషాన్ని, పాపసముదాయాన్ని తొలగించి, వాటికి పవిత్రతను ప్రసాదించే శ్రీవేంకటేశ్వరస్వామికి యీ శుభసమయంలో నమస్కరిస్తున్నాను.

56. ఓం తీర్థస్వామి సరస్స్నాత జనాభీష్ట ప్రదాయినే శ్రీవేంకటేశాయ నమః

గిరిక్షేత్రంలో శేషగిరి అతి పవిత్రమైంది. అర్చావతార మూర్తులలో శ్రీవేంకటరమణమూర్తి అతి ప్రముఖ దేవతామూర్తి. అశేషతీర్థాలలో స్వామి పుష్కరిణి అతి పుణ్యప్రదమైంది. అందుచేత అది తీర్థస్వామి అయింది. అందుకే చేస్తే వేంకటాచల యాత్ర చేయాలి! దర్శిస్తే వేంకటరమణమూర్తిని దర్శించాలి! సేవిస్తే స్వామిపుష్కరిణిని సేవించాలి! ఆ విధంగా వేంకటాచల యాత్ర సాగించి, స్వామిపుష్కరిణిలో స్నానం చేసి, స్వామిని దర్శించిన భక్తజనుల సకల మనోభీష్టాలు, వాంఛితాలు శ్రీనివాసుడు పూరిస్తాడు. అట్టి శ్రీవేంకటేశ్వరస్వామికి నమస్కారం చేస్తున్నాను.

57. ఓం కుమారధారికావాస స్కందాభీష్ట ప్రదాయినే శ్రీవేంకటేశాయ నమః

తిరుమలపై గల అతిపవిత్ర తీర్థాలలో కుమారధారా తీర్థం అతిముఖ్యమైంది. శ్రీనివాసుడు బాలాకుమారుడై ఒక వృద్ధ విప్రుని ఒక తీర్థంలో స్నానం చేయించి అతని జరాభారాన్ని తొలగించి బాలాకుమారునిగా రూపొందించాడు. అందుచేత ఆ తీర్థానికి కుమారధారా తీర్థం అనే పేరు వచ్చింది. అట్టి కుమారధారా తీర్థ సమీపంలో కుమారస్వామి తారకాసురవధజనితమైన బ్రహ్మహత్యా పాతకాన్ని తొలగించుకోవడానికి తపస్సు చేశాడు. అట్టి కుమారస్వామి అభి

మతాన్ని, అభీష్టాన్ని మన్నించిన శ్రీవేంకటేశ్వర స్వామికి నమస్కరిస్తున్నాను.

58. ఓం జానుదఘ్నసముద్భూతపోత్రిణే శ్రీవేంకటేశాయ నమః

పూర్వకాలంలో వేంకటాచలంపై వసువనే కిరాతుడు నివసించేవాడు. అతని భార్య చిత్రవతి. కుమారుడు వీరుడు. ఆ కుటుంబం శ్రీనివాసునకు అంకితమైపోయింది. ఆ నిషాదదంపతులు శ్యామాక తండులాలను శ్రీనివాసుని సన్నిధిని అర్చన చేసే ఒక వైఖానసునికిచ్చి పాకం చేయించి స్వామికి నివేదన చేయించి, ఆ నివేదితాన్నాన్ని భుజించి జీవించేవారు. ఒకనాడు బియ్యాన్ని అర్చకునికిమ్మని కుమారుని నియోగించి తేనె తేవడానికై అడవికి పోయారు. కాలాతిక్రమణం జరిగిన మూలంగా వీరుడు ఆకలితో బాధపడి అన్నము తాను వండి చెట్టుమొదట స్వామికి నివేదించి, తాను భుజించి విశ్రమించాడు. మధువును తోడ్కొని చిత్రవతితో నిషాదుడు మరలివచ్చి, పరిస్థితి గ్రహించి పుత్రునిపై ఆగ్రహించి తనయుని కుత్తుకను కత్తితో ఉత్తరించడానికి సిద్ధపడ్డాడు. భగవానుడు ప్రత్యక్షమై వసువునకు జరిగిన విషయం వివరించి శాంతింపజేసి అదృశ్యుడయ్యాడు. ఆ కిరాతుడు అన్నపానీయాలను త్యజించి పునః పునః ఆ రూపాన్ని దర్శింపకాంక్షించి అన్వేషిస్తూ అరణ్యమంతా తిరుగనారంభించాడు. ఆ సమయంలో తాను చూచిన పంచవర్ణముల శుకాన్ని అన్వేషిస్తూ నారాయణపుర చక్రవర్తి తొండమానుడు కనిపించాడు. నిషాదుడు శ్వేతవరాహ రూపాన్ని గూర్చి తొండమానుని ప్రశ్నించాడు. అతడు తెలియదన్నాడు. తొండమానుడు పంచవన్నెల చిలుక వృత్తాంతాన్ని నిషాదుని అడిగాడు. "అది శ్రీనివాసుని పెంపుడు చిలుక పగలు అడవిలో తిరుగుతుంది. రాత్రి స్వామి సన్నిధికి చేరుతుంది. అద్ది

ఎవరికీ చిక్కడు." అంటూ నిషాదుడు తొండమాను చక్రవర్తికి నివేదించి సాయంసంధ్యలో శ్రీనివాసుని దర్శిద్దామని కోరాడు. రాజు అంగీకరించాడు. స్వామిపుష్కరిణిలో స్నానంచేసి స్వామినిదర్శించి నివేదితాన్నం భుజించి నిషాదునికుటీరంలో విశ్రమించారు. ఒకనాడు కిరాతుడు తొండమాను చక్రవర్తికి తనపొలంలో శ్యామాకాన్ని తింటూన్న శ్వేతవరాహ వృత్తాంతాన్ని, అది వాల్మీకంలో దాగిన వివరాన్ని విన్నవించాడు. రాజు ఆ వరాహాన్ని దర్శింప ఆరాటం చెందాడు. రాజు నిషాదకుటుంబాన్ని అనుసరించి పొలము సమీపించాడు. వారికి వల్మీకంలో సగందాగి జానువులకు పైభాగముమాత్రం దర్శనమిచ్చిన ఆదివరాహస్వామి సాక్షాత్కరించాడు. మిగతా భాగాన్ని చూడాలని కిరాతుడు వల్మీకంత్రవ్వడం ప్రారంభించగా మూర్ఛపోయాడు. అప్పుడు తొండమానుచక్రవర్తి వల్మీకంలో నీల గోక్షీరాభిషేకంతోను, నిషాదపుత్రుడు వీరుడు దివ్యధ్యాన ప్రార్థన తోను స్వామిని సుప్రసన్నుని చేశారు. అంత ప్రసన్నుడైన వరాహ మూర్తి యీవిధంగా ఆదేశించాడు.

"నాహం దృశ్యోస్మి తే పుత్ర సచ్చిదానంద విగ్రహః
కింతు వక్ష్యామి తే పుత్ర బ్రహ్మణా స్థాపితం పురా
శిలారూపంచ వల్మీకే వర్తతే తత్సముద్ధర
విమానం కారయిత్వాచ తస్య పుష్కరిణీతటే
బ్రహ్మాండైశ్చ విధానజ్ఞైః పూజాం కారయమే విభో"

బ్రహ్మపురాణం 8 వ అధ్యాయం. భగవానుని యీ ఆదేశాన్ని నిషాదుడు తౌదలదాల్చి శ్రీస్వామి పుష్కరిణీ తీర్థమందు ఒక దివ్యవిమానాన్ని నిర్మించాడు. వల్మీకంలో గోచరించిన శ్వేతవరాహ స్వామి శిలాప్రతిరూపాన్ని రూపొందింపజేశాడు. శ్రీవైఖానసుల చేత ప్రతిష్ఠింపజేసి, నిత్యారాధనా విధులను, అర్చనాపద్ధతులను ప్రవేశ

పెట్టాడు. ఆ రూపమే యీనాడు శ్రీనివాసుని దర్శనా, ఆరాధన, నివేదనలకు ముందుగా ప్రథమదర్శన, ఆరాధన నివేదనలు అందుకొని, అనుభవించి భక్తులను అనుగ్రహిస్తున్న రూపం ఆవిధంగా వరాహ రూపంగా అవతరించిన శ్రీ వేంకటేశ్వరస్వామికి ప్రథమ నమస్కారం చేస్తున్నాను.

59. ఓం కూర్మమూర్తయే శ్రీవేంకటేశాయ నమః

శ్రీనివాసుడు క్షీరసాగర మథనం కర్తవ్యమని ప్రకటించాడు. మథనరంగం క్షీరసాగరం. దేవదానవులు భాగస్వాములు, మథనకార్య నిర్వాహకులు. మందరపర్వతం కవ్వం. వాసుకి కవ్వపుత్రాడు. వాసుకి తలపట్టి దానవులు, తోకపట్టి దేవతలు లాగి మందరాన్ని త్రిప్పుతున్నారు. మందరం పాలసముద్రంలో తేలడంలేదు. అట్టి విపరీత విపత్కర పరిస్థితిని నివారించడానికై ముకుందుడు మందరపర్వత భారం వహించి మునగకుండా శ్రీకూర్మమై అవతరించి, క్షీరసాగరమథన కార్యక్రమం అవిచ్ఛిన్నంగా సాగి విజయవంతం కావడానికి తోడ్పడ్డాడు. అంతటితో హాలాహలం గగనతలానికి ఎగసింది. దాన్ని నీలకంఠుడు ధరించాడు. పిమ్మట చంద్రుడు పుట్టాడు. ఉచ్చైశ్రవం, ఐరావతం, కౌస్తుభం, కల్పవృక్షం, మహాలక్ష్మి ఉదయించాయి. తరువాత ధన్వంతరి అమృతకలశంతో సాక్షాత్కరించాడు. ఆవిధంగా అమృతావరణానికి తోడ్పడడానికై శ్రీకూర్మంగా ఆవిర్భవించిన శ్రీవేంకటేశ్వరస్వామికి యీ పుణ్యపూజాసమయంలో నమస్కరిస్తున్నాను.

60. ఓం కిన్నరద్వన్ద్వ శాపాన్త ప్రదాత్రే శ్రీవేంకటేశాయ నమః

పూర్వకాలంలో దూర్వాసుని ఆశ్రమానికి కిన్నరుడు భార్యాసమేతుడై వచ్చి కామమోహితులై క్రీడించడంచూచిన దూర్వాసుడు ఆగ్రహించి సింహాద్రి అరణ్యంలో కిరాతదంపతులుగా జన్మించునట్లు శపించాడు. వారు దూర్వాసుని క్షమించమని కోరారు. శ్వేతవరాహ

దర్శనంవల్ల శాపాన్తం కలుగుతుందని శాపమోక్షమార్గం ఉపదేశించాడు. వారు శాకమూలాలు తింటూ జీవిస్తున్నారు. కొంతకాలానికి వారికి చిత్రాంగుడనే కుమారుడు జన్మించాడు. పెరిగి పెద్దవాడయ్యాడు. ఒకనాడు కిరాతకులకు ప్రియంగుధాన్యాలు దొరికాయి. వానిని చక్కజేసి పైరుజేశారు. పంట ఫలోన్ముఖానికి వచ్చింది. ఒక శ్వేతవరాహం కన్నునుండివచ్చి సస్యాన్ని పాడుజేసింది. దాన్ని లోకోత్తరమృగంగా గుర్తించి మండలాధిపతికి నివేదించాడు. రాజు దాన్ని వేటాడబోగా అది విసిగించి వల్మీకంలోకి మాయమైంది. రాజు నిరాశతో, ఆశ్చర్యంతో వరాహస్వరూపతత్వం గ్రహింప ప్రాయోపవేశం చేశాడు. భగవానుడు అశరీరవాణి రూపంగా 'వల్మీకంలో' క్షీరధార తెంపులేకుండా కపిలావులతో అభిషేకం చేయుమని ఆదేశించాడు. బంగారుకడవలతో సమృద్ధిగా నీలగోక్షీరం తెప్పించి రాజు వల్మీకంలో అభిషేకంచేసి శ్రీవరాహస్వామి దివ్యమంగళవిగ్రహాన్ని దర్శించాడు. రాజుతో కిరాతదంపతులుకూడాదర్శించి స్తుతించారు. వరాహభగవానుడు కిరాతదంపతులను శాపవిముక్తులనుజేసి కిన్నరదంపతులుగా రూపొందింపజేసి వారిని స్వస్థానాన్ని అలంకరింపజేశాడు. ఆ విధంగా కిన్నరదంపతుల శాపాన్తంకలిగించడానికై వరాహస్వామిగా అవతరించి కాపాడిన శ్రీవేంకటేశ్వరస్వామికి యీ పవిత్రపూజాముహూర్తంలో నమస్కరిస్తున్నాను.

61. ఓం విభవే శ్రీ వేంకటేశాయ నమః

మోక్షసాధనకై పరతత్వం గ్రహించాలి. వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చామార్గాలలో పరమేశ్వరుని నిజతత్వం ఆవిష్కరింపబడింది. వ్యూహమార్గంప్రకారం పరమేశ్వరుడు సృష్టికి ఆదిలో ఒక బంగారుగ్రుడ్డును సృష్టించాడు. ఆ బంగారుగ్రుడ్డునుండి అసంఖ్యాకములైన అండాలు ఉద్భవించాయి. అవే జీవులుగా పరిగణింపబడు

తున్నాయి. ప్రథమంగా సృష్టింపబడ్డ బంగారుగ్రుడ్డును వైష్ణవాండం అంటారు. ముక్తులైనజీవులు ఆ వైష్ణవాండం చేరుకుంటారు. దానిలో పరమాత్ముడు నిత్యులతో, సిద్ధులతో, ముక్తులతో విహరిస్తుంటాడు. అట్టి పరమాత్మ సాన్నిధ్యం పొందడానికి సామాన్యాండంలో ఉండే జీవుడు పురుష. సత్య, అచ్యుత, అనిరుద్ధస్థితులు పొంది ఆమోద, ప్రమోద, సమ్మోద, వైకుంఠలోకాలు సంపాదించడంలో విష్ణు, మహావిష్ణు, సదావిష్ణు, సర్వవ్యాపి నారాయణావతారాలు సాధనద్వారా సిద్ధింపజేసుకొంటాడు. వాటిని అర్చించడం ద్వారా మోక్షం పొంద వచ్చును.

ఇక విభవావతారాలు విషయం పరిశీలించాలి. సద్ధర్మ సంరక్షణార్థం- దుష్టశిక్షణార్థం పరమేశ్వరుడు అనంతములైన, అసంఖ్యాకములైన విభవావతారాలను వహించాడు వానిలో దశావతారాలు గణనీయమైనవి.

ఆపరమేశ్వరుడు సర్వాంతర్యామియై సర్వజీవుల్లోను సాక్షిరూపంగా నివసిస్తున్నాడు. శీతావాతాతపాల్ని పొందకుండా, లింగభేదాల్ని పాటించకుండా, త్రికాలాతీతుడై, త్రిగుణాతీతుడై పంచకోశములకు భిన్నుడై, షడ్వికారాలకు అతీతుడై, మృత్యుంజయుడై, ద్రిష్టయై, సాక్షియై, జీవుల్లో మెలుగుతున్నాడు. ఆవిధంగా నామరహితునిగాను, సర్వనామధారునిగాను, రూపహితునిగాను, సర్వరూపధారునిగాను అవతరించి, ఆవిర్భవించి తన అనంతకల్యాణ గుణసంపదతో లోకాన్ని సముద్ధరిస్తూ, సర్వజనులఅర్చనలు స్వీకరిస్తూ ఆశీర్వదిస్తున్నాడు. అట్టి అపూర్వమైన వ్యూహావిభవ, అంతర్యామి, అర్చారూపాలలో వెలసి, గోచరించి, సకలజీవులకు మోక్షాన్ని ప్రసాదించే శ్రీవేంకటేశ్వరస్వామికి యీ మధుర మంజుల మనోహార పూజాసమయంలో వినయాంజలి సమర్పిస్తున్నాను.

62. ఓం వైఖానసముని శ్రేష్ఠ పూజితాయ శ్రీవేంకటేశాయ నమః

దైవారాధన విధానాలను క్రమబద్ధం చేసిన ఆగమశాస్త్రాలలో వైఖానస, పాంచరాత్రాగమాలు ప్రముఖమైనవి. ప్రధానమైనవి వైఖానసమహాముని అనంతనారాయణుని నాభిసరోజమందవతరించారు. మునులకు, తపోధనులకు, మహాఋషిపుంగవుల ఆశ్రమాలకు నిలయమైన నైమిశారణ్యంలో మహాతపమాచరించారు. శ్రీవైఖానస భగవచ్ఛాస్త్రాన్ని సంపాదించి శ్రౌతస్మార్త ధర్మరూపమైన ఔఖేయ సూత్రాన్ని రూపొందించి, వైఖానసభగవచ్ఛాస్త్రం విరచించారు. ఆ శాస్త్ర సంచయాన్ని భృగుమరీచ్యత్రికాశ్యపులనే నలుగురు శిష్యుల కుపదేశించారు. అట్టి పరమ వైదికశాస్త్ర సమ్మతమైన వైఖానసుని ఆగమశాస్త్రానుసారంగా నిత్యోత్సవ, వారోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ, సంవత్సరోత్సవ వివిధోత్సవ కృతానందుడయ్యే శ్రీవేంకటేశ్వరస్వామికి యీ పుణ్యపూజాసమయంలో నమస్కరిస్తున్నాను.

63. ఓం సింహాచల నివాసాయ శ్రీవేంకటేశాయ నమః

వైకుంఠ ద్వారపాలకులైన జయవిజయులు శాపవశం వలన హిరణ్యాక్ష, హిరణ్యకశిపులై జన్మించారు. వీరు ముల్లోకాలను గడగడ లాడించారు. వరాహావతారమెత్తి శ్రీహరి హిరణ్యాక్షుని సంహరించాడు. హిరణ్యకశిపుని భార్య లీలావతి, కుమారుడు ప్రహ్లాదుడు. హిరణ్యకశిపుడు బ్రహ్మను గూర్చి తపమాచరించి సజీవునిచేగాని, నిర్జీవునిచేగాని, దేవతచేగాని, మానవునిచేగాని, రాక్షసునిచేగాని, రాత్రి గాని, పగలు గాని, జలంలోగాని, నేలపైనగాని, మరణం పొందకుండునట్లు వరం సంపాదించాడు. ఆ వర సంపాదనానంతరం

సకల జగతీ జనులను తల్లడిల్లజేశాడు. హరినామస్మరణ మహా నేరంగా పరిగణించి అట్టివారికి మరణదండనే విధించేవాడు. శుక్రాచార్యుల కుమారులైన చండామార్కులను ప్రహ్లాదునకు గురువుగా నియోగించాడు. ప్రహ్లాదుడు చదివి, చదువులసారమైన శ్రీహరి భక్తిని మిక్కుటంగా గ్రహించి, ప్రవర్తించాడు. పుత్రుని హరిసేవ తండ్రి హిరణ్యకశిపునకు తీవ్రవేదనను, ఆగ్రహాన్ని కల్పించింది. కొండల నుండి కన్నకుమారుని తోయించాడు. పాముల చేత కరిపించాడు. ఏనుగులచేత త్రొక్కించాడు. సముద్రంలో పడవేయించాడు. ప్రహ్లాదుడు హరిసేవ విడనాడలేదు. బాధపడలేదు. అప్పుడు హిరణ్యకశిపుడు "నీవు సేవించే శ్రీహరి ఎక్కడున్నాడని" ప్రశ్నించాడు. "శ్రీహరి సర్వాంతర్యామి" అని ప్రహ్లాదుడు సమాధానం చెప్పాడు. అంతట తన భవనంలో స్తంభంలో చూపుమని హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని ఆదేశించాడు. ఆదేశిస్తూ గాఢంగాను, బలంగాను ఆ స్తంభాన్ని తన్నాడు. ఆ స్తంభం బ్రద్దలు చేసుకొని నరసింహావతారంగా శ్రీహరి ఆవిర్భవించి బ్రహ్మ యిచ్చిన వరాలకు భంగము రాకుండా హిరణ్యకశిపుని తన పాదాలపై పెట్టి తన నఖాలతో చీల్చి, వధించి, లోకశాంతి సమకూర్చాడు. ఆ విధంగా స్తంభం నుండి ఆవిర్భవించిన దివ్యదృశ్యం అహోబిలమహాక్షేత్రములో గోచరిస్తోంది. అందుచేత అహోబిలం నరసింహుడవతరించడానికి అవకాశం చూపిన దివ్యక్షేత్రం కావడం మూలంగా అది సింహాచలంగా కూడా నామాంతరం పొందింది. ఆ విధంగా నరసింహావతారం ధరించి సింహాచల నివాసం గలిగి, ఆంధ్రదేశంలో సింహాచలం, మంగళగిరి, యాదగిరి ఆదిగా గల దివ్యక్షేత్రాలను సహితం నవనారసింహ క్షేత్రాలుగా రూపొందించిన శ్రీవేంకటేశ్వరస్వామికి యీ పవిత్రపూజాసమయంలో నమస్కరిస్తున్నాను.

64. ఓం శ్రీమన్నారాయణాయ శ్రీవేంకటేశాయ నమః

హిరణ్యాకశిపుని సంహరించిన తరువాత నరసింహావతారం రెండు భాగాలైంది. నరరూపం నరుడయ్యాడు. సింహరూపం నారాయణుడయ్యాడు. వీరు ధర్ముని పుత్రులుగా జన్మించిన విష్ణ్వంశ సంభూతులు, కవ మిత్రులు. వీరు బదరీవనంలో తపస్సు కావిస్తున్నారు. ఇంద్రుడు తపోభంగం కావించడానికై అప్సరసలను పంపాడు. నారాయణుడు తన ఊరువును గోరుతో గీకాడు. అచ్చట నుండి ఒక సుందరాంగి పుట్టింది. నారాయణుని ఊరువుల నుండి జన్మించింది గాన ఆమెకు ఊర్వశి అనే పేరు వచ్చింది. ఆమె సౌందర్యం తిలకించిన అప్సరసలు సిగ్గుతోను, విస్మయంతోను తలలు వంచి తిరోహితులయ్యారు. ఆ విధంగా ఉగ్ర తపమాచరించిన నరనారాయణులు సహస్రకవచుడనే రాక్షసుణ్ని సంహరించడానికి యుద్ధం ప్రారంభించారు. సహస్రవర్షాలు తపమాచరిస్తేనేగాని వానితో యుద్ధంచేసి వాని ఒక కవచం ఛేదించడం సాధ్యం గాదు. నరనారాయణులు వంతుల ప్రకారం తొమ్మిదివందల తొంభై తొమ్మిదివేల సంవత్సరాలు తపస్సు చేసి సహస్రకవచుడనే రాక్షసుని తొమ్మిదివందల తొంభై తొమ్మిది కవచాలు ఛేదించారు. ఒంటి కవచంతో ఆ రాక్షసుడు కర్ణుడుగా జన్మించారు. నరనారాయణులు కృష్ణార్జునులుగా పుట్టి వాణ్ని సంహరించాడు. ఆ విధంగా సహస్రకవచుడనే రాక్షస సంహారం కోసం నరుని సహాయంతో నారాయణునిగా అవతరించి దుష్ట రాక్షస సంహార కార్యాన్ని విజయవంతంగా నిర్వహించి జగతికి, జనతకి సుఖశాంతులు కల్పించిన శ్రీవేంకటేశ్వరస్వామికి యీ పుణ్యపూజా సమయంలో వందనం సమర్పిస్తున్నాను.

65. ఓం సద్భక్త నీలకంఠార్చ్య నృసింహాయ శ్రీవేంకటేశాయ నమః

పూర్వకాలమందు బ్రహ్మదేవుడు సర్వదేవతా సముదాయంలో వేంకటాచలానికి వచ్చి తపస్సు చేసి రావణుని బాధనుండి లోకాన్ని రక్షింపుమని శ్రీనివాసుని అర్థించాడు. దానికి అంగీకరించి సర్వ దేవతల్ని పేరుపేరునా పిల్చి వారి అభీష్టాలు తెలుపుమని కోరగా శంకరుడు తన వంతు వచ్చినప్పుడు శ్రీనివాసుని యీ విధంగా అర్థించాడు.

"స్వామిం స్త్వయి సదా యాత్రి స్థీయతే వేంకటేశ్వర త్వత్తైవ దేవ స్థాతవ్యం మయా వృషగిరీశ్వర"

(వరాహపురాణం)

శ్రీనివాసుని స్థానంలో అక్కడనే తనకో స్థానం ప్రసాదింప వరం అర్థించాడు.

ఆ కల్పంచ వసామేహో వేంకటాహ్వాయ భూధరే
త్వమప్యత్ర మృడానీశ మహాదేవ వసప్రభో
ఉతత్యాకాయామస్యాద్రేః శోభిషేక్షశది శేశ్వర

(వరాహపురాణం)

అంటూ భగవానుడు అంగీకరించి శేషాచలాగ్నేయ భాగంలో నీలకంఠునకు స్థానం నిర్దేశించాడు. తన ప్రమథగణంతో ఉమా సమేతుడై శంకరుడు కపిల తీర్థ తీరంలో నివసింప నారంభించాడు.

కశ్చిత్ క్షితిధరః కుక్షి కక్షోక్షితిరుహోఽక్షయః
త్ర్యక్షాశ్రమః పక్షి యాద్మా వాసప్ల క్షౌక్షకోట దరః

– పద్మపురాణం

అన్నట్లుగా ఆ నీలకంఠుని ఆశ్రమప్రదేశం అలరారుతోంది. దానిలో దివ్యపుష్కరిణి ఉంది. ఒక అపూర్వమైన అశ్మన్యరోధ వృక్షం ఉంది. అది పాపుల తాపాన్ని హరించే కల్పవృక్షంవంటిది. ఆ వృక్షమూలం శంకరసఖ నీలకంఠుని నివాసస్థానం. ఈ పర్వతప్రాంతం అహోబిల నరసింహునిది. కాపున యీ పర్వతానికి విష్ణుః పర్వతానామధిపతిః అందుచేత యీ పర్వతాధిపతియైన నారసింహుని దివ్యమంగళ విగ్రహాన్ని నెలకొల్పి దివ్యభూషణాలతో, దివ్యాయుధాలతో దివ్యాలంకారాలతో, దివ్యపుష్పాలతో, దివ్యసుగంధ ద్రవ్యాలతో నీలకంఠుడు దివ్యసుందరంగా, వైభవోపేతంగా అర్చించి ఆరాధించి సేవించాడు. ఆ విధంగా కపిలతీర్థ సమీపంలో గల నీలకంఠుని ఆశ్రమంలో నీలకంఠునిచే నారసింహస్వరూపునిగా సేవింపబడే శ్రీవేంకటేశ్వరస్వామికి యీ దివ్యపూజాసమయంలో అంజలి ఘటిస్తున్నాను.

66 ఓం కుముదాక్షగణశ్రేష్ఠసైనాపత్య ప్రదాయ శ్రీవేంకటేశాయ నమః

పూర్వకాలంలో దుర్మేధసుడనే రాక్షసుడు లోకకంటకుడై, జనానీకానికి భీతిగొల్పి, బీభత్సం కల్పించి, సుఖశాంతులు దూరం చేశాడు. ఈ పరిస్థితిని నివారింపమని బ్రహ్మదేవుడు శ్రీహరిని అర్థించాడు. భగవానుడు తక్షణమే ఆమోదించి కుముదాక్షుడనే పారిషదునకు గణాధిపత్యాన్ని, విష్వక్సేనునికి సైన్యాధిపత్యాన్ని ప్రసాదించి ఆ రాక్షసుని సంహరింపజేసి లోకంలో వ్యాపించిన శోకతాపాలను హరించాడు. ఆ విధంగా శత్రుసంహారానికి కుముదాక్షునకు గణాధిపత్యం, విష్వక్సేనునికి సైన్యాధిపత్యం అనుగ్రహించి లోకరక్ష గావించిన శ్రీవేంకటేశ్వరస్వామికి యీ శుభప్రదమైన అర్చనా సమయంలో నమస్కారం చేస్తున్నాను.

67. ఓం దుర్మేధః ప్రాణహర్త్రే శ్రీవేంకటేశాయ నమః

దుర్మేధసుడు ఆదిగాగల రాక్షసుల ప్రాణాలను హరించడం ద్వారా దుష్టశిక్షణ, శిష్టరక్షణ భారాన్ని నిర్వహించిన శ్రీ వేంకటేశ్వరస్వామికి నమస్కరిస్తున్నాను.

68. ఓం శ్రీధరాయ శ్రీవేంకటేశాయ నమః

నీ హృదయసీమ లక్ష్మీదేవికి నివాసస్థానం. శ్రీదేవిని ఆవిధంగా వక్షస్థలంలో నిలుపుకొని శ్రీధరుడవయ్యావు శ్రీనివాసుడవయ్యావు. అట్టి శ్రీధరుడైన శ్రీవేంకటేశ్వరస్వామికి నమస్కరిస్తున్నాను.

69. ఓం క్షత్రియాన్తక రామాయ శ్రీవేంకటేశాయ నమః

పరశురాముడు రేణుకా జమదగ్నుల పుత్రుడు. రమణ్వాతుడు, సుసుణుడు, వసువు, విశ్వవసువు యితని సోదరులు. జమదగ్ని రేణుకను వధింపమని పుత్రుల నాదేశింపగా పరశురాముడు వినా మిగతా నల్వురు పుత్రులు నిరాకరించారు. వారిని జమదగ్ని శపించాడు. తండ్రిచెప్పినట్లు తల్లిని పరశురాముడు వధించాడు. తండ్రి సంతోషించి వరం కోరుకొమ్మన్నాడు. తల్లిని బ్రతికింపమనీ, సోదరులశాపవిముక్తిని వరంగా పొందాడు. కొంతకాలానికి తండ్రిని హయహయరాజు సంహరించాడు. తల్లి యిరువదియొక్క మారులు గుండెలుబాదుకొని వెక్కివెక్కి రోదించింది. హయహయుడు తన తండ్రిని చంపాడుగాన క్షత్రియవంశాన్ని యిరువదియొక్కమార్లు నాశనం చేస్తానని పరశురాముడు భీషణశపథం చేశాడు. అంతలో భృగుమహాఋషి వచ్చి తండ్రిపై మంత్రజలం అభిషేకించి సజీవుని కావించాడు. తీవ్రమైన తపమాచరించి మహాశక్తులు సముపార్జించి నర్మదానదిలో స్నానంచేసి పవిత్రగాత్రుడై క్షత్రియసంహారానికి బయలుదేరాడు. కార్తవీర్యునిపై యుద్ధంప్రకటించాడు. మత్స్య, మగధ, నిషాద, విదర్భ, మిథిలా,

కన్యాకుబ్జ, సౌరాష్ట్ర అవంతీ పురరాజులను సంహరించాడు. కార్త వీర్యాని మట్టుపెట్టాడు. ఈవిధంగా అవనీతలంపై గల అవనీపాలకులపై యిరువదియొక్క మార్లు దండయాత్రలుసాగించి, వారిని జయించి, తన భీషణ శపథాన్ని నెరవేర్చుకొని పరశురాముడు తన గాఢమైన మాతృ భక్తిని ప్రదర్శించుకొన్నాడు. పిమ్మట నర్మదలో శుచిర్భూతంగా స్నానంజేసి యీసువిశాల మహీతలాన్ని పరశురాముడు కశ్యపునకు దానంచేశాడు. అట్టి అపూర్వమైన, పరాక్రమసంపన్నమైన, మహా సాహసోపేతమైన పరశురామావతారాన్ని ధరించి జనరంజకంగా, భక్తజనభంజకం నిర్వహించిన శ్రీ వేంకటేశ్వరస్వామికి యీ దివ్య పూజాసమయంలో పుష్పాంజలి సమర్పిస్తున్నాను.

70. ఓం మత్స్యరూపాయ శ్రీ వేంకటేశాయ నమః

వైవస్వతమనువు అర్ఘ్యమిస్తూండగా ఒక మత్స్యం రక్షింపు మంటు దోసిటపడింది. దాన్ని ఒకకుండలో ఉంచాడు. మరునాటికి అది పదహారుఅంగుళాలు పెరిగి మరల రక్షింపమని కోరింది. అంత ఆ మత్స్యాన్ని నూతిలో ఉంచాడు. మరునాటికి ఆకూపం దానిప్రమాణా నికి సరిపోలేదు. అంత ఆమత్స్యాన్ని తటాకంలో ఉంచగా మరునాటికి తటాకాన్ని మించి పెరిగిపోయింది. అంత దాన్ని సముద్రంలో ఉంచాడు. ఈవిచిత్ర మత్స్యపు విపరీతవృద్ధిని గమనించిన మనువు విస్మయచకితుడై "నీచరిత్ర వివరింపుమని" ఆ మత్స్యాన్ని ప్రశ్నిం చాడు. "నేను శ్రీమన్నారాయణుడను. ఈ మత్స్యావతారం ధరిం చాను. ఇక వందసంవత్సరాలలో మహాజలప్రళయం సంభవించి సర్వ సృష్టి నశిస్తుంది. సర్వసత్త్వాల్ని, వేదాల్ని సేకరించి నేను నీకు ప్రసా దించే నావలో భద్రపరచి నాశృంగానికి కట్టు" అంటూ మత్స్యం

వైవస్వతమనువుకు సమాధానించాడు. అతడు మత్స్యదేశాన్ని ప్రళయ సమయములో నిర్వహించాడు. హయగ్రీవుడనే సోమకాసురుడు చతుర్వేదాల నపహరించి సముద్రములో దాక్కొన్నాడు. ఆ మత్స్యావతార స్వరూపుడైన శ్రీమన్నారాయణుడు సోమకాసురుణ్ణి సంహరించాడు. ఈవిధంగా వేదోద్ధారణం, సత్యవ్రతరక్షణం, జగద్రక్షణం నిర్వహించిన మత్స్యావతార స్వరూపుడైన శ్రీవేంకటేశ్వరస్వామికి యీ అపూర్వపూజాసమయములో వినయాంజలి ఘటిస్తున్నాను.

## 71. ఓం పాండవారిప్రహర్త్రే శ్రీవేంకటేశాయ నమః

పాండవుల్ని కౌరవులు పెక్కు యిక్కట్లు పాలుజేశారు. వారి న్యాయమైన రాజ్యభాగాన్ని మాయాద్యూతం నెపంతో హరించారు. ద్రౌపదిని నిండుసభలో అవమానించారు. పైశాచిక రాక్షసకృత్యాలు సల్పారు. భారతయుద్ధానికి ముందు భవిష్యత్తుకై పాండవులు పరిపరి విధాల పరితపించారు. శ్రీనివాసభగవానుడు వారిని వేంకటాచలం సేవింపమని ఆదేశించాడు. వారు వేంకటాచలంవచ్చి శ్రీనివాసకైంకర్యంలో ఒకనిండు సంవత్సరం గడిపారు. శ్రీనివాసుడు స్వప్నంలో సాక్షాత్కరించి కురుక్షేత్రసంగ్రామములో శ్రీకృష్ణావతార స్వరూపంలో కౌరవులను సర్వనాశనం చేసి పాండవుల్ని రక్షించాడు. అట్టి శ్రీవేంకటేశ్వరస్వామికి యీ శుభప్రదమైన అర్చనాసమయములో పుష్పాంజలి సమర్పిస్తున్నాను.

## 72. ఓం శ్రీకరాయ శ్రీవేంకటేశాయ నమః

శ్రీనివాసా! నీవు శ్రీకరుడవు, శుభంకరుడవు, మంగళకరుడవు' దయాసంపత్కరుడవు, దయాసంపదను పంచి యిచ్చెడి సద్భక్తమందారుడవు. ఇహాపరసుఖాల్ని, లౌకిక పారలౌకిక సంపదల్ని ప్రసాదించే శ్రీసంపన్నుడవు, అట్టి శ్రీవేంకటేశ్వరస్వామీ! నీకు నమస్కరిస్తున్నాను,

73. ఓం ఉపత్యకా ప్రదేశస్థ శంకరధ్యాతమూర్తయే శ్రీవేంకటే శాయ నమః

రావణసంహారక ర్తవ్యాన్ని శ్రీనివాసుని అర్థించడానికై బ్రహ్మ దేవతలతో వేంకటాచలం విజం చేశాడు. శ్రీనివాసుడు దివ్య విమానంలో వారికి అపూర్వదర్శనమిచ్చాడు. శంకరుడు శ్రీనివాసుని వేంకటాచలం సమీపంలో తనకు స్థానం కల్పించమని అర్థించాడు. శ్రీనివాసుడు ఆనందంతో అంగీకరించాడు. వేంకటాచల సానువులలో కపిలతీర్థం వద్ద శంకరుడు ఆశ్రమం నిర్మించుకొని నివసించి శ్రీనివాసుని ధ్యానించడం ప్రారంభించాడు. ఆ విధంగా తన పర్వత పార్శ్వమందు ఉనికి కల్పించుకొని సదా సర్వకాల సర్వావస్థల్లోను శంకరునిచేత పూజింపబడి, స్మరింపబడి, ధ్యానింపబడే శ్రీవేంకటేశ్వరస్వామికి నమస్కరిస్తున్నాను.

74. ఓం రుక్మాబ్జసరసీకూల లక్ష్మీకృత తపస్వినే శ్రీవేంకటే శాయ నమః

భృగుమహర్షి త్రిమూర్తుల సత్వగుణసంపద పరీక్షించాడు. ఆ సమయంలో శ్రీహరి వక్షస్థలంపై పాదాఘాతం చేశాడు. ఫలితంగా శ్రీహరికి శ్రీసతితో వియోగం జరిగింది. లక్ష్మీదేవి కరవీరపురానికి కదలిపోయింది. లక్ష్మీప్రసన్నం పొందడానికై పది సంవత్సరాలు కర వీరపురంలో తపస్సు చేశాడు. 'సువర్ణముఖరీ తీరంలో పద్మసరోవరం నిర్మించి దాని సమీపంలో తనకు పద్మాలతో పూజ చేయ'మని లక్ష్మీదేవి శ్రీనివాసుని ఆదేశించింది. ఆ విధంగా పద్మసరోవరం సృష్టించి – సరోవర తీరంలో పన్నెండు సంవత్సరాలు శ్రీమహాలక్ష్మీ దేవి ప్రీతికి శ్రీనివాసుడు మహోగ్రమైన తపమాచరించాడు. ఆ విధంగా పద్మసరోవరతీరంలో లక్ష్మీకటాక్షంకోసం కఠోరదీక్ష

వహించిన శ్రీవేంకటేశ్వరస్వామికి యీ పుణ్యపూజాసమయంలో పద్మాంజలి సమర్పిస్తున్నాను.

(వివరాలకు 21వ నామము చూడండి)

75. ఓం లసలక్ష్మీ కరాంభోజ దత్తకల్హారక స్రజే శ్రీవేంకటే శాయ నమః

మహాలక్ష్మికోసం ద్వాదశవర్ష ప్రమాణమైన దీక్ష పద్మసరోవర తీరంలో శ్రీనివాసుడు ముగించిన శుభసమయంలో ఆమె ప్రసన్నురాలై సాక్షాత్కరించింది. పద్మసరోవరంలోని సహస్ర పత్రకమలం నుండి పద్మరథంతో, పద్మకాంతులతో, పద్మనేత్రియై పద్మవదనయై, పద్మశరీరయై, పద్మాలంకృతయై, పద్మపాణియై, కరపద్మాలతో పద్మహారం ధరించి ఆవిర్భవించింది. ప్రణయ పారవశ్యంతో, పరమభక్తి భావంతో శ్రీనివాసుని గళసీమను కల్హారమాలతో అలంకరించింది. మహాలక్ష్మి సమర్పించి, అలంకరించిన కల్హారపుపూలమాల కాంతులతో, దీప్తులతో, వెలుగులతో ప్రకాశించే శ్రీవేంకటేశ్వరస్వామి పాదాలముందు నల్లకలువలు, తెల్లకలువలు, ఎర్రకలువలు ప్రమోద భరితంగాను, పరమభక్తిభావయుక్తంగాను సమర్పించి సాగి సాష్టాంగ దండప్రణామం చేస్తున్నాను.

(విశేషవివరాలకు 21వ నామం చూడప్రార్థన)

76. ఓం సాలగ్రామ నివాసాయ శ్రీవేంకటేశాయ నమః

సాలగ్రామశిల బహుపవిత్రమైంది. అందుచేత దేవతార్చనలలో సేవింపబడుతూంటుంది. ఇవి గంగానది ఉపనదియైన గండకీ నదిలో విశేషంగా లభ్యమవుతాయి. దశావతార రూపాలలోన్నూ, శతసహస్ర యితర రూపాలలోను సాలగ్రామశిలలు గండకీనదిలో

గోచరిస్తాయి తులసిని మాయచేసి ఆమె భర్తయైన శంఖచూడిని రూపం ధరించి శ్రీమహావిష్ణువు ఆమెతో రమించాడు. ఈ మాయ తెలిసికొన్న తులసి విష్ణువుని శిలకమ్మని శపించింది. శ్రీమహావిష్ణువు శివుణ్ణి ఆ సమయంలో ప్రార్థించాడు. శివుడు విచ్చేసి తులసి గండకీ నదిగా జన్మిస్తుందనీ శ్రీమహావిష్ణువు సాలగ్రామ శిలారూపాలలో దానిలో నివసిస్తాడని ప్రకటించాడు. అట్టి పవిత్ర సాలగ్రామశిలా నిర్మితమైన దివ్యగిరి వేంకటగిరి. అందుచేత విశిష్టాద్వైత సిద్ధాంతం ప్రతిపాదించి, విశ్వవ్యాప్తం గావించిన శ్రీరామానుజాచార్యులు పాదాలలో విష్ణుమయమై సాలగ్రామశిలానిర్మితమైన వేంకటాచలాన్ని త్రొక్కి ఎక్కరాదని మోకాళ్ళతో డేకి అధిరోహించాడని స్థలజ్ఞులు చెప్పారు. "ఆదివాగ్గేయకారు," "పదకవితాపితామహా," "పదకవితా సార్వభౌమ," "పాంచరాత్రా" గమసార్వభౌమాది బిరుదాంకితుడై, శ్రీవేంకటేశ్వరుని నందకఖడ్గపు అంశంలో జన్మించిన అన్నమా చార్యుడు స్వామిని ప్రప్రథమంగా దర్శించడానికి వచ్చినప్పుడు పాద రక్షలతో కొండ ఎక్కనారంభించాడు. మోకాళ్ళముడుపు సమీ పించిన సమయంలో అలసి, డస్సి, వెదురుపొద క్రింద నీరసంతో విశ్ర మించాడు. అమ్మ అలమేలుమంగ సాక్షాత్కరించి పాయసాన్నాలు అన్నమయ్యకు పెట్టి, సాలగ్రామశిలానిర్మితమైన పర్వతాన్ని పాద రక్షలు విసర్జించి అధిరోహించమని ఆదేశించింది. అప్పుడు స్వామి ప్రసన్నుడవుతాడని ఉపదేశించింది. శ్రీపాదరేణువు శిలపై ఉంచుతే శిల బ్రద్దలవుతుంది. సాలగ్రామశిల మాత్రం చలించదు. స్వామివారి విగ్రహం సాలగ్రామశిలా నిర్మితం. నివాసమైన పర్వతం సాలగ్రామ మయం. అట్టి దివ్యసాలగ్రామ నివాసుడైన శ్రీవేంకటేశ్వరస్వామికి ఈ పూజాసమయంలో నమస్కరిస్తున్నాను.

77. ఓం శుకదృగ్గోచరాయ శ్రీవేంకటేశాయ నమః

ఒకానొక సమయంలో మేరుపర్వత శిఖరంపైన సర్వదేవతా సముదాయం చతుర్ముఖుని ఆధ్వర్యంలో సమావేశమైంది. ఆ దేవతా పరిషత్తు వేంకటాద్రి వైభవం గూర్చి విశేషంగా ప్రశంసించింది. ఆ విషయం ఆలించిన శ్రీశుకయోగీంద్రుడు వేంకటాచలానికి తరలి వచ్చి పరిశీలించ నారంభించాడు. అట్టి శుకయోగీంద్రుని శ్రీని వాసుడు పద్మసరోవర ప్రాంతంలో తపమాచరింపమని ఆదేశించాడు. పద్మసరోవరంలో నిత్యం స్నానంచేసి శ్రీనివాసుని ధ్యానిస్తూ తప మాచరించాడు. ఆ సరోవరతీరంలో నూటఎనిమిది యిండ్లు కట్టి వేద వేదాంగవిదులైన పండితప్రకాండులకు దానం చేశాడు. అందుచేత మంగాపురానికి (తిరుచానూరుకి) శ్రీశుకగ్రామం అనే పేరు వచ్చింది. శ్రీనివాసుడు శ్రీ శుకమహాయోగీంద్రునికి సాక్షాత్కరించి తన సాయుజ్యాన్ని ప్రసాదించి మన్నించాడు. శ్రీశుకుడు ఆకాశరాజును పద్మావతిని శ్రీనివాసునకిచ్చి వివాహం చేయుమని కర్తవ్యబోధ చేశాడు. ఆ విధంగా పద్మావతీ శ్రీనివాసుల కల్యాణం కావించ డంలో ప్రముఖసూత్రధారియై ప్రధానపాత్ర వహించాడు. ఆ విధంగా శ్రీశుకుని తన చల్లని చూపులతో మన్నించిన శ్రీ వేంకటేశ్వర స్వామికి మల్లెలమాలలు సమర్పించి నమస్కరిస్తున్నాను.

78. ఓం నారాయణార్చితాశేషజన దృగ్విషాయ శ్రీవేంకటే శాయ నమః

పూర్వకాలంలో నారాయణుడనే బ్రాహ్మణుడు శేషాచలంపై స్వామిపుష్కరిణీ తీరంలో మహోగ్రతపం కావించి లోకాన్ని సుఖ శాంతులతో వర్ధిల్లజేశాడు. శ్రీనివాసుడు సంప్రీతుడై నారాయణు నకు ప్రత్యక్షమయ్యాడు. వరం అర్థించమన్నాడు. నారాయణుడు తనకు యే దివ్యరూపంలో గోచరించాడో ఆ రూపంతో సకల భక్త

జనులకు కన్నులపండు చేయమని శ్రీనివాసుని ప్రార్థించాడు. నారాయణుని వరం పాలించడానికై సర్వజనసులభుడై భక్తులకు నేత్రపర్వమైన దివ్యదర్శనాన్ని ప్రసాదిస్తూన్న శ్రీవేంకటేశ్వరస్వామికి పూల దోసిళ్ళు పాదాలమ్రోల సమర్పించి నమస్కరిస్తున్నాను.

79. ఓం మృగయారసికాయ శ్రీవేంకటేశాయ నమః

వేంకటాచలానికి రెండు యోజనాల దూరంలో సదాశివ కోన వుంది. దాని సమీపంలో అగస్త్యాశ్రమంలో ఆకాశరాజు ఉద్యానవనాలు ఉన్నాయి. వకుళమాలాదేవిసపర్యలు స్వీకరిస్తున్న శ్రీనివాసుడు ఒకనాడు వసంతకాలంలో మృగయావినోదార్థం సారంగ భల్లూక చమరీ శరభ సింహ శార్దూల ఖగ మృగ సంఘాలను సంహరించాడు. ఒక మదమాతంగాన్ని తరుముతూ అశ్వారూఢుడై వచ్చాడు. ఆ గజం ఆకాశరాజు వనంలోకి ప్రవేశించింది. అచ్చట మదమాతంగం నెపంతో గజగమనయైన పద్మావతితో శ్రీనివాసుని సమావేశం సంభవించింది. అది పరిణయంగా పరిణమించింది. శ్రీనివాసుని మృగయారసికత్వం శ్రీనివాసకల్యాణానికి నాంది అయింది. అట్టి కల్యాణప్రదమైన మృగయావినోదత్వం ప్రదర్శించిన శ్రీవేంకటేశ్వరస్వామికి వసంతశ్రీ సముపేతమైన కుసుమాలు సమర్పించి వందనం చేస్తున్నాను.

80. ఓం వృషభాసురహారిణే శ్రీవేంకటేశాయ నమః

పూర్వకాలంలో వృషభాసురుడనే రాక్షసుడు వేంకటాచలంపై తుంబుర తీర్థ సమీపంలో నివశించేవాడు. నృశింహ సాలగ్రామాన్ని ఐదువేల సంవత్సరాలు అర్చించాడు. ప్రతి దినం పూజాసమయంలో తన శిరస్సును ఖండించి స్వామికి నివేదించేవాడు. మరల క్రొత్తతల మొలిచేది. శ్రీనివాసుడు సుప్రీతుడై, ప్రత్యక్షమై వరం కోరుకోమని వృషుణ్ని ఆదేశించాడు. అతడు శ్రీహరితో సంగ్రామాన్ని వరంగా

అర్థించాడు. శ్రీనివాసుడు వరం అనుగ్రహించి, భక్తునితో సంగ్రామం సాగించి, సంహరించి తన సాయుజ్యం ప్రసాదించాడు. అట్టి వృషభాసుర సంహారుడైన శ్రీవేంకటేశ్వరస్వామికి వినమ్రుడనై మల్లికాహారాలు, తులసిథామాలు సమర్పించి భక్తిపురస్సరంగా నమస్కారం చేస్తున్నాను.

(వివరాలకు 3 వ నామం చూడ ప్రార్థన)

## 81. ఓం అంజనా గోత్రపతయే శ్రీవేంకటేశాయ నమః

శ్రీవేంకటేశ్వరుని నివాసమైన తిరుమల కృతయుగసమయంలో వృషాద్రిగాను, త్రేతాయుగ సమయంలో అంజనాచలంగాను, ద్వాపరయుగ కాలంలో శేషశైలంగాను ప్రచారం పొందింది. కలియుగంలో వేంకటాచలంగా వ్యవహారం సంపాదించుకొంది.

త్రేతాయుగ సమయంలో కేసరి అనే రాక్షసుడు పుత్రార్థియై తపస్సు చేశాడు. శంకరుడు ప్రత్యక్షమై పుత్రికను ప్రసాదించాడు. అంజనాదేవి జన్మించింది. తండ్రి యుక్తవయస్సు వచ్చిన అంజనాదేవిని కేసరి అనే కపివరున కిచ్చి వివాహం చేశాడు. ఆమెకు చాలా కాలం సంతానం కలుగలేదు. ఆమె పుత్రలాభం పొందడానికి ఉపాయం చెప్పమని మతంగ మహర్షి నర్థించింది. ఆమె ముని ఆదేశించిన విధంగా బయలుదేరి వేంకటాచలం అధిరోహించింది. స్వామిపుష్కరిణిని సేవించింది. వరాహస్వామిని అర్చించింది. సమీపంలో ఆకాశగంగ ప్రాంతంలో వేయి సంవత్సరాలు తపం గావించింది. వాయుదేవుడు శంకర వీర్య ప్రపూరితమైన మహాఫలాన్ని సమర్పించాడు. దానిని స్వీకరించిన అంజనాదేవి గర్భవతియై మహాబలుడైన, అఖండ వీరుడైన ఆంజనేయస్వామిని కన్నది. అంజనాదేవి తపం గావించిన ప్రదేశం, ఆంజనేయస్వామి ఆవిర్భవించిన పవిత్ర ప్రాంతం

కావడంవలన అది అంజనాద్రిగా ప్రఖ్యాతమైంది. అట్టి అంజనాచల నాయకుడైన శ్రీవేంకటేశ్వరస్వామికి యీ నిర్మల పూజాసమయములో నమస్కరిస్తున్నాను.

82. ఓం వృషభాచలవాసినే శ్రీవేంకటేశాయ నమః

వైవస్వత మనువుకాలంలో ధర్ముడనే ధార్మికసంపన్నుడు వేంకటాచలపై మహోగ్రమైనతపం కావించాడు. అతని తపఃప్రభావం మూలంగా జగతిలో ధర్మం నాలుగుపాదాలా నడిచింది. లోకులలో ధార్మిక ప్రవృత్తి యితోధికంగా వృద్ధి చెందింది. ధర్మునికి వృషుడనే నామాంతరముంది. వృషుని తపస్సుకు సుప్రసన్నుడైన శ్రీవేంకటేశ్వర స్వామి అతనికి ప్రత్యక్షమై వరం అర్థించమన్నాడు. వృషుడు తనుతపం కావించిన పర్వతం తనపేరుమీదుగా పిలువబడే వరం అనుగ్రహింపమని అర్థించాడు. శ్రీనివాసుడు అనుగ్రహించాడు. తదాదిగా అది వృషభాచలంగా వ్యవహారప్రచారం సంపాదించుకొంది. అట్టి వృషభాచలపతియైన శ్రీవేంకటేశ్వరస్వామికి యీ ఏకాంతప్రశాంత పూజాసమయములో నమస్కరిస్తున్నాను.

83. ఓం అంజనాసుత దాత్రే శ్రీవేంకటేశాయ నమః

పుత్రార్థియై మతంగమహర్షి ఆదేశానుసారంగా అంజనాదేవి వేంకటాచలం సమీపించింది. అట్టి అంజనాదేవి శ్రీనివాసుని దర్శించింది. శ్రీనివాసుడు కరుణాదృష్టులు ప్రసరించి ఆమె తపం కావించుకోవడానికి ఆకాశగంగా తీర్థప్రాంతం నిర్దేశించాడు. ఆమె ఆ ప్రాంతములో తీవ్రమైన తపం కావించింది. శ్రీనివాస సంకల్ప ఫలితంగా వాయుదేవుడు వీర్యప్రపూరితమైన ఫలాన్ని అంజనాదేవికి ప్రసాదించాడు. ఆమె స్వీకరించి గర్భవతియై ఆంజనేయస్వామిని ప్రసవించింది. ఆవిధంగా అంజనాదేవికి పుత్రలాభం కల్పించి, ఆంజనేయస్వామిని శ్రావణమాసంలో తనజన్మనక్షత్రమైన శ్రవణానక్షత్రంలో అవతరింప

చేసిన శ్రీవేంకటేశ్వరస్వామికి యీ దివ్య పూజాసమయంలో అంజలి ఘటిస్తున్నాను.

84. ఓం మాధవీయాఘహారిణే శ్రీవేంకటేశాయ నమః

తిరుపతి సమీపంలో శ్రీకాళహస్తి అనే సుప్రసిద్ధమైన శివ క్షేత్రం ఉంది. ఆ మహాక్షేత్రంలో పురంధర సోమయాజి అనే వైదిక నిష్ఠాగరిష్ఠుడైన బ్రాహ్మణోత్తముడు ఉండేవాడు. అతని కుమారుడు మాధవుడు. వేదవేదాంగ విద్యాపారంగతుడు. అతని భార్య చంద్రలేఖ. ఆమె మోము నెలవంకవంటిది. ఆమె రూపవతి, విద్యావతి, గుణవతి. భర్తకు అనుకూలవతి. మాధవుడెంత విద్యావంతుడో, అంత వక్రబుద్ధి కలవాడు.

ఒకనాటి పగటిపూట కామాతురుడై మాధవుడు చంద్రలేఖను కామకేళికి ప్రేరేపించాడు. ఆమె ధర్మోపదేశం చేసి నివారించింది. అతడు మన్మథవాంఛామోహితుడై ఆమె సమాధానాలను నిరాకరించి బలవంతము జేశాడు. ఆమె నిరాదరణతో అంగీకరించింది. సతీపతులు ఒక సుందరమైన ఉద్యానవనంలోకి ప్రవేశించారు. మాధవుడు ఆ సమయములో, ఆప్రదేశంలో ఒకకాంతను చూశాడు. చంద్రలేఖతో తాను ధర్మవిరుద్ధంగా ప్రవర్తించలేనని చెప్పి ఆమెను స్వగృహానికి పంపించాడు.

వనంలో తాను విలోకించిన వనితను మోహించి వరించాడు. మాధవుడు ఆమె కులగోత్రాలను వివరింపమని ప్రశ్నించాడు "నేను అంత్యజాతికాంతను. నావృత్తి నీచమైన పసువువృత్తి. నాదిమధ్య దేశం. నాపేరు కుంతల. మీరు విప్రులుకాన నన్ను వరించరాదు." అంటూ కుంతల సమాధానంచెప్పి మాధవుని వారించింది. కుంతల హితోక్తులను మాధవుడు పెడచెవినిపెట్టాడు. కామాతురుడై భయం, లజ్జ వర్జించాడు. కుంతలను రమించాడు. కుంతల తనను సతిగా స్వీక

రింపమని మాధవుని శాసించింది. మాధవుడు ఆమెను భవునిగా ఉండడానికి అంగీకరించాడు. యజ్ఞోపవీతం త్యజించాడు. వారి సంబంధం మూడు దశాబ్దులకాలం సాగింది. ఇంతలో కుంతల మరణించింది. దానితో మాధవునిమనస్సు వికారంపొందింది. ఆత డున్మత్తుడై సంచరిస్తున్నాడు. ఆసమయంలో ఉత్తరదేశంనుండి రాజులు తిరుమల యాత్రకు బయలుదేరి వెళుతున్నారు. వారిని అనుసరించాడు. వేంకటాచలం అధిరోహించాడు. శ్రీనివాసుడు ప్రసన్నుడై వాని శరీరం నుండి అగ్నిని ఆవిర్భవింపజేసి వాని పాపాలను దహింపజేశాడు. ఆ విధంగా మాధవుని మహాపాపాలను తొలగించి హరించిన శ్రీవేంకటేశ్వరస్వామికి యీఅర్చనాసమయములో నమస్కరిస్తున్నాను.

85. ఓం ప్రియంగు ప్రియభక్షాయ శ్రీవేంకటేశాయ నమః

గుడాన్న, తిలాన్న, ముద్గాన్న, మాషాన్నదధ్యన్నాలు గుడాపూప, తిలాపూప, మాషాపూప, మనోహరమోదకాది సకలరుచికరమైన భక్ష్య భోజ్య చోష్య పానీయాలలో ప్రియంగుధాన్య పాయసాన్ని ప్రియంగా స్వామి సేవిస్తాడు. అట్టి కొఱ్ఱబియ్యం బీదలు, సామాన్యజనులు ఉపయోగిస్తారు. అట్టి కొఱ్ఱబియ్యపు పాయసాన్ని ప్రేమతో స్వీకరించడంద్వారా తననిరాడంబరత్వాన్ని, భోగబాహ్యతను ప్రదర్శిస్తూన్న శ్రీవేంకటేశ్వరస్వామికి యీ ప్రశాంత పూజాసమయములో ప్రియంగుపాయసాన్ని నివేదిస్తూ నమస్కరిస్తున్నాను.

86. ఓం శ్వేతకోలవరాయ శ్రీవేంకటేశాయ నమః

విష్ణుదేవుని ద్వారపాలకులైన జయవిజయులు శాపవశమువలన హిరణ్యాక్ష, హిరణ్యకశిపులుగా జన్మించారు. వారు లోకాన్ని పలు విధాలుగా చికాకుపరచారు. హిరణ్యాక్షుడు లోకకంటకుడై భూమిని చుట్టచుట్టి పాతాళలోకంలోకి విసరివేశాడు. పాతాళంలో శోకతాపా

లతో తల్లడిల్లిపోతూన్న భూమాత నుద్ధరించడానికై శ్రీమహావిష్ణువు శ్వేతవరాహావతారం ధరించి అవనీమాతను పాతాళంనుండి రక్షించాను. హిరణ్యాక్షుని సంహరించి విశ్వశాంతిని నెలకొల్పావు. ఆనాటి నుండి కాలమానంలో శ్వేతవరాహకల్పం యేర్పడింది. ఆవిధంగా పృథ్వీమాతను రక్షించడానికి శ్వేతవరాహావతారం ధరించి, శ్వేత వరాహకల్పానికి నాందీప్రస్తావన చేసిన శ్రీవేంకటేశ్వరస్వామికి యీ పవిత్రపూజా సమయములో నమస్కరిస్తున్నాను.

87. ఓం నీలధేను పయోదారాసేక దేహోద్భవాయ శ్రీవేంకటేశాయ నమః

నీవు కృష్ణావతారం ధరించినప్పుడు గోపాలుడవై నీ మంజుల మురళీమోహనరవంతో గోసముదాయాన్ని అలరింపజేశావు. కాళింది మడుగులోని నీరుత్రాగి ఆవులు చనిపోగా వానిని బ్రతికించావు. కాళింగమర్దనం కావించావు. ఒకనాడు బ్రహ్మ గోవులను, గోపకులను మాయంజేశాడు. నీవు గోవుల, గోపకుల రూపాలుధరించి ఒకసంవత్సరము గడిపావు. ఇంద్రుడు కోపించి రాళ్ళవాన కురిపించగా గోవర్ధన పర్వతాన్ని వ్రేలితో ఎత్తి గోసముదాయాన్ని రక్షించావు. ఈవిధంగా గోరక్షణ కావించావు. గోక్షీరం అంటే నీకు ప్రీతిమెండు. నీ ఆకలి దప్పులు తీర్చడానికి బ్రహ్మ గోవై వచ్చి నిన్ను క్షీరధారలతో సంతృప్తి పరుస్తుండగా గోపాలుడు వధించబోగా ఆ గోవును రక్షించావు. గోవు యజమానియైన చోళరాజును శపించావు. అట్టి గోరక్షకుడవైన నీవు కపిలగోవుల క్షీరాభిషేకం పొందావు. క్షీరసాగర శయనుడవైన నీవు గోక్షీరాభిషేకముతో దివ్యమంగళమూర్తిగా కల్యాణలావణ్యమూర్తిగా ఆవిర్భవించి శ్రీనివాసుడవై తిరుమలపై వెలశావు. అట్టి ఓ వేంకటేశ్వరస్వామి! నీకు యీ పవిత్రపూజాసమయ

ములో గోక్షీరాభిషేకము చేసి, గోక్షీరము నివేదన చేసి ప్రీతిపురస్సర ముగా నమస్కారం చేస్తున్నాను.

88. ఓం శంకరప్రియమిత్రాయ శ్రీవేంకటేశాయ నమః

శ్రీనివాసుడు శంకరునకు ప్రియమిత్రుడు. శంకరుడు భక్తవ శంకరుడై భస్మాసురునకిచ్చిన వరము తనపాలిట శాపముగా పరిణమించింది. భస్మాసురుడు శంకరుని భస్మము చేయడానికి వచ్చాడు. శ్రీహరి జగన్మోహినీరూపం ధరించి భస్మాసురుని ఆకర్షించి తన ఉపాయముతో శంకరునకు అపాయాన్ని తప్పించాడు. ఆవిధముగా శ్రీహరి శంకరునకు ప్రియమిత్రుడయ్యాడు. అట్టి శంకరునకు తన సోదరియైన జ్ఞానప్రసూనాంబిక నిచ్చి శ్రీనివాసుడు కల్యాణోత్సవము కావించాడు. తనకు సమీపంలోని శ్రీకాళహస్తి క్షేత్రములో వారిని నిలిపాడు. ఆ విధముగా శంకరునకు ప్రియాన్ని హితాన్ని నెరపిన శ్రీవేంకటేశ్వర స్వామికి మనఃపూర్వకముగా వందనము చేస్తున్నాను.

89. ఓం చోళపుత్రప్రియాయ శ్రీవేంకటేశాయ నమః

పూర్వకాలములో చోళదేశపురాజుండేవాడు. అతడు ఒకానొక సమయములో మృగయావినోదం కోసమై వేటకు బయలుదేరాడు. మార్గమధ్యములో ఒకనాగకన్య కనబడింది. చోళరాజు నాగకన్య పరస్పరము ప్రేమించుకొన్నారు. సరసశృంగారక్రీడలలో కాలం గడిపారు. పిమ్మట నాగకన్య నాగలోకానికి మరలిపోయింది. రాజు చోళమండలానికి తిరిగిపోయాడు. నాగకన్య తనతండ్రితో జరిగిన వృత్తాంతము నివేదించింది. చోళరాజుతో జరిగిన సమాగమఫలితముగా సద్యోగర్భం ధరించి సకాలములో మహాపురుషలక్షణాలుగల పుత్రుని ప్రసవించింది. అతడు రూపవంతుడై, విద్యావంతుడై, బలవంతుడై, గుణవంతుడై దినదినాభివృద్ధి పొందాడు. తల్లి అనుమతి, ఆశీర్వచనం స్వీకరించి భూలోకములోని చోళరాజ్యానికివచ్చి తండ్రిని కలిసాడు. చక్రవర్తినామం

ధరించి యీ అఖండభూమండలాన్ని యేకచ్ఛత్రాధిపత్యముగా పాలిం చాడు. ఈవిజయపరంపరను, యీ సంతతాభ్యుదయాన్ని చోళపుత్ర ప్రియుడైన శ్రీనివాసుని చల్లనిదీవెనతో, అనుగ్రహంతో, అనుకం పతో సాధించగలిగాడు. ఆవిధముగా చోళపుత్రుడైన చక్రవర్తికి పితృ వాత్సల్యసంపదను, అఖండరాజ్యలాభాన్ని ప్రసాదించి అనురాగముతో, అభిమానముతో, అప్యాయముతో, అమృతహృదయముతో రక్షిం చిన శ్రీవేంకటేశ్వరస్వామికి యీ ప్రశాంతపూజాసమయములో వినమ్రంగా నమస్కరిస్తున్నాను.

90 ఓం సుధర్మిణీ సుచైతన్య ప్రదాత్రే శ్రీవేంకటేశాయ నమః

పూర్వకాలములో చంద్రపురి అనే గ్రామములో కృష్ణశర్మ అనే విప్రుడుండేవాడు. అతని సతీమణి సుధర్మిణి. అతను భార్యాసమే తుడై కాశీయాత్రకు బయలుదేరాడు. గర్భవతియైన భార్య ప్రయాణ బడలిక సహించలేదని చోళరాజైన చక్రవర్తిని సుధర్మిణి రక్షణభారం వహించమని ప్రార్థించాడు. అతడు అంగీకరించాడు. కృష్ణశర్మ కాశీ యాత్రకు సంతోషముగా వెళ్ళాడు. ఆరుమాసాలకు సరిపోయే ఆహార పదార్థాలు, సకలపరికరాలను రాజు సుధర్మిణికిచ్చి ఒక గృహములో ఉంచి గృహద్వారాన్ని గొలుసులతో బంధించాడు. రాచకార్యభారం మూలముగా చక్రవర్తి కృష్ణశర్మ కుటుంబ వృత్తాంతము మరచి పోయాడు. కృష్ణశర్మ కాశీకావడిధరించి రెండు సంవత్సరాలకు తిరిగి వచ్చి భార్య క్షేమసమాచారాన్నిగూర్చి రాజు నర్థించాడు. చక్రవర్తి తన దేవేరితో సుధర్మిణి శ్రీనివాసుని అభిషేకము తిలకించడానికి వెళ్ళిందని, రేపుతిరిగి వస్తుందనీ సమాధానంచెప్పి స్వయంపాకము చేసి కోవడానికి వలసిన సంబరాలు యిచ్చి పంపాడు. ఆవిధముగా ధైర్య ముతో సమాధానముచెప్పిన పిమ్మట సేవకుణ్ణి వారి విశేషాలు సేకరింప మని నియోగించాడు. అతడు మరలివచ్చి ఆగృహంలో అస్థిసంజరా

లున్నాయని నివేదించాడు. బిలమార్గము గుండా శ్రీనివాసుని సమీపించి సేవించి తన ఆవేదనను నివేదించి క్షమించి రక్షించమని చక్రవర్తి ప్రార్థించాడు. "నీవు నా భక్తుడవు. కాన ఆ పాపము నేను చేసినట్లే. నా భక్తుడవైన నీకు యేవిధమైన దౌర్భాగ్యము, దారిద్ర్యము, పాపము రాకుండా చేయడం నా ప్రథమ కర్తవ్యము. మృతులైన వారిని సజీవులను చేస్తాను. ఈ సంఘటన ద్వారా కలియుగములో మహాపాతకికి పాపవిముక్తి చేశాడనే కీర్తిని యీ వెంకటనాథుడు సంపాదిస్తాడు. వెంటనే వారి అస్థులను తోడ్కొని రమ్మని" అంటూ శ్రీనివాసుడు ఆదేశించాడు. చక్రవర్తి ఆ విధంగా చేశాడు. శ్రీనివాసుడు తన సైన్యాధ్యక్షుడైన విష్వక్సేనుని సమీపములోని సరోవరంలో వారి అస్థులను ముంచమని ఆజ్ఞాపించాడు. ఫలితంగా సుధర్మిణీదేవి శిశువుతో సజీవురాలైంది. సుధర్మిణి అస్థులు ముంచబడిన తీర్థం అస్థిసరోవరమై మృతులను సజీవులను చేసే శక్తిని పొంది దేవతల పుష్పవర్షాన్ని అందుకొంది. చక్రవర్తి సుధర్మిణీదేవిని శిశువుతో కృష్ణశర్మకు భద్రంగా అప్పగించాడు. మృతి పొందిన కృష్ణశర్మ ధర్మపత్ని సుధర్మిణి పట్ల అమృతమూర్తియై జీవచైతన్యాన్ని కల్పించి జీవింపజేసిన కరుణాంతరంగుడైన, దయాసముద్రుడైన, భక్తపరాధీనుడైన శ్రీ వేంకటేశ్వరస్వామికి యీ ప్రశాంత పూజాసమయములో నిర్మల గాత్రముతో, నిశ్చలభక్తిభావముతో, అచంచల విశ్వాసముతో నమస్కారము సమర్పిస్తున్నాను.

## 91. ఓం మధుఘాతినే శ్రీవెంకటేశాయ నమః

శ్రీ మహావిష్ణువు వటపత్రశాయియై నిద్రిస్తున్నాడు. నాభి నుండి బ్రహ్మ, కర్ణాలనుండి మధుకైటభులు జన్మించారు. మధుకైటభులు తమ జన్మస్థానము గ్రహింపలేక తాము శక్తివలన పుట్టామని

భావించి, ఆమెనుపాసించి విపరీత బలసంపన్నులయ్యారు. విక్రమగర్వముతో వారు బ్రహ్మను బాధింపజొచ్చారు. బ్రహ్మపై యుద్ధము ప్రకటించారు. బ్రహ్మ వారికి భయపడి శ్రీమహావిష్ణువును ప్రార్థించాడు. యోగనిద్రాముద్రితుడైన శ్రీహరి మేల్కాంచలేదు. యోగనిద్రను తొలగిపొమ్మని ప్రార్థించి బ్రహ్మ కృతార్థుడయ్యాడు. విష్ణువు మేల్కాంచి చతుర్ముఖునకు అభయమిచ్చాడు. మధుకైటభులతో యుద్ధము ప్రారంభించాడు. వారిపై విజయము సాధించడం కష్టమైంది, ఉభయులపై యుద్ధం చేయడంతో అలసిపోయి విశ్రాంతి కోరాడు. ఆ రాక్షసులు యుద్ధాన్ని నిలిపారు. అప్పుడు లక్ష్మీపతి శక్తిని ప్రార్థించగా ఆమె వారి నావహించి మోహితులను చేసింది. అప్పుడు శ్రీమన్నారాయణుడు మీరు నాపై విజయము సాధించడము అసాధ్యం, అసంభవం కనుక మీరు శరణు కోరండి" అంటూ మధుకైటభులతో వచించాడు. వారు అహంభావంతో, అహంకారముతో, మహాగర్వముతో "నీవు మాతో యుద్ధంలో పరాజయం పొందడం అనివార్యం. కనుక వరం అర్థించు. ప్రసాదిస్తాం" అంటూ సమాధానించారు. అంత నారాయణుడు తన చేతిలో వారు మృతులగునట్లు వరము కోరాడు. వారు భయపడ్డారు. మాట తప్పడానికి సంకోచించారు. ప్రాణరక్షణోపాయమార్గాన్వేషులై మమ్ము జలము లేని చోట చంపుమని శ్రీహరిని కోరారు. అప్పుడు సర్వము జలమయమై వుంది. శ్రీమహావిష్ణువు తన యూరువుల్ని మహావిశాలంగా పెంచి వానిపై మధుకైటభుల్ని సంహరించాడు. వారి మేధ తెగి పడి భూమిగా రూపొందింది. వారే గజకచ్ఛపాలై పరస్పరము పోరాటం సాగించుకొంటున్నారు. అమృతాన్వేషణకై బయలుదేరిన గరుడుడు యీ గజకచ్ఛపాలను భక్షించాడు. ఈవిధంగా మహావిష్ణుమూర్తి స్వరూపములో మధుకైటభరాక్షసులను సంహరించి బ్రహ్మ

దేవుని సృష్టికార్యక్రియానికి అంతరాయము తొలగించిన శ్రీ వేంక టేశ్వరస్వామికి నమస్కారము చేస్తున్నాను.

92. ఓం కృష్ణాఖ్య విప్ర వేదాన్త దేశికత్వప్రదాయ శ్రీవేంకటే శాయ నమః

పూర్వకాలంలో కృష్ణశర్మ సహధర్మచారిణి సుధర్మిణిని చక్ర వర్తి రక్షణభారములో ఉంచి కాశీయాత్రకు పోయి వచ్చాడు. అతడు రాజకార్య నిమగ్నుడు కావడము మూలంగా సుధర్మిణిని యోగ క్షేమాలు చూడలేకపోయాడు. ఆమె మరణించింది. శ్రీనివాసుడు ఆమెను చక్రవర్తి ప్రార్థనపై సజీవరాలుని జేశాడు. సుధర్మిణీ కృష్ణ శర్మలు శ్రీ వేంకటేశ్వరస్వామి దర్శనానికి తమ కృతజ్ఞత తెలుపుకోవ డానికి వెళ్ళారు. మార్గమధ్యములో సుధర్మిణి శ్రీనివాసుని కుక్షిలో తాను నివసించాననీ దానిలో సర్వదేవతాసముదాయాన్ని, చతుర్దశ భువనాలను, సప్తసముద్రాలను చూచానని భర్తతో చెప్పింది. "నీవు ఉత్తమురాలవు, పుణ్యవంతురాలవు. నీ జీవితము చరితార్థమైంది, ధన్యమైంది" అంటూ కృష్ణశర్మ సుధర్మిణిని అభినందించాడు. వారు శ్రీనివాసుని సమీపించారు. స్వామి దివ్యమంగళరూపాన్ని, ప్రసన్న సుందరస్వరూపాన్ని సందర్శించారు. తన్మయులై స్వామివారి అనంత కల్యాణగుణాలను ప్రశంసించారు. కృష్ణశర్మ "స్వామీ! నా సతీమణి జీవితాన్ని పునీతం కావించావు. భాగ్యసంపన్నము చేశావు. ఈ నా జన్మము వృథాగా పరిణమించింది. నా వేదాధ్యయనం, తపస్సు, తీర్థసందర్శనం వ్యర్థమయ్యాయి. సార్థకమయ్యే జీవితం - చరితార్థ మయ్యే జీవితం - నీ పాదసేవలో అంకితమయ్యే జీవితం ప్రసాదించు స్వామీ! అంటూ దీన ఆవేదనారవాలు కావిస్తూ, నతమస్తకుడై శ్రీనివాసుని అర్థించాడు. దానికి శ్రీనివాసుడు సుప్రసన్నుడై

"ఉత్తరజన్మలో నా గుడిగంట అంశలో నీవు వేదాంతదేశికుడవై జన్మిస్తావు. అప్పుడు నీ ఊహాలు, ఉద్దేశాలు, ఆశలు, ఆకాంక్షలు, ఆదర్శాలు నెరవేరుతాయి, సిద్ధిస్తాయి" అంటూ కృష్ణశర్మకు వరము అనుగ్రహించాడు. క్రీ.శ. 1268వ సంవత్సరంలో కంచీపురంలో ఒక సామాన్య కుటుంబంలో వెంకటనాథుడు జన్మించాడు. ఉత్తరార్కాటు జిల్లాలోని క్రొత్తకడలూరు పట్టణ సమీపంలోని తిరువహీంద్ర పురములో యితడు తపస్సు కావించాడు. వేదవేదాంగాల్ని పురాణేతిహాస ఆగమశాస్త్రాదులను అవలోకించాడు. ఆసేతు శీతనగపర్యంతము గల సకలక్షేత్రాలను, సర్వతీర్థాలను సేవించాడు. ఇరవై యేండ్లు నిండకమునుపే యీపై కార్యాలు సాధించాడు. ఇరవయ్యో యేట కాంచీపురం చేరాడు. శ్రీరంగనాథక్షేత్రమునుండి అళవందారు శిష్యుల ఆదేశము శ్రీరంగనాథుని శాసనము పురస్కరించుకొని శ్రీరంగం వెళ్ళాడు. శ్రీరంగంలో తిరుమంగై ఆళ్వారు ప్రవేశపెట్టిన సంవత్సర అధ్యయనోత్సవము జరగరాదనీ, తొమ్మిదవ శతాబ్దంలో నాథముని ప్రవేశపెట్టిన ఆళ్వారుల ద్రావిడదివ్యప్రబంధపఠనం రంగనాథుని ఆలయంలో సాగరాదనీ అచ్చట అద్వైతవాదులు అభ్యంతర పెట్టారు. వారితో వెంకటనాథుడు వాదించి జయించి ఆ కార్యక్రమాలు విజయవంతంగా సాగించాడు. దానికి గుర్తుగా శ్రీనివాసుడు వెంకటనాథునకు వేదాంతదేశికుడనే బిరుదును ప్రసాదించాడు. విద్యారణ్యస్వామికి సమకాలికుడై వేదాంతదేశికుడు విశిష్టాద్వైతమత ప్రచారకుడై సంస్కృత, తమిళ, మణిప్రవాళభాషలలో తామరతంపరగా అపూర్వగ్రంథాలు రచించాడు. శ్రీవేంకటనాథుని దయావిశేషం గురించి "దయాశతకం" రచించాడు. ఆ విధంగా వేదాంతదేశికుడు తన సర్వస్వం, జీవితసర్వస్వం శ్రీనివాసుని పాదసేవకు అంకితం చేసి

తన జీవితాన్ని ధన్యము కావించుకొన్నాడు. ఆ విధముగా తన గుడి గంట అంశలో కృష్ణశర్మను వేదాంత దేశికునిగాను, తన కౌస్తుభపు అంశలో శఠగోపయతీంద్రుని తన నందకఖడ్గపు అంశలో అన్నమయ్యను అవతరింపజేసి వారి జీవితాన్ని చరితార్థము చేసి వారిద్వారా లోకోద్ధరణ సాధించిన శ్రీవేంకటేశ్వరస్వామికి యీ దివ్య పూజా సమయములో భక్తిపురస్సరంగా నమస్కరిస్తున్నాను.

93. ఓం వరహాచలనాథాయ శ్రీవేంకటేశాయ నమః

భృగువు కావించిన త్రిమూర్తుల పరీక్ష శ్రీనివాసునకు, శ్రీ సతికి వియోగం కల్పించింది. శ్రీనివాసుని వియోగంతో వేంకటాచలానికి వచ్చి స్వామిపుష్కరిణీ తీరంలో ఒక తింత్రిణీ వృక్షసమీపములోని వల్మీకంలో పరున్నాడు. మాయాగోవు యథాప్రకారము వల్మీకంలోని శ్రీనివాసునకు పొదుగు జారవిడచి క్షీరం నింపుతోంది. రాజు భార్యచేత కోపింపబడిన గోపాలుడు తన కఠారాన్ని గోవుపై ప్రయోగింప ప్రయత్నించాడు. విజ్ఞతాభావముతో, కృతజ్ఞతాభావముతో తన్ను సాకి పోషించిన ధేనువును కాపాడడానికై గోవుకీ, గోపాలునికీ మధ్య నిలిచాడు. గోపాలుని కుఠారఘాతము శ్రీనివాసుని శిరస్సునకు బలంగా తగిలింది. దానితో సప్తతాళ ప్రమాణమైన రక్తస్రావము గాయం నుండి వెలువడింది. దానికి చికిత్సకై కొండలపై తిరుగుతూండగా శ్రీనివాసుడు వరాహస్వామిని కలిసాడు. శ్రీ వరాహస్వామి శ్రీనివాసుని శ్రియఃపతిగా గుర్తించాడు. అతని వృత్తాంతము సమగ్రంగా గ్రహించాడు. వేంకటాద్రిపై నివాసం యేర్పాటు చేసుకోవడానికై పాదశత పరిమితమైన స్థలము యేర్పాటు చేయమని శ్రీనివాసుడు శ్రీవరాహస్వామిని అర్థించాడు. శ్రీవరాహుడు దానికి మూల్యము చెల్లించమన్నాడు. స్థలానికి మూల్యంగా ప్రథమదర్శనం,

ప్రథమనైవేద్యం. శ్రీవరాహునికి చెల్లేలాగ శాశ్వతమైన యేర్పాటు చేస్తానని శ్రీనివాసుడు బాస చేశాడు. శ్రీవరాహుడు ఆ నిబంధనలకు అంగీకరించి పాదశతపరిమిత స్థలాన్ని శ్రీనివాసునకు సమర్పించాడు. తన సేవకురాలైన వకుళమాలను శ్రీనివాసుని సేవకు నియోగించాడు. ఆ విధముగా వరాహాచలంపై పాదశత ప్రదేశం తీసికొని క్రమంగా ఆ పర్వతాన్నే ఆక్రమించి వరాహాచలనాథుడైన శ్రీవేంకటేశ్వరస్వామికి యీ ఏకాంతపూజాసమయములో భక్తిపురస్సరంగా వినమ్రుడనై నమోవాకాలు సమర్పిస్తున్నాను.

94. ఓం బలభద్రాయ శ్రీవేంకటేశాయ నమః

శ్రీమహావిష్ణువు శ్రీరామునిగాను, శేషుడు లక్ష్మణస్వామిగాను అవతరించారు. శ్రీహరి శ్రీకృష్ణునిగాను, ఆదిశేషుడు బలరామునిగాను అవతరించారు. బలరాముడు రోహిణీ వసుదేవుల కుమారుడు. జనులను రమింపజేయుట చేత రామునిగాను, యమునసంరక్షణ చేత సంకర్షణుని గాను, బలవంతుడగుట చేత బలరామునిగాను పేరుపొందాడు. శ్రీకృష్ణునకు చేదోడు వాదోడై మెలిగాడు. ఈ విధముగా హలాయుధుడైన బలరామావతారము ధరించిన శ్రీవేంకటేశ్వరస్వామికి యీ మనోహర పూజాసమయములో నమస్కరిస్తున్నాను.

95. ఓం త్రివిక్రమాయ శ్రీవేంకటేశాయ నమః

బలిచక్రవర్తి ముల్లోకాలు ఆక్రమించి పాలిస్తున్నాడు. దేవతల ప్రభావము తగ్గిపోయింది. ఇంద్రుడు స్వర్గాధిపత్యము కోల్పోయాడు. శ్రీహరిని దేవతలు రక్షింపమని ప్రార్థించారు. శ్రీహరి వారిని మన్నించి, అదితి కశ్యపులకు వామనుడుగా జన్మించాడు. ఉపనయనం అయిన పిమ్మట బ్రహ్మచారులవలె భిక్షాటనము మొదలుపెట్టి బలిచక్రవర్తిని సమీపించాడు. బలి "నీకు కావల్సిన వరము అర్థించు" మంటూ వామనుని కోరాడు. వామనుడు మూడడుగుల భూమి

మాత్రం అర్థించాడు. బలి అంగీకరించాడు. రాక్షస గురువైన శుక్రాచార్యుడు బలిని దానము నిరాకరింపమని ఉపదేశించాడు. బలిచక్రవర్తి వాగ్దానభంగానికి అంగీకరింపలేదు. వామనునికి బలి మూడడుగులు భూమి ధారపోస్తుండగా శుక్రుడు కీటకమై జారీ కొమ్ములో అడ్డుపడ్డాడు. వామనుడు పుల్లతో పొడిచాడు. శుక్రుడు ఏకాక్షుడయ్యాడు. బలి దానజలము పోశాడు. వామనుడు విశ్వరూపము ధరించాడు. వటుడు భూనభోంతరాళం బంతగా వ్యాపించి పోయాడు. తన త్రివిక్రమ స్వరూపంతో ఒక పాదముతో భూమిని, ఒక పాదముతో గగనతలాన్ని ఆక్రమించాడు. మూడవ అడుగు స్థలము యిమ్మని వామనుడు బలిచక్రవర్తిని కోరాడు. మూడవ పాదము తన శిరస్సుపై నిలపమన్నాడు. వామనుడు బలిని రసాతలానికి అణచివేసాడు. ఈవిధముగా వామనరూపములో తన త్రివిక్రమ పరాక్రమాన్ని ప్రదర్శించిన శ్రీ వేంకటేశ్వరస్వామి చరణ విన్యాసానికి అంజలి సమర్పిస్తున్నాను.

96. ఓం మహతే శ్రీవేంకటేశాయ నమః

"అణోరణీయన్ మహతో మహీయాన్" అనే ప్రమాణ వాక్యము వింటూంటాము. భగవానుడు అణువులలో పరమాణువై ఉంటాడు. ఉన్నత ప్రమాణంగల వస్తువుకంటె మహోన్నతుడై భాసిస్తూంటాడు. సూక్ష్మమైన మత్స్యకూర్మావతారాలు ధరించాడు. త్రివిక్రమ స్వరూపమైన వామనావతారము ధరించాడు. చీమలో బ్రహ్మ కూడా సంచరిస్తూంటాడు. అట్టి శ్రీవేంకటేశ్వరస్వామికి నమస్కారము చేస్తున్నాను.

97. ఓం హృషీకేశాయ శ్రీవేంకటేశాయ నమః

హృషీక మంటే విషయేంద్రియ ప్రధానమైన ప్రపంచము అని భావం. దీని కతీతుడై యున్మిషితంగా ధరించుటచేత శ్రీహరికి

హృషీకేశుడనే నామము సిద్ధించింది. ప్రపంచ వ్యామోహాలల్లో, విషయవాంఛలలో నిరంతరము కాంతాకనకాల ఆకర్షణాలలో చిక్కుకొనే జనుల మనస్సులను కలుషరహితముచేసి, పరిశుద్ధం గావించి వారి హృదయాలు తన పాదాలపై నిలిపి ధ్యానించునట్లుచేసే హృషీకేశుడైన శ్రీవేంకటేశ్వరస్వామికి యీ నిర్మల పూజాసమయములో నమస్కారం చేస్తున్నాను.

98. ఓం అచ్యుతాయ శ్రీవేంకటేశాయ నమః

శ్రీహరికి ఆత్మార్పణము చేసికొన్న నిజభక్తుల హృదయాలలో నిరంతరము అతడు నివసిస్తాడు. ఆశ్రియించిన భక్తుణ్ణి, దాసుణ్ణి, తన వానిగా శ్రీమన్నారాయణుడు చేసికొంటాడు. అట్టివారిలో తాను చ్యుతి లేకుండా వుంటాడు. వారిని తనలో నింపుకుంటాడు. అందుచేత అచ్యుతుడయ్యాడు. అంతేకాదు శ్రీమన్నారాయణుడు బ్రహ్మ, రుద్ర ఇంద్రాదులతో ఆవిర్భవించినా, వారు నాశనానికి గురియైనా తాను నాశరహితుడై, ఆద్యంతరహితుడై, సర్వాంతర్యామి స్వరూపుడై, అచ్యుతుడై భాసిస్తాడు. ఆవిధముగా దేవతలలో అచ్యుతుడై, భక్తులపాలిట అచ్యుతుడైన శ్రీవేంకటేశ్వరస్వామికి యీ పూజాసమయములో వినయాంజలి సమర్పిస్తున్నాను.

99. ఓం నీలాద్రి నిలయాయ శ్రీవేంకటేశాయ నమః

ఋష్యమూక పర్వతం నుండి వానరసైన్యంతో రావణవధార్థము ప్రయాణమైన శ్రీరాముడు వేంకటాచలం అధిరోహించాడు. ఆకాశగంగ సమీపంలో అంజనాదేవి ఆతిథ్యము స్వీకరించాడు. రామునితో వచ్చిన సుగ్రీవ, అంగద, జాంబవంత, నీలాది కపి శ్రేష్ఠులలో నీలుని యీ పర్వతపు ప్రకృతిరమణీయత విశేషంగా ఆకర్షించింది. అందుచేత నీలుడు యీ పర్వతంపై శ్రీవేంకటేశ్వరస్వామి

నుద్దేశించి తపము కావించాడు. నీలుడు తపమాచరించిన పర్వతము కావడమువలన అది నీలాద్రిగాను, నీలగిరిగాను వ్యవహార ప్రాచుర్యము సంతరించుకొంది. అట్టి నీలగిరిపై భక్తపరాధీనుడై నివసించే శ్రీవేంకటేశ్వరస్వామికి యీపకాంతపూజాసమయములో నమస్కరిస్తున్నాను.

100. ఓం క్షీరాబ్ధినాథాయ శ్రీవేంకటేశాయ నమః

శ్రీమన్నారాయణుడు వైకుంఠవాసం చేస్తూన్న సమయములో భయంకర మకర దంష్ట్రావళి జిక్కిన గజేంద్రుడు పాహి పాహి అంటూ రక్షించమని ప్రార్థించాడు. వైకుంఠనగరిలోని ఉద్యానవనములో ఆమూల సౌధంలో రమాపతి వివాదప్రోద్ధత కుచోపరిచేలాంచలాన్ని వీడక శంఖ చక్రాల్ని ధరింపక, పరివారాన్ని పిలువనంపక, గరుత్మంతుని అధిష్ఠింపక, కాలినడకను గజ ప్రాణ రక్షణ కావించడానికి వెళ్ళాడు. గజేంద్రుని రక్షించాడు. భూజనుల రక్షణసత్వరముగా సాగించడములో పరమపదనివాసము కాలహరణానికి హేతువని భావించి, భక్తత్రాణకై అత్యంత వ్యవహితమైన వైకుంఠాన్ని విడచి, భూజనులకు సన్నిహితంగాను, సమీపంగాను ఉండే పాలకడలిపై శేషశయనుడై రమాపతి సేవలను ప్రీతిపూర్వకముగాను, ప్రేమపూర్వకముగాను స్వీకరిస్తున్నాడు. ఆవిధముగా క్షీరాబ్ధినాథుడైన శ్రీవేంకటేశ్వరస్వామికి యీ పుణ్యపూజాసమయములో క్షీరమును నివేదించి నమస్కరిస్తున్నాను.

101. ఓం వైకుంఠాచలవాసినే శ్రీ వేంకటేశాయ నమః

శ్వేతవరాహరూపియైన శ్రీహరి యీలోకములో కొంతకాలము ఉండడానికి నిశ్చయించుకొన్నాడు. అర్హమైన స్థలం సంపాదించడానికై అన్వేషించాడు. గోమతీనదికి దక్షిణంగా అరవై యోజనాల దూరంగాను, పూర్వసముద్రానికి పశ్చిమముగా ఐదు యోజనాల దూరంగాను, ఉన్న సువర్ణముఖీనదికి ఉత్తరముగా ఉండే దివ్యస్థలాన్ని తన నివాసస్థానముగా నిశ్చయించాడు. గరుడుని వైకుంఠానికి వెడలి క్రీడా

ద్రిని కొనిరమ్మని ఆజ్ఞాపించాడు. వైకుంఠంలోని క్రీడాచలం అప్రాకృతమై, అమేయమై, సర్వరత్నమయమై ఒప్పారుతోంది. బంగారుశిఖరముతో మెరసిపోతోంది. ఉపనిషదాత్మకమై వెలుగుతోంది. సురభుగ్మాలతో శోభిస్తోంది. దానిని ఆశ్రయించిన పక్షిసంఘాల ఆలాపాలాతో శ్రవణానందము కలిగిస్తోంది. పుష్పించిన లతల దివ్యసౌరభముతో గుభాళిస్తోంది. గలగలపారే సెలయేళ్ళ మధుర, మంజుల, మనోహర, శ్రావ్య, సరస, సంగీత నాదాలతో ప్రతిధ్వనిస్తోంది. నిత్యముక్తులచేత, నిత్యశూరులచేత, కామరూపులచేత సేవింపబడుతోంది. మూడు యోజనాల వెడల్పు, ముప్పైయోజనాల పొడవుకలిగిన, శేషరూపమైన, శ్రీహరికి శేషభూతమైన, సర్వభూతాలకూ శేషియైన వీక్షణమాత్రంచేత మోక్షముప్రసాదించి, నారాయణగిరి నామముతో వ్యవహరింపబడే శ్రీనివాసుని క్రీడాచలాన్ని వైకుంఠంనుండి గరుడుడు భుజానధరించి క్షణకాలములో తోడ్కొని వచ్చాడు. శ్రీనివాసుడు నిర్దేశించిన స్థలములో ఉంచాడు. కోటి సూర్యసమప్రభలతోకూడిన దివ్యవిమానములో శ్రీనివాసుడు శంఖ చక్ర గదాధరుడై వైకుంఠం నుండి కొనిరాబడిన క్రీడాచలంపై ఉద్భవించాడు. ఆ విధముగా వైకుంఠాచలవాసుడైన శ్రీవేంకటేశ్వరస్వామికి యీప్రశాంత పూజా సమయములో నమస్కరిస్తున్నాను.

## 102. ఓం ముకుందాయ శ్రీ వేంకటేశాయ నమః

జీవితములో సుఖం సుఖభ్రాంతి. దుఃఖం దుఃఖభ్రాంతి. హరి ముకుందుని సేవించని జీవితము వ్యర్థం, నిరర్థకం, ప్రపంచానికి అనర్థకం. అట్టివారి జీవఫలం చేదువిషం. అనన్య చింతతో, దాస్యభావంతో, భక్తిప్రపత్తితో, శరణాగతిభావంతో శ్రీహరికి ఆత్మార్పణం చేసికొన్న జీవితము ఉత్తమమైంది. అట్టి భక్తుల భవబంధాలు ఛేదించి వారి కలుషాన్ని, పాపాన్ని హరించి, వారికి శ్రీహరి ముక్తిమార్గము సుగమం,

సులభం చేస్తాడు. అందుచేత శ్రీహరి ముకుందు డయ్యాడు. ఆ విధంగా భక్తులకు మోక్షసామ్రాజ్య పట్టాభిషేకము ముక్తి కాంతా కరగ్రహణము చేయించే ముకుందుడైన శ్రీవేంకటేశ్వరస్వామికి మోక్షార్థినై నమస్కరిస్తున్నాను.

103. ఓం అనన్తాయ శ్రీవేంకటేశాయ నమః

సృష్టిలోని చతుర్దశ భువనాలు నీ అడుగుజాడల్లో నడుస్తున్నాయి. సమస్త చరాచరజీవులు నీ కనుసన్నలలో మెలగుతున్నాయి. సృష్టికర్త చెప్పుచేతల్లో నడుస్తున్నారు. సప్తఋషులు అష్టదిక్పాలకులు, నవగ్రహాధిపతులు, ద్వాదశాదిత్యులు నీ ఆజ్ఞానువర్తులై సంచరిస్తున్నారు. ద్వంద్వాలు, త్రిగుణాలు, చతుర్విధపురుషార్థాలు, పంచభూతాలు, పంచకోశాలు, షడ్వికారాలు, సప్తజ్ఞానభూమికలు, అష్టసిద్ధులు, నవరసాలు నీ అనంతగుణాలకు అనంతవ్యాప్తిత్వానికి నిదర్శనాలై భాసిస్తున్నాయి అందుచేత నీవు అనంతుడవు. ఆద్యంతరహితుడవు. ఆనన్తుని సేవకునిగా, శయనంగా, శైలరూపంగాను చేసుకొని క్రీడించే అనన్తస్వరూపుడైన శ్రీవేంకటేశ్వరస్వామిని అనంతనామాలతో పిలుస్తూ. అనంతమైన పుష్పాలు సమర్పిస్తూ, అనంత సేవలు చేస్తూ అనంతంగా నమస్కారాలు సమర్పిస్తున్నాను.

104. ఓం విరించాభ్యర్థితానీత సౌమ్యరూపాయ శ్రీవేంకటేశాయ నమః

హిరణ్యాక్షుడు లోకోపద్రవంగా వ్యవహరించడాన్ని సహించలేని శ్రీహరి మహాభయంకరమైన, అతిభీతావహమైన, విపరీత బీభత్సరస ప్రధానమైన శ్వేతవరాహావతారాన్ని ధరించి హిరణ్యాక్షుని సంహరించి, వాని రక్తపానము గావించి అవనీమాత నుద్ధరించాడు. భయమువల్ల జనంలో కోలాహలం చెలరేగింది. జనం ఆ అవతారాన్ని

చూచి తల్లడిల్లి మూర్ఛపోతున్నారు. ఉగ్రస్వరం భరించలేక పోతున్నారు. బ్రహ్మదేవుడు సృష్టిజనుల తరపున ఉగ్రస్వరూపాన్ని ఉపసంహరించుకోమని శ్రీహరిని అర్థించాడు. శ్రీహరి మన్నించి సౌమ్యసుందరమైన సర్వజన సమ్మోహనమైన, నవమోహనమైన, లావణ్యభరితమైన శ్రీనివాసావతారాన్ని ధరించాడు. ఆ విధముగా బ్రహ్మచేత అభ్యర్థించబడి జనధనాకర్షణీయమైన శ్రీనివాస రూపాన్ని వహించిన శ్రీవేంకటేశ్వరస్వామికి యీ దివ్యార్చనా సమయములో ధన్యవాదాలు సమర్పిస్తున్నాను.

105. ఓం సువర్ణముఖరీస్నాత మనుజాభీష్ట దాయినే శ్రీవెంకటేశాయ నమః

పూర్వం సప్తఋషులూ హిమవంతుని వద్దకేగి అతని కుమార్తెను శివునికిచ్చి పెండ్లి చేయమని అర్థించారు. పర్వతరాజు అంగీకరించాడు. శంకరుడు పెండ్లికుమారుడై శైలరాజభవనానికి తరలి వచ్చాడు. కల్యాణాన్ని తిలకించడానికై సకల భువనాలలోని సమస్త భూతాలు వచ్చాయి అందుచేత దక్షిణభాగం గగనతలాని కెగసింది. శంకరుడు యిది గమనించి అగస్త్యుని దక్షిణభూమి కేగమని కోరాడు. అగస్త్యుడు వింధ్యపర్వతాలు అధిగమించడంతో భూమి గరిమనాభి స్థానం సర్దుకొంది. ఒక ఆశ్రమాన్ని నిర్మించుకొని నివసిస్తున్నాడు. ఒకనాడు అశరీరవాణి "ఓ మునిపుంగవా, ఆశ్రమ సమీపములో నది ఉండడము శ్రేష్ఠం. దానికై ప్రయత్నింపుము" అంటూ అగస్త్యునికి కర్తవ్యము ఉపదేశించింది. అగస్త్యుడు నదిని సాధించడానికై తీవ్రమైన తపము కావించాడు. బ్రహ్మ సాక్షాత్కరించి వరం అర్థింపమని అగస్త్యుని కోరాడు. అగస్త్యుని కోరిక విని బ్రహ్మ గంగను పిలిచి నీ యంశతో ఒక పుణ్యనదిని ఉత్పత్తిజేసి అగస్త్యుని వాంఛితము నెరవేర్చుమని ఆదేశించి అంతర్ధానమయ్యాడు. గంగ

తాను ఎచ్చట ఉదయించవలని అగస్త్యుని ప్రశ్నించింది. అగస్త్యుడు తన్ననుసరింపమని గంగ నాదేశించాడు. ఆ విధంగా సువర్ణముఖరీనది అగస్త్యాచలంపై పుట్టి దక్షిణముఖంగా ప్రవహించింది.

"అగస్త్యాచల సంభూతమ్ దక్షిణోదధిగామినమ్
సమస్త పాప హంత్రాం త్వాం సువర్ణముఖరీంశ్రయే
మహాపాతక విప్లుష్టం గాత్రం మమ తవోదకైః
క్షాలయామి జగద్ధాత్రి శ్రేయసా యోజయస్వమామ్"

అని స్నానకాలంలో సువర్ణముఖి స్తుతింపబడుతోంటుంది. ఈ నదీతీరములో స్నానానుష్ఠానాలు అగస్త్యప్రతిమా దానాలు విధింపబడ్డాయి. ఈ నదీతీరంలోని అగస్త్యేశ్వరుడనే శివదేవుణ్ణి సేవించడము మహాఫలదాయకం. దేవపితృతీర్థం, వేణీ సువర్ణముఖరీ సంగమం, శంఖతీర్థం, శంఖ లింగం ఆ సమీపంలో ఉన్నాయి. శంఖలింగ సమీపములో సువర్ణముఖి కల్యాణనదితో కలుస్తోంది. వేంకటాద్రి సువర్ణముఖరికి సమీపములో ఉంది. పిమ్మట అగస్త్యుడు శ్రీకాళహస్తి నుండి వేంకటాద్రినాథుని సేవించడానికై వేంకటాచలానికి వెళ్ళాడు. స్వామిని సేవించాడు. అగస్త్యుడు తాను ఉత్పత్తి చేసిన నదికి మహాత్మ్యాన్ని ప్రసాదింపమని ప్రార్థించాడు. శ్రీనివాసుడు సుప్రసన్నుడై,

"యత్త్వా ప్రార్థితం త్వయా విప్ర తత్తథైవ భవిష్యతి
స్నానమప్రతిమా లోకే మయి భక్తిః కృతాత్వయా
జాహ్నవీ వనధినేయం సువర్ణముఖరీ మునే
స్వాదాశాస్య సురాణాంచ వాంఛిత శ్రీవిధాయినీ"

అంటూ వరము ప్రసాదించాడు. సువర్ణముఖరీనదిలో స్నానంజేసిన మానవుల మనోభీష్టాలు పూరించడానికి శ్రీనివాసుడు దీక్షాబద్ధుడై

బద్ధ కంకణుడై ఉన్నాడు అట్టి శ్రీవేంకటేశ్వరస్వామికి సువర్ణముఖరీ స్నానమహాఫలితాన్ని ప్రసాదించమంటూ నమస్కరిస్తున్నాను.

106. ఓం హలాయుధ జగత్తీర్థ సమస్తఫలదాయినే
శ్రీవేంకటేశాయ నమః

బలరాముడు తీర్థయాత్రలకు బయలుదేరాడు. సకల తీర్థాలను సమస్త క్షేత్రాలను, సమస్త దేవతామూర్తులను సేవించాడు. వేంకటాచలం సమీపించాడు. భువనత్రయములో గల సమస్తతీర్థాలకు సమానములైన తీర్థాలు ఉన్నాయని, అందుచేత వేంకటాద్రికి ప్రదక్షిణము చేస్తే భూప్రదక్షిణ పుణ్యఫలము సిద్ధిస్తుందని బలరాముడు విన్నాడు. బలరాముడు వేంకటాచల ప్రదక్షిణముచేసి వేంకటాచలంపై గల సమస్త తీర్థాలను సేవించాడు. శ్రీనివాసుని దర్శించాడు. తన హలాయుధముతో వేంకటాద్రిపై ఒక దివ్యతీర్థాన్ని నిర్మించాడు. దానికి హలాయుధ తీర్థం అనే పేరు వచ్చింది. . అట్టి హలాయుధ తీర్థంలో స్నానము చేసిన వారికి పుడమిపై గల మూడుకోట్ల యాభై లక్షల పుణ్యతీర్థాలను సేవించిన ఫలాన్ని శ్రీవేంకటేశ్వరుడు అనుగ్రహిస్తాడు. హలాయుధ తీర్థ సేవాఫలాన్ని ప్రసాదించమంటూ శ్రీవేంకటేశ్వరస్వామికి నమస్కారము చేస్తున్నాను.

107. ఓం గోవిందాయ శ్రీవేంకటేశాయ నమః

మనస్సులు పొంగి పరవశించే విధంగా కమ్మగా కమనీయముగా, లలితముగా, రసభరితముగా, మధురముగా, మనోహరముగా ఉండే నీ మృదుల మురళీరావంతో గోవులకు వీనులవిందు కావించి గోవిందుడవయ్యావు. గోపకులపై నీ చల్లని చూపుల తేనెవానలు, అమృత వర్షాలు కురిపించి కన్నుల విందు కావించి గోవిందుడవయ్యావు. నీ మోహనవంశీగానముతో చూపుల తూపులు కురిపించి, నీ కౌగిలింతల

దొంతరలలో పరవశింపజేసి గోపికాంగనల మనస్సులకు విందు చేసి గోవిందుడ వయ్యావు. భక్తులకు నీ నామస్మరణవల్ల వీనుల విందు, నీ రూపదర్శనమువల్ల కన్నులవిందు, నీ సన్నిధిలో పెన్నిధివంటి హృదయాల విందులభింపజేసి గోవిందుడవయ్యావు. నీకు గోవిందశబ్దం అంటే మహాప్రీతి. అందుచేత నీవు గోవిందబొబ్బల వాడవయ్యావు. గోవిందా అంటూ నిన్ను పిలిస్తే యిందా అంటూ భక్తులకు వరాలు అందిస్తావు. గోవిందుడవైన శ్రీ వేంకటేశ్వరస్వామికి నమస్కరిస్తున్నాను.

108. ఓం శ్రీనివాసాయ శ్రీవేంకటేశాయ నమః

శ్రీకమనీయహారమణిఁ జెన్నుగఁ దానును గౌస్తుభంబునం
దా కమలా వధూటియు నుదారతఁదోఁప పరస్పరాత్మలం
దాకలితంబులైన తమ యాకృతులచ్ఛతబైకిఁదోఁప న
స్తోకతనందుఁ దోఁచెనన శోభిలు వేంకటభర్త గొల్చెదన్.

—శ్రీకృష్ణదేవరాయలు

నీ వక్షస్థలం శ్రీ మహాలక్ష్మికి నివాసస్థానం. నీ హృదయసీమ శ్రీసతికి ఆవాసం. అందుచేత శ్రీనివాసుడ వయ్యావు, శ్రీకరుడ వయ్యావు. నిన్ను సేవించేవారికి భోగశ్రీని, మోక్షశ్రీని ప్రసాదిస్తున్నావు. అట్టి ఓ శ్రీనివాస స్వామీ! నీవు నిరంతరము నా హృదయసీమలో నివసించు స్వామీ. స్వామీ! నిన్ను అష్టోత్తర శతనామావళితో పిలిచి, స్తుతించి, నీ అనంత కల్యాణగుణాల్ని కీర్తించి, నీ దివ్య సుందర స్వరూపాన్ని భావించి, ధ్యానించి, స్మరించి, పూజించాను. ఆవాహనము, ఆసనము, పాద్యము, అర్ఘ్యము, ఆచమనము, స్నానం, యజ్ఞోపవీతము, గంధము, అక్షతలు, పుష్పము, ధూపము, దీపము, నైవేద్యము, తాంబూలము, వస్త్రము, నీరాజనము, మంత్రపుష్పము సమర్పించి నీకు అష్టోత్తర శతనామ పూజాసమయములో షోడశోప

చారాలు భక్తి శ్రద్ధలతో నిర్వహించాను. ఆత్మప్రదక్షిణ నమస్కారము చేస్తున్నాను. ఆత్మార్పణము చేస్తున్నాను. అపరాధసహస్రాలను మన్నించమని సవినయంగా మనవిచేసికొంటూ నమస్కరిస్తున్నాను. ఆత్మానందాన్ని, ఆత్మవికాసాన్ని, ఆత్మోన్నతిని కల్పించమని ప్రార్థిస్తున్నాను. ఈ అష్టోత్తర శతనామ కుసుమాలను నీ పాదాల ముందు సమర్పిస్తున్నాను. అనురాగంతో, అభిమానంతో, అమృతహృదయంతో స్వీకరించి, నన్ను అనుగ్రహించి, రక్షించి, కృతార్థుడను, చరితార్థుడను కావింపుము స్వామి! శ్రీనివాసా! శ్రీవేంకటేశా! చిద్విలాసా! సుహాసా! మనఃపూర్వకంగా, ఇంకొక్కసారి, మరొకపర్యాయము పూలదోసిలితో నీ చెంత నిలిచాను. ఈ పూలదోసిలి నీ కోసము జీవితాంతము నిన్ను చింతిస్తూ నీ పాదాలు సేవిస్తూ, నీ పదాలు పాడుకుంటూ నిన్ను నాలో ఉంచుకుంటూ, నీలోను, నీతోను ఆడుకుంటూ పూలదోసిలి సమర్పిస్తుంటాను.



# తీర్థవైభవం

## శ్రీ స్వామిపుష్కరిణి

"శ్రీవైకుంఠ విరక్తాయ స్వామిపుష్కరిణీ తటే
రమయా రమమాణాయ వేంకటేశాయ మంగళమ్"

"స్వామి పుష్కరిణీస్నానం సద్గురోః పాదసేవనమ్
ఏకాదశీవ్రతం చాపి త్రయమత్యంత దుర్లభమ్
దుర్లభమ్ మానుషం జన్మదుర్లభం తత్రజీవనమ్
స్వామిపుష్కరిణీ స్నానం త్రయమత్యంత దుర్లభమ్"

– వరాహపురాణం.

"స్వామి పుష్కరిణీ స్నానం, వేంకటేశ్వర దర్శనమ్
మహాప్రసాదస్వీకారః త్రయమత్యంత దుర్లభమ్"

– భవిష్యోత్తరపురాణం.

శ్రీవైకుంఠంపై, క్షీరసాగరంపై విరక్తితో, శ్రీనివాసుడు శ్రీమహాలక్ష్మితో రక్తితో, అనురక్తితో, విలాసంతో విహరించే తీరం స్వామిపుష్కరిణీతీరం. స్వామిపుష్కరిణీస్నానం, శ్రీవేంకటేశ్వర దర్శనం, శ్రీవేంకటేశ్వర ప్రసాదలాభం మహాదుర్లభమైనవి. పంచభూతాలలో అగ్ని, జలం శ్రేష్ఠతను సంపాదించుకొన్నాయి. అగ్నిని ఆరాధించడంవలన పవిత్రత లభిస్తుంది. అగ్నిని ఆరాధించడానికి అర్హత నీటిలోస్నానం చేయడంవలన సిద్ధిస్తుంది. జలాగ్నులలో అగ్నికన్న జలం శ్రేష్ఠమైనది. జ్యేష్ఠమైనది. 'పానాగమయోస్తీర్థం ఋషిజుష్ట జలేగురౌ' అన్నది తీర్థ నిర్వచనం. పుణ్యజలం కలిగి పుణ్యపురుషుల కాశ్రయమైన పుణ్యజలాశ్రయం కలిగిన పుణ్యస్థలమే తీర్థం.

ఈ తీర్థాలు తపో, దాన, యాగ, అర్చనాదులను పావనం చేస్తాయి. ఇవి దేవ, ఋషి, ఆసుర, మానుష తీర్థాలని నాలుగురకాల తీర్థాలుగా విభజింపబడ్డాయి ఇవి క్రమానుగతంగా పవిత్రతను కలిగి కృత, త్రేతా, ద్వాపర, కలియుగాలలో నిభక్తులకు సేవింపదగినవిగా నిలచాయి. పుణ్య నదులు దేవతీర్థాలు. దేవతీర్థాలలో ఋషులుతపస్సుకావించి సాధించిన నదులు, ఋషి నివాసాలు ఆర్ష తీర్థాలు. అసురులు, స్థాపించినవి ఆసుర తీర్థాలు. శ్రీరామాది ఉత్తమపురుషులు నిర్మించినవి మానుష తీర్థాలు. కాగా ధర్మరతిప్రదాలు, జ్ఞానప్రదాలు, భక్తివైరాగ్య ప్రదాలు, ముక్తిప్రదాలు అనే చతుర్విభాగ ప్రధానములైన 66 కోట్ల పుణ్యతీర్థాలు వేంకటాచలంపై ఉన్నట్లు బ్రహ్మ, స్కందపురాణాలు తెలుపుతున్నాయి. 1008 ధర్మరతిప్రద తీర్థాలు, 108 జ్ఞానప్రద తీర్థాలు, 68 భక్తివైరాగ్యప్రద తీర్థాలు, 7 ముక్తిప్రద తీర్థాలు ప్రధానములైన తీర్థాలుగా నిర్ణయింపబడ్డాయి. అవి వేంకటాద్రిపై నెలకొన్నాయి. ఇట్టి అసంఖ్యాకములైన దివ్యతీర్థాలు ఉండడంచేత వేంకటాద్రి తీర్థాద్రి, పుష్కరాద్రి అని పిలువబడుతోంది. భువన త్రయంలోగల సమస్త తీర్థాలకన్న ఉత్తమమైన తీర్థాలు వేంకటాచలంపై ఉన్నాయి. అందుచేత శేషగిరి ప్రదక్షిణం భూప్రదక్షిణ పుణ్యఫలాన్ని ప్రసాదిస్తుంది. బలరామునకు జగత్తులోని సమస్త తీర్థాలను సేవించిన పుణ్యఫలాన్ని వేంకటాద్రిపై గల తీర్థాలు ప్రసాదించాయి.

ఏడుకొండలుపై గల ఏడు ముక్తిప్రదాలైన తీర్థాలలో స్వామి పుష్కరిణి ప్రధానమైంది యాభైమంది ఋషులచేత అతిపవిత్రమైన తీర్థంగా స్వామిపుష్కరిణి నిర్ణయింపబడింది. 'విష్ణుపాదం నుండి జన్మించి బ్రహ్మదేవుని కమండలంలో నిండి, శివుని శిరస్సున నిలచిన గంగతో

స్వామిపుష్కరిణీ జలం నిండి పవిత్రతను పొందింది' అని సనందన యోగి స్వామిపుష్కరిణిని స్తుతించాడు. 'శ్రీనివాసుని ప్రణయకేళీ విహారసీమయైన స్వామిపుష్కరిణీ తీరం భక్తులపాలిట ఆత్మ సాక్షాత్కార ప్రసారకేంద్రం' అని సనకయోగి ప్రస్తుతించాడు. 'కీర్తన స్నాన, పానములద్వారా తాపత్రయనివారిణిగా వెలసిన దివ్యపుష్కరిణి స్వామిపుష్కరిణి' అని శౌనకమహర్షి ప్రశంసించాడు. 'సురులకు, నరులకు, జంతువులకు, పురుగులకు, సకలచరాచర జీవరాసులకూ ఆత్మావలోకనం ప్రసాదించే ఉత్తమతీర్థం స్వామిపుష్కరిణీతీర్థం' అని శుకమహర్షి అభివర్ణించాడు 'స్వామి తీర్థం అని మూడుసార్లు స్మరించి ఏ జలాశయంలో స్నానం చేసినా ఆ మానవుడు స్వామిపుష్కరిణీ స్నానఫలితాన్ని పొందడమే కాదు; బ్రహ్మపదాన్ని అందుకొంటాడు' అని వ్యాసభగవానుడు స్కందపురాణంలో ప్రతిపాదించాడు.

సర్వతీర్థయాత్రా ఫలసిద్ధిని ఆశించి బ్రహ్మనుద్దేశించి మార్కండేయ మహర్షి తపం కావించాడు. బ్రహ్మ మార్కండేయునికి సాక్షాత్కరించి "సర్వ తీర్థయాత్రలు కావించడానికి ఎన్ని జన్మలైనా చాలవు ప్రపంచంలోని సకలతీర్థాలు ప్రతిమార్గశీర్ష శుక్లద్వాదశీ పర్వదినాన అరుణోదయ సమయంలో పాపనివారణార్థం స్వామిపుష్కరిణిలో సంగమిస్తాయి. ఆ అరుణోదయ సమయంలో స్వామిపుష్కరిణిలో స్నానంచేసి నీవు సర్వతీర్థయాత్రాఫలసిద్ధిని పొందుమని ఆదేశించాడు. మార్కండేయుడు ఆవిధంగా చేసి సర్వతీర్థ సేవా మహాఫలాన్ని పొందాడు. మార్కండేయమహర్షికే సకలతీర్థసేవాభాగ్యాన్ని స్వామిపుష్కరిణి ప్రసాదించిన పవిత్రగాథను వామనపురాణం ప్రకటిస్తోంది.

పులస్త్య బ్రహ్మ శాపంమూలంగా సరస్వతీనది మహాతీర్థంగా స్థానం సంపాదించటంలో వైఫల్యం పొంది భగవానునిగూర్చి తపస్సు

కావించి, సాక్షాత్కరింపజేసికొని తనకు సర్వతీర్థాలలో ఉత్కృష్ట స్థానాన్ని ప్రసాదింపుమని ప్రార్థించింది. సర్వతీర్థాలు పాపనివారణ కావించుకొనే స్వామి పుష్కరిణీరూపం ధరించి వేంకటాచలంపై నిలువమని భగవానుడు వరం అనుగ్రహించాడు. స్వామిపుష్కరిణి సరస్వతీ స్వరూపిణి.

ధర్మగుప్తుడు నందనందనుడు, చంద్రవంశపు రాజు. ప్రజా రక్షణకై ఒకనాడు అరణ్యంలోనికి వేటకు వెళ్ళాడు. రాత్రి సమయంలో ఒక చెట్టు ఎక్కాడు. సింహం తరుముగా ఒక ఎలుగు పరుగునవచ్చి రాజు ఎక్కిన వృక్షాన్ని ఆశ్రయించింది. రాజు వన్యమృగంతో వంతుల ప్రకారం చెట్టుపై విశ్రమించడానికి ఒప్పందం కుదుర్చుకొన్నాడు. ఆ నిర్ణయం ప్రకారం ముందుగా రాజు విశ్రమించాడు. వన్యమృగం సింహం బారినుండి రక్షిస్తోంది. నిద్రిస్తున్న రాజును చెట్టునుండి క్రిందికి తోసి తనకు ఆహారం కల్పించమని మృగరాజు వన్యమృగాన్ని కోరింది. అవిశ్వాసంతో తాను ప్రవర్తించలేనని సింహం సూచనను నిరసించి, నిరాకరించింది ఆ వన్యమృగం. రాజు మేల్కాంచాడు. మృగం నిద్రించింది. మృగరాజు రాజసింహునికి వన్యమృగానికిచ్చిన సలహాను చెప్పింది. రాజు అనాలోచితంగా ఆ మృగాన్ని చెట్టుపైనుండి క్రిందికి తోయబోయాడు. ఆ అడవిజంతువు మేల్కొని "మానవులు మృగాలకంటే నీచంగా, హీనంగా ప్రవర్తిస్తున్నారు. అవిశ్వాసంతో సంచరిస్తున్నారు. నేను ఈ ఎలుగుబంటి రూపంలో ఉన్న ధ్యానకాష్ఠుడనే ఋషిని. భృగు పరంప[illegible]బేరుని సహచరుడైన భద్రుడనే యక్షుడు ప్రేయసితో గౌతముని ఆశ్రమంలో సంచరించి శాపగ్రస్తుడై సింహరూపం పొందాడు" అని ప్రకటించి ధ్యానకాష్ఠరూపాన్ని ధరించింది. సింహరూపంలోని భద్రుడనే యక్షుడు ధ్యానకాష్ఠ ఋషి దర్శనంతో

నిజరూపాన్ని పొంది కృతజ్ఞత ప్రకటించి ఆశీస్సులు అందుకొని దివ్య విమానారూఢుడై కుబేరస్థానమైన అలకాపురానికి వెళ్ళాడు.

ఈ విచిత్రమైన సంఘటనను చూచిన ధర్మగుప్తుడు ఆశ్చర్య చకితు డయ్యాడు. ధ్యానకాష్ఠుడు ఆగ్రహావేశపరవశుడై 'నీవు అధర్మ వర్ధనుడవై రక్షించినవారిని శిక్షించి, భక్షింపచేయడానికి ప్రయత్నించావు. కనుక ఉన్మత్తుడవై ఈ శిక్షను అనుభవిస్తావు' అని శపించాడు. ధర్మగుప్తుడు పిచ్చివాడై అడవి అంతా తిరిగి రాజధానికి వచ్చాడు. మంత్రులు సామంతులు రాజుకు వైద్యం చేయించారు. పిచ్చి కుదరలేదు. రేవాతీరంలో వానప్రస్థాశ్రమం స్వీకరించి తపస్సు కావిస్తూన్న నందరాజుకు కుమారుని ఉన్మాదవృత్తాంతం నివేదించారు. నందుడు ధర్మగుప్తుని జైమిని వద్దకు కొనిపోయి రక్షింపమని ప్రార్థించాడు. జైమిని దివ్యదృష్టితో విషయం గ్రహించి "వేంకటాచలంపై గల స్వామిపుష్కరిణిలో నీ కుమారుని స్నానం చేయిస్తే అతడు స్వాస్థ్యచిత్తం పొందుతాడు" అని ఆదేశించాడు. నందరాజు ధర్మగుప్తుని వేంకటాచలానికి తోడ్కొనిపోయాడు. సంకల్పపూర్వకంగా కుమారునిచేత స్వామిపుష్కరిణిలో స్నానం చేయించాడు. ధర్మగుప్తుడు గాఢసుషుప్తి నుండి మేల్కొంచినవానివలె స్వాస్థ్య చిత్తం పొందాడు. ధర్మగుప్తుని మనోవ్యాధిని నిర్మూలించిన స్వామిపుష్కరిణీ మహిమ స్కందపురాణంలో ఆవిష్కృతమైంది.

ఈ స్కందపురాణంలోనే ఉన్న సుమతికథ కూడ స్వామిపుష్కరిణీ మాహాత్మ్యాన్ని ప్రకటిస్తోంది. అది మహారాష్ట్ర ప్రాంతం. అచ్చట యజ్ఞదేవుడనే బ్రాహ్మణు డుండేవాడు. అతడు సదాచార సంపన్నుడు. భక్తి పరతంత్రుడు. అతని కుమారుడు సుమతి. పేరుకు సుమతి గాని అతడు కేవలం దుర్మతి. సుమతి ముదుసలి తండ్రిని, సౌశీల్యవతి

మైన కులకాంతను వదలి పెట్టాడు. ఉత్కళ దేశానికి వలసపోయాడు. అచ్చట ఒక కిరాతస్త్రీని ప్రేమించి కిరాతవృత్తి అవలంబించాడు. ఒక నాడు సంపన్నుడైన బ్రాహ్మణుని వధించి అతని సంపదను అపహరించాడు. ఆ బ్రాహ్మణహత్యాపాపం బ్రహ్మహత్యా పాపమై భయంకర రూపం ధరించి సుమతిని వేధించ సాగింది. ఛాయవలె వెన్నంటి తిరిగింది. అతడు భయంతో ఈ ఆపద నివారించుకోవడానికి సతమతమై పోయాడు. కడకు తండ్రిని కలసికొని తన బ్రహ్మహత్యా పాపం నివారింపుమని వేడికొన్నాడు. పుత్రవాత్సల్యముతో యజ్ఞదేవుడు కుమారుని బ్రహ్మహత్యాపాపం నివారించడానికి ప్రయత్నించాడు. సుమతిని రక్షించినవారిని, వారి వంశాన్ని నాశనం చేస్తానని యజ్ఞదేవుని బ్రహ్మహత్య హెచ్చరించింది. వంశనాశనానికి సిద్ధపడి పుత్రవాత్సల్యం ప్రదర్శించలేకపోయాడు. పుత్రుని శోకస్థితిని చూచి భరించలేకపోయాడు. పుత్రవాత్సల్యం, పుత్రశోకం యజ్ఞదేవుని హృదయంలో సంఘర్షించుకొంటున్న సమయంలో రుద్రాంశసంభూతుడైన దూర్వాస మహర్షి ఆ మార్గంలో ప్రయాణం చేస్తున్నాడు. దూర్వాసమహామునికి సుమతి విషాదగాథను యజ్ఞదేవుడు నివేదించి కుమారుని బ్రహ్మహత్యాపాప నివారణోపాయాన్ని సూచింపమని ప్రార్థించాడు. దూర్వాసుడు దివ్యదృష్టిని ప్రసరించి శేషశైలంపై శ్రీనివాసుని దివ్యసన్నిధానంలోని స్వామిపుష్కరిణీస్నానం సుమతి బ్రహ్మహత్యాపాపాన్ని హరిస్తుందని యజ్ఞదేవున కుపదేశించాడు. ముని మాట ప్రకారం సుమతిని తండ్రి వేంకటాచలానికి తీసికొనివెళ్లి స్వామిపుష్కరిణిలో స్నానం చేయించాడు. సుమతి బ్రహ్మహత్యా పాపనివృత్తిని పొందాడు. పవిత్రగాత్రుడయ్యాడు. పావనహృదయుడయ్యాడు. సుఖసంతోషాలు పొందాడు. సుమతి బ్రహ్మహత్యా పాపాన్ని నిర్మూలించిన దివ్యతీర్థం స్వామిపుష్కరిణీతీర్థం.

వరాహపురాణంలోని శంఖుని వృత్తాంతం స్వామిపుష్కరిణీ వైభవాన్ని విపులంగా వర్ణిస్తోంది. సాంకాశ్యాన్ని శంఖణుడనే చంద్రవంశపు రాజు పరిపాలించేవాడు. విధి వైపరీత్యంవల్ల పరరాజులు సాంకాశ్యాన్ని ఆక్రమించి శంకణుణ్ణి పరాజితుని కావించారు. రాజ్యభ్రష్టుడైన శంఖణుడు భార్యాసమేతుడై, మంత్రులు వెంటరాగా తీర్థయాత్రలు కావించాడు. సేతువు సేవించాడు. సువర్ణముఖిలో స్నానం కావించాడు. పద్మసరోవరంలో మునకలిడి పావనగాత్రుడై రాజ్యనష్టం తలపోసి విచారించాడు. 'ఓ రాజా ! నీవు వెంకటాద్రి గల స్వామిపుష్కరిణిలో స్నానంచేస్తే నీకు యథాపూర్వం స్వామిత్వం లభిస్తుంది' అనే అశరీరవాక్కు వినపడింది. శంఖణుడు వేంకటాచలాన్ని అధిరోహించాడు. ఆరునెలలు నియతవ్రతుడై స్వామిపుష్కరిణిని సేవించి, శ్రీనివాసుని పూజించాడు. శ్రీభూదేవీ సమేతుడై శ్రీపతి దివ్యవిమానంలో శంఖణునకు దివ్యదర్శనమహాభాగ్యం ప్రసాదించి 'స్వామి పుష్కరిణిని సేవించిన నీకు స్వామిత్వం లభిస్తుందని' అభయమిచ్చాడు. శంఖణుడు స్వదేశానికి మరలివచ్చాడు. ప్రజలు అతనికి స్వాగతవచనాలు పలకడానికి తరలివచ్చారు. శత్రురాజులు పరస్పర ద్వేషంతో కలహించుకొని రాజ్యం విడిచిపోయారని సాంకాశ్య రాజ్యంలోని ప్రజలు రాజునకు నివేదించారు. యథాపూర్వం సింహాసనం అలంకరించి రాజ్యపాలనం సాగించమని ప్రజలు ప్రార్థించారు. ఈ విధంగా శంఖణుడు స్వామి పుష్కరిణీ స్నానప్రభావం వలన, కోల్పోయిన స్వామిత్వం సంపాదించుకొని విజయశ్రీ సమునేతుడై వర్థిల్లాడు.

కాశ్యపుని మహాపాతకాన్ని తొలగించి సుప్రసిద్ధమైన స్వామి పుష్కరిణి రమణీయ గాథను స్కాందపురాణం ప్రతిపాదించింది.

తక్షకుని వలన ఏడవ రోజున మరణిస్తావని శపింపబడిన పరీక్షిత్తును తన మంత్రశక్తి చే రక్షించి విశేషంగా ధనసంపాదన చేయాలని కాశ్యపుడు బయలుదేరాడు. పరీక్షిత్తును సంహరించడానికి తక్షకుడు ప్రయాణమయ్యాడు. మార్గమధ్యంలో వా రుభయులూ సమావేశమై తమ తమ లక్ష్యాలను ప్రకటించుకొన్నారు. తమ తమ శక్తులు నిరూపించుకోవడానికి సిద్ధపడ్డారు. తక్షకుడు తన విషంతో ఒక చెట్టును, దానిపై ఎక్కిన మానవుణ్ణి సమూలంగా నాశనం కావించాడు. కాశ్యపుడు తన అమోఘమైన, అప్రతిహతమైన మంత్రశక్తితో ఆ చెట్టును, మనిషిని పూర్వస్థితిలోనికి కొనివచ్చాడు. తక్షకుడు "నీవు పరీక్షిత్తును రక్షిస్తే ఎంత ధనం సంపాదింపగలవో దానికి రెట్టింపు నేను సమర్పిస్తాను. ఈ దివ్యమైన మణులూ రత్నాలూ స్వీకరించి స్వదేశానికి మరలిపొమ్మ"ని అర్థించాడు. ధన వ్యామోహపీడితుడైన కాశ్యపుడు వానిని స్వీకరించి స్వగృహానికి చేరుకొన్నాడు. తక్షకుడు తన విషంతో పరీక్షిత్తును సంహరించాడు. శ్రీహరి భక్తుడైన పరీక్షిత్తు మరణానికి కాశ్యపుని ధనలుబ్ధత్వం కారణమని గ్రహించిన జనులు కాశ్యపుణ్ణి మహాపాతకుడని నిర్ణయించి నిందించారు. కాశ్యపుడు శాకల్యమహర్షి గురుదేవుని దర్శించి తన వృత్తాంతం నివేదించుకొన్నాడు. "విష్ణుభక్తుడైన పరీక్షిత్తు మహారాజు ప్రాణరక్షణకు బదులుగా ధనసంపాదనకు ఎక్కువ విలువ చూపించావు. రక్షించ సమర్థుడవైనా రక్షింపక పరీక్షిత్తు మరణానికి కారకుడవయ్యావు. రాజహత్యామహాపాతకానికి పాల్పడ్డావు. ఈ నీ పాతకం తొలగాలంటే నీవు వేంకటాచలానికి వెంటనే వెళ్ళాలి. స్వామిపుష్కరిణిలో స్నానం చేయాలి. శ్రీనివాస ప్రభుని సేవించాలి" అని శాకల్య మహర్షి శిష్యునికి పాతక నివారణోపాయం ఉపదేశించాడు. కాశ్యపుడు గురుదేవుని ఉపదేశాన్ని, ఆదేశంగా, శాసనంగా స్వీకరించి

వేంకటగిరికి తరలిపోయి, స్వామిపుష్కరిణిలో స్నానంచేసి శ్రీ వేంకట గిరి నాయకుని దర్శించి, మనసారా ధ్యానించి తన మహాపాతకాన్ని నివారించుకొని ధన్యుడయ్యాడు.

ఈ స్వామిపుష్కరిణీ తీరంలో పర్వదినాన పితృముక్తి హేతువులైన కార్యాలు చేస్తే పితృదేవతలు శాశ్వత విష్ణులోకం పొందుతారు. భూతభయాన్ని, మూర్ఛవ్యాధిని స్వామిపుష్కరిణీ స్నానం తొలగిస్తుంది. స్వామిపుష్కరిణి మానవుల సర్వపాపాలను నిర్మూలిస్తుంది. మహాపాతకాలను నశింపజేస్తుంది. దీనిలో స్నానంచేసిన మానవుణ్ణి యముడు జయించలేడు. దీనిలో స్నానం చేయడం వలన అశ్వమేధ యాగ నిర్వహణ, తులాపురుషదాన, సహస్ర గోదాన ఫలాలను పొందుతారు. లక్ష్మీకటాక్షాన్ని, మోక్షలక్ష్మీకటాక్షాన్ని పొందుతారు. స్వామిపుష్కరిణి అతిపవిత్రమైనది. మనోహరమైనది. శ్రీనివాసునకు ప్రేమపాత్రమైనది. శ్రీ భూదేవులకు ప్రీతిపాత్రమైనది. అప్రాకృతమైన దివ్యజలంతో, సుగంధసంభరితమైన జలంతో స్వామిపుష్కరిణి నిండి ఉన్నట్లు పురాణాలు వర్ణించాయి. శ్రీ స్వామివారికి ప్రీతిపాత్రం కావడంచేతను, శ్రీ స్వామివారు శ్రీ భూదేవులతో నిత్యసన్నిహితులై ఉండటంచేతను, సర్వతీర్థాలకు స్వామి కావడం వల్లనూ, భక్తులకు వారి వారి అర్హతలనుబట్టి స్వామిత్వాం ప్రసాదించేది అవడంవల్లనూ ఇది స్వామిపుష్కరిణీతీర్థం అనే సార్థకనామం సంతరించుకొంది. ఇది శ్రీ వేంకటేశ్వర స్వామి దేవాలయ సింహద్వారానికి 30 మీటర్లదూరంలో ఈశాన్యమూలగా సుమారు ఒకటిన్నర ఎకరాల ప్రాంతంలో ఉంది. పుష్కరిణి పొడవు 400 అడుగులు. వెడల్పు 150 అడుగులు. 5 లేక 6 అడుగుల లోతు ఉంటుంది. 85 అడుగులు పొడవు వెడల్పులు కలిగి 19 అడుగులు లోతుగల ఒక కోనేరు, 140 అడుగుల పొడవు, 88 అడుగుల వెడల్పు - 16, 8 అడుగుల లోతు

గల రెండవ కోనేరు ఈ స్వామిపుష్కరిణిలో ఉన్నాయి. దీనిలో ప్రస్తుతం 20 లక్షల గ్యాలన్ల నీరు ఉంటోనట్లు అంచనా వేయబడింది. 'నీరి' పరిశోధనలకు 25 వేల రూపాయాలను దేవస్థానం ఖర్చుచేసి దాని సిఫార్సులను అమలుచేయడానికి లక్షలాది రూపాయలు వెచ్చించి పుష్కరిణిలో నిత్యం స్నానంచేసే సుమారు 5 వేలమంది భక్తులకు స్వచ్ఛమైన స్వామిపుష్కరిణీ జలం లభింపజేయడానికి పథకాన్ని అమలుచేయడానికి సన్నద్ధంగా ఉంది.

'స్వామి పుష్కరిణీ తీర్థం సమం నాస్తి న చాస్తివై' అని ప్రశస్తి కాంచిన స్వామిపుష్కరిణిలో నవతీర్థాలు ఉన్నాయి. తూర్పు దిక్కున ఆయుపు వృద్ధి కావించే మార్కండేయతీర్థం, ఆగ్నేయమూల పాపహరమైన ఆగ్నేయతీర్థం, దక్షిణాన నరకనివారకమైన యామ్య తీర్థం, నైఋతిమూల ఋణనివృత్తికరమైన వశిష్ఠ తీర్థం, పశ్చిమం లోను, వాయువ్యభాగంలోను మోక్షప్రదాలైన వరుణ, వాయు తీర్థాలు, ఉత్తరంలో భాగ్యసమృద్ధికరమైన ధనదతీర్థం, ఈశాన్యమూల ఇహపర సాధకమైన గాలవ తీర్థం, మధ్యలో మహాపాతక నిర్మూలక మైన సరస్వతీ తీర్థం నవతీర్థాలలై స్వామిపుష్కరిణిలో నెలకొన్నట్లు పద్మపురాణం ప్రకటిస్తోంది. వామన, భవిష్యోత్తర, స్కంద, బ్రహ్మ, పద్మ, వరాహపురాణాలు స్వామిపుష్కరిణీ వైభవాన్ని ప్రస్తావించి ప్రశంసించాయి. శ్రీదేవి భూదేవి సమేత శ్రీమలయప్పస్వామికి స్వామిపుష్కరిణిలో వివిధ విద్యుద్దీప వర్ణకాంతులలో జరిగే డోలా విహారం భక్తులకు దివ్యానుభూతి పరంపరలు ప్రసాదిస్తుంది. మార్గ శీర్ష శుద్ధ ద్వాదశినాడు అరుణోదయ సమయంలో ఆరుఘడియలకు స్వామిపుష్కరిణీ పర్వసమయం. ఆ సమయంలో స్నానం చేయడం ఉత్తమం.

"దేవునికి దేవునికి నీతెప్పలకోనేరమ్మా
వేవేలు మొక్కులు లోకపావని నీకమ్మా ॥పల్లవి॥
ధర్మార్థకామమోక్షతతులు నీ సోపానాలు
అర్మిలి నాలుగు వేదాలదే నీదరులు
నిర్మలపు నీజలము నిండు సప్తసాగరాలు
కూర్మము నీలోతు వో కోనేరమ్మా ॥దేవు॥
తగిన గంగాదితీర్థములు నీకడళ్ళు
జగతి దేవతలు నీజలజంతులు
గగనపు పుణ్యలోకాలు నీదరి మేడలు
మొగినీచుట్టుమాకులు మును లోయమ్మా ॥దేవు॥
వైకుంఠనగరము వాకిలే నీయాకారము
చేకొను పుణ్యములే నీజీవభావము
యేకడను శ్రీవేంకటేశుండె నీవునికి
దీకొని నీతీర్థమాడితిమి కావవమ్మా ॥దేవు॥

— అన్నమాచార్యులు.



# సప్త తీర్థాలు

శ్రీ వేంకటాద్రిపై గల అసంఖ్యాములైన దివ్యతీర్థాలలో ముక్తి ప్రదాలైన సప్తతీర్థాలు ముఖ్యమైనవి. శ్రీ స్వామిపుష్కరిణీతీర్థం, కుమారధారాతీర్థం, తుంబురుతీర్థం, రామకృష్ణతీర్థం, ఆకాశగంగాతీర్థం, పాపవినాశనతీర్థం, పాండవతీర్థం అన్నవి సప్తముక్తి దాయకాలైన తీర్థాలని బ్రహ్మపురాణములోని నాల్గవ అధ్యాయము వివరించింది. వీనిలోని రామకృష్ణతీర్థాన్ని వదలి మిగతా ఆరుతీర్థాలను ముక్తిప్రదాలని స్కాంద పురాణములోని పదిహేనవ అధ్యాయము నిర్ణయించింది. ఈ ఆరుతీర్థాలతో దేవతీర్థాన్ని కలిపి వానిని సప్తముక్తిదాయకాలైన తీర్థాలుగా వరాహపురాణములోని ద్వితీయభాగమందలి ప్రథమాధ్యాయం వర్ణించింది. చక్రతీర్థం సప్తముక్తిప్రదమైన తీర్థాలలో ఒకటిగా పాఠాంతరాలలో స్థానంసంపాదించుకొంది. ఏడుకొండలపై గల ఏడుముక్తిదాయకమైన ఏడుదివ్యతీర్థాలలో ఏడవతీర్థంగా రామకృష్ణ, దేవ, చక్రతీర్థాలు పేర్కొనబడ్డాయి. శ్రీవేంకటాద్రిపై గల సప్తమోక్షతీర్థాలలో ప్రథమస్థానం వహించిన తీర్థం శ్రీస్వామిపుష్కరిణీ తీర్థం. గత ప్రకరణలో శ్రీస్వామిపుష్కరిణీ మాహాత్మ్యం గ్రహించాము.

**కుమారధారాతీర్థం :**

శ్రీనివాసుని ఆనందనిలయానికి వాయువ్యభాగంలో ఐదుమైళ్ళ దూరంలో కుమారధారాతీర్థం ఉంది. శ్రీవేంకటాద్రిపై తపస్సు కావిస్తున్న ఒక బ్రాహ్మణుడు శతవృద్ధుడయ్యాడు, శిష్యుడైన కౌండిన్యుని సహాయంతో వనంలో సంచరించడానికి వెళ్ళిన ఆవృద్ధుడు మార్గం తప్పి 'కుమారా ఆశ్రమానికి తీసుకొనివెళ్ళు' అంటూ విలపించసాగాడు. శ్రీనివాసుడు కుమారరూపధారుడై వృద్ధునకు కరావలంబం ఇచ్చాడు. 'జరాభారం సహింపలేక మృత్యువుకోసం ఎదురుచూస్తు

న్నాను' అన్నాడు వృద్ధుడు. శ్రీనివాసుడు 'నీకు నిజంగానే జీవితంమీద ఆశలేదా' అంటూ ప్రశ్నించాడు. 'ముసలితనంతో వేగలేక చావాలనుకొంటున్నాను. దేవ, ఋషి, పితృఋణాలను తీర్చడంకోసం బ్రతకాలను కొంటున్నాను. అన్నాడు వృద్ధుడు. శ్రీనివాస భగవానుడు వృద్ధుణ్ణి ఆశ్రమానికి నడిపిస్తూ మార్గమధ్యంలోని ఒకతీర్థంలో స్నానం చేయించాడు. కుమారరూపధారిఐున శ్రీవేంకటేశ్వరుని మహిమతో తీర్థంలో స్నానంచేసిన పండుముదుసలి నిండుయవ్వనంతోకూడిన యువకుడయ్యాడు. శ్రీనివాసుడు నిజరూపంతో అతనికి సాక్షాత్కరించి "కర్మానుష్ఠానం, ధర్మానుష్ఠానం నిర్మలంగా, నిశ్చలంగా నిర్వహించి నియతవ్రతుడవై జీవయాత్ర సాగించడానికి వలసిన యవ్వనమే కాదు, పుష్కలంగా ధనంకూడ అనుగ్రహిస్తున్నాను" అని వచించాడు. ఆ వృద్ధ బ్రాహ్మణుణ్ణి పదునారు సంవత్సరాల ప్రాయంగల బాలాకుమారునిగా బాలాజీ మార్చి కృతార్థుణ్ని కావించాడు. మూడు కాలాలలో మూడుమాసాలు ఈ తీర్థంలో స్నానంచేసిన ముసలివారు నడివయస్కు లవుతారని దేవతలు దీవించారు. వృద్ధుని కుమారునిగా చేసిన ఈ తీర్థం కుమారరూపధారుడైన శ్రీనివాసునివరంమూలంగా కుమారధారాతీర్థం అనే సార్థకనామాన్ని సంతరించుకొంది. వరాహపురాణంలో ఈ కుమారధారావైభవము, మాహాత్మ్యము విస్తరించాయి. పర్వదినాలలో స్నానంచేసిన పరమ భక్తాగ్రేసరులు పరమ పదాన్ని సులభంగా సంపాదించుకొంటారని వరాహపురాణం ప్రకటిస్తోంది.

దేవసేనాని కుమారస్వామి దేవతారక్షణార్థం తారకాసుర సంహారం కావించాడు. అందుచేత బ్రహ్మహత్యాపాపపీడితుడై తండ్రి

శంకరుణ్ని కుమారస్వామి బ్రహ్మహత్యాదోషనివారణమార్గం తెలుపుమని ప్రార్థించాడు. కుమారధారాతీర్థాన్ని సేవిస్తూ, శ్రీవేంకటేశ్వర మహామంత్రాన్ని జపిస్తే ఆ దోషం పోతుందని శంకరుడు కుమారున కుపదేశించాడు. స్కందుడు సింహాసన నారాయణస్మరణ పారాయణు డయ్యాడు. వేంకటాద్రికి పయనం కావించాడు. చక్రతీర్థాన్ని, శ్రీస్వామిపుష్కరిణీతీర్థాన్ని సేవించి శ్రీనివాసుని దర్శించి మనసా పూజించాడు. పిమ్మట పాపవినాశనతీర్థంలో స్నానంకావించి కుమారధారాతీర్థాన్ని చేరుకున్నాడు. కుమారధారాతీర్థాన్ని సదా సేవిస్తూ, శ్రీవేంకటేశ్వర మహామంత్రజపం కావిస్తూ కుమారస్వామి తపం కావించాడు. ఒక మాఘపూర్ణిమా బుధవారంనాడు మఘానక్షత్రయుక్త మధ్యాహ్న సమయంలో శ్రీనివాసుడు కుమారస్వామికి సాక్షాత్కరించి "నీపేరుతో ఈ తీర్థం 'కుమారధారాతీర్థం' అని విశ్వవిఖ్యాత మవుతుంది. శ్రీవేంకటాద్రిని సేవించగానే నీ బ్రహ్మహత్యాపాతకం తొలగిపోయింది. నేను సాక్షాత్కరించిన ఈ మాఘపూర్ణిమాదినం ఈ తీర్థానికి పర్వదినమై విరాజిల్లుతుంది. ఆనాడు స్నానంచేసినవారి బ్రహ్మహత్యాదిదోషాలు తొలగిపోతాయి" అని వరం అనుగ్రహించాడు. బ్రహ్మరుద్రాది దేవతల పూజలు, కుమారస్వామిసేవలుపొంది స్వామి అదృశ్యుడయ్యాడు. మాఘమాసంలోని మఘానక్షత్రయుక్త పూర్ణిమాదిన మధ్యాహ్న సమయము కుమారధారా తీర్థానికి పర్వసమయము. మార్కండేయ పురాణముద్వారా కుమారస్వామి బ్రహ్మహత్యాదోషం నివారించిన కుమారధారికా తీర్థ మాహాత్మ్యం వ్యక్తమవుతోంది. "ఓం కుమారధారికావాస స్కందాభీష్ట ప్రదాయినే శ్రీవేంకటేశాయ నమః" అనే నామం మార్కండేయ పురాణాంతర్గతమైన కుమారధారికా తీర్థ మహిమను అభివ్యక్తీకరిస్తోంది.

తుంబురతీర్థం

తుంబురతీర్థం శ్రీనివాసుని ఆనందనిలయానికి సుమారు 8 మైళ్ళ దూరంలో శ్రీవేంకటాద్రిపై నెలకొని ఉంది. దీని అసలుపేరు గోణ తీర్థం. ఫాల్గుణీతీర్థం దీని నామాంతరం. స్కాందపురాణంలోని పదహారవ అధ్యాయం గోణతీర్థ మహిమను వర్ణించింది. గోణతీర్థ మహిమను వివరించమని అర్థించినగార్గేయునకు దేవలుడు ఆ తీర్థమహిమను ఈ విధంగా చెప్పాడు. "ఒకనాడు గంధర్వగాయక సార్వభౌముడైన తుంబురుడు తన ప్రియకాంతను మాఘమాసంలో తనతో తీర్థయాత్ర లకు అనుసరింపుమని ఆదేశించాడు. చలి బాధకు భయపడి ఆమె తన అశక్తతను వ్యక్తపరచింది. ఆగ్రహంతో గంధర్వుడు 'వేంకటా చలంపై గల గోణతీర్థ సమీపంలోని రావిచెట్టు తొర్రలో కప్పవై పొమ్మని శపించాడు. ఆమె అతిదీనంగా తన తప్పిదాన్ని మన్నించి శాపవిమోచనమార్గం తెలిపి తనను రక్షింపుమని తుంబురుని ప్రార్థించింది. ఏనాడు అగస్త్యమహర్షి తన తీర్థయాత్రా మార్గంలో శిష్యసమేతుడై గోణతీర్థం సేవించి అశ్వత్థ వృక్షచ్ఛాయలో గోణ తీర్థ మహిమను శిష్యులకు వివరిస్తాడో, అది విన్న నీకు ఆనాడు నీ మండూకరూపం పోయి గంధర్వ భామినీరూపం లభిస్తుంది' అని తుంబురుడు శాపవిమోచనమార్గం సూచించాడు. ఆమె కప్పగామారి శాపాన్ని అనుభవించి, అగస్త్యమహాముని కాపించిన గోణతీర్థ మహిమా కథనాన్ని విని గంధర్వభామినీరూపాన్ని ధరించి తుంబురుణ్ణి చేరి సుఖించింది. గోణతీర్థ మాహాత్మ్యశ్రవణం ద్వారా మండూకరూపం నిర్మూలించుకొని నిజరూపం సంపాదించుకొని తుంబురుని ప్రియసతి తరించింది."

పూర్వం ఒకనాడు ఆకాశమార్గంలో ప్రయాణం చేస్తూ తుంబురనారదులు సమావేశమయ్యారు. పరస్పరం అభినందించుకొని

కుశలప్రశ్నలు వేసికొన్నారు. తుంబురుని చేతిలోని క్రొత్త వాద్య విశేషం చూచి, దాన్ని ఎక్కడ సంపాదించావని నారదుడు తుంబురుని ప్రశ్నించారు. "ప్రాచీనబర్హిఋషి ఆస్థానానికి వెళ్ళి ఆ మహారాజును ప్రశంసిస్తూ గానం చేసాను. ఆ చక్రవర్తి సంతోషించి ఈ క్రొత్త వీణను సగౌరవంగా నాకు కానుకగా సమర్పించాడు" అని తుంబురుడు నారదునకు సమాధానం చెప్పాడు. ఆ జవాబు విన్న నారదుడు మండి పడి తుంబురుని మందలించాడు. "నీవు శ్రీహరిని కీర్తించడానికి బదులుగా నరుని కీర్తించచావు. నీవు నాకు సహచరుడవుగా, సహ వ్రతుడువుగా ఉండతగవు. కాన నీకున్న ఆకాశగమనాది దివ్యశక్తులు నశిస్తాయి." అని నారదుడు తుంబురుని శపించాడు. ఆ క్షణంలోనే తుంబురుడు ఆకాశగమనశక్తిని కోల్పోయి భూమార్గం పట్టాడు. అదృష్టవశాన తుంబురుడు వేంకటాచలంపై గల గోణతీర్థ సమీపంలో పడ్డాడు. తాను భూమార్గంపట్టి, భూపతనమైన స్థలం వేంకటాచలమని గ్రహించిన తుంబురుడు సంతోషాంతరంగుడయ్యాడు. ఆ ప్రశాంత వాతావరణంలోని గోణతీర్థంలో నిత్యం స్నానం చేసి శ్రీనివాసుని ధ్యానిస్తూ తుంబురుడు తపమాచరించాడు. ఫాల్గుణ పౌర్ణమినాడు శ్రీనివాసుడు తుంబురునకు సాక్షాత్కరించాడు. తుంబురుని, పరివార దేవతల్ని గోణతీర్థంలో స్నానం చేయమని శ్రీవేంకటేశ్వరుడు ఆజ్ఞా పించాడు. గోణతీర్థాన్ని సేవించిన తుంబురుడు తాను సేవించిన ఆ తీర్థం తన పేరుతో తుంబురతీర్థమని ప్రసిద్ధిపొందాలని – వర్ధిల్లాలని శ్రీనివాసుని వరం అర్థించాడు. బాలాజీ ఆమోదించి, అనుగ్రహించాడు. గోతీర్థం వైభవం వలన తుంబురుడు నష్టపోయిన ఆకాశ గమనాది దివ్యశక్తులు సంపాదించుకొన్నాడు. నారదునితో కలిసి శ్రీహరికీర్తన చేయగలిగాడు. తుంబురునకు దివ్యశక్తులు ప్రసాదించిన

దివ్యతీర్థం తుంబురతీర్థం. బ్రహ్మోత్తరఖండం తుంబురతీర్థ ప్రాశస్త్యం గూర్చి వర్ణించింది.

బ్రహ్మోత్తరఖండంలోని యాభైయవ అధ్యాయంలోని ఈ కథవలన కూడా తుంబురతీర్థ వైభవం వ్యక్తమవుతోంది. పూర్వకాలం ఒక గ్రామంలో సర్వాబద్ధుడనే బ్రాహ్మణుడుండేవాడు. దరిద్రుడై, దురాచారుడైన సర్వాబద్ధుడు ధనాపేక్షతో విప్రసభలకు వెళ్ళేవాడు. 'వశిష్ఠవత్తిష్ఠ సిసభాసు' అని బ్రాహ్మణులు హేళనచేసి అతణ్ణి సభలనుండి వెళ్ళగొట్టేవారు. దానితో సర్వాబద్ధుడు వశిష్ఠుని ఆశ్రయించి తనను రక్షింపుమని ప్రార్థించాడు. రాజపౌరోహిత్యం వలన సంక్రమించిన పాపాలను నివారించుకోవాలని నిశ్చయించుకొన్న వశిష్ఠుడు సర్వాబద్ధుని తోడ్కొని బ్రహ్మను దర్శించి ప్రాయశ్చిత్తం వలని తొలగని తమ పాపాలు హరించేమార్గం ఉపదేశించమని ప్రార్థించాడు. 'మీనపౌర్ణమినాడు వేంకటాచలంపైగల గోణతీర్థంలో స్నానం చేస్తే మీ ఉభయుల పాపాలు నశిస్తాయి' అని బ్రహ్మ ప్రకటించాడు. విధాతవచనాన్ని అనుసరించి వశిష్ఠుడు సర్వాబద్ధునితో కలిసి వేంకటాచలానికివచ్చి, తుంబురతీర్థాన్ని సేవించాడు. శ్రీనివాసుని మనసా ధ్యానించగా శ్రీనివాసుడు ప్రత్యక్షమై వశిష్ఠుని అనుగ్రహించాడు. సర్వాబద్ధునకు సకల సంపదలు, సర్వసిద్ధులు ప్రసాదించాడు. గోణతీర్థమహిమను తన శక్తితో శతాధికం చేసాడు. ప్రాయశ్చిత్తాలతో తొలగని పాపాలను క్షాళనం చేసే పుణ్యతీర్థం. వశిష్ఠ సర్వాబద్ధుల పాపాలను తొలగించి, పుణ్యపరంపరలను సిద్ధింపజేసిన పవిత్రమైన తీర్థం తుంబుర తీర్థం.

అరుంధతి మహాసాధ్వీమతల్లులలో ఉన్నతస్థానం పొందిన ఉత్తమ మహిళ. ఒకనాడు ఆ మహాపతివ్రత వశిష్ఠుని 'ఈ విశాల

విశ్వంలో మహాపవిత్రమైన ఉత్తమ తీర్థ మేదని' ప్రశ్నించింది. 'ప్రపంచంలోని అతిపవిత్ర తీర్థాలలో తుంబురతీర్థం మహోన్నతమైనది' అని మునికులతిలకుడు పలికాడు. అట్టి పుణ్యతీర్థాన్ని సేవించడానికి అనుమతించమని అరుంధతి అర్థించగా అతడు అంగీకరించాడు. అరుంధతి వేంకటాచలాన్ని అధిరోహించింది. స్వామిపుష్కరిణీ, పాపవినాశనం ఆదిగా గల తీర్థాలను సేవించింది. శ్రీనివాసుని దర్శించి, భక్తిపురస్సరంగా పూజించింది. తుంబురతీర్థ సమీపంలో ఆశ్రమం నిర్మించుకొని, నిత్యం తుంబురతీర్థంలో స్నానంచేస్తూ పన్నెండు సంవత్సరాలు ఆహార పానీయాలు వర్జించి యమనియమం పాటించి, శ్రీనివాసుని ఉద్దేశించి కఠినతమమైన తపం కావించింది. ఫాల్గుణపౌర్ణమినాడు శ్రీనివాసుడు అరుంధతికి సాక్షాత్కరించాడు ఆవిధంగా ప్రత్యక్షమైన శ్రీవేంకట నాథునకు పూజలు సలిపి తనకు తుంబురతీర్థ మహిమను వివరింపమని అరుంధతి కోరింది. "ఈ తుంబురతీర్థం స్నానం కావించిన మానవుల పాపాలను హరిస్తుంది. జనులకు సకలాభీష్టాలను సిద్ధింపజేస్తుంది. దీని ప్రభావంతో భాగ్యహీనుణ్ణి భాగ్యవంతుణ్ణి చేస్తుంది. దీని మహిమ చదివినా, విన్నా, దీనిలో స్నానం చేసినా, మహాపుణ్యం లభిస్తుంది" అంటూ శ్రీలక్ష్మీనాథుడైన శ్రీవేంకటనాథుడు అరుంధతికి తుంబురతీర్థ మహిమను వివరించాడు. శ్రీనివాసుడు తుంబురతీర్థ సమీపములో అరుంధతికి ఫాల్గుణమాసంలో ప్రత్యక్షమై అనుగ్రహించిననాటినుండి తుంబురుతీర్థం ఫాల్గుణీ తీర్థంగా ప్రసిద్ధి వహించింది. 'ఫల్గుణీతీర్థమిత్యస్య నామలోకే భవిష్యతి పతివ్రతానాం ముఖ్యాన భవత్వంచ సుపుత్రిణీ' అంటూ శ్రీనివాసుడు అరుంధతిని అనుగ్రహించాడు. తుంబురుతీర్థ సేవాభాగ్యం, శ్రీనివాస సాక్షాత్కార మహాభాగ్యం పొందిన అరుంధతీ విజయగాథను గరుడపురాణములోని అరవైమూడవ అధ్యాయం

వివరించింది. బ్రహ్మ, వరాహ పురాణాలు తుంబురుతీర్థ సేవాఫలాన్ని అభివర్ణించాయి. సప్తముక్తిదాయకమైన తీర్థాలలో తుంబురుతీర్థం (తుంబుతీర్థం) ఒకటి. ఫాల్గుణమాసములో ఉత్తరఫల్గునీ నక్షత్రయుక్తమైన పౌర్ణమి దినపు మధ్యాహ్నసమయము తుంబురుతీర్థస్నానానికి మహాపర్వసమయం "కలౌతు భారతే వర్షే మానుషం జన్మ దుర్లభమ్ తతో వేంకటయాత్రాతు దుర్లభా సుకృతం వినా తతోప్యస్మిన్ దినే పుణ్యే తీర్థే తుంబురునామకే స్నానం దానం చ లబ్ధం తే తుతే కృతార్థా న సంశయః"

రామకృష్ణతీర్థం :

పూర్వకాలం వేంకటాద్రిపై రామకృష్ణుడనే మహర్షి తీవ్రంగా తపం కావించాడు. సమీపంలో స్నానార్థం ఒకతీర్థాన్ని నిర్మించుకొన్నాడు. ఏకాగ్రతతో, శ్రీనివాసధ్యానతత్పరతతో చాలాకాలం తపస్సు కావించాడు. ఇంద్రుడు రామకృష్ణమహర్షి తపోతీవ్రతను గమనించి, అతనివలన తన పదవికి ప్రమాదంకలుగుతుందని భ్రమపడి, భయపడ్డాడు. రామకృష్ణమహాముని తపోభంగం కావించడానికై అసంఖ్యాకములైన ఆటంకాలు కల్పించాడు. వరుణుణ్ణి తపోభంగం కావింప నియోగించాడు. వరుణుడు ఏడుదినాలు క్షోణీపాతంగా వర్షం కురిపించాడు. పుట్టలోని ముని చలించలేదు. శ్రీనివాసధ్యానాన్ని మరువలేదు. ముని ఉన్నపుట్టపై వరుణుడు పిడుగులుపడే యేర్పాటుచేసాడు. ఒక పెద్దపిడుగు రామకృష్ణుడు తపస్సు సాగిస్తున్న ఆపుట్టపై పడింది. ఆపిడుగునుండిస్థిర సౌదామినీ కాంతితో శ్రీనివాసుడు ఆవిర్భవించి రామకృష్ణమహర్షికి సాక్షాత్కరించాడు. అతడు నిర్మించిన ఆతీర్థం అతని పేరుతో రామకృష్ణ తీర్థంగా ప్రసిద్ధమై భావితరాలవారిని తరింపజేస్తుందని రమారమణుడైన శ్రీ వేంకటరమణుడు వరం ప్రసాదించాడు. తాను రామకృష్ణ మహామునికి ప్రత్యక్షమైన మకరమాసంలోని పుష్యమీనక్షత్రయుక్త పౌర్ణమి

రామకృష్ణతీర్థానికి మహాపర్వదినమై ఒప్పారుతుందని శ్రీనివాసుడు అభయమిచ్చాడు. తల్లిదండ్రులు గురువులు కావించినమేలు మరచి వారిని నిందించి, అవమానపరచినవారి కృతఘ్నతాదోషాలను తొలగించి వారిదీవనలను అనుగ్రహింపజేసే దివ్యతీర్థం రామకృష్ణతీర్థం. శ్రీ వేంకటాద్రిపైగల ఏడు ముక్తిప్రదాలైన తీర్థాలలోని రామకృష్ణ తీర్థాన్ని సేవించిన వారు సకల కామితీర్థాలను పొందుతారు. రామకృష్ణ మహర్షి చేత వేంకటాద్రిపై నిర్మింపబడి, వేంకటాద్రినాథునిచేత అనుగ్రహింపబడిన ఈరామకృష్ణ తీర్థప్రశంస బ్రహ్మపురాణంలోని నాల్గవఅధ్యాయంలో వ్యక్తమవుతోంది. శ్రీనివాసుడు రామకృష్ణ మహర్షికి సాక్షాత్కరించిన పుష్యమీనక్షత్రయుక్త పుష్యశుద్ధపౌర్ణమి రామకష్ణతీర్థానికి మహాపర్వదినం. ఈతీర్థం స్వామినిలయానికి సుమారు ఆరుమైళ్ళదూరంలో ఉంది.

## దేవతీర్థం :

రామకృష్ణతీర్థం బదులుగా దేవతీర్థాన్ని ఏడవముక్తిఫలదాయకమైన తీర్థంగా వరాహపురాణంలోని ద్వితీయభాగమందలి ప్రథమాధ్యాయం ప్రతిపాదించింది. 'దేవతీర్థమితి ఖ్యాతం తటాకమతి శోభనమ్' అంటూ వరాహపురాణంవర్ణిస్తూ దేవతీర్థ మహాత్మ్యాన్ని వివరించింది. దేవతలు అభిమానించి, అభినుతించి, ఆరాధించిన తీర్థం కావడంవలన ఇది దేవతీర్థంగా విఖ్యాతిపొందింది. ఇది శ్రీహరి ఆనందనిలయానికి వాయువ్యభాగంలోని వేంకటాద్రి శిఖరంపైగల ఒకగుహలో ఉన్న రమణీయమైన, కమనీయమైన మహనీయమైన దివ్యతీర్థం. దీనిలో పుష్యమీ నక్షత్రయుక్తమైన గురువారంనాడుగాని, శ్రవణనక్షత్రంతో కూడిన సోమవారంనాడుగాని స్నానంచేయడం యోగ్యమైన పర్వసమయంగా నిర్ణయింపబడింది. ఆ పర్వసమయంలో స్నానంచేసిన మానవుడు తెలిసీ తెలియక చేసిన పాపాలనుండి విముక్తుడవుతాడు. ఆయు

ర్భాగ్యం, పుత్రపౌత్రసౌభాగ్యం, స్వర్గసౌఖ్యమహాభాగ్యం పొందుతాడు. స్కంద, బ్రహ్మపురాణాలు విస్మరించిన దేవతీర్థాన్ని వరాహపురాణం స్మరించి శ్లాఘించింది. దాని మాహాత్మ్యాన్ని ఆదివరాహదేవుని చేత భూదేవికి వివరింపజేసింది.

## చక్రతీర్థం

శ్రీనివాసుని ఆనందనిలయానికి దక్షిణంగా ఉన్న మహాపవిత్ర తీర్థం చక్రతీర్థం. సుదర్శనుడు శివానుగ్రహం పొందడానికై కపిల తీర్థంలో తపస్సు కావించి శివసాక్షాత్కారం, వరానుగ్రహం పొంది శ్రీవేంకటాచలంపై తపస్సు కావించిన తావులోని తీర్థమే చక్రతీర్థమై విరాజిల్లింది. పూర్వకాలంలో చక్రతీర్థం సమీపంలో పద్మనాభుడనే శ్రీవత్సగోత్రీకుడైన బ్రాహ్మణుడు ద్వాదశాబ్దాలు శ్రీపతినుద్దేశించి అతితీవ్రమైన తపం కావించాడు. శ్రీపద్మావతీ హృదయాధినాథుడైన శ్రీనాథుడు పద్మనాభునకు ప్రత్యక్షమయ్యాడు. పద్మనాభుడు శ్రీనివాసుని వివిధవిధాలుగా వినుతించాడు. ప్రసన్నుడైన శ్రీ వేంకటనాథుడు పద్మనాభునకు కల్పాంతంవరకు చక్రతీర్థంవద్ద నివసించడానికి వరం అనుగ్రహించాడు. పద్మనాభుడు శ్రీనివాసుని ధ్యానిస్తూ చక్రతీర్థ తీరంలో నివశిస్తున్నాడు. ఒకనాడు ఒకరాక్షసుడు పద్మనాభుని సంహరింప సమాయత్తుడయ్యాడు.

ఆ రాక్షసుడు పూర్వజన్మలో సుందరుడనే గంధర్వుడు. అతని తండ్రి వీరబాహుడు. శ్రీరంగంలో కావేరీనదీజలాలలో సుందరుడు తన శతపరిమితమైన సతులతో కలసి నగ్నంగా జలక్రీడలాడుతున్నాడు. ఈవిధంగా సుందరుడు సుందరాంగులతో నగ్నంగాఉన్న మధ్యాహ్న సమయంలో వశిష్ఠమహర్షి ఋషిపరిషత్తుతో కలసి మధ్యాహ్నకాలస్నానం కావించుకోవడానికి కావేరీతీరానికి వచ్చాడు. మునిజనాన్ని

చూచిన సుందరుని స్త్రీజనం వస్త్రాలు ధరించింది. సుందరుడు ముని సమూహానికి సముచితగౌరవం చూపలేదు. జలక్రీడలు మానలేదు. సుందరునిఅసభ్యప్రవర్తనతో వశిష్ఠుడు ఆగ్రహావేశపరవశుడయ్యాడు. వశిష్ఠుడు సుందరుని రాక్షసకృత్యంచూచి సహింపలేక రాక్షసుడవై పొమ్మని శపించాడు. సుందరునిభార్యలు మునినిప్రార్థింపగా పదహారు సంవత్సరాలు రాక్షసునిగా సంచరించినపిమ్మట వేంకటాద్రిపైగల చక్ర తీర్థంసమీపంలోని పద్మనాభుని సంహరింప సమకట్టినసమయంలో శాప విమోచనంపొంది, సుందరుడై, గంధర్వుడై మరలివస్తాడని వారిని అను నయించి, అనుగ్రహించాడు. పదహారుసంవత్సరాలు రాక్షసునిగా సంచరించి, వేంకటాద్రికివచ్చి చక్రతీర్థంచేరి పద్మనాభుని సంహరింప సుందరుడు సన్నాహం కావించాడు. పద్మనాభుడు తనను రాక్షసుని బారినుండి రక్షింపమని శ్రీనివాసుని ప్రార్థించాడు. శ్రీహరి పద్మ నాభుని రక్షింపుమని సుదర్శనచక్రాన్ని నియోగించాడు. సుదర్శనుడు రాక్షసుణ్ణి సంహరించాడు. చక్రప్రయోగంతో చక్రతీర్థసమీపంలో రాక్షసుడు శాపవిమోచనంపొంది, సుందరుడనే గంధర్వుడై, గంధర్వ లోకానికి వెళ్ళిపోయాడు. పద్మనాభుడు చక్రిని, చక్రాన్ని, చక్రధారిని, సుదర్శనచక్రాన్ని వివిధ రీతులలో స్తుతించాడు.

సుదర్శనుడు పద్మనాభుని ఉద్దేశించి "నీరక్షణకోసం శ్రీహరి నన్ను నియోగించాడు. ఈ తీర్థంలో నేను అధివశిస్తాను. నేటినుండి ఈతీర్థం నా నిమిత్తంగా చక్రతీర్థం, సుదర్శన చక్రతీర్థం, సుదర్శనతీర్థం అనే సార్థకనామాలను సంతరించుకొంటుంది. దీనిలో స్నానంచేసిన జనులకు మోక్షంలభిస్తుంది. ఈ స్థానాన్ని సేవించే భక్తజనులమోక్ష క్షేమాలు నేనుచూస్తాను. దీనిని సేవించినవారికి, వారిసంతతికి రాక్షస బాధలు నివారిస్తాను. వారికిపుణ్యలోకాలు ప్రాప్తింపజేస్తాను."

అంటూ అభయమిచ్చాడు. తదాదిగా ఈ తీర్థం చక్రతీర్థంగా ప్రసిద్ధమైంది. సుదర్శనుడు తపస్సుకావించిన తీర్థమిది. పద్మనాభుని రక్షించి సుదర్శనుడు సన్నిధానంచేసిన దివ్యతీర్థమిది. స్కంధపురాణంలోని 13వ 25వ అధ్యాయాలు ఈ చక్రతీర్థమహిమను వర్ణించాయి. వరాహ పురాణం వేంకటాద్రిపైగల చక్రతీర్థాన్ని సప్తముక్తిప్రదాలైన తీర్థాలలో చేర్చింది. వేంకటాచలం సమీపంలోని కపిలతీర్థానికికూడా చక్రతీర్థం అనే ప్రసిద్ధిఉంది. వేంకటాచలంపైగల చక్రతీర్థం, వేంకటాచలం సమీపంలో చక్రతీర్థంగా వ్యవహరింపబడిన చక్రతీర్థం రెండు భిన్నములైన చక్రతీర్థాలు. వానిమహిమావిశేషాలలో భిన్నకథనాలు గోచరిస్తున్నాయి.

ఆకాశగంగాతీర్థం

"అత్ర్యాది సప్తఋషయ సముపాస్య సంధ్యాం
ఆకాశసింధు కమలాని మనోహరాణి
ఆదాయ పాదయుగ మర్చయితుం ప్రపన్నాః
శేషాద్రిశేఖరవిభో ! తవ సుప్రభాతమ్"

శ్రీనివాసునకు ప్రీతిపాత్రములైన ఆకాశగంగా ప్రాంతంలోని సింధుకమలాలను అత్ర్యాదిసప్తఋషి పుంగవులు సుప్రభాతసమయంలో శ్రీహరిపాదాలను పూజించడానికి కొనివస్తారు. శ్రీనివాసుడు ఆకాశసింధుకమలాల పూజలందుకొంటాడు. ఆకాశగంగాజలంతో నిత్యం అర్చనలు స్వీకరిస్తాడు బాలాజీప్రభుడు. రాత్రి స్వామివారికి ఏకాంత సేవ జరిగినతరువాత శ్రీవేంకటేశ్వరుని గర్భాలయంలో నాలుగు మూలలా పవిత్రమైన ఆకాశగంగాజలంతో నింపిన వెండిపాత్రలను పూజారులు ఉంచుతారు. ఒకపెద్ద వెండిపాత్రంలో ఆకాశగంగను ప్రత్యేకంగా యేర్పాటుచేస్తారు. రాత్రిసమయంలో బ్రహ్మదేవుడు

శ్రీనివాసుని సేవిస్తాడు. ఉదయం స్వామివారి విశ్వరూపదర్శన సమయంలో భక్తులకు బ్రహ్మదేవుడు అర్చింపగామిగిలిన ఆకాశగంగను స్వామితీర్థంగా వినియోగిస్తారు. ఇది నేటికీ సాగుతూన్న ఆచారం.

ఇట్టి ఆకాశగంగా పుణ్యతీర్థం శ్రీబాలాజీ నిలయానికి రెండు మైళ్లదూరంలో నెలకొని ఉంది. స్వామివారి సన్నిధానంలోగల సప్త ముక్తిదాయకములైన తీర్థాలలో ఇది ఒక ముఖ్యమైన తీర్థం. హిమాచలపు సానువులలో జన్మించి, ప్రవహించిన గంగ స్వర్గ, మర్త్య పాతాళలోకాలను పునీతంచేస్తోంది. వేంకటాచలంపై గల ఆకాశగంగ శ్రీనివాసుని, శ్రీనివాసభక్తులను అభిషేకిస్తూ అతిపవిత్రతీర్థమై అలరారుతోంది.

"అగ్నివాహస్థితే భానౌ చిత్రా నక్షత్ర సంయుతే
పూర్ణిమాఖ్యే తిథౌ పుణ్యే ప్రాతఃకాలే తథైవ చ
ఆకాశగఙ్గాసరితి స్నాతో మోక్షమవాప్నుయాత్"

— వరాహపురాణం

"మేషసంక్రమణే భానోశ్చిత్రా నక్షత్రసంయుతే
పౌర్ణమాస్యాంచ గంగాయాం స్నానం కుర్వంతి యేజనాః
తేయంతి పరమంధామపునరావృత్తి వర్జితమ్"

— స్కాంధపురాణం

చిత్తానక్షత్రయుక్తమైన చైత్రపౌర్ణమినాటి ప్రాతఃకాల సమయం ఆకాశగంగాతీర్థంలో స్నానంచేయడానికి పర్వసమయం.

కేసరిభార్య అంజనాదేవి. సంతానభాగ్యం పొందాలని మతంగ మహర్షికి నమస్కరించింది. మతంగమహర్షి ఆదేశానుసారం అంజనాదేవి వేంకటాచలానికి వచ్చింది. స్వామిపుష్కరిణిని, స్వామిని సేవించింది. మతంగ మహర్షి ఉపదేశానుసారం నిత్యం ఆకాశగంగలో స్నానం

చేస్తూ, ఆకాశగంగాతీరంలో కుటీరం నిర్మించుకొని పుత్రసిద్ధికై ద్వాదశ వర్ష ప్రమాణమైన దివ్యతపస్సును కావించింది. శ్రీరామభక్త హను మంతుణ్ణి పుత్రునిగా బడసిన అంజనాదేవికి తపోసిద్ధిని, ప్రసిద్ధ పుత్ర సిద్ధిని ప్రసాదించిన దివ్యప్రాంతం ఆకాశగంగాతీరం. శ్రీరామపాద పరాగంచేత పునీతమైన పరమపావన ప్రదేశం ఆకాశగంగా తీరం. శ్రీరామమూర్తి బాల్యక్రీడలకు ఆలవాలమైన క్రీడాస్థలం ఆకాశగంగా తీరం. స్కాంద భవిష్యోత్తరపురాణ గాథలలో అంజనాదేవి పుత్ర ప్రాప్తికి కావించిన తపోవృత్తాంతముతో ఆకాశగంగాతీర్థ పవిత్రో దంతంకూడా విపులంగా వర్ణింపబడింది. వ్యాసభగవానునిచేత వేంక టాద్రిపైగల ఆకాశగంగాతీర్థ పవిత్ర స్నానమహిమ అభివర్ణింపబడింది.

స్కాందపురాణంలోని ద్వాదశాధ్యాయంలోని పుణ్యశీలుని వృత్తాంతములో ఆకాశగంగాతీర్థమహిమ ప్రముఖంగా ఆవిష్కరింప బడింది. పూర్వకాలములో పుణ్యశీలుడనే బ్రాహ్మణుడు గోదావరీ తీరములో నివసించేవాడు. ధర్మ కర్మనిష్ఠలుగల గుణశీలుడు, పుణ్య శీలుడు. ఒకనాడు తండ్రి ఆబ్దీకం వచ్చింది. వేదవేదాంగపారంగుడైన పండితుడు అభ్యాగతిగా ఆనాడు పుణ్యశీలుని గృహానికి వచ్చాడు. అతణ్ణి పితృస్థానంలోనిలిపి పుణ్యశీలుడు సశాస్త్రీయంగా, సమంత్రకంగా, సభక్తికంగా శ్రాద్ధం నిర్వహించాడు. ఈవిధంగా పితృకార్యం నెర వేర్చిన నాటినుండి అతనిఆకారంలో వికారం ప్రారంభించింది. కొంత కాలానికి అతనిముఖం గాడిదముఖంగా మారిపోయింది. గోదావరీతీరం నుండి సువర్ణముఖరీతీరానికివెళ్ళి అచ్చట ఆశ్రమంలోగల అగస్త్య మహర్షిని దర్శించి, జరిగినవిషయంనివేదించి గర్దభాకారం తొలగి పోయి స్వస్వరూపం సిద్ధించేమార్గం తెలుపుమని పుణ్యశీలుడు ప్రార్థిం చాడు. అగస్త్యుడు దయాంతరంగుడై దివ్యదృష్టితో సర్వవిషయాలు

గ్రహించాడు. "నీవు పితృకార్యం నిర్వహించిన సమయములో అపుత్ర కుణ్ని పితృస్థానములో నిమంత్రణం చేయడంమూలంగా నీ ఆకారానికి వికారమైన గార్దభాకారంవచ్చింది. వేంకటాద్రిపై గల ఆకాశగంగా తీర్థంలో ససంకల్పంగా స్నానంచేస్తే నీకు స్వస్వరూపం సిద్ధిస్తుంది" అని అగస్త్యుడు పుణ్యశీలునకు హితోపదేశం కావించాడు. పుణ్యశీలుడు ఆకాశగంగను సేవించి, శ్రీనివాసుని పూజించి సుందరమైన స్వస్వరూపం సంపాదించుకొని తరించాడు.

పూర్వం వానప్రస్థాశ్రమంలో ఉన్న రామానుజుడనే మహా విష్ణుభక్తుడు శ్రీవేంకటాద్రిపై గల ఆకాశగంగాతీరంలో తీవ్రమైన తపం ఫల, పత్ర, జల, వాయుభక్షకుడై కావించాడు. శ్రీనివాసుడు సుప్రసన్నుడై సపరివారసమేతుడై రామానుజునకు ఆకాశగంగాతీరంలో సాక్షాత్కరించి వరం కోరుకోమని ఆజ్ఞాపించాడు. 'నీ దివ్యదర్శన భాగ్యం లభించడమే నాకు లభించిన మహావరం. శ్రీనివాసా నీపాదాలు సదాభావించి సేవించే శక్తిని, భక్తిని నాకు ప్రసాదింపుముస్వామీ ! అంటూ రామానుజుడు శ్రీవేంకటేశ్వరుణ్ణి ప్రార్థించాడు. బాలాజీ అనుగ్రహానికి రామానుజుడు పాత్రుడై పునరావృత్తిరహితమైన పరమపదాన్ని పొందాడు. అంజనాదేవికి పుత్రప్రాప్తిని, పుణ్యశీలునకు సుందరమైన స్వస్వరూపప్రాప్తిని, రామానుజునకు మోక్షప్రాప్తిని ప్రసాదించిన పరమపవిత్రతీర్థం ఆకాశగంగాతీర్థం.

## పాపవినాశనతీర్థం

సర్వప్రాణుల సమస్తపాపాలను హరించే దివ్యతీర్థం కావడం వలన దీనికి పాపనాశనతీర్థం, పాపవినాశనతీర్థం అనే సార్థకనామాలు సిద్ధించాయి. ఈ తీర్థం వేంకటాద్రిపై స్వామివారి దేవాలయానికి ఉత్తరంగా సముద్రమట్టానికి 2, 440 అడుగుల ఎత్తున ఉంది. ఇది కాలి

బాటను వెళ్ళితే సుమారు మూడుమైళ్ల దూరంలో ఉంది. తిరుమల నుండి పాపవినాశనతీర్థానికిగల ఘాటురోడ్డు పొడవు నాలుగుమైళ్ల రెండు ఫర్లాంగులు. పదిలక్షలరూపాయల ఖర్చులో దీనికి పక్కా ఘాటురోడ్డు నిర్మాణం జరిగింది. ఈ బస్సుమార్గం ఆకాశగంగాతీర్థం గుండా పోతుంది. 1952 సం॥లో 6 లక్షలరూపాయల ఖర్చులో పాపవినాశనం నీటి సరఫరాపథకం యేర్పాటు చేయబడింది. 30-11-1959 నాటి ఉదయమే తిరుమల పాపవినాశనం ఘాటురోడ్డుకు ప్రారంభోత్సవం జరిగింది. దీనికి బస్సుసౌకర్యం యేర్పడింది. అందువలన తిరుమలయాత్రికులకు ఆకాశ గంగా, పాపవినాశనతీర్థాలను సులభంగా సేవించే సౌలభ్యం కలిగింది.

పురాణకాలంలో హిమాలయపర్వత ప్రాంతంలో 'బ్రహ్మాశ్రమం' ఉండేది. దానిలోని మునులకు కులపతి సుమతి. దృఢమతి అనేవ్యక్తి వచ్చి బ్రహ్మాశ్రమం చూచి అచ్చటి తపోధనులు తపోయజ్ఞయాగాదులు నిర్వహించడం పరిశీలించి తానుకూడ అట్టి కార్యకలాపాలు చేపట్టాలని సంకల్పించాడు. కులపతిని కలిసి తన ఆలోచన తెలిపాడు. దృఢమతిని అతడు నివారించాడు. దృఢమతి తనసంకల్పం విరమించుకోలేకపోయాడు. ఆ హిమాలయ పవిత్రప్రాంతంలో బ్రహ్మాశ్రమానికి సమీపంగా ఆశ్రమం నిర్మించుకొని తపోనిమగ్నుడయ్యాడు. దృఢమతికి బ్రహ్మాశ్రమంలో తపోయజ్ఞయాగాదులు నిర్వహించడానికి అర్హతలేదని భావించి, స్థానం నిరాకరించిన కులపతి ఒకనాడు దృఢమతి ఆశ్రమానికి వెళ్ళాడు. అతడు కావించిన యథోచిత గౌరవసత్కారాలకు సంతోషించి కొంతకాలం దృఢమతి ఆశ్రమానికి రాకపోకలు సాగించాడు. దృఢమతి శక్తిసామర్థ్యాలను, మనోస్థితిగతులను విస్మరించి అతడు కోరగా తపోనియమాలను, ధ్యానరహస్యాలను, యజ్ఞవిధులను బోధించాడు. అర్హతలేని శిష్యునకు తపోధర్మాలు, క్రతుకార్యకలాపాల నిర్వాహణమర్మాలు తెలిపి సుమతి అజ్ఞాతంగా క్షీణ

పుణ్యుడయ్యాడు. ధర్మం నిర్వహించాలనే అభినివేశమేగాని, పరిపక్వ మానసికస్థితిని సిద్ధింపజేసికొనలేని దృఢమతి తపోసిద్ధి, ధ్యానసిద్ధి, యజ్ఞఫలసిద్ధి పొందడంలో విఫలుడయ్యాడు. వారుభయులూ కొంత కాలానికి కాలగర్భంలో లీనమయ్యారు.

అర్హత, మానసిక పరిపక్వత లేని దృఢమతికి మోక్షవిద్యారహస్యాలు తెలిపిన దోషంమూలంగా సుమతి క్రిమి, కీటక, పశు, పక్ష్యాది జన్మలను మరల పొందాడు. అనేక మానవజన్మలు పొందినతరువాత ఒక బ్రాహ్మణవంశంలో జన్మించాడు. ఉపనయనమై బ్రహ్మవిద్యారహస్యాలు గ్రహించే సమయంలో అతడు బ్రహ్మరాక్షసబాధకు లోనయ్యాడు. తనయుని బాధానివృత్తికై తండ్రి శివాశ్రమంలో ధ్యానం కావిస్తూన్న అగస్త్యముని వద్దకు తోడ్కొనిపోయి తనకుమారునికి బ్రహ్మరాక్షసపీడను తొలగింపుమని ప్రార్థించాడు. అగస్త్యమహర్షి దివ్యదృష్టితో విప్రబాలుని బ్రహ్మరాక్షసపీడాకారణం గ్రహించి ఉపశమనమార్గాన్ని ఈ విధంగా ఉపదేశించాడు. "ఇతడు పూర్వజన్మలో హిమాలయాలలోని బ్రహ్మాశ్రమానికి కులపతియైన సుమతి. అపాత్రుడైన దృఢమతికి బ్రహ్మవిద్యాబోధ కావించిన దోషం మూలంగా నరకయాతనలు, జన్మపరంపరలు పొంది ఈనాడు బ్రహ్మరాక్షసపీడకు గురయ్యాడు. ఈ బాలుణ్ణి వేంకటాద్రిపైగల పాపవినాశన పవిత్రతీర్థంలో మూడురోజులు విధివిధానంగా స్నానంచేయిస్తే ఇతనికి బ్రహ్మరాక్షసబాధానివృత్తి లభిస్తుంది." అని తండ్రి తనయుని వేంకటాచలానికి కొనిపోయి సంకల్పయుక్తంగా మూడుదినాలు పాపవినాశనతీర్థంలో స్నానం చేయించాడు. ఫలితంగా అతనికి బ్రహ్మరాక్షసబాధానివృత్తి లభించింది. ఇహపరసౌఖ్యం సిద్ధించింది. మానసిక పరిపక్వస్థితిని అందుకోలేని స్థితిలో దృఢమతి బ్రహ్మవిద్యారహస్యాలు, యజ్ఞవిధులు సుమతినుండి అభ్యసించి, అధ్యయనంచేసి,

ఆచరించిన అపరాధఫలితంగా జన్మపరంపరతో దుఃఖితు డయ్యాడు. గ్రద్ధరూపం పొందాడు. గ్రద్ధరూపంలోని దృఢమతి ఒకనాడు శ్రీవేంకటాచలంపై విహరించి పాపవినాశనతీర్థంలో మునిగి ఆతీర్థం సేవించాడు. దానితో అతనిపాపం నశించింది. అతడు పుణ్యలోకం పొందాడు. ఈ విధంగా గురుశిష్యుల దోషాలను, పాపాలను నిర్మూలించి వారికి ఉత్తమలోకాలను ప్రసాదించిన పరమపవిత్రతీర్థం పాపవినాశనతీర్థం. ఈవిధమైన పాపవినాశనమహిమ స్కాందపురాణాంతర్గతమైన తొమ్మిదవ అధ్యాయంద్వారా తెలుస్తోంది.

"వర్తతే దైవతైస్సేవ్యః పావనో వేంకటాచలః
తస్యోపరి మహాతీర్థం నామ్నా పాపవినాశనమ్
అస్తిపుణ్యం ప్రసిద్ధ్యంచ మహాపాతకనాశనమ్
భూతప్రేతపిశాచానాం భేతాళబ్రహ్మరాక్షసామ్
మహతాంచైవ రోగానాం తీర్థం తన్నాశకమ్ స్మృతమ్"

— స్కాందపురాణం

పూర్వం భద్రమతి అనే బ్రాహ్మణుడు కృత, సింధు, యశోవతి, కామిని, మాలిని, శోభ అనే ఆరుగురుభార్యలను కలిగి వారివలన రెండువందలమంది కుమారులను కన్నాడు. బహుభార్యత్వం, అధిక సంతానంమూలంగా ఇతడు దరిద్రుడయ్యాడు. వేదవేదాంగ విద్యాప్రవీణునిగా, మహాపండితునిగా ప్రసిద్ధుడైనా, వృత్తిహీనుడై, ధనహీనుడై, వ్యర్థజీవను డయ్యాడు. భర్తబాధనుచూచి సహించలేని కామిని అనే భద్రమతి భార్య "నాతండ్రికూడ దారిద్ర్యబాధ పడ్డాడు. నారదమహర్షి ఉపదేశానుసారం వేంకటాచలానికివెళ్ళి పాపవినాశన తీర్థాన్ని సేవించి ఆ పాపవినాశనతీరంలో భూదానంచేసి భాగ్యవంతుడై లౌకిక పారలౌకిక సుఖశాంతులు పొందాడు. మీరూ ఆ విధంగాచేస్తే బాధలు తొలగుతాయి" అని హితవు చెప్పింది.

భద్రమతి కుటుంబసమేతుడై తిరుమలయాత్రకు బయలుదేరాడు. మార్గంలోని సుశాలి అనే పట్టణమందలి సుఘోషుని అర్థించి పంచ హస్తప్రమాణంగల భూమిని దానంగాపొందాడు. తిరుమలచేరి శ్రీని వాసుని మనసా పూజించాడు. పిమ్మట పాపవినాశనతీర్థాన్ని సేవించి దానితీరంలో ఉత్తముడైన బ్రాహ్మణునకు సుశాలి పట్టణంలో సుఘోషునివలన పొందిన పంచహస్తప్రమాణమైన భూమిని విష్ణు స్వరూపునిగా భావనచేసి దానం కావించాడు. అంత శ్రీనివాసుడు పరమప్రీతుడై భద్రమతికి ప్రత్యక్షమయ్యాడు.

"నమో నమస్తేఖిల కారణాయ నమోనమస్తేఖిల పాలకాయ
నమో నమస్తే మరనాయకాయ నమో నమో దైత్యవిమర్దనాయ
నమోనమో భక్తజనప్రియాయ నమోనమః పాపవిదారణాయ
నమోనమో దుర్జననాశకాయ నమోస్తు తస్మై జగదీశ్వరాయ
నమోనమః కారణవామనాయ నారాయణామితవిక్రమాయ
శ్రీశార్ఙ్గచక్రాసిగదాధరాయ నమోస్తు తస్మై పురుషోత్తమాయ
నమః పయోరాశి నివాసకాయ నమోస్తు లక్ష్మీపతయే అవ్యయాయ
నమోస్తు సూర్యాద్యమితప్రభాయ నమోనమః పుణ్యగతాగతాయ
నమోనమో ఇందీవరలోచనాయ నమోస్తుతే యజ్ఞఫలప్రదాయ
నమోస్తు యజ్ఞాంగ విరాజితాయ నమోస్తుతే సజ్జనవల్లభాయ
నమోనమః కారణకారణాయ నమోస్తు శబ్దాదివవర్జితాయ
నమోస్తుతే అభీష్టసుఖప్రదాయ నమోనమో భక్తమనోరమాయ
నమో నమస్తే అఖిలకారణాయ నమోస్తు తే మందరధారకాయ
నమోస్తు తే యజ్ఞవరాహనామ్నే నమో హిరణ్యాక్షవిదారకాయ
నమోస్తు తే వామనరూపభావే నమోస్తు తే క్షత్రకులాంతకాయ
నమోస్తు తే రావణమర్దనాయ నమోస్తు తే నందసుతాగ్రజాయ

నమస్తే కమలాకాంత నమస్తే సుఖదాయినే
శ్రితార్తినాశినే తుభ్యం భూయో భూయో నమోనమః"

—స్కందపురాణం

ఈవిధంగా శ్రీనివాసమూర్తిని స్తుతించాడు. ఆర్తత్రాణపరాయణుడైన, భక్తార్తినాశకుడైన, భక్తజనమందారుడైన శ్రీవేంకటరమణమూర్తిని భద్రమతి ప్రస్తుతించాడు.

"తత్ తృష్టోస్మి భద్రంతే స్తోత్రేణ మహతా ద్విజ
సర్వభోగసమాయుక్తః పుత్రపౌత్రాదిభిర్యుతః
ఇహాలోకే సుఖంప్రాప్య దేహాంతే ముక్తిమాప్నుహి"

—స్కందపురాణం

అంటూ సుప్రసన్నుడైన శ్రీనివాసుడు భద్రమతిని అనుగ్రహించాడు. భద్రమతి సకలసంపదలుపొంది అనుభవించాడు. దేహాంతమందు మోక్షసామ్రాజ్యలక్ష్మీ పట్టాభిషిక్తుడయ్యాడు. స్కందపురాణంలోని పదవఅధ్యాయంలోని భద్రమతికథ పాపవినాశని తీర్థమహిమను ప్రకటించింది. సుమతి బ్రహ్మరాక్షసబాధను భద్రమతిదారిద్ర్య బాధను నిర్మూలించిన ముక్తిప్రదమైన ఉత్తమతీర్థం పాపవినాశన తీర్థం.

"అశ్వినే శుక్లపక్షేతు భానువారేణ సప్తమీ
ఉత్తరాషాఢయా యుక్తా తస్యాం పాపవినాశనే
ప్రాప్తాయా ముత్తరభాద్రాం ద్వాదశ్యాం వా సమాగమః
తదా పాపవినాశాఖ్యే స్నాతుర్ముక్తిర్భవిష్యతి"

—బ్రహ్మపురాణం

"శుక్లేపక్షేఽథవా కృష్ణే యార్కవారేణ సప్తమీ
యుక్తా పుష్యక్షసంయుక్తా హస్తే క్షణయుతాపివా
తస్యాం అథా మహాభాగే పాపనాశనసంజ్ఞకే

తీర్థే యస్స్నాతి నియమాద్భాద్రశేరవిస్య మస్తకే
కోటిజన్మార్జితైః పాపైర్ముచ్యతే స నరోత్తమః"

—వరాహపురాణం

పాపవినాశనతీర్థానికి ఆశ్వయుజశుక్ల భాను సప్తమీయుక్త ఉత్తరాషాఢా నక్షత్రంనాడుకాని, ద్వాదశీయుక్త ఉత్తరాభాద్రనాడు కాని పర్వదినం అని బ్రహ్మపురాణం తెలుపుతోంది. సూర్యుడు వృషభరాశిలో ఉన్న శుక్ల, కృష్ణపక్షాలలోని పుష్యమి లేక హస్తా నక్షత్రంతో కూడిన భానుసప్తమినాడు యే మానవుడు శ్రీవేంకటాద్రిపై గల పాపవినాశనతీర్థంలో సంకల్పయుక్తంగా స్నానంచేస్తాడో అతడు కోటిజన్మల పాపాలనుండి విముక్తిపొంది ముక్తిపొందుతాడని వరాహపురాణం ప్రకటిస్తోంది. ఇట్టి అపూర్వమైన మహిమావిశేషం గల దివ్యతీర్థం వేంకటాచలంపై గల పాపవినాశన తీర్థం.

## పాండవతీర్థం

తిరుమలపై శ్రీవేంకటేశ్వరుని ఆనందనిలయానికి అతిసమీపంలో పాండవతీర్థం ఉంది. ఆనందనిలయానికి వాయువ్యభాగంలో సుమారు అరమైలుదూరంలో ఉంటుంది. శ్రీవేంకటాద్రిపై గల సప్తముక్తిప్రదమైన తీర్థాలలో ఇది ఒకటి. దీని ప్రశంస వరాహ పద్మపురాణాలలో కనపడుతోంది. దుష్టశిక్షణార్థమై, శిష్టరక్షణార్థమై అవతరించిన లీలామానుష విగ్రహుడు శ్రీకృష్ణపరమాత్ముడు. పాండవులు తమ తాపత్రయాలను హరింపజేసికోవడానికై శ్రీకృష్ణభగవానుని ఉపదేశంతో వేంకటాచలాన్ని సేవించారు. శ్రీవేంకటాచలపతిని అర్చించారు. స్వామి దివ్యదేవాలయసమీపంలో తిరుమలక్షేత్రపాలకస్వామి రక్షణలోని పవిత్రతీర్థతీరంలో నివసించారు. ఒకసంవత్సర పర్యంతం ఆ పుణ్యతీర్థంలో పాండవులు స్నానంచేస్తూ, శ్రీవేంకటేశ్వరుని ఆరాధిస్తూ,

ఆ తీర్థంలో తపస్సు సాగించారు. పాండవాగ్రజుడైన ధర్మరాజునకు ఒక సుస్వప్నంవచ్చింది. "మీరు ఈ దివ్యతీర్థాన్ని ఒక ఏడాదిపాటు సేవించిన పుణ్యఫలితంగా ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికరూపాలైన తాపత్రయాలు నశించాయి. మీరు క్షీణపాపు లయ్యారు. పుణ్యసంపదను సంపాదించారు. యుద్ధంవలన విజయము, విజయముద్వారా రాజ్యలాభము సిద్ధిస్తాయి." అనే శుభవాక్యపరంపరలు వారుచూచినకలలో వినిపించాయి. పాండవులకు శ్రీకృష్ణుని సహాయం, సారథ్యం, రాజకీయ నాయకత్వం ప్రాప్తించాయి. కురుక్షేత్రమహాసంగ్రామములో విజయశ్రీ సమువేతు లయ్యారు. ధర్మరాజపట్టాభిషేకం జరిగింది. పాండవులకు హస్తినాపురరాజ్యం లభించింది. వేంకటాద్రిపై ఆ సమయంలో పాండవులచేత సేవింపబడిన పుణ్యతీర్థం పాండవతీర్థం అనే పవిత్రనామాన్ని సంతరింపజేసికొని సప్తముక్తిదాయకమైన తీర్థాలలో పరిగణింపబడి ప్రసిద్ధిపొందింది. ఈ విధంగా పాండవతీర్థమహిమ వరాహపురాణంలో ప్రతిపాదింపబడింది.

దీనికి భిన్నమైనరీతిలో పద్మపురాణంలో పాండవతీర్థమహిమ ప్రతిబింబింపబడింది. పూర్వం పాండవులు మాయాజూదంలో ఓడిపోయి అరణ్య, అజ్ఞాతవాసాలు పూర్తిచేసారు. శ్రీకృష్ణునిదూతగా తమ ధర్మమైన రాజ్యభాగంకోసం పంపారు. ఐదుఊళ్ళకైనా సంసిద్ధులయ్యారు. రారాజు రక్కసిరాజ్యకాంక్షతో సూదిమొనమోపిన భూభాగమైనా ఇవ్వనని నిరాకరించాడు. ధర్మరాజు నివారించాలనుకొన్న యుద్ధం అనివార్యమైంది. కురుక్షేత్రమహాసంగ్రామంసాగింది. పాండవులు తాతలను, తండ్రులను, మేనమామలను, అన్నదమ్ములను, జ్ఞాతులను, అసంఖ్యాకములైన శత్రుసేనలను వధించి రాజ్యంతోపాటు మహాపాపాన్ని పొందారు. జ్ఞాతివధ, ప్రాణహింసవలన సంక్రమించిన

పాపాన్ని పాండవులు నివారించుకోవడానికై శ్రీకృష్ణపరమాత్మ ఉప దేశానుసారం స్వామివారి సన్నిధానానికి సమీపంలోని తీర్థంలో స్నానంచేసి, శ్రీనివాసుని యథావిధిగా పూజించి పాపవిముక్తుల య్యారు. పాండవులు సేవించిన ఆతీర్థం పాండవతీర్థంగా తదాదిగా ప్రసిద్ధమైనట్లు పద్మపురాణం ప్రకటిస్తోంది. వైశాఖశుద్ధ ద్వాదశీ ఆది వారంనాడుకాని వైశాఖబహుళ మంగళవారంనాడుగాని పాండవ తీర్థానికి పర్వసమయం అని వరాహపురాణం నిర్ణయించింది. పాండవ తీర్థం వేంకటాచలంపైగల సప్తముక్తిదాయకములైన పుణ్యతీర్థాలలో ఒకటి.

వేంకటాద్రిపైగల సమస్తతీర్థాలూ ప్రకృతిరమణీయతకు నిల యాలు, సప్తముక్తిదాయకములైన తీర్థాలు ప్రకృతిసౌందర్యానికి, ఆరామశోభకు, పర్వతసానువుల కమనీయమైన దృశ్యవైభవానికి ప్రతి బింబాలై ప్రత్యక్షప్రదర్శనశాలలై విరాజిల్లుతున్నాయి. తుంబురతీర్థ సమీపంలో తరికొండ వెంకమాంబ తపస్సుచేసి శ్రీవేంకటేశ్వర సాక్షాత్కారం పొందిన వెంకమాంబ గుహ, దాని సరసనే మహర్షి మళయాళస్వామి తపస్సుచేసి ఆత్మసాక్షాత్కారం పొందినగుహ ఉన్నాయి. నేటికీ వేణువీణావల్లకీనాదాలు ప్రతిధ్వనించే సుమధుర సంగీతనాదాలు ప్రసరించే కళానిలయం తుంబురతీర్థం. ఆ తుంబురతీర్థ తీరంలో వాయులీనసాధనంచేసి జగత్ప్రసిద్ధ వాయులీనవాద్య విద్వాం సుడై చౌడయ్య ధన్యుడయ్యాడు. ఇట్టిలౌకిక, పారలౌకిక సుఖశాంతులు మానవాళికి ప్రసాదించే దివ్యతీర్థాలు శ్రీవేంకటాద్రిపైగల సప్తముక్తి దాయకములైన తీర్థాలు.

## సప్తదశ తీర్థాలు

"నాస్తిబుద్ధిరయుక్తస్య నచాయుక్తస్య భావనా
నచాభావయతః శాన్తి రశాంతస్యకుతస్సుఖమ్" —గీత

"స్థిరమైన బుద్ధిలేకపోతే భావన స్థిరపడదు. భావన లేకపోతే శాంతి ఉండదు. శాంతంలేక సౌఖ్యంలేదు" అన్నాడు శ్రీకృష్ణ భగవానుడు 'గీత'లో. సౌఖ్యానికి మూలాధారమైన స్థిరబుద్ధిని సంపాదించుకోవడానికి తీర్థసేవనం అవశ్యాచరణీయమని ఆర్షఋషులు అభిభాషించారు.

"పోయి సేవింపలేకున్న పుణ్యతీర్థ
మహిమ వినుటయు నఖిల కల్మషహరంబు" అన్నారు

మనపెద్దలు తీర్థమహిమనుగూర్చి. తీర్థసేవనం ఎంత ఫలవంతమైనదో తీర్థ మహిమాశ్రవణంకూడా అంతఫలవంతమైనదే. మన ప్రాచీనుల వర్ణాతీత సమాజ స్థాపన కాంక్షను ప్రత్యక్షనిదర్శనంగా నిలచేది తీర్థసేవన సంప్రదాయం. కోటలోని రాజును, పేటలోని పేదను తమజలాలలో స్నానం కావించిపునీతులుకావడానికి సమానమైన అవకాశాలు ప్రసాదించే సమసమాజ స్థాపనకేంద్రాలు తీర్థాలు. తీర్థాలను మనపూర్వులు జంగమతీర్థాలుగా, మానసతీర్థాలుగా, స్థావరతీర్థాలుగా విభజించారు. సాధు సజ్జనులు నివసించిన, నివసిస్తున్న స్థావరాలు జంగమతీర్థాలు.

"సత్యంతీర్థం క్షమాతీర్థం తీర్థ మింద్రియ నిగ్రహః
సర్వభూతదయాతీర్థం తీర్థ మార్జవమేవత"

సత్యం, క్షమా, ఇంద్రియనిగ్రహం, భూతదయ, బ్రహ్మచర్యం ఆదిగాగల సర్వసద్గుణాలకు నిలయమైన మానవహృదయమే మానస తీర్థం. అట్టిమానసతీర్థం హృదయయులో గలవారే 'స్వయంతీర్థః పరాన్ తారయతి' అన్న కోవకుచెందిన మహాత్ములు. కాశీరామేశ్వరాది పుణ్యస్థలలాన్నీ స్థావరతీర్థాలు.

"గంగేచ యమునే చైవ గోదావరి సరస్వతి
నర్మదే సింధు కావేరి జలేస్మిన్ సన్నిధిం కురు"

ప్రతిభారతీయుడు తన స్నానసంకల్పములో, దైవపూజావిధాన ములో నిత్యము భారతీయనదీతీర్థాలను విధిగా స్మరిస్తాడు. ఈవిధమైన పవిత్రతీర్థ స్మరణద్వారా భారతీయులలో దైవభక్తి, దేశభక్తి కొన సాగుతున్నాయి. దివ్యతీర్థాలు జాతీయసమైక్యతను, విశ్వకల్యాణభావ నను బలపరుస్తున్నాయి అఖండ భారతజాతీయభావనను, సర్వమత ఏకత్వసాక్షాత్కార సాధనను తీర్థాలు కొనసాగిస్తున్నాయి. ఋగ్వేదం నదులను, తీర్థాలను జలదేవతలుగా, క్షేత్రాలను పుణ్యస్థలాలుగా, మాతృభూమిని పుణ్యభూమిగా ఆవిష్కరించి కీర్తించింది. అధర్వణ వేదములోని పృథ్వీసూక్తంనుండి బంకించంద్రుని వందేమాతరం గీతం వరకూ దేశమాతను, పరదేవతగా ప్రశంసించాయి. మానవాళికి, భారతజనావళికి పరమేశ్వరుడు ప్రకృతిరూపంలో అనుగ్రహించిన వరాలే గిరులు, తరులు, తీర్థాలూను. తిరుమలగిరి దివ్యతీర్థాలకు ఆల వాలమై, ప్రకృతి సౌందర్యానికి నిలయమై, భారత ఏకాత్మభావనకు కేంద్రమై సర్వమత సమ్మత మహిత పీఠమై, విశ్వవిఖ్యాత పవిత్ర యాత్రాస్థలమై అలరారుతూ, దర్శించి, సేవించిన యాత్రికజనతకు దివ్యానుభూతి పరంపరలు కలిగిస్తోంది. తరులు, గిరులు, తీర్థాలు బాలాజీ నెలకొన్న తావులో, తిరుమలలో మహిమాన్వితాలై, ప్రభావ సంపన్నాలై శోభిస్తున్నాయి. అవి బాలాజీలీలావిభూతులకు పరిసార కేంద్రాలై విరాజిల్లుతున్నాయి. తిరుమలలోని దివ్యతీర్థాలు తిరుమలే శ్వరునివలన పవిత్రతను, పరిఖ్యాతిని సంతరించుకొన్నాయి. సకలతీర్థాల లోని జలం శ్రీహరిపాదంనుండి పుట్టింది కావడవలన పవిత్రమై, పావ నములకెల్ల పావనమై, సర్వమంగళదాయకమై, ఒప్పారుతోంది.

బ్రహ్మపురాణము శ్రీవేంకటాద్రిపై అరవైఆరుకోట్ల పుణ్య తీర్థాలు ఉన్నాయని ప్రకటిస్తూ కొన్ని ప్రధానములైన తీర్థాలను ప్రక

టించింది. సప్తఋషితీర్థాలు, అష్టభైరవతీర్థాలు, నవప్రజాపతితీర్థాలు, దశావతారతీర్థాలు, ఏకాదశరుద్రతీర్థాలు, ద్వాదశాదిత్యతీర్థాలు పంచతీర్థాలు, నవతీర్థాలు, సప్తదశతీర్థాలు శక్తివంతాలైనవని బ్రహ్మ, విష్ణు, రుద్ర, నారసింహ, ఇంద్ర, అగ్ని, యమ వరుణ, వాయు, కుబేర, కార్తికేయ, దేవ ఆదిగాగల దేవతాసంబంధమైన తీర్థాలు ప్రాభవవైభవాలు సంతరించుకొన్నాయి భృగు, కాశ్యప, భారద్వాజ, కణ్వ, నారద, మార్కండేయ, జాబాలి, వాలఖిల్య, విశ్వామిత్ర, గౌతమ, ఋశ్యశృంగ ఆదిగాగల మహర్షి తీర్థాలు మహిమాన్వితాలై ప్రకాశిస్తున్నాయి. జర్వహర, విషహర, ఇష్టసిద్ధి, కర్మసిద్ధి, పుణ్యవృద్ధి, పాపవినాశన, జరాహర, ఋణవిమోచన, వనిఘ్నరసాయన, శుద్ధోదక ఆదిగాగల ప్రత్యక్షఫలదాయకాలైన, సార్థకనామధేయాత్మకములై పుణ్యతీర్థాలు తిరుమలపై వెలసి పురాణసాహిత్యములో సముచితస్థానము సంపాదించుకొన్నాయి. జ్ఞానసిద్ధి, కార్యసిద్ధి, మనోవాంఛాఫలసిద్ధి, యోగసిద్ధి, తపోసిద్ధి, ఆరోగ్యసిద్ధి, ఆయుర్వృద్ధి, ఐశ్వర్యవృద్ధి, మోక్షసిద్ధి మొదలైన దివ్యఫలాలను మానవులకు ప్రసాదించే దివ్యతీర్థాలవి. మానవుల సమస్తపాపాలు హరించి, వారిదోషాలు, బాధలునివారించి, వారికి సకల సుఖాలు, శుభాలు, వరాలు అనుగ్రహించే పుణ్యతీర్థాలు తిరుమలపైగల దివ్యతీర్థాలు. ఈ విధముగా అసంఖ్యాకంగా ఉన్నతీర్థాలలో సప్తతీర్థాలపిమ్మట సప్తదశతీర్థాలు, పంచతీర్థాలు, నవతీర్థాలు (నవనిధులు), సనకసనందన, కాయరసాయన, ఫాల్గుణి, జాబాలి, అస్థి, కటాహ ఆదిగాగల తీర్థాలు పురాణసాహిత్యములోప్రముఖస్థానము గ్రహించి, తిరుమలయాత్రికులుస్మరించి, దర్శించి, సేవించవలసిన ప్రధానమైన, ప్రశస్తమైన, ప్రభావసమన్వితమైన తీర్థాలుగా విరాజిల్లుటున్నాయి వర్ధిల్లుతున్నాయి.

## సప్తదశ తీర్థాలు

పూర్వకాలములో ఒక బ్రాహ్మణుడు ప్రపంచంలోని సకలతీర్థాలకు యాత్ర కావించి సేవించాలని సంకల్పించాడు. అతని పవిత్ర సంకల్పాన్ని మన్నించిన శ్రీనివాసుడు భక్తవాత్సల్యహృదయుడై 'వేంకటగిరిపై గల సప్తదశతీర్థాలను సేవిస్తే లోకమందలి సమస్త పుణ్యతీర్థాలను సేవించిన మహాఫలం లభిస్తుంది' అని ఆ బ్రాహ్మణునకు చెప్పి అనుగ్రహించాడు. శ్రీ వేంకటేశ్వరుని ఆదేశాన్ని అనుసరించి వేంకటాద్రిపై గల సప్తదశతీర్థాలను అతడు సేవించి విశాలవిశ్వమందలి అశేషతీర్థాలను సేవించిన పుణ్యఫలము, మహాభాగ్యము పొందాడు. విశ్వ తీర్థయాత్రాఫలాన్నిచ్చే పవిత్రతీర్థసముదాయము వేంకటాద్రిపై గల సప్తదశతీర్థసముదాయము. వామన, వరాహ పురాణాలు సప్తదశతీర్థాల మహిమలను వర్ణించాయి. వామన పురాణం పంచాయుధతీర్థాలు, అగ్నితీర్థం, బ్రహ్మతీర్థం, సప్తఋషితీర్థాలు, కపిలతీర్థం, ఇంద్రతీర్థం, విష్వక్సేనతీర్థం అన్నవరసలో సప్తదశతీర్థాల క్రమాన్ని ప్రతిపాదించింది. వరాహపురాణము ప్రకటించిన సప్తదశతీర్థాల క్రమములో కపిలతీర్థం, చక్రతీర్థం, (ఇంద్రతీర్థం), విష్వక్సేనతీర్థం, పంచాయుధతీర్థాలు, అగ్నితీర్థం, బ్రహ్మతీర్థం, సప్తఋషితీర్థాలు ఉన్నాయి. వామన వరాహపురాణాలు రెండూ అవి ప్రకటించిన క్రమాలలోని సప్తదశతీర్థాలూ ఒకతీర్థంకన్న తరువాతి తీర్థం పదిరెట్లు పుణ్యాన్ని ప్రసాదింపగలవని ప్రశంసించాయి. ఈసప్తదశతీర్థాలు వేంకటగిరి భాగమైన నారాయణగిరికి నైఋతిభాగములో నెలకొన్నాయి వామనపురాణము ప్రతిపాదించిన క్రమములో సప్తదశతీర్థాలమహిమలను పరిశీలిద్దాము.

## పంచాయుధ తీర్థాలు

శ్రీనివాసుడు సదా పాంచజన్యశంఖము, సుదర్శనచక్రము, కౌమోదకి అనే గద, సారంగము అనే ధనుస్సు, నందకఖడ్గము అనే పంచాయుధాలను ధరించి సంచరిస్తూ దుష్టశిక్షణ, శిష్టరక్షణ కావిస్తూం

టాడు. స్వామివారి ఆయుధరూపాలలో పాంచజన్య, సుదర్శన, కౌమోదకి, సారంగ, నందక అనే పంచాయుధతీర్థాలు నారాయణగిరికి నైఋతి భాగంలో ఉన్నాయి. అట్టి పంచాయుధతీర్థాలను సేవించడం బహు పుణ్యప్రదం.

అగ్నితీర్థం

పంచాయుధతీర్థాలకు పై భాగంలో అగ్నితీర్థం ఉంది. పంచభూతాలలోని అగ్నికి అధిపతి అగ్నిదేవుడు. అష్టదిక్పాలకులలో ఒకడు అగ్నిదేవుడు. అగ్నిదేవుడు అధికాధికమైన పవిత్రతను సంపాదించుకోవడానికై శ్రీవేంకటాచలాన్ని సందర్శించి, శ్రీవేంకటాచలపతిని సేవించాడు. పిమ్మట నారాయణగిరిపై నివసించి, తన స్నానాదులకై లోతైనతీర్థం నిర్మించుకొన్నాడు. ఆ తీర్థసమీపములో చిరకాలము తపస్సు కావించి కృతార్థుడయ్యాడు. తదాదిగా అగ్నిదేవుడు నిర్మించిన ఆ తీర్థం ఆగ్నేయతీర్థం అనే సార్థకనామం పొందింది. దీనిని సేవించడం వలన అగ్నిహోత్రుని పవిత్రత, తేజస్సు లభిస్తాయి.

బ్రహ్మతీర్థం - సప్తఋషితీర్థాలు

ఆగ్నేయతీర్థపు పై భాగములో బ్రహ్మతీర్థం ఉంది. శ్రీనివాసుడు అపూర్వమైన ఆనందనిలయ విమానములో వేంకటాద్రిపై బ్రహ్మాది దేవతలకు దర్శనమిచ్చి ధన్యులను కావించాడు. బ్రహ్మదేవుడు పంచగోపురాలను శ్రీనివాసమూర్తి పేరుమీదుగా రూపొందించి దివ్యమైన విమానప్రాకార దేవాలయాలను నిర్మించి స్వామివారికి సమర్పించాడు. నవరాత్రదీక్షతో కూడి ధ్వజారోహణముతో ప్రారంభమై, రథారోహణముతో సమాప్తమయ్యే వివిధ వాహనసేవలు, ఉత్సవాలు, దివ్యమైన ప్రసాదనివేదనలతో కూడిన బ్రహ్మోత్సవము శ్రీనివాసునకు బ్రహ్మ నిర్వహించాడు. ఆ సంప్రదాయము నేటికీ కొన

సాగుతోంది. నిత్యం బ్రహ్మదేవుడు రాత్రిసమయములో శ్రీనివాసుని అర్చిస్తాడు. అదే ఉదయం భక్తులకు తీర్థంగా వినియోగింపబడుతోంది. శ్రీనివాసునితో అట్టి సన్నిహితసంబంధంకల బ్రహ్మదేవుడు శ్రీనివాసునితో నిత్య సన్నిహితత్వం నిలుపుకోవడానికై, నారాయణగిరిపై తీర్థం సృష్టించుకొని నివశిస్తూ, స్వామిని సేవిస్తున్నాడు. ఆ విధంగా బ్రహ్మచేత నిర్మింపబడినతీర్థం బ్రహ్మతీర్థమై అలరారుతోంది. అట్టి బ్రహ్మతీర్థం మహాపుణ్యప్రదమైన తీర్థం. ఆ బ్రహ్మతీర్థం సేవించడం వలన శ్రీనివాసుని నిత్యసేవాకార్యక్రమాలలో సాన్నిహిత్యం లభిస్తుంది.

ఒక మతంప్రకారం భృగువు, అంగీరసుడు, మరీచి, అత్రి, పులస్త్యుడు, పులహుడు, క్రతువు సప్తఋషులుగా పేర్కొనబడ్డారు. కశ్యపుడు, అత్రి, భరద్వాజుడు, విశ్వామిత్రుడు, గౌతముడు, జమదగ్ని, వసిష్ఠుడు సప్తఋషులుగా ఇంకొకమతంప్రకారం వ్యవహరింపబడ్డారు. బ్రహ్మతీర్థపు పైభాగములో భృగు, అంగీరస, మరీచి, పులస్త్య, పౌలహ, క్రతు అనే సప్తఋషులపేర్లమీదుగా సప్తఋషితీర్థాలు వెలసాయి. వీనిలో స్నానంచేయడంద్వారా ఋషిఋణంనుండి విముక్తిని భక్తులు పొందుతారు. సప్తఋషులదీవనలు పొందుతారు.

## కపిలతీర్థం

వేంకటాద్రికి దిగువభాగంలో కపిలేశ్వరస్వామి సన్నిధానంలో వెలసిన మహాపుణ్యతీర్థం కపిలతీర్థం. ఇది శ్రీవేంకటాచలానికి ఆగ్నేయభాగంలోఉంది. కార్తీకపౌర్ణమినాడు మధ్యాహ్నసమయాన ఈ తీర్థానికి పర్వసమయం. ఆనాటి మధ్యాహ్నసమయంలో పదిఘడియలకాలం ముల్లోకాలలోని ముఖ్యమైన పవిత్రతీర్థాలన్నీ దీనిలోకలసి నిలచి, సాన్నిధ్యం పొందుతాయి. పూర్వం కపిలమహర్షి చేత పూజింప

బడే శివలింగం ఉండేది. దానికి కామధేనువు నిత్యం క్షీరాభిషేకం కావించేది. తిరుమలగిరి పాతాళమూల నిలవాలని ఆ శివలింగం పాతాళాన్ని ఛేధించుకొని పైకివచ్చింది. ఇంకా ఆశివలింగం పెరుగుతోంటే కామధేనువు తనగిట్టెతో అదిమిపట్టి దాని ఊర్ధ్వగమనాన్ని అరికట్టింది. ఆ శివలింగం మూలభాగాన వెండిరంగుతోను, మధ్యభాగంలో బంగారు రంగుతోను, పైభాగం అరుణకాంతితోను ప్రకాశిస్తోంది. పంచవక్త్ర సమన్వితమై, పంచవర్ణభాసితమై, త్రినేత్రాలంకృతమై శోభిస్తోంది. కృతయుగంలో కపిలమహర్షి పూజలందుకొని కపిలలింగంగాను, త్రేతాయుగంలో అగ్నిఅర్చనలు అందుకొని ఆగ్నేయలింగంగాను, ద్వాపరయుగంలో చక్రదేవునిసేవలు పొంది సుదర్శనలింగంగాను, కలియుగంలో మరల కపిలమహర్షి అభిషేకాదులు స్వీకరించి కపిలేశ్వరస్వామిగా ప్రసిద్ధివహించింది. వేంకటాద్రి పాదసమీపాన వెలసిన కపిలలింగానికి ముందుభాగంలో ఒక జలపూర్ణమైన తీర్థముంది. ఆ జలాశయం పాతాళంలోని కపిలమహర్షి రావడానికి యేర్పడినరహస్య బిలమార్గం. ఆ బిల మార్గం జలపూర్ణమై కపిలతీర్థమై వెలసింది.

ఆదిదంపతులు వేంకటాచలంపైగల కుమారధారికా తీర్థసమీపంలో తపస్సుచేస్తూన్న కుమారునిచూడడానికి వచ్చారు. శ్రీనివాసుని సేవించిన పార్వతీపరమేశ్వరులు కపిలతీర్థానికివచ్చారు. దాని తీరంలో తపస్సుచేస్తూన్న సుదర్శనునిచూచారు. శివదేవుడు చక్రదేవుని వరంకోరుకోమన్నాడు. మహేశ్వరుడు తనహృదయాంతరవర్తి కావాలని సుదర్శనుడుకోరాడు. శ్రీహరి ఆదేశంతో కపిలతీర్థసమీపంలో తపస్సుచేస్తున్నావు. నన్ను గౌరవించడానికి వరం అర్థించావు. వాసుదేవుడు సత్వగుణ ప్రధానుడు. నేను తామసగుణ ప్రధానుడను. నేను నీహృదయంలో ఉండాలనుకొంటున్నావు. నాహృదయంలో

శ్రీనివాసుడు నిలవాలని నేను ఆశిస్తున్నాను. నీవు మహావిష్ణువునకు నిత్యసన్నిహితుడవు. నీ కాంక్ష, నా ఆకాంక్ష, నెరవేరడానికి హరిహర హిరణ్యగర్భుడనై నీ హృదయాధిదేవత నవుతాను. ఆ సమయం వచ్చేవరకు ఈ కపిలతీర్థసమీపంలో తపం కొనసాగింపుము' అంటూ శివుడు సుదర్శనుని అనుగ్రహించాడు. సుదర్శనుడు శివానుగ్రహం పొందడానికి తావుచూపిన ఆ కపిలతీర్థసమీపంలో శ్రీనివాసుని ఆదేశానుసారం తపం కావించిన ఆ కపిలతీర్థం సుదర్శనతీర్థంగా, చక్రతీర్థంగా, చక్రత్తాళ్వారుతీర్థంగా, ఆళ్వారుతీర్థంగా భాసించి వ్యవహారప్రాచుర్యం సంతరించుకొన్నది.

దూర్వాసుడు వారణాసిని శపించాడు. కృత్య అనే భీకరమైన దేవతను కాశీని నశింపజేయమని నియోగించాడు. సుదర్శనచక్రంవలన పరమశివుని చరణదాసి కాశి నశించింది. కొంతకాలానికి శ్రీమహావిష్ణువు పరమశివునకు సాక్షాత్కరించి వరం అనుగ్రహించాడు. సుదర్శనచక్రం ద్వారా నశించినకాశీ పూర్వపువైభవంతో వర్ధిల్లాలని శివుడు నారాయణుని అర్థించాడు 'సుదర్శనుడు ఈ భూమిపై వేయి దివ్యసంవత్సరాలు నివశించినప్పుడు నీకు, కాశీకి పూర్వపుశోభ కలుగుతుందని' శ్రీహరి శివునకు వరంప్రసాదించాడు. శ్రీనివాసుని వరప్రసాదంమూలంగా సుదర్శనచక్రం శివునకుస్వాధీనమై పరమశివునకు దివ్యవిభూతిని, కాశీ క్షేత్రానికి పూర్వపు ఔన్నత్యాన్ని కల్పించింది. విష్ణువువలన శివుడు మంత్రలాభంపొంది, ఆ విష్ణుమంత్రసిద్ధితో త్రిపురాసుర సంహారం కావించాడు. శివుడు మంత్రోపదేశంచేసి తనను విజయశ్రీసముపేతుని కావించిన గురుదేవుడైన విష్ణుదేవునకు గురుదక్షిణగా తనస్వాధీనంలో ఉన్న సుదర్శనచక్రాన్ని భక్తిపురస్సరంగా సమర్పించాడు. సుదర్శనుడు శివునివియోగం భరించలేక శ్రీనివాసుని ఆదేశానుసారం కపిల

తీర్థసమీపంలో శివుని నిత్యసన్నిహిత్యం కోరి తపస్సు కావించి, శివ సాక్షాత్కారంతో తన అభీష్టం పొందాడు. సుదర్శనుడు ఆ విధంగా కపిలతీర్థం సమీపంలో తపస్సు చేయుటవలన కపిలతీర్థం సుదర్శనతీర్థమని ప్రసిద్ధి పొందింది. కపిలతీర్థ దర్శనమాత్రం చేత మానవులు సకలపాపాల నుండి విముక్తులవుతారు. స్నానం చేత సమస్తపుణ్యాలు పొందుతారు. గో, భూ, అన్న, మంత్రదానాలు కపిలతీర్థతీరంలో చేసినవారు క్రమంలో స్వర్గ, కైలాస, వైకుంఠ, బ్రహ్మలోకాలు సిద్ధింపజేసికొంటారు. ఈ విధమైన కపిలతీర్థమహిమను వామనపురాణంలోని 23, 24, 33వ అధ్యాయాలు ప్రకటించాయి.

క్రీ. శ. 1070 - 1122 వరకు పరిపాలించిన కులోత్తుంగుని శాసనంలో ప్రప్రథమంగా కపిలతీర్థప్రశంస కనపడుతోంది. క్రీ. శ. 1287 సం॥లో కపిలతీర్థ తీరంలోని కోవెలను పల్లవరాయలు పునరుద్ధరించినట్లు తెలుస్తోంది. 12వ శతాబ్దం నుండి 18వ శతాబ్దం వరకు కపిలతీర్థం కపిలతీర్థంగా కాక, ఆళ్వారుతీర్థంగా శాసనాలలో స్థానం సంపాదించుకొంది. 12వ శతాబ్దం నుండి తిరుపతిలోని శ్రీగోవిందరాజస్వామివారి తిరుమంజనానికి (ఉపాకర్మాదులకి) ఆళ్వారుతీర్థంలోని పవిత్రజలం ఉపయోగింపబడుతోన్నట్లు శాసనాధారాలు కనపడుతున్నాయి. క్రీ శ. 1467 మే, జూన్ నాటి శాసనం ఆ విషయాన్ని ధృవపరుస్తోంది. 25-6-1531 సం॥లోని వీరఅచ్యుతరాయమహారాయలు కాలంలో తెలుగు, కన్నడ, తమిళభాషలలో చెక్కబడిన శాసనాన్నిబట్టి ఇతడు ఆళ్వారుతీర్థానికి నాలుగుమూలలా సుదర్శనశిలలు స్థాపించి, శిలాసోపానాలు, మండపాలు నిర్మించినట్లు తెలుస్తోంది. ఈవిధముగా సుమారు క్రీ.శ. 1865 సం॥ వరకు కపిలతీర్థం ఆళ్వారుతీర్థంగా వ్యవహరింపబడింది. 10-2-1856 సం॥లో ఆనాటి విచారణకర్తయైన శ్రీ మహంతు ధర్మదాసు కపిల

తీర్థానికి పునర్నిర్మాణము చేసినట్లు తెలుస్తోంది, ఇది కపిలతీర్థానికి సంబంధించిన పౌరాణిక, చారిత్రక ప్రశస్తి.

## ఇంద్రతీర్థం

కపిలతీర్థానికి ఎగువగాను, విష్వక్సేనతీర్థానికి దిగువగాను ఇంద్ర తీర్థం ఉంది. దీనికి శక్రతీర్థం, వజ్రతీర్థం అనేపేర్లుకూడ ఉన్నాయి. ఇంద్రుడు అహల్యాజారుడై గౌతముని శాపానికి గురైయ్యాడు. శాప ఫలితముగా ఇంద్రునిశరీరమువై వెయ్యి స్త్రీగుహ్యావయవాలు యేర్ప డ్డాయి. భగవతికి పాతివ్రత్యభంగంకావించిన ఫలితంగా సహస్రభగాలు పొందిన ఇంద్రుడు వికృతాకారుడై అవమానంభరించలేక హిమా లయ పర్వతప్రాంతంలోని తామరుకొలనులో రహస్యస్థావరం యేర్ప రచుకొని అక్కడ తలదాచుకొన్నాడు. ఇంద్రుడు స్వర్గంలో అదృశ్యం కావడం గమనించిన దేవతలు సచీపతికై అన్వేషించి విఫలురయ్యారు సచీదేవిసూచన ననుసరించి దేవగురుడైన బృహస్పతిని ఆశ్రయించి దేవతలు స్వర్గాధిపతి జాడ తెలిసికొన్నారు. దేవతలు తమనాయకు డైన ఇంద్రుని శరీరంపై గల స్త్రీగుహ్యావయవాలను సహస్రలింగాలుగా మార్చి అమరావతికి తీసికొనివచ్చారు ఇంద్రుడు అమరావతికివచ్చి దేవతాస్త్రీలనురమించాడు. కాని అతని విషయవాంఛ నివృత్తి కాలేదు. ఆ విధంగా విసిగివేసారిన మహేంద్రుడు వేంకటాద్రిని చేరుకున్నాడు. వేంకటాచలంపై తనవజ్రాయుధఘాతంతో పాతాళగంగను సృష్టించు కొన్నాడు. అదే వజ్రతీర్థమై విఖ్యాతిపొందింది. దానిలో ఇంద్రుడు వెయ్యిసంవత్సరాలు స్నానంచేయడంవలన అది ఇంద్రతీర్థంగా ప్రఖ్యాతి వహించింది.

అట్టి వజ్రతీర్థసమీపంలో సహస్రాక్షుడు సహస్రవర్షాలు సుదీర్ఘ మైన తపస్సు సాగించాడు. భూదేవీసమేతుడైన ఆదివరాహస్వామి ప్రసన్నుడై ఇంద్రునికి ప్రత్యక్షమై అతని అభిమతం అభివ్యక్తీకరింప

మని ఆదేశించాడు. ఇంద్రుడు తన శరీరంపైగల సహస్రలింగాలు తొలగిపోవునట్లు చేయమని కోరాడు. అది వరాహ దేవుని వరానుగ్రహమువలన ఇంద్రునిశరీరముపై గల సహస్రలింగాలు భూ పతన మయ్యాయి. భూ పతనమైన సహస్రలింగాలనుండి సహస్ర భూసురోత్త ములు ఆవిర్భవించారు. వారు "మేము వేదవిదులమైన విప్రులము. మేము కామప్రేరితులమై ఇంద్రాణితో కూడ దేవతాకాంతలను కూడ వలెనని కోరుచున్నాము. గౌతమునిశాపం మాకు ఆ అవకాశం లభింప జేసింది. నీవు అర్థించేవరం అనుగ్రహిస్తాము" అంటూ ప్రకటించారు. ఇంద్రుడు తన శరీరమునుండి సహస్రలింగాలు తొలగిపోయిన స్థానాలలో సహస్రనేత్రాలు ఉద్భవించే యేర్పాటుచేయమని అర్థించాడు. భూసురుల వరప్రభావమునూలంగా ఇంద్రుడు వేయికన్నుల వేల్పుగా రూపొందాడు. వేంకటాద్రిపై గల వజ్రతీర్థం (ఇంద్రతీర్థం) దేవేంద్రుడు సహస్రాక్షుడై గౌతమ శాపవిమోచనంపొందే మహాభాగ్యం ప్రసాదించిన మహాపుణ్యతీర్థం. స్కందపురాణం ఇంద్రతీర్థవైభవాన్ని ఆవిష్క రించింది.

## విష్వక్సేన తీర్థం

"అశేషవిఘ్నశమనమనీకేశ్వరమాశ్రయే
శ్రీమతః కరుణామ్భోధౌ శిక్షాస్రోతఇవోత్థితమ్"

—వేదాంతి దేశికులు

శైవులు విఘ్నశమనార్థం గణపతిని పూజిస్తారు. వైష్ణవులకు ఆదిపూజ్యుడు విష్వక్సేనుడు. అతడు శ్రీనివాసుని అశేషసేనావాహినికి సర్వసేనాపతి. "శ్రీనివాసుని దయ అనే పెద్ద జలాశయంలో ఉదయించిన శిక్షాప్రవాహరూపుడు విష్వక్సేనుడు. అశేష విఘ్నశమనార్థం విష్వక్సేనుని ఆశ్రయం పొందుతున్నాను" అంటూ వేదాంత

దేశికాచార్యులవారు తమ 'దయాశతకము' లో భగవత్సేనాపతి విష్వక్సేనుని ప్రార్థించారు.

విష్వక్సేనతీర్థం వేంకటాచలంపై ఇంద్రతీర్థానికి ఎగువగా ఉంది. వామనపురాణములోని ఇరవై మూడవ అధ్యాయం విష్వక్సేనతీర్థ మహిమను వివరముగా వర్ణించింది. త్రేతాయుగములో దుర్వాసుడు తీవ్రమైన తపం కావిస్తున్నాడు. ఎవరు ఎక్కడ తపస్సుచేసినా తన పదవికి ముప్పు వస్తుందని అనుమానముతో భయపడే ఇంద్రుడు దుర్వాసుని తపోభంగం చేయమని దేవనర్తకి కుంతలను నియోగించాడు. కుంతల దుర్వాసుని ఆశ్రమానికి వచ్చింది. శృంగారగీతాలు పాడుతో, విలాసభంగిమలలో నృత్యాలుచేస్తూ మునితపస్సును భంగపుచ ప్రయత్నించి తానే భంగపడింది. తన తపోదీక్షకు అంతరాయం కల్పించ ప్రయత్నించిన కుంతలను కిరాతస్త్రీగా జన్మిస్తావని దుర్వాసుడు శపించాడు. "ఇది నా అపచారము కాదు. ఇది నా ఉద్యోగధర్మానికి సంబంధించిన అధర్మము. శాపాన్ని ఉపసంహరించి నన్ను రక్షింప ప్రార్థిస్తున్నాను" అని కుంతల దుర్వాసుని అర్థించింది. "కిరాతస్త్రీగా పుట్టిన నీకు మాతృత్వం సిద్ధించినపిమ్మట స్వర్గలోకానికి దేవనర్తకి కుంతలగా ప్రవేశం లభిస్తుంది" అని ముని కుంతలను అనుగ్రహించాడు. ఆమె తనకు ఆయుష్మంతుడైన, తపోధనుడైన, జ్ఞానసంపన్నుడైన పుత్రుని అనుగ్రహించమని కోరింది. దుర్వాసుడు ఆశీఃపూర్వకముగా వరం ప్రసాదించాడు.

దేవనర్తకి కుంతల ఒక అడవిలో కిరాతదంపతులకు పుత్రికగా జన్మించింది. ఆమె తండ్రి వీరబాహుడు ఆమెకు సువర్చల అని పేరు పెట్టాడు. సువర్చల పెరిగి యుక్తవయస్కురాలైంది. తల్లితండ్రులు భద్రుడనే యువకునికిచ్చి ఆమెకు పెండ్లి చేసారు. కొంతకాలం పిమ్మట

ఫాల్గుణమాసంలో శుక్లపక్షంలో కుంతల నర్మదాతీరంలో వినోదార్థం విహారంచేసింది. ఆ సమయంలో వరుణుడు ఆమెసౌందర్యంచూచి మోహించి రమించాడు. ఆమె వరుణుణ్ణి తనకుపుత్రుణ్ణి ప్రసాదించమని ప్రార్థించింది. వరుణు డనుగ్రహించి అదృశ్యుడయ్యాడు. సువర్చల సర్వాంగసుందరుడైన పుత్రుణ్ణి ప్రసవించింది. అతనికి విష్వక్సేనుడని పేరుపెట్టారు. అతని పదవయేట తల్లి సువర్చల మరణించింది. మరణించినసువర్చల దేవశక్తి కుంతలరూపం వహించి దుర్వాసుని శాపం నుండి విముక్తిపొంది అమరావతికి వెళ్ళిపోయింది.

విష్వక్సేనుడు కశ్యపుని ఆశ్రమంలో ఆశ్రయం పొందాడు. కశ్యపుడు విష్వక్సేనుని సకలవిద్యాపారంగతునిగా, సమగ్ర శాస్త్రపండితునిగా తీర్చిదిద్దాడు. విష్వక్సేనుడు అతీంద్రియశక్తులు సంపాదించి, జ్ఞానసిద్ధుడయ్యాడు. ఆచార్యుని ఆశీర్వచనం స్వీకరించి విష్వక్సేనుడు వేంకటాద్రికి పయనమయ్యాడు. వేంకటాచలాన్ని సేవించి, వేంకటాద్రినాథుని పూజించాడు. వేంకటాద్రిలోని వృషాద్రిని చేరుకొని శ్రీవేంకటాచలపతి నుద్దేశించి కఠోరమైన నియమాలుపాటించి, తీవ్రమైన తపం కావించాడు. ఆశ్వయుజమాసంలో పూర్వాషాఢా నక్షత్రయుక్తమైన శుభదినాన శ్రీనివాసుడు విష్వక్సేనునకు సాక్షాత్కరించి సారూప్య, సామీప్య, సాయుజ్యాలు ప్రసాదించాడు. విష్వక్సేనుని తనసేనానిగా నియమించి, స్వీకరించాడు. వృషాచలంపై విష్వక్సేనుడు తపం కావించడానికి నిర్మించి, స్నానపానాదులకు ఉపయోగించిన తీర్థమే విష్వక్సేనతీర్థమై, ప్రసిద్ధమై నేటికీ నిలచిఉంది. విష్వక్సేనునకు సర్వదేవసైన్యాధ్యక్షపదవిని ప్రసాదింపజేసిన దివ్యతీర్థం విష్వక్సేనతీర్థం. దీనిలో స్నానంచేసే భక్తులకు శ్రీనివాసుని సారూప్య, సామీప్య, సాయుజ్యాలు, ఉన్నతపదవులు, ఉత్తమస్థానాలు లభిస్తాయి. "ఓం సువర్చలాసుతన్యస్తసైనాపత్యభరాయ శ్రీవేంకటేశాయనమః."



# శ్రీ వేంకటాద్రి తీర్థాద్రి

శ్రీవేంకటాద్రినాథుడు వెలసిన శ్రీవేంకటాద్రిపై అసంఖ్యాకములైన దివ్యతీర్థాలు నెలకొని ఉండడంవలన వేంకటాద్రి తీర్థాద్రిగా ప్రసిద్ధిపొందింది. వేంకటాచలంపైగల తీర్థాలలో సప్త, సప్తదశతీర్థాల పిమ్మట సేవింపవలసిన తీర్థాలలో నవతీర్థాలు, పంచతీర్థాలు, వరాహతీర్థం ఆదిగాగల తీర్థాలు ప్రధానమైనవి.

నవతీర్థాలు

నవతీర్థాలు నవనిధులని బ్రహ్మపురాణం ప్రశంసించింది. నవతీర్థాలు, వరాహతీర్థం శ్రీ స్వామిపుష్కరిణీతీర్థంలోనే నెలకొని ఉన్నాయి. స్వామిపుష్కరిణిలో తూర్పుభాగంలోనిజలం మార్కండేయ తీర్థంగా, ఆగ్నేయమూలగల జలం ఆగ్నేయతీర్థంగా, దక్షిణానగల జలం యమతీర్థంగా నైఋతిమూలగల జలం వసిష్ఠతీర్థంగా, పశ్చిమాన గల జలం వరుణతీర్థంగా (ఋణమోచనతీర్థంగా), వాయవ్యభాగానగల జలం వాయుతీర్థంగా, ఉత్తరానగల జలం కుబేరతీర్థంగా (ధనదతీర్థంగా), ఈశాన్యమూలగల జలం గాలవతీర్థంగా, మధ్యనున్నజలం సరస్వతీ తీర్థంగా పద్మపురాణం నామనిర్దేశం చేసింది. ఆయుర్భాగ్యం, పాపక్షయం, నరకబాధానివృత్తి, మోక్షసిద్ధి, దేవ, పితృదేవ ఋణవిముక్తి, కైవల్యప్రాప్తి, ఐశ్వర్యం, సంసారబంధవిముక్తి, జ్ఞానసిద్ధివంటి శుభప్రదములైన సద్యోఫలితాలను ఆక్రమంలో నవతీర్థాలు తైర్థికులకు ప్రసాదిస్తాయి. నవతీర్థాలు నవనిధులవంటి నవవిధశుభఫలితాలను ప్రసాదించేవి కావడంవలన అవి నవనిధులని పేర్కొనబడ్డాయి. శ్రీ స్వామిపుష్కరిణిలోనే నెలకొనిన నవతీర్థాలను సేవించడంవలన మార్కండేయ, అగ్ని, యమ, వసిష్ఠ, వరుణ, వాయు, కుబేర, గాలవ, సరస్వతి ఆదిగాగలవారి చల్లనిదీవనలు, అనుగ్రహదృష్టులు భక్తులకు లభిస్తాయి.

## వరాహ తీర్థం

శ్రీస్వామి పుష్కరిణి ఉత్తరభాగాన్ని వరాహతీర్థమని, దక్షిణ భాగాన్ని శ్రీనివాసతీర్థమని స్థలజ్ఞులు పిలుస్తారు. శ్రీస్వామి పుష్కరిణి తీర్థపు వాయువ్యభాగములోనే శ్రీ భూదేవీ సమేత శ్రీ ఆదివరాహ స్వామి సన్నిధానంలో పరమపవిత్రమైన వరాహతీర్థం ఉంది. భూమిని చాపచుట్టినట్లుచుట్టి హిరణ్యాక్షుడు పాతాళానికి పట్టుకుపోయాడు. బ్రహ్మ శ్రీహరిని, పుడమితల్లిని ఉద్ధరింపుమని ప్రార్థించాడు. శ్రీమహా విష్ణువు వరాహరూపం వహించి పాతాళానికి వెళ్ళి హిరణ్యాక్షుని వధించి భూతలాన్ని స్వస్థలములో నిలిపాడు. భూలోక రక్షకుడైన వరాహావతారమూర్తిని బ్రహ్మ తిరుమలపై శ్రీస్వామి పుష్కరిణీ తీరంలో ప్రతిష్ఠించాడు. ప్రతిష్ఠాతంత్రంలో భాగమైన జలాధివాసం శ్రీభూదేవీ సమేత వరాహస్వామికి స్వామిపుష్కరిణీ తీరంలో బ్రహ్మ యేర్పాటు చేసాడు. బ్రహ్మ శ్రీ భూదేవీ సమేత శ్రీవరాహస్వామిని యథా శాస్త్రీయంగా ప్రతిష్ఠించి కృతార్థుడయ్యాడు. ప్రతిష్ఠాతంత్రం సమాప్తం కావించినపిమ్మట బ్రహ్మ దేవతా సముదాయముతో, ఋషి బృందముతో, పితృగణంతో స్వామిజలాధివాస తీర్థములో స్నానం చేసి ధన్యోస్మి అని భావించాడు.

"శ్రీవరాహస్వామి జలాధివాసస్థానమందలి ఈ తీర్థం వరాహ తీర్థంగా భాసిస్తుంది. తిరుమలయాత్రికులు ముందుగా వరాహతీర్థాన్ని సేవించాలి. ఆదిలో ఆదివరాహస్వామిని అర్చించాలి." అని బ్రహ్మ దేవుడు తిరుమల యాత్రావిధిని నిర్ణయించి శ్రీనివాసప్రభుని చేత ఆమోదింపజేసాడు. ఇది వరాహతీర్థ అవతరణగాథ. ఇది వరాహ క్షేత్ర ఆవిష్కరణ పుణ్యకథ. ఇది బ్రహ్మపురాణములో ప్రతిపాదింపబడింది.

## పంచతీర్థాలు

పంచతీర్థాలు కపిలతీర్థానికి పశ్చిమభాగాన ఉన్నాయి అన్నది జనశ్రుతి. అవి విప్ర, క్షత్రియ, వైశ్య, శూద్ర, చండాలతీర్థాలు. ఆయా వర్ణాలకు చెందినవారు ఆ యా తీర్థాలలో స్నానంచేసి ఆ తీర్థాలలో అంతర్లీనుడై ఉండే ఆదివరాహస్వామి అనుగ్రహానికి పాత్రులై అభీష్ట సిద్ధిని పొందేవారు. కాని నేడు ఆ తీర్థాలుకల స్థలాలజాడలు తెలియడము లేదు. నేటికీ కపిలతీర్థానికి పశ్చిమాన ఉన్న ఒక జలపాతపు భూ పీఠం 'మాలవాండ్లగుండం' అనే పేరుతో పిలువబడుతోంది.

"జరాహారం వలిఘ్నం చ రసాయనమితి త్రికమ్
తీర్థానాంవర్తతే తస్మిన్ చిన్తామణి గిరౌ తథా
స్వామిపుష్కరిణీ పూర్వదేశే పర్వతగహ్వరే
ద్వావింశచ్చర పాతేతు కిన్తు మాయాతిరోహితమ్
నజానన్తి బుధాస్తీర్థం తత్తు విస్మయకారకమ్."

—వరాహపురాణం

శ్రీవేంకటేశ్వరస్వామి సన్నిధానమందలి శ్రీస్వామిపుష్కరిణికి తూర్పున ఇరవై బాణపాతాల దూరంలో జరాహారం, వలిఘ్నం, రసాయనం అనే తీర్థాలు ఉన్నాయి. శ్రీనివాసునిమాయచే ఒక పర్వత గుహలో తిరోహితములై మానవులకు గోచరించడంలేదు. ఈ మూడు తీర్థాలు ముసలితనం పోగొట్టి యౌవనం ప్రసాదిస్తాయి. రసాయనతీర్థం సర్వక్షాయకరోగాలను నివారిస్తుంది. సాధకులైన భక్తులకు, వైరాగ్య సంపన్నులకు కాయకల్ప చికిత్సవలన లభించే శుభఫలితాలు ఈ తీర్థ త్రయములో స్నానమాత్రంచేత సిద్ధిస్తాయి. అవి నేటి మానవులకు గోచరించడంలేదు. యోగం. శ్రీనివాసానుగ్రహ యోగం కలవారికి మాత్రమే స్వామి ఆ తీర్థత్రయ స్నానఫలం అందిస్తాడు. వానిని భక్తు

లకు కనుమరుగుచేసినా, కనుపించని ఆ తీర్థాలకు అట్టి శక్తిని ప్రసాదించిన స్వామి ఆర్తులు, అర్థితులు, వ్యాధిపీడితులను కాపాడుతున్నాడు. వారికి ఐశ్వర్యం, ఆరోగ్యం, ఆయువు ప్రసాదిస్తున్నాడు. ఈ మూడు తీర్థాలను స్మరిస్తే ముల్లోకాలకు ఏలిక అయిన ఏడుకొండలవాడు జాలి గుండెవాడై ఏడేడు జన్మలనుండి జనులుచేసిన పాపాలను దహించి వారి జీవితాలలో ఐశ్వర్య, ఆరోగ్య, ఆయుర్భాగ్యాలను ఉదయింపజేస్తాడు. అనుభవం, అనుభూతివలన గ్రహింపవలసిన శ్రీబాలాజీ లీలా హేలలు అవి.

## వ్రతాతీవ్రతనీతీర్థం

పూర్వం మేరుపర్వతశిఖరంపైన సర్వదేవతాసముదాయం బ్రహ్మదేవుని ఆధ్వర్యంలో సమావేశం జరిపింది. ఆ దేవతాపరిషత్తు శ్రీవేంకటాద్రివైభవం గూర్చి పలువిధాలుగా ప్రశంసించింది. అట్టి వేంకటాచలపు మహిమవిన్న శుకయోగీంద్రుడు శ్రీవేంకటగిరికి ప్రయాణం కావించాడు. శేషశైలాన్ని సాకల్యంగా, సమగ్రంగా పరిశీలించి, అన్వేషించి సర్వతీర్థాలను సేవించాడు. ఆకాశగంగకు సమీపంలో పర్ణశాల నిర్మించుకొని వ్రతాతీవ్రతనతీర్థం యేర్పాటుచేసికొని, నిత్యం దానిలో స్నానంచేసి, శ్రీనివాసుని దర్శించి ధ్యానించేవాడు. ఒకనాడు సువర్ణముఖీనదీతీరంలోని పద్మసరోవరప్రాంతంలో తపం కావించమని అతనికి అశరీరవాణి వినిపించింది. పిమ్మట శుకయోగీంద్రుడు పద్మసరోవరతీరంలో తపం కావించాడు. నూటఎనిమిది ఇండ్లుకట్టించి వేద వేదాంగవిదులైన విప్రులకు దానం చేసాడు. అందుచేత మంగాపురం శ్రీశుకపురంగా ప్రసిద్ధమైంది. పద్మసరోవరంలో నిత్యం స్నానంచేసి శ్రీనివాసునిగూర్చి తీవ్రమైన తపం కావించిన శ్రీశుకునకు పద్మావతీ ప్రియవల్లభుడు సాక్షాత్కరించి అనుగ్రహించాడు. పద్మావతీ శ్రీనివాసుల కల్యాణానికి ప్రధానసూత్రధారుడై శ్రీశుకుడు లోకకల్యాణ

కారకుడయ్యాడు. శ్రీశుకనను పద్మసరోవరతీరంలో పద్మావతీ హృద యేశ్వరుని ప్రత్యక్షంకావడానికీ దారిచూపిన దివ్యతీర్థం, వ్రతాతీవ ర్తినీ తీర్థం. ఆకాశగంగకు సమీపంలోఉన్న ఈ తీర్థమహిమను పద్మపురాణం లోని 24వ అధ్యాయం వివరించింది. శ్రీవేంకటేశ అష్టోత్తర శతనామా వళిలోని 'ఓం శుకదృగ్గోచరాయ శ్రీవేంకటేశాయనమః' అనే నామం ఈ తీర్థమహిమను దృగ్గోచరం కావింపజేస్తోంది.

## సనకసనందనతీర్థం

శ్రీనివాసుని ఆనందనిలయానికి మూడున్నరమైళ్ల దూరంలోను పాపవినాశనతీర్థానికి ఉత్తరంగా ఒకమైలుదూరంలోను ఉన్న దివ్యతీర్థం సనకసనందన పుణ్యతీర్థం. సనకసనందనాది యోగివర్యులచేత నిర్మింప బడి, ప్రస్తుతింపబడిన తీర్థంకావడంవలన ఇది సనకసనందన పుణ్యతీర్థం అని వ్యవహరింపబడుతోంది. యోగసిద్ధి, తపోసిద్ధి, ధ్యానసిద్ధియోగం కలవారుమాత్రమే ఈ తీర్థాన్ని దర్శించి సేవింపగలుగుతారు. అన్యులకు ఈ తీర్థంకానరాదు. మార్గశీర్షమాసమందలి శుద్ధద్వాదశినాడు విధి విధానంగా, నియమవ్రతుడై, యోగకాముడు స్నానంచేయాలి. మను సటి త్రయోదశినుండి సనకసనందన పుణ్యతీర్థంలో స్నానంచేస్తూ నిత్యం శ్రీవేంకటేశ్వర అష్టాక్షరీమహామంత్రాన్ని పదివేలవంతున జపం చేయాలి. ఆ విధంగా యోగాభ్యాసం చేసినవారికి యోగసిద్ధి కలుగు తుంది. తీర్థశక్తి, మంత్రశక్తి యోగశక్తిని ప్రసాదించి, శ్రీనివాస సాక్షాత్కారాన్ని కలిగించి వారిని ముక్తిసామ్రాజ్య పట్టాభిషిక్తులను చేస్తుంది. యోగాభ్యాసపరులకు ఈ శుభఫలితాలను, దివ్యఫలాలను అనుగ్రహించే పుణ్యతీర్థం సనకసనందన పుణ్యతీర్థం. వరాహాపురాణపు ప్రథమభాగంలోని 60వ అధ్యాయం యోగసిద్ధిప్రదాయకమైన దివ్య తీర్థమని అభివర్ణించింది.

## కాయరసాయనతీర్థం

సనకసనందన పుణ్యతీర్థసమీపంలో కాయరసాయనతీర్థం ఉంది. కలియుగ మందలి మానవులు స్వార్థపరులై దుర్వినియోగపరచకుండా యోగులు శిలలతో మూసి ఆ తీర్థదర్శనసేవాదులను అసాధ్యం కావించారు. చిత్తశుద్ధి, లక్ష్యశుద్ధి, యోగశుద్ధి, అపారమైన శ్రీనివాసానుగ్రహసిద్ధిగల పుణ్యపురుషులు, మహాభక్తులుమాత్రం కాయరసాయనతీర్థదర్శనంచేసి సేవింపగలుగుతారు. దీనిలోపండి ఎండినఆకునువేస్తే వెంటనే అది సజీవశ్యామపత్రంగా మారుతుంది. శుష్కించినదేహం కలవాడైనా, జరాభారంతో బాధితుడైనా, రోగగ్రస్తుడైనా కాయరసాయనతీర్థంలో స్నానంచేసి, దానిలోనిజలాన్ని పానంచేస్తే కాయకల్పచికిత్సాఫలితాన్ని క్షణమాత్రంలో పొందుతాడు. శరీరంలోశక్తి, మనస్సులో భక్తి స్థిరపడతాయి. దివ్యపురుషుల, పుణ్యపురుషుల, పురాణపురుషుల దర్శనభాగ్యం, అనుగ్రహభాగ్యం, ఆశీర్వాదభాగ్యం లభిస్తాయి. పరమచేతనుడు, పరమప్రాప్యుడు శ్రీవేంకటరమణుడు. భగవత్కైంకర్యపరుడు చేతనుడు. చేతనుడు శేషుడై, శేషియైన శేషగిరివాసుడైన శేషాచలాధీశుని ఉపాసించడానికే దేహంఅనే ఉపాధి లభించిందని భావించినవారికి మాత్రమే కాయరసాయనతీర్థ సేవాభాగ్యం లభిస్తుంది. అట్టివారుమాత్రమే త్రికరణశుద్ధిగా శ్రీనివాసుని సేవింపగలుగుతారు. వారు శరీరపాటవం, ఏకాగ్రచిత్తం పొందుతారు. ఏకాగ్రచిత్తంతో స్వామిని సేవించడంవలన కైవల్యపదం కాయరసాయనతీర్థసేవాపరులకు కరతలామలకమవుతుంది. కలియుగమానవులకు ముక్తిసాధనం నామజపం. నామజపం నిరంతరం నిర్విరామంగా నిశ్చలంగా జరగాలంటే శారీరక, మానసిక, ఆత్మశక్తులు కావాలి. అట్టి దివ్యశక్తులిచ్చి, శ్రీనివాస సాక్షాత్కారం, మోక్షంప్రసాదించే అపూర్వమైన

అతిపవిత్రమైన తీర్థం కాయరసాయన పుణ్యతీర్థం. కలియుగమానవులు కాయరసాయన తీర్థసంబంధం సాధించుకొని శ్రీనివాసుని శ్రీపాదంపై శిరస్సు, శ్రీహరి దివ్యనామంపై మనస్సునిలిపి తరించాలి. ఆ విధంగా మనస్సుతో, మాటలతో, చేతలతో శ్రీపతిని సేవింపనివాని జీవితం వ్యర్థం. అట్టివాడు ఆత్మద్రోహి. స్వామిద్రోహి అని వరాహపురాణం ఘంటాపథంగా ప్రకటించింది. వరాహపురాణంలోని ప్రథమభాగమందలి 60వ అధ్యాయం కాయరసాయన తీర్థమహిమను సవివరంగా వ్యక్తం చేసింది.

## ఫల్గుణీతీర్థం

శ్రీవేంకటేశ్వరస్వామి బ్రహ్మోత్సవమహోత్సవం నిర్వహించి, తిలకించి, ఆనందపరవశులైన బ్రహ్మ, రుద్ర, ఇంద్రాదులు సత్య, కైలాస, స్వర్గలోకాలకు చేరుకున్నారు. శివుడు కపిలతీర్థం సమీపంలో నివాస మేర్పరచుకోనాలని సంకల్పించి, నిశ్చయించుకొని వెళ్ళిపోయాడు. ఆ సమయంలో శ్రీనివాసుని సేవించిన సనకసనందనాది యోగివర్యులు పాపవినాశనతీరమందలి వనాలలో ఆశ్రమాలు నిర్మించుకొని తపోని మగ్నులయ్యారు. అప్పుడు వారు నిర్మించిన తీర్థమే సనకసందనాది పుణ్య తీర్థం. శ్రీనివాస సేవావైభవంలో భాగస్వాములైన సప్తఋషిపుంగవులు ఫల్గుణీధారల సమీపంలో నిజనివాసాలు వేసికొని తపోనిమగ్నులయ్యారు. పూర్వం వశిష్ఠుని అనుమతితీసికొని ఈ తీర్థసమీపంలోనే అరుంధతి ద్వాదశవర్షాలు శ్రీనివాసుని ఉద్దేశించి తీవ్రమైన తపం కావించింది. ఫాల్గుణపౌర్ణమినాడు అరుంధతికి ప్రత్యక్షమై శ్రీనివాసుడు వరానుగ్రహం కావించి ఆమె తపస్సుచేసిన తుంబురతీర్థం ఫాల్గుణ తీర్థంగా ప్రసిద్ధమవుతుందని ఆశీర్వదించాడు. ఆనాటి శ్రీనివాసానుగ్రహ మధురస్మృతులు తలపోసికొని పులకించి పరవశించిన అరుంధతి ఆ తీర్థం

వద్ద శ్రీమహాలక్ష్మి నుద్దేశించి తపంకావింప సంకల్పించింది. ఆవిధముగా సంకల్పించి, మహాతీవ్రతమమైన తపః కావించింది. శ్రీసతి సంతసించి అరుంధతికి శ్రీనివాసుడు ప్రత్యక్షమై అనుగ్రహించిన ఫాల్గుణపౌర్ణమినాడే సాక్షాత్కరించి సంపదను, సౌభాగ్యసంపదను ప్రసాదించింది. ఉత్తరఫల్గుణీ నక్షత్రయుక్తమైన ఫాల్గుణ పౌర్ణమినాడు ఈతీర్థంలో స్నానంచేసినవారు అరుంధతివలె భాగ్యశ్రీసముపేతులై వర్ధిల్లుతారని వరంప్రసాదించి అదృశ్యమైనది. ఉత్తరఫల్గుణీనక్షత్రాన శ్రీలక్ష్మి సాక్షాత్కరించిన కారణముగా ఆతీర్థం ఫల్గుణీతీర్థం, ఉత్తర ఫల్గుణీతీర్థం అనే సార్థక నామాలను సంతరించుకొని సుప్రసిద్ధమైంది. శ్రీలక్ష్మీదర్శనము, కటాక్షంపొందిన సప్తఋషిపుంగవులు ఆస్థానంలోనే తమశాశ్వత నివాసాలు యేర్పరచుకొని శ్రీసతిని శ్రీనివాసుని సేవిస్తూ దివ్యానుభూతి పరంపరలు పొందారు. లక్ష్మీప్రదమైన దివ్య తీర్థం ఫల్గుణీతీర్థం. ఇట్టి తీర్థభాగ్యంగూర్చి వరాహపురాణము వివరించి వినుతించింది.

## జాబాలి తీర్థం

శ్రీనివాసుని బ్రహ్మోత్సవ మహోత్సవాన్ని తిలకించి, సేవించిన జాబాలి మహర్షి స్వామివారి శ్రీసన్నిధానానికి పశ్చిమోత్తర దిశలోని ఒకమహాపవిత్రప్రాంతాన్ని, అతిప్రశాంతప్రదేశాన్ని గమనించి అచ్చట ఒక ఆశ్రమం, ఒకతీర్థం నిర్మించుకొని తపస్సుప్రారంభించాడు. శ్రీపతిధ్యానంలో నిమగ్నుడయ్యాడు. ఆదివ్యతీర్థం జాబాలి తీర్థంగా ప్రాముఖ్యంవహించినట్లు వరాహపురాణం వినుతించింది. ఈతీర్థం ఫల్గుణీ తీర్థానికి పశ్చిమముగా నెలకొని ఉంది. శౌనకాదిమునులకు సూత పౌరాణికుడు జాబాలితీర్థమహిమను తెలుపుతూ వేనోళ్ళ పొగడినాడు.

పూర్వం కావేరీనదీతీరములో దురాచారుడనే బ్రాహ్మణుడుండేవాడు. దురాచారుడు అన్వర్థ నామధేయుడై దుర్మార్గుడై పంచమహా

పాతకాలు కావిస్తూ ఆత్మవంచన, ప్రజావంచన, లోకవంచన, దైవవంచన చేస్తూ జీవితయాత్రసాగిస్తున్నారు. విప్రత్వం కోల్పోయాడు. పితృదేవతలకు శ్రాద్ధకర్మలు శ్రద్ధగా నిర్వహించని కారణముగా ఒక బ్రాహ్మణుడు పితృదేవతాశాపం పొందాడు. భేతాళరూపుడయ్యాడు. ఆభేతాళుడు దురాచారుని ఆవహించి పీడించాడు. దురాచారుడు భేతాళుని దుష్ప్రభావానికిలోనై శారీరక, మానసిక సుఖశాంతులకు దూరమయ్యాడు. జన్మస్థలానికి దూరమయ్యాడు. అగమ్య సంచారం సాగించాడు. భేతాళావేశాన్ని నిరోధించుకోలేకపోయాడు. నివారించుకోలేకపోయాడు. అట్టి పీడితతాడిత యాతనామయస్థితిలో పూర్వజన్మపుణ్యవిశేష లేశంవలన వేంకటాచలాన్ని అధిరోహించాడు. శ్రీ వేంకటాద్రిని సేవించడంవలన దురాచారుని జన్మపరంపరలలోని, ఈ జన్మలోని పాపాలు హరించాయి. తన తిరుమలయాత్రలో జాబాలి తీర్థం సమీపించాడు. దానిలో స్నానం కావించాడు ఆశ్చర్యజనకమైన, ఆనందాయకమైన ఫలితాన్ని పొందాడు. భేతాళవేధనుండి విముక్తుడయ్యాడు.

మానసిక స్వస్థతపొందిన దురాచారుడు కావేరీతీరవాసుడైన తాను సువర్ణముఖినదీతీరవాసుడైనందుకు ఆశ్చర్యపడ్డాడు. సమీపములోని ఆశ్రమానికి వెళ్ళి జాబాలిని దర్శించాడు. తనకు సందేహనివృత్తి చేయమని మునిని అర్థించాడు. దివ్యదృష్టినిప్రసరించి, విషయం గ్రహించిన జాబాలి "నీవు మహాపాతకుడవు కావడంవలన భేతాళావేశం పొందావు. వేంకటాచలాన్ని సేవించి పాపరహితుడవయ్యావు. జాబాలి తీర్థములో స్నానముచేయడంవలన భేతాళుడుతొలగిపోయాడు. పితృకార్యవిముఖుడై, పితృదేవశాపహతుడైన ఒకబ్రాహ్మణుడు భేతాళుడై నిన్ను పీడించాడు. నిన్ను ఆశ్రయించి దీనిలో స్నానంచేసిన కారణముగా అతని భేతాళరూపం నశించింది. అతడు అతని పితృదేవ

తలు శాశ్వత విష్ణులోకం పొందారు. ఈజాబాలి తీర్థస్నానఫలితముగా పవిత్రశరీరుడవయ్యావు పుణ్యమనస్కుడవయ్యావు. నీవు ఇహలోక సుఖాలు అనుభవించి తనువు చాలించి వైకుంఠం అలంకరిస్తావు. పంచ మహాపాతకాలను నిర్మూలించే దివ్యశక్తిగల పుణ్యతీర్థం ఈ జాబాలి తీర్థం. ప్రాయశ్చిత్తాలు తొలగించలేని పాపాలను తొలగింపగల మహిత శక్తివంతమైన పరమపవిత్రతీర్థం జాబాలితీర్థం". అని దురాచారునకు వివరించాడు ఈవిధమైన వివరాలను తెలుపుతూ స్కందపురాణము జాబాలి తీర్థమహిమను ప్రకటించింది. దీనిలో స్నానం చేయడము సాధ్యపడనివారు దీని కీర్తి వివిన్నా, దీన్ని స్మరించినా జన్మజన్మాల పాపాలనుండి విముక్తులై శుభాలు, సుఖాలుపొందుతారు.

## అస్థి తీర్థం

అస్థితీర్థాన్ని అస్థిసరోవరం అనికూడ పిలుస్తారు ఇది పాండవ తీర్థం సమీపములో ఉంది అది తొండమానుడు రాజ్యం పాలిస్తూన్న కాలం. కూర్మశర్మ వశిష్ఠ గోత్రీకుడైన బ్రాహ్మణుడు. శ్రీరంగక్షేత్ర వాసుడు. అతని భార్యలక్ష్మి. కుమారుడు రాఘవుడు. రాఘవుని వయస్సు ఐదుసంవత్సరాలు. కుటుంబముతో కాశీయాత్రకు బయలు దేరిన కూర్మశర్మ తొండమానుని రాజధానీనగరం చేరుకున్నాడు. భార్యగర్భవతి అని తెలిసికొన్నాడు. కాశీయాత్రనుండి మరలి వచ్చే వరకు తనభార్యను, పుత్రునిపోషించి, రక్షింపుమని తొండమానుని కూర్మశర్మ అర్థించాడు. చక్రవర్తి అంగీకరించాడు. అతడు నిశ్చింతగా కాశీయాత్రకు సాగిపోయాడు. తొండమానుడు కూర్మశర్మ భార్యా పుత్రులకు ఆరుమాసాలకు సరిపోయే ఆహారపదార్థాలు సమర్పించి, చక్కటిభవనంలో నివాసమేర్పరచి రాచకార్యాలలో నిమగ్ను డయ్యాడు.

కూర్మశర్మ పితృదేవతల అస్థులను గంగాజలంలో కలిపి, గయా శ్రాద్ధం ముగించుకొని, అయోధ్యను సేవించుకొని రెండు సంవత్సరాలు గడచిన పిమ్మట తొండమానుని దర్శించాడు. భార్యా పుత్రులయోగ క్షేమాలగూర్చి ప్రశ్నించాడు. స్వప్న వృత్తాంతంవలె భావించిన తొండమానుడు తేరుకొని శ్రీనివాసుని మనసాధ్యానించాడు. "శుక్రవారంనాడు స్వామికి జరిగే అభిషేకమహోత్సవాన్ని తిలకించడానికి మహాలక్ష్మి, రాఘవుడు, నూతనముగా జన్మించిన పుత్రికా పట్టమహిషితో కలసి తిరుమలకు తరలిపోయారు." అని తొండమానుడు కూర్మశర్మకు సమయోచితంగా సమాధానము చెప్పాడు. భోజనానికివలసిన శాకపాకాలు సమర్పించాడు.

తొండమానుడు తనయునిరావించి మహాలక్ష్మినివాసభవనము తెరిపించి వారిని తోడ్కొని రమ్మని పంపాడు. అతడు మరలివచ్చి ఆ గృహములో అస్థులు ఉన్నాయని చెప్పాడు. తొండమానుడు తల్లడిల్లిపోయాడు. ఆందోళనతో, ఆవేదనతో భయకంపితుడై క్రుంగిపోయాడు. తాను వారిని మృత్యువు పాలుచేసిన పాపాత్ముడనని పరితపించాడు. వేంకటాచలానికి కుమారునితో కలసివెళ్ళాడు. శ్రీనివాసుని శ్రీచరణాలను ఆశ్రయించాడు. కూర్మశర్మకథ, తన తప్పిదం నివేదించుకొని కాపాడమని ప్రార్థించాడు. శ్రీనివాసుడు దయాసముద్రుడు. కరుణాసాగరుడు. భక్తజనసులభుడు. భక్తజనరక్షాదీక్షాదక్షుడు. "నీపాపం నేను భరిస్తాను. నాభక్తుని బాధ నివారిస్తాను నాభక్తుని భంగపాటు నేను సహింపను. నీపుత్రుని పంపి కూర్మశర్మ భార్యాబిడ్డల అస్థుల పల్లకిలో పెట్టి తీసికొనివచ్చే యేర్పాటు వెంటనే చేయించు" అంటూ శ్రీనివాసుడు తొండమానునకు అభయ మిచ్చాడు. తొండమానుని తనయుడు శ్రీనివాసుని ఆజ్ఞను శిరసావహించి అవశ్యంనిర్వహించాడు. శ్రీవేంకటేశ్వరుడు ఆ అస్థులను తన ఉత్తరీయములో మూటకట్టుకొని,

తొండమానుని, అతనికుమారుణ్ణి వెంటపెట్టుకొని పాండవతీర్థం సమీపించాడు వారిని పాండవతీర్థంవద్ద నిలిపాడు తానుదానికి దగ్గరలోఉన్న ఒక తీర్థాన్ని చేరుకొన్నాడు. ఉత్తరీయంలోని అస్థులను ఆ తీర్థంలో ముంచి తీరంలో ఉంచాడు. తాను ఆ తీర్థంలో స్నానంకావించి అంజలితో జలం స్వీకరించి వానిపై చిలికాడు. వారు సజీవులై, సంతోషాంతరంగులై లేచినిలచారు. ఆ తీర్థప్రభావంవలన అస్థిరూపాలలోనివారు సజీవచైతన్యమూర్తులుగా మారడంవలన ఆ తీర్థానికి అస్థితీర్థం అనేపేరు సార్థకమై స్థిరమై ఒప్పారింది. శ్రీనివాసుడు కూర్మశర్మ కుటుంబసభ్యులను తొండమాను చక్రవర్తికి అప్పగించాడు. తొండమానుడు "ద్విజోత్తమా! నీ కుటుంబసభ్యులు రెండుజన్మలుపొందారు. శ్రీనివాసుని దయావిశేషం వలన వీరు నీకుమరల లభించారు" అంటూ కూర్మశర్మకు అతనిభార్య, పుత్ర, పుత్రికలను భద్రంగా సమాగమయోగం కల్పించాడు. కూర్మశర్మ కుటుంబసభ్యులు తాము శ్రీనివాసుని కుక్షిలో నివసించి చతుర్దశ భువనాలను, సప్తసముద్రాలను, సమస్తదేవతామూర్తులను దర్శించి, శ్రీనివాసునిదయవలన సజీవులమై నిలచామని ప్రకటించారు. వారిని తోడ్కొని కూర్మశర్మ తొండమానుని అనుమతిపొంది శ్రీరంగానికి మరలిపోయాడు. శ్రీనివాసవైభవం అస్థితీర్థప్రభావంగా ప్రసరించిందని తొండమానుడూ, కూర్మశర్మా స్మరించుకొని ఉప్పొంగిపోయారు. వారు పరమశ్రీనివాసదాసులై జీవితాలుగడపి ధన్యులయ్యారు. వారి జీవితాలకు ధన్యతను ప్రసాదించిన దివ్యతీర్థం అస్థితీర్థం. భవిష్యోత్తరపురాణంలోని పద్నాల్గొవ అధ్యాయం ఏవంవిధమైన అస్థితీర్థమహిమను ప్రకటించింది. ఈ అస్థితీర్థపు వివరాలలో కొన్నిమార్పులను చేర్పులను బ్రహాండపురాణం, వరాహపురాణం ప్రతిపాదించి అస్థితీర్థమహిమను అభివర్ణించాయి.

కటాహతీర్థం

పూర్వం తుంగభద్రా నదీతీరంలో వేదపురం అనే అగ్రహారం ఉండేది. ఆ అగ్రహారంలో పద్మనాభుడనే మహాపండితుడు ఉండేవాడు. అతనికుమారుడు కేశవుడు. కేశవుడు దురాచారపరుడు. పంచమహాపాతకాలు కావించిన వంచకుడు. వేశ్యాలోలుడై తల్లితండ్రులను భార్యను విడచిపెట్టాడు. వేశ్యాగమన వ్యసనలోలుడై ధర్మభ్రష్టుడై అర్థసంపాదనకై కిరాతసంఘసభ్యుడయ్యాడు. చోరవృత్తిని అవలంబించాడు. ఒకనాడు ఒకబ్రాహ్మణుని గృహంలోనికి చొరబడ్డాడు. అతణ్ణి హత్యకావించి ధనం దోచుకున్నాడు. బ్రహ్మహత్యాపాపంవలన బ్రహ్మహత్యాభూతం వికటాట్టహాసంచేస్తూ కేశవుణ్ణి వెంటాడి వేధింపసాగింది. భూతంనుండి తప్పించుకోవడానికై దేశదిమ్మరియై తిరిగి తిరిగి స్వగృహానికి చేరుకొన్నాడు. పద్మనాభుడు కేశవునిపరిస్థితి గమనించి, అతనికి బాధానివృత్తి కలిగించాలని ప్రయత్నించాడు. "నీ కుమారుడు వేశ్యాలంపటుడు. సురాపానప్రమత్తుడు. చోరశిఖామణి. ఆత్మద్రోహి. మాతృద్రోహి. పితృద్రోహి. భార్యను వదలిపెట్టిన దుర్మార్గుడు. వీణ్ణి పరిగ్రహించి రక్షించడానికి ప్రయత్నిస్తే సర్వనాశనం, వంశనాశనం చేస్తాను" అని బ్రహ్మహత్యాభూతం పద్మనాభుని బెదిరించింది. తండ్రీకొడుకుల్ని అదృష్టంపండి ఆ దేసమయంలో ఆదేమార్గాన భరద్వాజమహర్షి ప్రయాణం సాగిస్తున్నాడు.

పద్మనాభుడు భరద్వాజునకు కేశవుని వృత్తాంతం నివేదించాడు. పుత్రుని రక్షింపమని ప్రార్థించాడు. మహర్షి దివ్యదృష్టిని ప్రసరించి విషయం పరిశీలించాడు. ప్రాయశ్చిత్తాలవల్ల దోషంపోయేమార్గం మునిమనోనేత్రానికి గోచరించలేదు. భరద్వాజుడు (శ్రీ) వేంకటాద్రికి తోడ్కొనిపోయి కటాహతీర్థజలాన్ని శిరస్సునజల్లి, సేవింపజేస్తే కే

వునకు బ్రహ్మహత్యా భూతదోషం తొలగిపోతుందని పద్మనాభునకు ఆదేశించాడు. పద్మనాభుడు కేశవుని వేంకటాచలానికి తోడ్కొని వెళ్ళాడు. తనయునిచేత వరాహుని దర్శింపజేసి కటాహతీర్థజలం శిరస్సున ధరింపజేసి, సేవింపజేసాడు. ఆ క్షణంలోనే కేశవుడు బ్రహ్మహత్యా భూతపుహింసనుండి విముక్తుడయ్యాడు. పిమ్మట తండ్రీకుమారులు శ్రీనివాసుని దర్శనం కావించుకొని అర్చనలు కావించారు. వారి సేవలకు ప్రసన్నుడైన శ్రీనివాసుడు వారికి ప్రత్యక్షమై "ఎంత పాపాత్ముడైనా కటాహతీర్థాన్ని సేవిస్తే నా దివ్యసన్నిధానం పొందితీరతాడు. ఇది ప్రత్యక్షరప్రమాణం. ఇది ప్రత్యక్షరసత్యం" అని ప్రకటించాడు. ఈ తీర్థప్రశంస స్కాందపురాణంలో ఉంది. పద్మనాభునకు పుత్రభిక్ష ప్రసాదించిన పుణ్యతీర్థం కటాహతీర్థం. కేశవుని బ్రహ్మహత్యా భూతహింసను నివారించిన మహాపుణ్యతీర్థం కటాహతీర్థం.

కటాహతీర్థం శ్రీవేంకటేశ్వరస్వామి దేవాలయపు ఉత్తరభాగమందలి సరిహద్దులలోని మహామండపపుగోడను చేరిఉంది. మూడడుగుల లోతు అంతే వెడల్పుగల చిన్న నీటితొట్టివలె ఈ తీర్థం ఉంటుంది. శ్రీనివాసుని శ్రీపాదాలనుండి ఉద్భవించి అంతర్లీనముగా ప్రవహించి కటాహతీర్థరూపంలో కనపడుతోందని నాగదుడు శౌనకునకు వివరించిన విషయంవలన తెలుస్తోంది. దీనిలోని అంతఃప్రవాహజలము స్వామివారి శుక్రవార అభిషేకతీర్థంతో సిక్షిప్తమై నిండుగా ఉంటుంది. మృత్యుభయంకరమైన దీర్ఘవ్యాధులనుకహితం నిర్మూలింపగల మహితశక్తివంతమైనతీర్థం కటాహతీర్థం. రోగాలను, రోగాలకు కారణాలైన జన్మజన్మాంతరపాపాలను హరించే తీర్థమిది. గంగాది నదులు దీని స్పర్శ వలన పునీత మవుతాయి. ఈ తీర్థస్పర్శవలన పంచమహాపాతకాలు పటాపంచల మవుతాయి. అష్టాక్షరీమంత్రజపంకాని, కేశవనామస్మరణం గాని, అచ్యుతానంత గోవింద నామోచ్చారణగాని, శ్రీవేంకటేశ్వర

అష్టాక్షరీ మహామంత్రపఠనంగాని చేస్తూ కటాహతీర్థాన్ని తలపై జల్లుకొని, లోనికి తీసికొని సేవించడము ఉత్తమం. ఈ మంత్రాలు, నామాలు రానివారు 'ఓ తీర్థరాజమా! గతంలో, ప్రస్తుతంలో నేను కావించిన పాపాలను నిర్మూలింపుము' అంటూ నిర్మలహృదయంతో, నిశ్చలచిత్తంతో, భక్తితో, విశ్వాసంతో ఈ తీర్థాన్ని సేవించడం బహు పుణ్యప్రదం. కటాహతీర్థపు దర్శన, స్పర్శన, ధారణ, సేవన, శ్రవణ, పఠనాదులుసహితం పుణ్యావంతములైనవి. స్వామిపుష్కరిణీ స్నానం, వరాహస్వామి దర్శనం, కటాహతీర్థపానం తిరుమలయాత్రికుడు అవశ్యం ఆచరింపవలసిన మూడు ముఖ్యమైనవిధులు. ముల్లోకవాసులకూదుర్లభమైన విధు లవి. వీనివలన మాత్రమే సంపూర్ణతిరుమలయాత్రాఫలసిద్ధి కలుగుతుంది. శ్రీవేంకటాచలంపై గల ఈ దివ్యతీర్థాలు వివిధ విపుల పుణ్యతీర్థ సమూహాలు శ్రీనివాసునిచేత ప్రభావితములై మహాత్మ్యాన్ని, దైవత్వాన్ని సంతరించుకొన్నాయి. అవేకాదు కొండకు దిగువగాను, కొండకు అతిసమీపముగాను ఉన్న సువర్ణముఖరీనది, పద్మసరోవరం కూడ వేంకటాచలపు సన్నిహితత్వం, శ్రీవేంకటాచలాధీశుని నిత్య సన్నిహితదృష్టిపాతంవలన మహాత్మ్యప్రసార కేంద్రాలై ప్రత్యేకమైన విశిష్టతను సంపాదించుకొన్నాయి.

'ఓం సరస్స్వామి తటీజుషే శ్రీవేంకటేశాయనమః,' 'ఓం తీర్థ పంచకవాసినే శ్రీవేంకటేశాయ నమః' 'ఓం విశ్వతార్థాఘహారిణే శ్రీ వేంకటేశాయ నమః'. 'ఓం కుమారధారికావాసస్కన్దాభీష్టదాయినే శ్రీవేంకటేశాయ నమః', 'ఓం హలాయుధజగతీర్థ సమస్తఫలదాయినే శ్రీవేంకటేశాయనమః' అన్న ఐదునామాలు శ్రీవేంకటేశ్వర అష్టోత్తర శతనామావళిలో పఠింపబడుతూ శ్రీబాలాజీతీర్థ లీలాహేలను ప్రసరిస్తున్నాయి. రెండుభాగాల ఉదజని, ఒకభాగం ప్రాణవాయువు కలిసినది జలం అని శాస్త్రజ్ఞుల నిర్ణయం. ఆ కోణంలో జలాన్నిచూచి

దానిలో స్నానంచేసేవారికి శరీరశుద్ధి కలుగుతుంది. జలంలో మహాశక్తి ఉంది అని భావించి విశ్వసించే వారికి జలం శరీరనైర్మల్యం, మనోనైర్మల్యం, ఆత్మబలం, ఆత్మవిశ్వాసం, ఆత్మానుభూతి, దైవానుభూతి ఆదిగాగల సహస్రాధిక శుభఫలితాలను అనుగ్రహిస్తుంది. ఈ శక్తి తీర్థాలకు ఉంది. నమ్మిక ఉన్నవారికి, నమ్మగలిగినవారికి దైవరక్షణ ప్రసాదింపగలిగే దివ్యకేంద్రం తీర్థం లేనివారికి $H_2O$ ల సమ్మేళనమే !

రాముడు, బలరాముడు తీర్థయాత్రలు కావించారు. రామాయణంలో, భారతంలో ఆ పుణ్యపురాణపురుషులు కావించినతీర్థయాత్రల వర్ణనలు అసంఖ్యాకంగా ఉన్నాయి. వేంకటాద్రిపై తీర్థాలను, అవతారపురుషులు, దేవతలు, సప్తఋషులు, అష్టదిక్పాలకులు, మహాపురుషులు, తపోసంపన్నులు నిర్మించారు, సేవించారు. వారు మనకు మార్గదర్శకులయ్యారు. వేంకటాద్రి తీర్థాద్రిగా విఖ్యాతిపొందింది. వేంకటాద్రినాథుడు తీర్థాద్రినాథుడుగా ప్రఖ్యాతుడయ్యాడు. వేంకటాద్రి తీర్థయాత్రలోని బాలాజీలీల యాత్రికహృదయాలలో పూజాప్రసూనాల సౌరభాల మౌక్తికహారమై వెలుగులు నింపుతుంది. మధురమైన, శీతలమైన, పరిమళభరితమైన వెన్నెలకాంతులు విరజిమ్ముతుంది.